శ్రీః

శ్రీమదుత్పలదేవాచార్యవిరచిత

# శ్రీ శివస్తోత్రావళిః

తెనుగు టీక - చింతగుంట సుబ్బారావు



ప్రకాశకులు

**శ్రీమతి రావికృష్ణకుమారి**

**404 జంజనం కాంప్లెక్స్, చీరాల**

శ్రీః

శ్రీమదుత్పలదేవాచార్య విరచిత

# శ్రీ శివస్తోత్రావళిః

తెనుగు టీక

చింతగుంట సుబ్బారావు

ముద్రణ : ***15-08-2016,***
ప్రతులు : ***500***
పేజీలు : ***320***
వెల రూ. : ***300-00***



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

శ్రీః

# ప్రత్యభిజ్ఞ - శివస్తోత్రావళి

శ్రీరామచన్ద్రాయ నమః

శ్రీశివస్తోత్రావళి యుత్పలదేవాచార్యులు రచించిన స్తోత్రకావ్యము. ఇది ప్రత్యభిజ్ఞాదర్శనమునకు సంబంధించిన స్తోత్రగ్రంథము. అభిజ్ఞ యనఁగా గుర్తుపట్టుట. ప్రత్యభిజ్ఞ యనఁగా మఱల గుర్తునకుఁ దెచ్చుకొనుట. లేక తిరిగి జ్ఞాపకము చేసికొనుట. వాస్తవమునకు శివుఁడే సమస్త జీవస్వరూపుఁడు. తాను శివుఁడ నన్న సంగతి జీవుఁడు మఱచిపోయినాఁడు. మఱల జ్ఞానము పొంది నేనే శివుఁడ నన్న భావమును జీవుఁడు జ్ఞాపకము చేసికొన్నచో జీవునకు శివస్వరూపము లభించును. ఇదియే **ప్రత్యభిజ్ఞ.**

ఈ ప్రత్యభిజ్ఞామతము మొదట నాగమములలో నుద్భవించి తరువాత శాస్త్రకారులచేతిలో వృద్ధి పొందినది. 1. మాలినీ విజయోత్తర, 2. స్వచ్ఛంద, 3. రుద్రమాయళ, 4. నేత్ర, 5. మృగేంద్రతంత్రములు దీని మూలాగమములు. వీని ననుసరించి **'శివసూత్రము'** లుదయించినవి. పిదపఁ బ్రత్యభిజ్ఞాకారికలు మొదలగువానిలో నిది విస్తరించినది. దీనికే **1. కాశ్మీరశైవదర్శనము, 2. త్రికదర్శనము, 3. స్పందదర్శనము, 4. ఈశ్వరాద్వయము** నని నామాంతరములు.

**ప్రత్యభిజ్ఞా సారాంశము :**

ఈ దర్శనములో శివుఁడే పరమతత్త్వము. సాంఖ్యదర్శనము నందలి చతుర్వింశతి (24) తత్త్వములను శైవు లంగీకరించిరి. సాంఖ్యములో 1. పురుషుఁడు, 2. ప్రకృతి నిత్యపదార్థములు. స్వతంత్రములు. శైవదర్శనములో నివి యనిత్యములు. పరతంత్రములు. ప్రకృతియే మాయ. వీనితో పాటు పంచకంచుకములు, పంచశక్తులు శుద్ధవిద్య కూడ నంగీకరింపఁబడినవి. శుద్ధ విద్యకే **'సద్విద్య'** యని పేరు. ఈ సద్విద్య వలన సాధకుఁ డీశ్వరతత్త్వములోఁ బ్రవేశించును. ఈశ్వరతత్త్వము సదాశివతత్త్వములో; సదాశివతత్త్వము శక్తితత్త్వములో; శక్తితత్త్వము పరమశక్తితత్త్వములో లయ మగును. పరమశివతత్త్వజ్ఞానమువలన ముక్తి లభించును. ఇదియే పూర్ణావస్థ. ఈ విధముగా శైవులు 36 తత్త్వముల నంగీకరించిరి.

**షట్త్రింశత్తత్త్వములు**

1. ప్రకృతి – మాయ, 2. మహత్తు – బుద్ధి, 3. అహంకారము, 4. మనస్సు

5. శబ్దము,
6. స్పర్శము,
7. రూపము,
8. రసము,
9. గంధము

} పంచతన్మాత్రములు ( సూక్ష్మభూతములు)

10. పృథివి / భూమి
11. అప్పులు / నీళ్ళు
12. తేజము / అగ్ని
13. వాయువు / గాలి
14. ఆకాశము / శూన్యము

} పంచమహాభూతములు

15. శ్రోత్రము / చెవి
16. త్వక్కు / చర్మము
17. చక్షువు / కన్ను
18. జిహ్వా / నాలుక
19. ఘ్రాణము / ముక్కు

} పంచ జ్ఞానేంద్రియములు

20. వాక్కు / మాట
21. పాణి / చేయి
22. పాదము / కాలు
23. పాయువు / గుదము
24. ఉపస్థము / జననేంద్రియము

} పంచ కర్మేంద్రియములు

25. పురుషుఁడు / జీవుఁడు
26. పురుషుఁడు / బ్రహ్మము

27. కళ
28. విద్య
29. రాగము
30. కాలము
31. నియతి

} మాయా పంచకంచుకములు

32. శుద్ధవిద్య / సద్విద్య
33. ఈశ్వరుఁడు
34. సదాశివుఁడు
35. శక్తి
36. పరమశివుఁడు

ఇవి కాశ్మీరశైవదర్శనమునందలి షట్ త్రింశత్తత్త్వములు. ఈ షట్త్రింశత్తత్త్వములను గొందఱద్వైతులు కూడ నామోదించిరి.

**శ్లో॥ 'షట్త్రింశత్తత్త్వసోపాన స్వాత్మప్రాసాదభూపతిమ్'** అని సదాశివబ్రహ్మేంద్ర – శ్రీ దక్షిణామూర్తి ధ్యానము, శ్రీమాధవాచార్యులు సర్వదర్శనసంగ్రహములో 4 శైవ మతములను బేర్కొనినారు. **1. నకులీశపాశుపతిదర్శనము, 2. శైవదర్శనము, 3. ప్రత్యభిజ్ఞాదర్శనము, 4. రసేశ్వర దర్శనము.**

## ప్రత్యభిజ్ఞా వాఙ్మయము

**1. వసుగుప్తుఁడు (9శ.)**

కైలాసవాసి యగు పరమశివుఁడు వసుగుప్తునకు 'స్వప్నములో సాక్షాత్కరించి శివసూత్రముల నుపదేశించెను. వసుగుప్తుఁడు మహాదేవపర్వతమునందు శిలలపైఁ జెక్కఁబడిన శివసూత్రములను సంపాదించి గ్రంథస్థము గావించెను. క్షేమరాజు, భట్ట భాస్కరుఁడు, వరదరాజు మొదలగు వారు శివసూత్రములను వ్యాఖ్యానించిరి.

శివసూత్రములో 3 వికాసములు మొత్తము 22+10+45 = 77 సూత్రములు గలవు. **'చైతన్యమాత్మ'** యనునది **మొదటి** సూత్రము. **'భూయః స్యాత్ ప్రతిమీలనమ్'** – చివరి సూత్రము. ఈ శివసూత్రముల నాధారము చేసికొని తంత్రములతో సమన్వయము చేసి వసుగుప్తుఁడు 'స్పందకారిక' యను గ్రంథమును రచించెను. దీనిలో 4 నిష్యందములు, మొత్తము 52 కారికలు గలవు. దీనిపై 1. భట్టకల్లటుని వృత్తి, 2. రామకంఠుని వృత్తి, 3. క్షేమరాజు 'స్పందనిర్ణయము', 4. కృష్ణానందసాగరుని 'స్పందరంజని', 5. ఉత్పలాచార్యుల 'స్పందప్రదీపిక' యను వ్యాఖ్యలు పుట్టినవి.

**2. సోమానందుఁడు :** ఇతఁడు 'శివదృష్టి' యను గ్రంథమును రచించెను. దీనిలో 7 ఆహ్నికములు 700 కారికలు గలవు. దీనిపై 1. ఉత్పలుని 'వ్యాఖ్య', 2. అభినవగుప్తుల 'శివదృష్ట్యాలోచనము' వెలసినవి. ఈ శివదృష్టిని బ్రహ్మశ్రీ పుల్లెల శ్రీరామచంద్రుఁడుగా రాంధ్రీకరించిరి.

**3. ఉత్పలదేవుఁడు :** 'ఈశ్వరప్రత్యభిజ్ఞ' వీరి ప్రధాన గ్రంథము. ఉత్పలదేవుని గూర్చి తరువాత విన్నవింతును.

**4. అభినవగుప్తపాదాచార్యులు :** అభినవగుప్తులు సాహిత్యలోకములో సుప్రసిద్ధులు. వీరు రచించిన 1. నాట్యశాస్త్ర వ్యాఖ్య – **'అభినవభారతి'**, 2. ధ్వన్యాలోక వ్యాఖ్య – **'లోచనము'** సాహితీరసికులకు సుపరిచితములు. వీరు ప్రత్యభిజ్ఞా కారికలపై 1. **'విమర్శిని'** యను లఘువ్యాఖ్యను, 2. **'వివృతి విమర్శిని'** యను బృహద్ వ్యాఖ్యను నిర్మించిరి. అభినవ గుప్తులు రచించిన సుమారు 50 గ్రంథములు లభించుచున్నవి.

**5. భాస్కరకంఠుఁడు :** ఇతఁ డభినవగుప్తపాదుల ప్రత్యభిజ్ఞావిమర్శినిపై విపుల వ్యాఖ్యను (భాస్కరి) సంతరించినాఁడు. భాస్కరకంఠుని 'చిత్తానుబోధశాస్త్రము' కాశ్మీరశైవ సిద్ధాంతములను క్రోడీకరించిన యుత్తమగ్రంథము.

## స్తోత్రకావ్యము

1. భట్ట నారాయణుని 'స్తవచింతామణి', 2. భట్ట ప్రద్యుమ్నుని 'తత్త్వగర్భ స్తోత్రము', 3. జగద్ధరభట్టు 'స్తుతికుసుమాంజలి', 4. ఉత్పలదేవుని **'శివస్తోత్రావళి'** మొదలగునవి ప్రసిద్ధ స్తోత్రగ్రంథములు.

**ఉత్పలదేవుఁడు (900–1000) :** ఉత్పలదేవాచార్యుల గురువు సోమానందుఁడు. తల్లి నాగేశ్వరి, తండ్రి – ఉదయాకరుఁడు. ఇతఁడు 'రాజానక' వంశజుఁడు. లాటదేశీయుఁడు.

1. ఈశ్వరప్రత్యభిజ్ఞాకారిక, 2. ఈశ్వరప్రత్యభిజ్ఞా – వృత్తి, 3. ఈశ్వరప్రత్యభిజ్ఞా – టీక, 4. శివదృష్టి – వ్యాఖ్య, 5. సిద్ధిత్రయి, 6. **శివస్తోత్రావళి** – వీని రచనలు. సిద్ధిత్రయిలో 1. అజడప్రమాతృసిద్ధి, 2. ఈశ్వరసిద్ధి, 3. సంబంధసిద్ధి యను 3 ప్రకరణములు గలవు. దీనికిఁ బ్రతిగాఁ బరమవైష్ణవులు; శ్రీభాష్యకారులగు భగవ ద్రామానుజాచార్యులకుఁ బరమగురువులు నగు శ్రీయామునాచార్యులు 'సిద్ధిత్రయము'ను రచించిరి. దీనిలో 1. ఆత్మసిద్ధి, 2. ఈశ్వరసిద్ధి, 3. సంవిత్సిద్ధి గలవు.

## శివస్తోత్రావళి

ఇది యుత్పలదేవాచార్యులు రచించిన సుప్రసిద్ధ స్తోత్రగ్రంథము. దీనిలో 20 విభాగములు గలవు.

1. భక్తివిలాసము, 2. సర్వాత్మపరిభావనము, 3. ప్రణయప్రసాదము, 4. సురసోద్బలము, 5. స్వబలనిదేశనము, 6. అధ్వవిస్ఫురణము, 7. విధురవిజయము, 8. అలౌకికోద్బలనము, 9. స్వాతంత్ర్యవిజయము, 10. అవిచ్ఛేదభంగము, 11.

ఔత్సుక్యవిశ్వసితము, 12. రహస్య నిర్దేశము, 13. సంగ్రహస్తోత్రము, 14. జయస్తోత్రము, 15. భక్తిస్తోత్రము, 16. పాశానుద్భేదము, 17. దివ్యక్రీడాబహుమానము, 18. ఆవిష్కారము, 19. ఉద్ద్యోతనాభిధానము, 20. చర్వణాభిధానము.

మొదట నుత్పలదేవుఁడు 1. సంగ్రహస్తోత్రము, 2. జయస్తోత్రము, 3. భక్తిస్తోత్రము, 4. ఆహ్నికస్తుతి యను విభాగములతో నీ స్తోత్రకావ్యమును రచించెను. పిమ్మట శ్రీరామరాజు, ఆదిత్యరాజు వీనిని స్తోత్రగ్రంథముగా వింగడించిరి. పిదప శ్రీవిశ్వావక్తుఁడు దీనిని 20 స్తోత్రవిభాగములుగా విభజించెను. వీనిలో 7వ దగు 'విధురవిజయము' మిక్కిలి చిన్నది. 9 శ్లోకములు మాత్రమే గలవు. 17 అధ్యాయము పెద్దది. 48 శ్లోకములు గలవు. మొత్తము గ్రంథములో 439 శ్లోకములు గలవు. శ్లోకము లన్నియు భక్తిరసప్లావితములు. వివిధచ్ఛందములు వాడుటచే శ్రవణ రంజనములు.

శ్లో॥ న ధ్యాయతో న జపతః స్యాద్యస్యావిధిపూర్వకమ్ ।
ఏవమేవ శివాభాసస్తం నమో భక్తిశాలినమ్ ॥ (1-1)

అనునది మొదటి శ్లోకము

శ్లో॥ ఆరబ్ధా భవదభినుతి, రమునా యేనాంగకేన మమ శంభో! ।
తేనాపర్యంతమిమం, కాలం దృఢమఖిలమేవ భవిషీష్ఠ ॥ (20-21)

ఇది చివరి శ్లోకము. మొదటి యధ్యాయ మంతయు భక్తివిలాసము.

శ్లో॥ న యోగో న తపో నార్చా, క్రమః కోఽపి ప్రణీయతే ।
అమాయే శివమార్గేఽస్మిన్, భక్తిరేకా ప్రశస్యతే ॥ (1-18)

యోగము కాని, తపస్సు కాని, పూజాక్రమము కాని శివప్రాప్తికి సాధనములు కావు. మాయ లేని శివమార్గములో భక్తియోగ మొక్కటి మాత్రమే ప్రశస్తమైనది.

శ్లో॥ భక్తిర్భక్తిః పరే భక్తిర్భక్తిర్నామ సముత్కటా ।
తారం విరౌమి యత్తీవ్రభక్తిర్మేఽస్తు పరం త్వయి ॥ (16-25)

భక్తి - భక్తి - పరమేశ్వరుని యందు భక్తిమాత్రమే నాకుఁ గావలయును. ధారావాహిని యగు తీవ్రభక్తియే నీ యందుండవలయు నని బిగ్గరగా నఱచుచున్నాను.

శ్లో॥ అనంతానందసరసీ, దేవీ ప్రియతమా యథా ।
అవియుక్తాస్తి తే తద్వదేకా త్వద్భక్తిరస్తు మే ॥ (1-9)

ఈశ్వరా! అనంతానందసరసి యగు పరాశక్తి నీతో భేదము లేక యనపాయినిగా నెట్లున్నదో యట్లే నీయందు నాకు భక్తి యెప్పుడు నభిన్నముగా నుండుఁ గాక!

కాశ్మీరశైవదర్శనములో శివ–శక్తులకు భేదము లేదు. శక్తివలన శివునకుఁ గల్గిన స్పందము వల్లనే చరాచరసృష్టి యేర్పడుచున్నది. ఈ విషయమునే శ్రీశంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో మొట్టమొదటి శ్లోకములో –

శ్లో॥ శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం ।
న చేదేవం దేవో న ఖలు కుశలః స్పందితుమపి ॥

అని స్పష్టముగాఁ జెప్పినారు. శక్తిలేక శివుఁడు లేఁడు. శివుఁడు లేక శక్తి లేదు. వారిది నిత్యతాదాత్మ్యము. వహ్ని – దాహక శక్తి వంటిది.

శ్లో॥ న శివః శక్తిరహితో న శక్తిః శివవర్జితా ।
తాదాత్మ్యమనయోర్నిత్యం వహ్ని–దాహకయోరివ ॥

రెండవదగు సర్వాత్మపరిభావనాధ్యాయములోఁ బ్రతిశ్లోకము శివనమస్కారములతో నిండినది.

శ్లో॥ అగ్నీషోమరవిబ్రహ్మవిష్ణుస్థావరజంగమ –
స్వరూపబహురూపాయ నమః సంవిన్మయాయ తే ॥ (2–1)

1. అగ్ని, 2. చంద్రుఁడు, 3. సూర్యుఁడు, 4. బ్రహ్మ, 5. విష్ణువు, 6. స్థావరములు (స్థిరముగా నుండు చెట్లు – పర్వతములు మొదలగునవి), 7. జంగమములు (గమనము గలవి – పశుపక్షిమనుష్యాదులు) అన్నియు నీ బహురూపములే. అట్టి జ్ఞానస్వరూపుఁడ వగు పరమేశ్వరా! నీకు నమస్కారము. ఇక్కడ నొక విశేషము–

**'యతిః సర్వత్ర పాదాంతే శ్లోకార్ధే తు విశేషతః'** – అను ఛందశ్శాస్త్ర నియమము ననుసరించి పూర్వార్ధము నుత్తరార్ధముతోఁ గలుపుట దోషము. దీనిలోఁ గొన్ని శ్లోకములలో నిట్టి నియమోల్లంఘనము గలదు. ఆచార్యప్రయోగ మనుటచే సోఢవ్యము.

శ్లో॥ మహాదేవాయ రుద్రాయ శంకరాయ శివాయ తే ।
మహేశ్వరాయాపి నమః కస్మై చిన్మంత్రమూర్తయే ॥ (2–4)

ఇట్టి శ్లోకము లన్నియు నమకమంత్రములవలె సాగినవి.

శ్లో॥ దక్షిణాచారసారాయ నామాచారాభిలాషిణే ।
సర్వాచారాయ శర్వాయ నిరాచారాయ తే నమః ॥ (2–19)

1. దక్షిణాచారము, 2. వామాచారము, 3. శిష్టాచారము మొదలగు నాచారము లన్నియు శివస్వరూపములే. శివుఁడు మాత్రమే యాచారము లేక సకలాచారముల కంటె నున్నత స్థితిలో నున్నవాఁడు. అట్టి శర్వునకు నమస్కారము.

శ్లో॥ ఉత్తమః పురుషోఽన్యోఽస్తి యుష్మచ్ఛేషవిశేషితః ।
త్వం మహాపురుషస్త్వేకో నిశ్శేషపురుషాశ్రయః ॥ (3-14)

పురుషోత్తముఁడు శ్రీమహావిష్ణువు. **'వైష్ణవ్యాస్తు స్మృతో విష్ణుః'** - అని యాగమము.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః ।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥ (భ.గీ. 15-17)

అని శ్రీమద్భగవద్గీత.

ఆ మహావిష్ణువు కూడా నీకు శేషుఁడే. సమస్త పురుషులకు నాశ్రయుఁడ వగు నీవుమాత్రమే శివా! మహాపురుషుఁడవు. ఇది యొక అర్థము. యుష్మద్యుపపతే మధ్యమః (1-4-105) అస్మద్యుత్తమః (1-4-107) శేషే ప్రథమః (1-4-108) అను పాణినీయసూత్రముల ననుసరించి అస్మదర్థములో నున్న యుత్తమపురుషము యుష్మచ్ఛేషములగు ప్రథమ - మధ్యమ పురుషములచే విశేషింపఁబడుచున్నది. 'స భజతి', త్వం భజసి', 'అహం భజామి' యను మూఁడు పురుషములు 'వయం భజామః' అను దానిలోఁ గతించుచున్నవి. శివుఁడు ప్రథమ - మధ్యమ - ఉత్తమ పురుష వచనముల కతీతుఁడు అందువల్లనే మహాపురుషుఁడైనాఁడు.

ఇట్లే 14వ యధ్యాయమగు జయస్తోత్రములోని శ్లోకము లన్నియు జయశబ్దముతో నారంభమగుచున్నవి.

శ్లో॥ జయ త్రైలోక్యనాథైకలాంఛనాలికలోచన! ।
జయ పేతార్తలోకార్తికాలకూటాంకకంధర! ॥ (14-3)

ఇట్టి గూఢరహస్యముల గల శివస్తోత్రావళికి వ్యాఖ్యానము రచించిన మహాపండితుఁడు

**క్షేమరాజు (12శ.) :** ఇతఁడు శ్రీమదభినవగుప్తపాదాచార్యుల శిష్యశిరోమణి. ప్రత్యభిజ్ఞా దర్శనమును దన కృతులచే సుసంపన్నము చేసిన శైవాచార్యుఁడు. ఇతఁడు రచించిన కృతులు - 1. ప్రత్యభిజ్ఞాహృదయము, 2. పరాప్రవేశిక, 3. బోధవిలాసము - ఈ మూఁడును స్వతంత్రగ్రంథములు. 4. శివసూత్ర - విమర్శిని, 5. స్పందసందోహము, 6. స్పందనిర్ణయము, 7. స్తవచింతామణి - వివృతి, 8. విజ్ఞానభైరవ - ఉద్యోతము,

9. స్వచ్ఛందతంత్ర – ఉద్యోతము, 10. నేత్రతంత్ర – ఉద్యోతము, 11. శివస్తోత్రావళీ – వ్యాఖ్య, 12. సాంబపంచాశికా – వ్యాఖ్య ఈ తొమ్మిది వ్యాఖ్యాన గ్రంథములు. నిజముగా క్షేమరాజవ్యాఖ్య లేనిచో శివస్తోత్రావళి సులభముగా నర్థముకాదు. ఇట్టి శివస్తోత్రావళి కాంధ్ర వివరణమును గూర్చిన వారు **శ్రీ చింతగుంట సుబ్బారావుగారు.** వీరు సంస్కృత – ఆంధ్ర – హిందీ – ఆంగ్ల భాషలలో గొప్ప పండితులు. నాల్గు భాషలందును గ్రంథములు రచించిన వారు. బహుగ్రంథకర్తలు.

ఇట్టి గ్రంథమును బ్రచురించి వెలుఁగులోనికిఁ దెచ్చిన పుణ్యాత్ములు **రా మో రా** ఘంటానామము గల శ్రీ రావి మోహనరావు గారు. వీరు నా చిరకాల మిత్రులు. నిరంతర సరస్వతీ సేవాపరాయణులు. సుమారు 25 లక్షల రూప్యముల వెచ్చించి 140 అమూల్య గ్రంథములను వెలువరించి పాఠకుల కందించిన విశాలహృదయులు. స్వతంత్రముగా ఋతుసంహార – మేఘసందేశ – రఘువంశ – కుమారసంభవ – ఘటకర్పరాది కావ్యములకు వ్యాఖ్యానములు కూర్చిన పండితులు. వీరందఱికి నమందానందముతో శుభాభినందము లందించుచున్నాను.

ఈ శివస్తోత్రావళి పఠించి పాఠకులందఱు భక్తితో స్పందింతురు గాక! ఈ స్తోత్రనాయకుఁడగు సదాశివుఁడు సర్వులకు సర్వమంగళములు ప్రసాదించుఁగాక!

శ్లో॥ శంభో! శర్వ! శశాంకశేఖర! శివ! త్ర్యక్షాక్షమాలాధర!
శ్రీమన్నుగ్రకపాలలాంఛన! లసద్భీమత్రిశూలాయుధ! ।
కారుణాంబునిధే! త్రిలోకరచనాశీలోగ్రశక్త్యాత్మక!
శ్రీకంఠాశు వినాశయాశుభభరానాధత్స్వ సిద్ధిమ్ పరామ్ ॥ (11-11)

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

ఇట్లు
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

విజయవాడ,
శ్రీదుర్ముఖ సంవత్సర
వైశాఖ బహుళ నవమీ
సోమవారము,
30-5-2016



# విషయసూచిక

శ్రీః

ఓం తత్ సత్

ఓం శ్రీ విఘ్నహర్త్రే నమః ।

శ్రీ గురవే శివాయ నమః ।

# 1. భక్తివిలాసస్తోత్రమ్

**శ్లో॥ న ధ్యాయతో న జపతః స్యాద్యస్యావిధిపూర్వకమ్ ।**
**ఏవమేవ శివాభాసస్తం నుమో భక్తిశాలినమ్ ॥ 1**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనికి, న ధ్యాయతః = ధ్యానము చేయకుండగ, న జపతః = జపము చేయకుండగ, అవిధిపూర్వకమ్ = శాస్త్రోక్తవిధి విధానాల నాచరించకుండ, ఏవమేవ = ఉన్నట్లుండగనే, శివ + ఆభాసః = శివుని యొక్క వెలుగు, స్యాత్ = కలుగునో, తమ్ = అట్టి, భక్తిశాలినమ్ = భక్తిగలవానిని, నుమః = నమస్కరించుచున్నాము.

**తాత్పర్యము :** ఏ భక్తునకు శాస్త్రోక్తమైన ధ్యానజపములు పద్ధతిదప్పక చేయకుండగనే, ఎట్టి సాధనలు గాని నియమపాలన గాని లేకుండగనే **శివజ్యోతిదర్శనము** కలుగునో అట్టి భక్తునకు మేము నమస్కరించుచున్నాము.

శివజ్యోతి అనగా ఆత్మజ్యోతియే. ఈ ఆత్మజ్యోతిదర్శనం కోరినవారికి ధ్యానము, జపము సాధనలుగా నిర్ణయింపబడినవి. సాధన పద్ధతులు విధింపబడినవి. పద్ధతిదప్పక ఆయా సాధనలు చేయగా చేయగా పరిపక్వత పొందిన భక్తునికి ఆత్మదర్శనం లభిస్తుంది. అయితే, ఇందుకు విపరీతంగా, కొందరికి మాత్రం యే సాధనసంపత్తి లేకుండగనే కేవలభక్తితో ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. అట్టివారిని మూఢభక్తులని లోకం వర్ణిస్తుంది. కాని భగవద్విశ్వాసం ప్రగాఢంగా కలగటానికే కదా జపధ్యానాది అనేకానేక సాధనలు! అంతటి ప్రగాఢవిశ్వాసం కలిగి శివమయమైన మనస్సుతో ఆచరించే క్రియలు వికర్మలై, అకర్మలవుతాయి అంటుంది భగవద్గీత. **యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్,** అన్న భావంతో మనస్సు నిండిపోయిన భక్తుడు శివయుతుడు, సాక్షాత్ శివమయుడు. కనుక అట్టివానికి నమస్కరించటం శివునకు నమస్కరించటమే అవుతుంది.

భక్తి భగవంతునిలో లీనమైతే శేషించేది భగవంతుడేకదా, ఎందుకంటే, భక్తియే భగవంతుడైన స్థితికి చేరిన మహాత్ముడు భక్తుడు కాదు, భక్తితో బాటు భగవంతునిలో లీనమైనవాడు, సాక్షాత్ భగవంతుడే. అంతకంటె నమస్కరింపదగినవాడు వేరెవ్వరు?

**శ్లో॥ ఆత్మా మమ భవద్భక్తిసుధాపానయువాపి సన్ ।**
**లోకయాత్రారజోరాగాత్ పలితైరివ ధూసరః ॥ 2**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, భక్తి = భక్తి అను, సుధా = అమృతమును, పాన = త్రాగుటచేత, యువా = యౌవనముగలది, సన్ అపి = అయియుండియును, మమ = నాయొక్క, ఆత్మా = ఆత్మ, లోకయాత్రా = లోకయాత్రచేయుటలో, రజో = దుమ్ము కొట్టుకొన్నందువలన, రాగాత్ = ఎఱ్ఱదనముగలదై, పలితైః = పండినవైన, ధూసరః ఇవ = ధూసరమువలె.

**తాత్పర్యము :** నీ భక్తిభావామృతం త్రాగినందువలన నా ఆత్మ యౌవనంలోనే ఉన్నది. కాని లోకయాత్ర అనబడే జీవితంలో మలినమైన నా జుత్తుమాత్రం పండిపోయిన పుప్పొడితో కేసరాలవలె ఎఱ్ఱబారినవి.

ఈ శ్లోకంలో శరీరము, ఆత్మ అనువాని లక్షణాలు చెప్పబడినవి. ఆత్మకు వయస్సు హెచ్చుటం తగ్గటం ఉండదు. శరీరానికి అలసట, శక్తిక్షీణత, వార్ధక్యం, మాలిన్యం, అన్నీ ఉండటం సహజం. ఈ జీవితం ఒక ప్రయాణం, అజ్ఞాతం నుండి అజ్ఞాతానికి, అన్నారు పెద్దలు; జీవుని నుండి దేవునివరకు, అన్నారు తాత్త్వికులు. ఈ ప్రయాణంలో శరీరంపై దుమ్ము, ధూళి పడుతుంది. అందువలన జుత్తు ఎఱ్ఱగా అవుతుంది. ప్రయాణం వలన అలసట, శక్తిహీనత, వార్ధక్యం అనుభవంలోకి రావటం సహజం. ఈ లక్షణాలు ఆత్మకు లేవు. పైగా ఆ ఆత్మ భగవద్భక్తి అనబడే అమృతం త్రాగింది. అమృతపానం వలన దేవతలవలెనే అదికూడా నిత్యయౌవనం పొందింది. కనుక ముసలిదైన శరీరంలో ఉన్న ఆత్మ మంచి వయసులో ఉన్నది.

లోకానుభవంలో, శరీరం డస్సిపోతే, వయసు ముదిరి ఆత్మకూడా నిష్క్రియమూ ఉదాసీనమూ అయిపోతుంది. కారణం, ఆత్మకూడా జీవితం అనే యాత్రలోనే నిమగ్నమై ఉండటం. శరీరం దుమ్మూ ధూళీ అంటి ఎఱ్ఱబడితే, ఆత్మ రజోగుణ సంపర్కం చేత ఎఱ్ఱబారి నిస్సారతను అనుభవిస్తుంది. కాని ఆత్మ భక్తితో భగవంతునియందు లగ్నమై ఉంటే, దానికెప్పుడూ నిత్యయౌవనమే, రజోగుణంతో సంబంధంలేదు, ధూసరితం కాదు.

**లోకయాత్రారజోరాగాత్** అన్నదానిలో ఈ దేహాత్మల రెండిటికి అన్వయించేది

రజోరాగము ఉండటం, లేకపోవటం కూడా. రజః అంటే దుమ్ము అనిన్నీ, రజోగుణం అనిన్నీ అర్థాలు. అట్లాగే రాగం అంటే ఎఱ్ఱదనం అనీ, అనురాగం అనీ అర్థాలు.

**శ్లో॥ లబ్ధత్వత్సంపదాం భక్తిమతాం త్వత్పురవాసినామ్ ।**
**సంచారో లోకమార్గేఽపి స్యాత్తయైవ విజృంభయా ॥ 3**

**ప్రతిపదార్థము :** లబ్ధ = పొందబడిన, త్వత్ = నీయొక్క, సంపదామ్ = సంపదను కలిగిన, త్వత్ = నీయొక్క, పురవాసినామ్ = పురమున నివసించునట్టి, భక్తిమతామ్ = భక్తిగలవారియొక్క, సంచారః = ప్రవర్తన, సంచారము, లేక వ్యవహారము, లోకమార్గే అపి = లోకరీతులయందైనను, విజృంభయా = వికసించిన, పరిణతి చెందినదైన, తయా ఏవ = భక్తి చేతనే, స్యాత్ = అగును.

**తాత్పర్యము :** నీ పురమున వసించుచు నీయందలి భక్తిసంపదను పొందిన వారి ప్రవర్తన బాహ్యదృష్టికి లౌకికముగనే కన్పడినను, నిజమునకు భక్తిపారవశ్యముతో కూడినదే అగును.

చేతులతో చేసే పనికి లోకంలో ఒక బాహ్యార్థం ఉంటుంది. చేతలనుబట్టి వ్యక్తిత్వాన్ని అంచనా వేయటం లోకంలో పరిపాటి. కాని, చేతల వెనుక ప్రేరణనిస్తూన్న మనస్సు స్థితి ముఖ్యం. నేరాన్ని విచారించే సందర్భంలో కూడా మనఃస్థితిని పరిగణించటం కద్దు. నోటితో నామావళి పలుకుతూ, చేతితో పువ్వులు దేవుని మూర్తిపై చల్లుతూ ఉంటే, ఆ వ్యక్తి భక్తుడని లోకవ్యవహారం కలుగుతుంది. భక్తుడు చేసే క్రియాకలాపం ఆతడు చేస్తూన్నాడు కదా! కాని వాని మనస్సు దైవము నందు లేకపోవచ్చు. భక్తిలో పరిణతి చెందిన వాని విషయం వేరు. ఆతడు లౌకికకార్యాలలో నిమగ్నుడైయున్నప్పుడు కూడ, భగవద్గీత చెప్పినట్లు, భగవద్యుక్తుడై ఉంటాడు కనుక ఈ లౌకిక వ్యవహారాలు కూడా వాని భక్తివలన ప్రభావితమై పావనమవుతాయి. ఈ శ్లోక భావం ఇది.

**త్వత్పురవాసినాం** అనుదానికి శివనివాసమైన కాశీపురంలో ఉండేవారిని చెప్పవచ్చును. లేదా, శివునియందే నివసించేవారినీ చెప్పవచ్చును. పుర శబ్దానికి శరీరమని అర్థం అనుకుంటే, శరీరధారులైన భక్తులకు అనిన్నీ అర్థం చెప్పవచ్చు. అయితే భక్తి విజృంభణ గలవారు శివయుక్తులనటం హేతుబద్ధం కనుక, ఆ అర్థమే ప్రతిపాద్యం.

**శ్లో॥ సాక్షాద్భవన్మయే నాథ! సర్వస్మిన్ భువనాంతరే ।**
**కిం న భక్తిమతాం క్షేత్రం మన్త్రః క్వైషాం న సిద్ధ్యతి ॥ 4**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓస్వామీ!, సాక్షాద్ = ప్రత్యక్షముగా, భవత్ + మయే =

తమతో నిండిన, సర్వస్మిన్ = సమస్తమైన, భువనాంతరే = లోకములలో, భక్తిమతామ్ = భక్తిగలవారికి, కిమ్ = ఏది, క్షేత్రమ్ = పుణ్యక్షేత్రము, న = కాదు?, ఏషామ్ = వీరికి, క్వ = ఎక్కడ, మంత్రః = మంత్రము, న సిద్ధ్యతి = సిద్ధి పొందదు?

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఈ లోకాలన్నీ తమతో నిండియున్నవే. ఆ కారణముగా, భక్తిగలవారికి ప్రతిచోటా పుణ్యక్షేత్రమే, ప్రతి చోటా మంత్రసిద్ధియే. ఇది ప్రత్యక్ష ప్రమాణం.

భక్తి సర్వప్రధానం. క్షేత్రమూ మంత్రమూ భక్తినిబట్టి ఫలప్రదాలవుతాయే తప్ప, వాటిని బట్టి భక్తి లభించదు. అయితే మరి పుణ్యక్షేత్రసందర్శనం, మంత్రజపం, ఇవన్నీ దండుగేనా? అంటే అది కాదు భావం. పుణ్యక్షేత్రాల ప్రభావం సత్యమే, మంత్రశక్తీ సత్యమే. కాని ఆ క్షేత్రప్రభావాన్ని మనం దర్శించటం అంటే అర్థం, అక్కడ నెలకొన్న స్వామిని మనోనేత్రంతో దర్శించటం అని. అట్లాగే మంత్రశక్తి లభించే దెప్పుడు? మంత్రాధిదేవత దర్శనం లభిస్తే కదా? దానికి మంత్రజపం మాత్రమే చాలదు. ఆ మంత్రాధిదేవతయైనా, పరమశివుడైనా దర్శనమిచ్చేది భక్తికే తప్ప అన్యానికి కాదు. క్షేత్ర జపాదులు సాధకాలు మాత్రమే, దోహదకారులు.

**శ్లో॥ జయన్తి భక్తిపీయూషరసాసవవరోన్మదాః ।**
**అద్వితీయా అపి సదా త్వద్ద్వితీయా అపి ప్రభో! ॥ 5**

**ప్రతిపదార్థము :** ప్రభో = ఓ స్వామీ!, భక్తిపీయూషరస = భక్తియను అమృతరసమను, ఆసవవర = ఆసవములలో శ్రేష్ఠమైనదానితో, ఉన్మదాః = పరవశించినవారు, అద్వితీయాః అపి = తమతో సమానులు లేనివారైనను, త్వత్ ద్వితీయాః = నీతో సమానమైనవారు, అపి = కూడ, జయన్తి = వారికి జయము.

**తాత్పర్యము :** స్వామీ! భక్తి అనబడే అమృతం ఆసవాలన్నిటిలో శ్రేష్ఠమైనది. ఆ భక్తితో పరవశించినవారు ఏకకాలంలో ద్వితీయులూ అద్వితీయులూ కూడా. వారికి జయము.

మధువు వంటి పానీయాలు మత్తెక్కిస్తాయి. ఒడలు మరిపిస్తాయి. త్రాగినవాడు సర్వాధికారిగా ప్రవర్తిస్తాడు. లౌకికంగా అప్రతిష్ఠకు తలవంచవలసినవాడవుతాడు. కాని భక్తిమధువునాస్వాదించి మత్తిల్లినవాడి స్థితి వేరు. ఇతడున్నూ లోకంలో దేనినీ లక్ష్యం చెయ్యడు, త్రాగుబోతువలెనే. అయితే భక్తుడు తన లౌకికతనే త్యాగం చేసి, ఆ శివుని పారమ్యాన్ని అందుకుని అద్వితీయుడవుతాడు, ఆధ్యాత్మికంగా శివునితో సమానుడవుతాడు. కనుక భక్తుని పారవశ్యం అతనికి అప్రతిష్ఠను అంటగట్టకపోగా విశిష్టమైన ప్రతిష్ఠనే కలిగిస్తుంది, వానిని లోకారాధ్యుని చేస్తుంది. కనుక అతడు లోకదృష్టికి సైతం అద్వితీయుడే, అసమానుడే, శివస్వరూపుడే. వారికి ఇహ పరములందెల్ల విజయమే.

శ్లో॥ అనన్తానన్దసిన్ధోస్తే నాథ! తత్త్వం విదన్తి తే ।
తాదృశా ఏవ యే సాంద్రభక్త్యానందరసాప్లుతాః ॥ 6

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, తే = నీయొక్క, అనన్త = అంతములేని, ఆనంద = ఆనందము అను, సింధోః = సముద్రముయొక్క, తత్త్వమ్ = సత్యస్వరూపమును, తే = వారు, ఏవ = మాత్రమే, విదన్తి = తెలియుచున్నారు. యే = ఎవరు, తాదృశా ఏవ = అట్టిదే అయిన, సాంద్ర = దట్టమైన, భక్తి = భక్తివలన కలిగిన, ఆనందరస = ఆనందమను రసముచే, ఆప్లుతాః = నిలువెల్ల తడుపబడినారో.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ భక్తిరసానందసాగరంలో నిలువెల్ల మునిగి తడిసిన భక్తులెవరో వారు మాత్రమే నీ అనంతభక్తి సాగరమంత ఆనందమునివ్వగలదన్న సత్యాన్ని తెలిసికొనగలరు.

భక్తియొక్క సత్యస్వరూపం తెలియవలెనంటే భక్తుడు కావలసినదే. వేరు మార్గం లేదు. కాగా నీ భక్తివలన లభించే చిన్నచిన్న లౌకికలాభాలకు మురిసిపోయే భక్తులకు అంతమాత్రమే లభిస్తుంది. వారికి ఆనందం అంటే ఇంతే కదా!, ఇంతకు మించి మరేమున్నది? అన్పించటం కద్దు. వారికి పరిణతి లభించదు. సముద్రం ఒడ్డున నిలబడి కాళ్ళు కడుగుకొనటం వంటిది. వారికి సముద్రం స్వభావం తెలియదు. లోతుకు దిగి, మునిగి తేలినవారికి దాని నిజస్వరూపం తెలుస్తుంది. భక్తి ఫలంగా లభించే లాభాల వలన ఆనందం కలగటంతో మొదలై, పరిణామంలో భక్తియే ఆనందం అన్న సత్యం సాకారమవుతుంది. భక్తి సముద్రంలో మునిగి తేలినవాడవుతాడు.

శ్లో॥ త్వమేవాత్మేశ! సర్వస్య సర్వశ్చాత్మని రాగవాన్ ।
ఇతి స్వభావసిద్ధాం త్వద్భక్తిం జానఞ్జయేజ్జనః ॥ 7

**ప్రతిపదార్థము :** ఆత్మేశ = ఆత్మకు ప్రభువైనవాడా!, త్వమేవ = నీవే, సర్వస్య = సమస్తమునకు, సర్వః = సమస్తమైనవాడవు, చ = మరియు, ఆత్మని = ఆత్మయందు, రాగవాన్ = ప్రేమగలవాడవు, ఇతి = అని, స్వభావసిద్ధామ్ = సహజమైన, త్వద్‌భక్తిమ్ = నీ భక్తిని, జానన్ = తెలియుచు, జనః = నరుడు, జయేత్ = విజయము చేయును.

**తాత్పర్యము :** ఆత్మేశా! ఈ సమస్త విశ్వానికి సమస్తం నీవే. నీకు ఆత్మయందే ప్రేమ. అందుచేత నీయందు భక్తి అన్నది సహజసిద్ధం. ఈ విషయం తెలిసికొన్న నరుడు సర్వత్ర విజయమే పొందగలడు.

ఈ చరాచరవిశ్వాన్ని పరిశీలించిన విజ్ఞులు, ఇందున్నవి రెండే అని

ప్రకటించినారు; 1. పదార్థము, 2. శక్తి. ఇవియే సర్వమునకు సర్వం అన్నది విజ్ఞాన శాస్త్రం. కాని వేదాంతశాస్త్రం ఈ సర్వానికి సర్వమైనది ఆత్మయనీ, ఈ ఆత్మయే పరమేశ్వరుడనీ అంటుంది. పదార్థానికీ శక్తికీ యజమాని, అధికారి, కేంద్రబిందువు ఆ ఈశ్వరుడే. కనుకే ఆతడు ఆత్మేశుడు, ఆతనికి అనురాగం ఆత్మయందే. సర్వమూ ఈ ఆత్మకేంద్రంవైపు ప్రయాణించేవే, వేరే లక్ష్యం యే ఒక్కదానికీ విశ్వంలో లేదు. కనుకే ఆతడు **సర్వస్య సర్వః** అనబడినాడు. ఈ రహస్యాన్ని వచనరూపంలో వినటమే కాక, అనుభవరూపంలో తెలిసికొన్నవానికి భక్తి ఎంత సహజమో అర్థమవుతుంది. అటువంటివానికి అంతా జయమే.

**శ్లో॥ నాథ! వేద్యక్షయే కేన న దృశ్యోఽ స్యేకకః స్థితః ।**
**వేద్యవేదకసంక్షోభేఽ ప్యసి భక్తైః సుదర్శనః ॥ 8**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, వేద్య = ఎఱుగదగినవానియొక్క, క్షయే = నాశము (తరువాత) నందు, ఏకకః = ఒక్కడై, స్థితః = ఉన్న, కేన = ఎవనిచేత, న దృశ్యః అసి = చూడబడనివాడవు అగుచున్నావు?, వేద్య = తెలియదగినది, వేదక = తెలియువాడు అను, సంక్షోభే అపి = సంక్షోభమునందు కూడ, భక్తైః = భక్తులచేత, సుదర్శనః అసి = చక్కగా చూడబడినవాడవు అగుచున్నావు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎఱుగదగినదేదీ లేనప్పుడు, ఒక్కడై మిగిలినవాడు, చూడబడనివాడు ఎవడు? నీవే. తెలియదగినది, తెలిసికొనువాడు అను ఇద్దరుండి, తెలియదగిన, తెలియరాని అన్న వివక్ష సంక్షోభాన్ని కలిగించినప్పుడు కూడా భక్తులచేత చూడబడువాడవు నీవే.

దృశ్యము, దృష్టి, ద్రష్ట అను ఈ మూడింటి కూడలియే ఈ ప్రకృతి లేక ప్రపంచము. ఈ మూడిటిలో దృశ్యము లేనప్పుడు దృష్టి, ద్రష్ట అనునవి లేవు. దృష్టి లేనప్పుడు మిగత రెండు లేవు. ద్రష్ట లేనప్పుడు మిగత రెండు లేవు. అంటే, మూడు కలిసినప్పుడే, మూడూ ఉండటం సాధ్యం. అట్లా ఉండటమే ప్రపంచం. మరొక విధంగా, జ్ఞేయము (వేద్యము), జ్ఞానము (వేదము), జ్ఞాని (వేదకుడు) అను ఈ మూడున్నూ ఇట్లే. ఈ కలయికకే అనుభవం, అనుభూతి ఇత్యాదిగా పేర్లు.

భక్తి అన్నది దృష్టి అయితే, భక్తుడు ద్రష్ట, భగవంతుడు దృశ్యము. అట్లా కాక, దృష్టి అన్నది ఇంద్రియమైతే, ద్రష్ట జీవి, దృశ్యము ప్రపంచము. ఈ ప్రపంచభావం లేక సంసారభావం నశించినప్పుడు, ఈ కూటమి మారుతుంది. లేదా, దృష్టి అన్నది ప్రతి

వ్యక్తి ద్రష్టత్వాన్నీ, వాని దృశ్యాన్నీ, అంటే, జ్ఞేయ జ్ఞానాలను సాకారం చేస్తుంది. జ్ఞేయం లేనప్పుడు, జ్ఞానమూ జ్ఞాతా కూడా లేరు కనుక, ఆ స్థితిలో మూడూ ఒక్కటయిన స్థితిలో కేవలుడై మిగిలినవాడు శివుడు. ఆ శివపారమ్యం భక్తులకు ఈ సంసారంలో, వేద్య – వేద – వేదక త్రిపుటిలో కొట్టుమిట్టాడుతూన్న స్థితిలో కూడా, సిద్ధిస్తుంది. అదే కైవల్యప్రాప్తి. **భోక్తైవ భోగ్యరూపేణ సదా సర్వత్ర సంస్థితః** అంటుంది స్పందనశాస్త్రం. భోక్త – భోగము – భోగ్యము ఏకమైతే అదే కైవల్యం.

**శ్లో॥ అనన్తానందసరసీ దేవీ ప్రియతమా యథా ।**
**అవియుక్తాస్తి తే తద్వదేకా త్వద్భక్తిరస్తు మే ॥ 9**

**ప్రతిపదార్థము :** యథా = ఏవిధముగా, అనంత = అంతములేని, ఆనంద = ఆనందమను, సరసీ = సరస్సుగానైన, ప్రియతమా = ప్రియురాలైన, దేవీ = పరాశక్తి, తే = నీకు, అవియుక్తా = అభిన్నురాలు, అస్తి = అయియున్నదో, తద్వత్ = అదేవిధముగా, త్వద్ = తమయొక్క, భక్తిః = భక్తి, ఏకా = మాత్రము, ఒకటి, మే = నాకు, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** ఓ ప్రభూ! ఆనందసరస్సుగా అనంతముగా తమ ప్రియురాలైన పరాశక్తి తమ నుండి వేరుగాకున్నట్లే, నా భక్తి తమయందే అనంతానందమయమై తమనుండి విడివడకుండుగాక!

శివః అంటే శివుడు; శివా అంటే శక్తి. ఈ రెండిటికి శబ్దసామ్యం మాత్రమే కాదు. అర్థ, అర్ధసామ్యం కూడా : శివుడు సుఖస్వరూపుడు; శక్తి సుఖస్వరూపిణి. పరాశక్తి పరమేశ్వరుని ఇచ్ఛాశక్తిస్వరూపిణియే తప్ప వేరు వ్యక్తి కాదు. కనుకే శివశక్తులకభేదమే. కాక వేరు వేరైనప్పుడు శివం అనబడే సృష్టి సమస్తం శవం అనబడుతుంది. అట్లే భక్తి అన్నది ఈశ్వరయుక్తమైనప్పుడే సార్థకమవుతుంది తప్ప కానప్పుడు భక్తుడు విభక్తుడై భక్తియన్నది భక్తికాకపోతుంది. కాని, లోకయాత్రలో అవియుక్తభక్తి ప్రదర్శనలు నిత్యము కనబడుతూన్నవి కదా. వానిని స్మరించి కవి ఈ కోరికను వెలువరిస్తూన్నాడు.

**శ్లో॥ సర్వ ఏవ భవల్లాభహేతుర్భక్తిమతాం విభో! ।**
**సంవిన్మార్గోఽయమాహ్లాదదుఃఖమోహైస్త్రిధా స్థితః ॥ 10**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, ఆహ్లాద = సుఖము, దుఃఖ = దుఃఖము, మోహైః = మోహము అను వీటిచే, త్రిధా = మూడు విధములుగా, స్థితః = ఉన్న,

అయమ్ = ఈ, సర్వః = సమస్తము, సంవిత్‌మార్గః ఏవ = జ్ఞానమార్గమే, భక్తిమతామ్ = భక్తిగలవారికి, భవత్ = తమయొక్క, లాభ = ప్రాప్తికి, హేతుః = కారణము, సాధనము.

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! ఈ లోకం సమస్తం మూడు విధాలుగా అనుభవంలో ఉంటుంది : 1. సుఖం, 2. దుఃఖం, 3. మోహం. అయినా ఈ మూడున్నూ భక్తులకు జ్ఞానమార్గమే. ఇవి మూడున్నూ భక్తులను తమ దగ్గరకే చేరుస్తాయి.

విభో! అంటే సర్వవ్యాపీ అని అర్థం. సుఖదుఃఖమోహాలన్నిటిలో తానే వ్యాపించి ఉండి భక్తులకు అన్నిటా తానే దర్శనమిస్తాడు కనుకే ఆ స్వామిని విభో అని సంబోధన.

లోకంలో అందరికీ జీవితానుభవాలన్నింటినీ సుఖ, దుఃఖ, మోహాలన్న మూడు విధాలుగా విశ్లేషించవచ్చు. ఈ మూడున్నూ సత్త్వ, రజస్, తమస్ అన్న మూడు గుణాల వలన కలిగే అనుభవాలు. ప్రాణులన్నీ ఈ మూడింట ఏదో ఒక గుణం ప్రధానంగా జన్మించి జీవించేవే. కనుకే శుద్ధసత్త్వసాధన చేసి రజస్తమస్సులను నివారించమనీ, శాశ్వతసుఖాన్ని పొందమనీ పెద్దలంటారు. శివుడు సుఖస్వరూపుడు కనుక సత్త్వసాధన శివప్రాప్తిని కలిగిస్తుందని భావం. కాని, భక్తి ప్రధానంగా జీవించే వానికి సుఖమొక్కటే కాదు, దుఃఖమూ మోహమూ కూడా శివప్రాప్తికి సాధనాలే అవుతాయి. అంటే, భక్తి అన్నది పరుసవేది ఇనుమును బంగారంగా మార్చినట్లు, రజస్తమోగుణాలను సైతం సత్త్వగుణంగా మార్చగలదు, అని భావం.

**శ్లో॥ భవద్భక్త్యమృతాస్వాదాద్బోధస్య స్యాత్పరాపి యా ।**
**దశా సా మాం ప్రతి స్వామిన్నాసవస్యేవ శుక్తతా ॥ 11**

**ప్రతిపదార్థము :** స్వామిన్ = ఓ స్వామీ!, భవత్ = తమయొక్క, భక్తి = భక్తియను, అమృత = అమృతమును, ఆస్వాదాత్ = సేవించుటవలన, బోధస్య = జ్ఞానముయొక్క, పరా = ఉత్తమమైన, దశా = స్థితి, యా = ఏది, స్యాత్ = ఉండునో, సా అపి = అది కూడ, మాం ప్రతి = నా విషయంలో, ఆసవస్య = మదిరయొక్క, శుక్తతా ఇవ = కాఠిన్యమువలె.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ భక్తి అనే అమృతం త్రావినందువలన కలిగే ఆనందాన్ని ఆస్వాదించటం అనబడు జ్ఞానం కంటె ఉత్తమము, ఉన్నతము అయిన జ్ఞానమున్నదని యేది చెప్పబడుచున్నదో, ఆ జ్ఞానము నాకు రుచికరము గాదు. అది ఆసవములోని ఆమ్లత, చేదు వంటిది.

భక్తివలన ఆనందపారవశ్యం కలుగుతున్నది. ఇంతకు మించి జీవి కోరదగినదేమున్నది? అంటే జ్ఞానం అనబడేది వేరే ఒకటున్నదంటారు కొందరు. దానివలన కలిగే ఆనందం ఇంకా గొప్పదంటారు. మరి భక్త్యానందం జ్ఞానం కాదా? అజ్ఞానజనితమా? అంటే, అట్లా కాదు. అది జ్ఞానమే కాని దానికి కర్మస్పర్శ ఉన్నదికదా, అదికూడా లేని నిర్మలజ్ఞానం వలన కలిగే ఆనందం ఇంకా గొప్పది అంటారు వారు. నాకు మాత్రం ఆ శుద్ధజ్ఞానానందం రుచ్యం కాదు, కటువుగా తోస్తుంది. అర్థాత్, నీ భక్తికంటే వేరైన జ్ఞానమున్నా గాని, అది నాకోసం కాదు, స్వామీ! నాకు మాత్రం భక్తి జ్ఞానాలు ఒకటే. మరి జ్ఞానం కూడా సాధనమే అంటారు కదా, దేనికి సాధనం? భక్తిపారవశ్యానికి కాదా? శివపారమ్యానికి కాదా?

ఇదొక అన్వయం. ఇదికాక మరొక అన్వయం .... భక్తి జ్ఞానాలకు లక్ష్యమైన మోక్షం కూడా నాకు రుచించదు, అంటాడీ భక్తుడు. **పరా** శబ్దాన్ని అన్వయించే తీరును బట్టి ఈ అర్థాలు.

**శ్లో॥ భవద్భక్తిమహావిద్యా యేషామభ్యాసమాగతా ।**
**విద్యావిద్యోభయస్యాపి త ఏతే తత్త్వవేదినః ॥ 12**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, భక్తి = భక్తిరూపంగల, మహావిద్యా = అధ్యాత్మవిద్య, యేషామ్ = ఎవరికి, అభ్యాసమ్ + ఆగతా = అభ్యాసమవుతుందో, త (తే) ఏతే = అట్టివారే, విద్యా = విద్య, అవిద్యా = అవిద్య, అను, ఉభయస్య అపి = రెండిటియొక్కయు, తత్త్వవేదినః = సారభూతమైన పరమసత్యము నెఱిగినవారు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! తమయందు భక్తి ఎవనికి అభ్యాసపూర్వకస్థిరత్వమును పొందునో, వానికా భక్తియే మహావిద్య, ఆత్మవిద్య. వారు విద్య సారాన్నీ, అవిద్య సారాన్నీ కూడా తెలిసినవారు.

విద్యలు లౌకికాలు, పారమార్థికాలూ అని రెండు విధాలు. లౌకికార్థ సాధకాలైన విద్యలను దృష్టియందుంచుకొని మాత్రమే విద్యావంతులు, విద్యాహీనులు అనటం పరిపాటి. కాని పారలౌకికమైన ఆనందాన్ని సాధించే విద్య పారమార్థికవిద్య. ఇదే ఆత్మవిద్య, అధ్యాత్మవిద్య, మహావిద్య అనబడేది. అన్ని విద్యలవలెనే మహావిద్యకూడ అభ్యాసలబ్ధమే. నిజానికి లౌకిక విద్యాభ్యాసం కంటె మహావిద్యాభ్యాసం కష్టతరం. కాని దానిలో నిలుకడను సాధిస్తే విద్యయేదో అవిద్యయేదో, ఈ రెండిటి ఆంతర్యమేమో, సత్యం బోధపడుతుంది. అచంచలమైన భక్తి ఉంటే, మహావిద్యకూడ అభ్యాసం లేకుండగనే స్వాధీనమవుతుంది.

**అవిద్య** అంటే జీవాత్మ పరమాత్మల అభేదత్వాన్ని తెలియకుండటం. ఇది త్రిగుణాత్మకం. దీనికి భ్రాంతి, మాయ, ప్రకృతి అన్నవి ప్రసిద్ధ పర్యాయపదాలు.

**విద్య** అంటే ఆత్మవిద్య అన్నది వేదాంత పరిభాషార్థం. విశ్వవ్యాప్తంగా ప్రాణులు, అప్రాణివస్తువులు, వాచ్యంగా కొన్ని, లక్షణాత్ కొన్ని, నేను, నేను, అని ప్రకటించుకునే ఈ నేను యొక్క సత్యస్వరూపదర్శనాన్ని పొందటం. అందుకుపకరించేది బ్రహ్మవిద్య అనబడే విద్యలు.

బ్రహ్మవిద్యలివి (ఉపనిషత్తులు ప్రతిపాదించినవి)

| | | |
|---|---|---|
| 1. | ఈశావాస్య విద్య | (ఈశావాస్యోపనిషత్తు) |
| 2. | అంగుష్ఠప్రమితవిద్య | (కఠోపనిషత్తు) |
| 3. | నాచికేతవిద్య | (కఠోపనిషత్తు) |
| 4. | సత్యకామవిద్య | (ప్రశ్నోపనిషత్తు) |
| 5. | అపరవిద్య | (ముండకోపనిషత్తు) |
| 6. | ఆనందమయవిద్య | (తైత్తిరీయానందవల్లి) |
| 7. | పురుషవిద్య | (తైత్తిరీయనారాయణవల్లి) |
| 8. | సద్విద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 9. | అంతరాదిత్యవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 10. | ఆకాశవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 11. | ప్రాణవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 12. | పరంజ్యోతివిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 13. | శాండిల్యవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 14. | ఉపకోసలవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 15. | వైశ్వానరవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 16. | భూమావిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 17. | దహరవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 18. | మధువిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 19. | సంవర్గవిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 20. | పంచాగ్నివిద్య | (ఛాందోగ్యోపనిషత్) |
| 21. | ఉద్దాలకాంతర్యామివిద్య | (బృహదారణ్యకోపనిషత్తు) |
| 22. | గార్గ్యక్షరవిద్య | (బృహదారణ్యకోపనిషత్తు) |

23. జ్యోతిషాంజ్యోతిర్విద్య (బృహదారణ్యకోపనిషత్తు)
24. మైత్రేయీవిద్య (బృహదారణ్యకోపనిషత్తు)
25. ఆదిత్యమండలస్థవిద్య (బృహదారణ్యకోపనిషత్తు)
26. అక్షిస్థసత్యబ్రహ్మవిద్య (బృహదారణ్యకోపనిషత్తు)
27. ఉపస్థికహోలవిద్య (బృహదారణ్యకోపనిషత్తు)
28. ప్రతర్ధనవిద్య (కౌషీతకీ ఉపనిషత్తు)
29. బాలకివిద్య (శ్వేతాశ్వతర ఉపనిషత్తు)
30. అజావిద్య (శ్వేతాశ్వతర ఉపనిషత్తు)
31. రుద్రవిద్య (ఇతరోపనిషత్తులు)

**శ్లో॥ ఆమూలాద్వాగ్లతా సేయం క్రమవిస్ఫారశాలినీ ।**
**త్వద్భక్తిసుధయా సిక్తా తద్రసాఢ్యఫలాస్తు మే ॥ 13**

**ప్రతిపదార్థము :** ఆమూలాత్ = తల్లివేరు నుండి, క్రమ = అంచెలంచెలుగా, విస్ఫార = వికసించిన, శాలినీ = శోభ గలిగిన, సా ఇయమ్ = ఆ ఈ, వాక్ + లతా = వాక్కు లేక భాషారూపమైన లత, మే = నాకు, త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియను, సుధయా = అమృతముచే, సిక్తా = తడుపబడిన, తద్ = దానియొక్క, రస = రసరూపమైన, ఆఢ్య = గొప్ప, ఫలా = ఫలము గలది, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** నా యీ వాగ్లత సమూలంగా క్రమంగా పెరిగి, శోభగలదై నీయందలి భక్తి అను అమృతంతో తడిసిన, గొప్పఫలాన్ని అందించుగాక!

భక్తితో కవి ఈ శివస్తోత్రాలను రచించినాడు. ఈ భక్తి ఒక తీగవంటిది, సాగినకొద్దీ పూత, పిందె యేర్పడుతుంటుంది. అంటే భక్తి వృద్ధి అయినకొద్దీ దాని ప్రభావం అంతకంతకు గొప్పగా ప్రకటమై తెలియవస్తుంది. భక్తి స్వయంగా మధురమైనది. ఆ అమృతంతో క్రమంగా దాని ఫలం కూడా నిండిపోతుంది. ఇది క్రమపరిణామం. ఈ వర్ణన భక్తిలోని వివిధ దశలను స్ఫురింపజేస్తుంది. ప్రారంభంలో భక్తి, తీగ వ్రేళ్ళు నేల లోపలికి చొరబారినట్లు, భౌతికదశలోనే ఉంటుంది. దాని ప్రదర్శన క్రియా కలాపాలలో, నియమనిష్ఠలను పాలించటంలో నిమగ్నమై ఉంటుంది. చూచేవారికది చాదస్తంగా తోస్తుంది. కాని ఆ బాహ్యాడంబరంలో నుండి క్రమంగా భక్తి మానసికానందంలోకి ఎదుగుతూ బలపడి ఆత్మను తాకుతుంది. పారవశ్యం కలుగుతుంది.

భక్తితో కూడిన కవితాలతనుద్దేశించి కవి భావం ఇట్లా చెప్పవచ్చును : మూలం

అన్నది పరా, క్రమవిస్ఫారితం అన్నది పశ్యన్తీ, ఫలం అన్నది వైఖరీరూపవాగ్వికాసం, ఈ దశలలో వాక్కు వెలువడే విధానంలో భక్తి ఆ వాక్కును పోషించే అమృతంగా వెలువడాలని, భక్తి కాని అన్యరసం దాని నంటరాదని కవి ఆకాంక్షయనవచ్చు.

**శ్లో॥ శివో భూత్వా యజేతేతి భక్తో భూత్వేతి కథ్యతే ।**
**త్వమేవ హి వపుః సారం భక్తైరద్వయశోధితమ్ ॥ 14**

**ప్రతిపదార్థము :** శివః భూత్వా = శివుడవై, యజేత = పూజించవలె, ఇతి = అని, భక్తః = భక్తుడవు, భూత్వా = అయి, ఇతి = అని, కథ్యతే = చెప్పబడుచున్నది, హి = ఏలన, త్వమ్ = నీవు, భక్తైః ఏవ = భక్తులచేతనే, అద్వయశోధితమ్ = అభేదముతో వెదుకబడిన, వపుః సారమ్ = రూపముయొక్క సారము.

**తాత్పర్యము :** శివుడవై పూజించుము, భక్తుడవై పూజించుము, అని చెప్పబడుచున్నది. ఎందుకంటే, భక్తులు సాకారంగా నిన్ను పూజించి వెదకునది నిరాకారమైన నీ శక్తినే కదా!

**శివో భూత్వా శివం యజేత్,** అన్నది వేదవాక్కు. జీవుడు శివుడు కావటం అంటే, అది దేహపాతం వలన సాధించవలసిన శివత్వం అని కొందరి అభిప్రాయం. అన్యథా అసాధ్యమని. అంటే, దేహం ఉండగా శివభావం లేకుండా పూజ అన్నదే ఉత్పన్నం కాదు కనుక శివయుక్తుడైన శివభక్తుడే చెప్పబడినాడని గ్రహించాలి. కనుక **భక్తో భూత్వా శివం యజేత్** అన్నదానికి శివభావంలో ఉన్న భక్తునకు మాత్రమే శివపూజ తెలియునని భావం. సాకార నిరాకార శంకను తర్కించి శోధించి రూపసారం నీవేనన్న అద్వయభావంతో సాకారాన్ని పూజించువారు శివభక్తులు. ఆకారంతో ప్రకటమైనదేదీ? శివభావం కదా. అదే శివరూపసారం. రూపం పూజాసాధనం. భావం పారమ్యసాధనం.

**శ్లో॥ భక్తానాం భవదద్వైతసిద్ధ్యై కా నోపపత్తయః ।**
**తదసిద్ధ్యై నికృష్టానాం కాని నావరణాని వా ॥ 15**

**ప్రతిపదార్థము :** భవద్ = తమయొక్క, అద్వైతసిద్ధ్యై = అద్వైత (అభేద) భావము కలుగుటకై, భక్తానామ్ = భక్తులకు, ఉపపత్తయః = సాధనాలు, కాః = ఏవి, న = కాదు, వా = లేక, తద్ = దానియొక్క, అసిద్ధ్యై = సిద్ధించకుండుటకు, నికృష్టానామ్ = అధములకు, కాని = ఏవి, ఆవరణాని = ఆటంకములు, న = కావు.

**తాత్పర్యము :** తమ భక్తులకు తమతో అభేదభావాన్ని సిద్ధింపజేసికొనే ప్రయత్నంలో

సాధనాలు కానివేవీ లేవు. లేక, భక్తిరహితులకు ఈ అభేదభావం సిద్ధించకుండ చేయుటకు ఆటంకములు కానివి కూడ ఏవీ లేవు.

బుద్ధిననుసరించి సాధనసంపత్తి. నిజానికి కార్యసాధనకు ఉపకరణాలు కానివేవీ లేవు. ఎటొచ్చీ కార్యం సాధించవలెనా? లేదా? అన్న నిర్ణయం వ్యక్తిగతం. ఈ నిర్ణయానుసారం ఉపపత్తులుగా, ఆవరణాలుగా ప్రకృతి సాకారమవుతుంది. జీవితం ఫలవంతమవుతుంది. శివుని నమ్మి భక్తిమార్గాన సాధనచేసేవారికి ఆ దిశగానే ప్రకృతి సహకరిస్తుంది. ఈ నివృత్తిమార్గాన్ని నిరసించి ప్రవృత్తి మార్గాన్ని ఎంచుకొని పయనించే సాంసారిక జీవులకు ప్రకృతి ఆ దిశగానే సహకరిస్తుంది. శివభక్తుల బుద్ధికి శివునియందు విశ్వాసాన్ని అధికం చేసే కారణాలే, ప్రవృత్తిమార్గంలో పయనించే అభక్తులకు శివునియందు అవిశ్వాసాన్ని పోషించి పెంచే కారణాలుగా కన్పిస్తాయి. విలువలు ప్రతిపాదించేది వ్యక్తి వివేకం తప్ప వస్తువు కాదు. ఏ కార్యాన్నైనా సాధించటానికీ, త్రోసిపుచ్చటానికీ కారణాలు సమానమే.

**శ్లో॥ కదాచిత్ కాపి లభ్యోఽసి యోగేనేతీశ! వంచనా ।**
**అన్యథా సర్వకక్ష్యాసు భాసి భక్తిమతాం కథమ్ ॥ 16**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ స్వామీ!, కదాచిత్ = ఒకప్పుడు, కాపి = ఎక్కడనైన, యోగేన = యోగముతో, లభ్యమ్ = లభించువాడవు, అసి = అగుచున్నావు, ఇతి = అనుమాట, వంచనా = మోసము, అన్యథా = కానట్లయితే, సర్వ = అన్ని, కక్ష్యాసు = దశలలో, భక్తిమతామ్ = భక్తిగలవారికి, కథమ్ = ఎట్లు, భాసి = సాక్షాత్కరింతువు?

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట యోగదశలో నీవు సాక్షాత్కరిస్తున్నావు, అన్న మాట అబద్ధం. కాకపోతే, భక్తులకు అన్ని దశలలో నీవు దర్శనమివ్వటం ఎట్లా సాధ్యం?

యోగసాధనలో ఏదో ఒకదశలో, షట్చక్రాలలో యేదో ఒక చక్రంలోనో లేక శరీరాంగాలలో ఏదో ఒక అంగంలో ఏకాగ్రసాధన చేసినప్పుడో శివసాక్షాత్కారం లభిస్తుందని యోగసాధకులు చెబుతుంటారు. అది నిజం కాదనిపిస్తుంది. ఎందుకంటే, యోగం సంగతి ఎలా ఉన్నాగాని, భక్తిసాధనలో భక్తునికి సర్వత్ర సదా శివదర్శనమే అవుతున్నదికదా, యోగసాధనలో అక్కడా ఇక్కడా, అప్పుడూ ఇప్పుడూ, అంటూ వెదకి శివుని కనుగొనటం యేమిటి!? శివుడు అంతటా ఉన్నాడు, ఎప్పుడూ ఉన్నాడు. ఇది భక్తుల అనుభవం. ఒకచోట ఉన్నాడంటే మరెక్కడా లేడనేకదా? ఒకప్పుడు ఉన్నాడంటే మరెప్పుడూ లేడనే కదా? ఇది వంచన.

శ్లో॥ ప్రత్యాహారాద్యసంస్పృష్టో విశేషో౽స్తి మహానయమ్ ।
యోగిభ్యో భక్తిభాజాం యదుత్థానే౽పి సమాహితాః ॥ 17

**ప్రతిపదార్థము :** యోగిభ్యః = యోగులకంటె, భక్తిభాజామ్ = భక్తులకు, ప్రత్యాహార + ఆది = ప్రత్యాహారము మొదలైనవానిచే, అసంస్పృష్టః = తాకబడని, అయమ్ = ఈ, మహాన్ = గొప్ప, విశేషః = విశేషము, అస్తి = ఉన్నది, యద్ = ఏది, ఉత్థానే = ఉత్థానమునందు, అపి = కూడ, సమాహితాః = సమాధిస్థితిలోనివారే.

**తాత్పర్యము :** యోగులు ప్రత్యాహారము మొదలైన సాధనలన్నీ పూర్తిచేసి క్రమంగా సమాధిస్థితిని పొందుతారు. కాని భక్తులు సాధన స్థితిలో కూడా సమాధిలోనే ఉంటారు. ఇది గొప్ప విశేషం.

**ప్రత్యాహారం** అన్నదొక యోగసాధన, ఇంద్రియాలను నియమించి స్వాధీనం చేసికొనే సాధన. ఇది యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అను ఏడిటితో కలిపి ఎనిమిది యోగాంగాలుగా చెప్పబడినవి. వీనిలో చివరిది సమాధి. సాధనలో కూడా సమాధిస్థితిని అందుకునేందుకు ఉపకరణాలు మిగత ఏడున్ను. కనుక యోగులు ఈ సప్తాంగాలపై అధికారం సాధించిన తరువాతనే చివరిదైన సమాధికి యోగ్యులవుతారు. అప్పుడే సమాధి అనుభవం వారికి కలుగుతుంది. కాని భక్తుడు అనుసరించే ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ, అభిషేక, వస్త్ర, యజ్ఞోపవీత, గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్య, తాంబూల, ప్రదక్షిణ, నమస్కారాలు అను షోడశోపచారాలతో కూడిన పూజా విధానాన్ని అనుసరించే సమయంలో కూడా సమాధి స్థితిలోనే ఉంటాడు. ఇది సాకారదైవార్చన. కనుక ఇక్కడ కూడా అతనికి దేవుని సాక్షాత్కారం లభిస్తుంది. కాగా శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అను నవవిధ భక్తి మార్గాలలోనూ భక్తిద్వారా భక్తునికి భగవంతుని సాన్నిధ్యమే అనుభవమవుతుంది. ఈ కారణంగా భక్తుడెప్పుడూ ఈశ్వరసన్నిధిలో ఈశ్వరయుక్తుడై ఉంటాడు. ఈ ప్రయత్నం అతని సహజజీవన సరళిలోనే సాగిపోతుంది. ప్రాకృతిక పద్ధతుల ననుసరిస్తూనే భగవంతుని దర్శిస్తాడతడు.

యోగి మార్గం వేరు. అది ప్రకృతికి విరుద్ధంగా సాగి, ప్రకృతి పరిధిని దాటి, అంతరంగంలో ఎక్కడో దాగిఉన్న దైవాన్ని దర్శించే మార్గం. జీవితమంతా శ్రమించినప్పటికీ, ఒక్క జీవితకాలంలో యోగి పరిపూర్ణుడై ఈశ్వరయుక్తుడవుతాడని నమ్మకంగా చెప్పలేరు. కాని భక్తుడు భౌతికంగాను, మానసికంగానూ, ఆధ్యాత్మికం

గానూ, ఒక్క ప్రగాఢ విశ్వాసాన్ని ఆశ్రయించి ఈశ్వరయుక్తుడవుతాడు. కనుక యోగి కంటే భక్తుడు విశేషమైన సాఫల్యాన్ని సాధిస్తూన్నాడు అనటం స్వభావోక్తి.

**శ్లో॥ న యోగో న తపో నార్చాక్రమః కోఽపి ప్రణీయతే ।**
**అమాయే శివమార్గేఽస్మిన్ భక్తిరేకా ప్రశస్యతే ॥ 18**

**ప్రతిపదార్థము :** అమాయే = మాయ కాని, అస్మిన్ = ఈ, శివమార్గే = శివునియొక్క మార్గమునందు, యోగః = యోగము, న = కాదు, తపః = తపస్సు, న = కాదు, అర్చాక్రమః = పూజావిధానము, కః అపి = ఏదియైన, న ప్రణీయతే = నిశ్చయింపబడదు, ఏకా = ఒక్క, భక్తిః = భక్తి, ప్రశస్యతే = సర్వశ్రేష్ఠముగ ప్రశంసింపబడుచున్నది.

**తాత్పర్యము :** శివమార్గంలో మాయలేదు. దీనికి నిర్ణయింపబడినది యోగమార్గమూ కాదు, తపోమార్గమూ కాదు. భక్తిమార్గమొకటి మాత్రమే శివుని జేర్చునని ప్రశంసింపబడినది.

శివుడు జ్ఞానస్వరూపుడు, జ్ఞానదాత, సుఖస్వరూపుడు, సుఖప్రదాత. జ్ఞానం ఉన్నచోట మాయలేదు, భ్రాంతి, భ్రమ ఉండవు. భ్రాంతి, భ్రమ అన్నవి మాయ, లేక అజ్ఞాన లక్షణాలు. అట్లాగే, సుఖశబ్దానిక్కూడా ఆత్మానందమని అర్థం. ఆత్మానంద మార్గంలో కూడా భ్రాంతి ఉండదు. ఇట్లా శివుని మార్గం అంతా స్వానుభవంతో కూడినది. ఇది శాక్తమార్గం. కనుక భక్తి ఒక్కటే సాధనం తప్ప, యోగం, తపస్సును పోలిన వేరు మార్గాలు లేవు. భక్తి కూడా స్వానుభవంతో కూడిన మార్గమే. కాయికమైన అర్చావిధానాల కంటె అనుభూతియే ప్రధానం. అందుకే భక్తి పరమసాధనం అనటం.

**శ్లో॥ సర్వతో విలసద్భక్తితేజో ధ్వస్తావృతేర్మమ ।**
**ప్రత్యక్షసర్వభావస్య చిన్తానామాపి నశ్యతు ॥ 19**

**ప్రతిపదార్థము :** సర్వతః = అన్ని దిక్కుల నుండి, విలసత్ = ప్రకాశించుచున్న, భక్తి = భక్తియొక్క, తేజః = తేజస్సుచే, వెలుగుచే, ధ్వస్త = నశింపజేయబడిన, ఆవృతేః = అజ్ఞానావరణముయొక్క, ప్రత్యక్ష = కట్టెదుట గల, సర్వభావస్య = అన్నింటి సత్యస్వరూపమును చూచుచున్న, మమ = నాయొక్క, చిన్తా = వికల్పవృత్తులయొక్క, నామ అపి = పేరు కూడ, నశ్యతు = నశించుగాక!

**తాత్పర్యము :** అంతటా ప్రకాశించే భక్తితేజస్సువలన అజ్ఞానం అనబడే ఆవరణం లేక తెర తొలగి, నశించి, ఎదుటగల సర్వవస్తుప్రాణిజాలముయొక్క సత్య స్వరూపాన్ని దర్శిస్తూన్న నాకు చింతయను పేరు కూడ నశించుగాక!

భక్తి అన్నిదిక్కులా విలసిల్లటం అంటే, మనోవాక్కాయ కర్మలనబడు త్రికరణములా ప్రకటం కావటం, భావంలోనూ, భాషణలోనూ, క్రియారూపంలోనూ భక్తి ప్రకాశించటం. అట్లా వెలిగే తేజస్సు ముందు అజ్ఞానం అనబడు ఆటంకం నిలువదు. అజ్ఞానం అంటే జ్ఞానం అనబడే వెలుగు లేకపోవటం. భక్తియే ఇప్పుడు జ్ఞానమై వెలుగు నింపుతూన్నది కనుక ఆటంకం తొలగిపోయింది. భక్తి జ్ఞానంగా పరిణమించింది కనుక ఆ జ్ఞానదృష్టికి అన్నిటా అంతటా అంతర్యామి సత్యత్వం గోచరిస్తుంది. ఇక దేనిని గురించియైన చింత కలుగదు, అంటే, 'నాది' అనబడే ఒక వికల్పం లేక భావన కలుగదు.

**సర్వతో విలసద్భక్తితేజః** అన్నదాని విపులీకరణ :

*శ్లో॥ అన్తర్లక్ష్యో బహిర్దృష్టిర్నిమేషోన్మేషవర్జితః ।*
*ఇయం సా భైరవీ ముద్రా సర్వతంత్రేషు గోపితా ॥*

అన్న భైరవీముద్రాలక్షణాన్ని బట్టి, ఈ ముద్రలోనున్న భక్తుడిక్కడ ప్రస్తావించబడినట్లు భావించవచ్చు. ఈ ముద్రలోని భక్తునికి ఆలోచనామాత్రంచేత సర్వవస్తువులు మనోనేత్రానికి ప్రత్యక్షమవుతాయి. **ప్రత్యక్షసర్వభావస్య** అనటంలో ఉద్దిష్టార్థమిది. సాక్షాత్తు, పరభైరవ స్వరూపంలో అనుప్రవేశింపబడిన భక్తుడు భావించబడినాడు.

**శ్లో॥ శివ ఇత్యేకశబ్దస్య జిహ్వాగ్రే తిష్ఠతః సదా ।**
**సమస్తవిషయాస్వాదో భక్తేష్వేవాస్తి కోఽప్యహో! ॥ 20**

**ప్రతిపదార్థము :** అహో! = ఏమాశ్చర్యము!, సదా = ఎల్లప్పుడు, శివ ఇతి = 'శివ' అను, ఏక = ఒక, శబ్దస్య = శబ్దముయొక్క, జిహ్వాగ్రే = నాలుకపై, తిష్ఠతః = ఉండుటవలన, కః అపి = ఏదేని ఒక, సమస్తవిషయ = అన్ని విషయముల సంబంధమైన, ఆస్వాదః = అనుభవము, భక్తేషు ఏవ = భక్తులయందు మాత్రమే, అస్తి = ఉన్నది.

**తాత్పర్యము :** నిరంతరం 'శివ' అన్న ఒక్క శబ్దాన్ని పలుకుతూ ఉండటంవలన, సమస్త విషయాస్వాదము కలిగినంత ఆనందం లభిస్తూన్నది. ఏమాశ్చర్యము!

**సమస్తవిషయాస్వాదః** అంటే పంచేంద్రియాల విషయాలన్నిటినీ అనుభవించి ఆనందించటం. ఇంద్రియాలకు దేని విషయం దానికున్నది. కన్ను విషయం దృశ్యం, చెవి విషయం శబ్దశ్రవణం, ముక్కు విషయం ఆఘ్రాణం, నాలుక విషయం రుచి, చర్మం విషయం స్పర్శ. ఇవన్నీ నిత్యం ప్రాణులు అనుభవించేవే. అయినా ఈ నిత్యానుభవం క్షణికానందాన్ని మాత్రమే ఇస్తుంది. శివనామస్మరణలో ఈ సమస్త

ఇంద్రియానుభవానందం శాశ్వతంగానూ సమగ్రంగానూ లభిస్తుంది. ఇక్కడింక కంటితో చూచే దృశ్యంగాని, చెవితో వినే శబ్దంగాని, ముక్కుతో చూచే వాసనగాని, నాలుకతో రుచిచూడటం గాని, చర్మంవలన స్పర్శ తెలియటంగాని ప్రత్యేకించి ఉండవు. జ్ఞానేంద్రియాలు ప్రసాదించే విడివిడి సుఖాలన్నీ ఆ జ్ఞానస్వరూపుడూ సుఖస్వరూపుడూ అయిన శివుని నామంలో చేరిపోయి మహాసుఖాన్ని కలిగిస్తాయి. అందుకే భక్తులంటారు, శివుడు మహాప్రకాశమయమైన నిజస్వరూప పరామర్శ గల ఆత్మ, అని. అనగా శివుడు జగదానందస్వరూపుడు. శివశబ్దం ఆ రూపానికి శబ్దప్రతీక. కనుకే 'శివ' అన్న ఒకే శబ్దంలో జగదానందమంతా ఇమిడి యున్నది, అది భక్తులకు జపంలో అనుభూతమవుతూన్నది. ఈ రహస్యం తెలిసినప్పటికీ, ఇది ఆశ్చర్యజనకమే!

**శ్లో॥ శాన్తకల్లోలశీతాచ్ఛస్వాదుభక్తిసుధాంబుధౌ ।**
**అలౌకికరసాస్వాదే సుస్థైః కో నామ గణ్యతే ॥ 21**

**ప్రతిపదార్థము :** శాన్త = శాంతించిన, కల్లోల = తరంగములతో, శీత = చల్లనైన, అచ్ఛ = నిర్మలమైన, స్వాదు = రుచ్యమైన, భక్తిసుధా = భక్తియను అమృతమయమైన, అంబుధౌ = సముద్రమున, అలౌకిక = లోకసంబంధము కాని, రస = ఆనందముయొక్క, ఆస్వాదే = అనుభవించుటయందు, సుస్థైః = సుఖముగ నున్నవారిచే, కః నామ = ఎవడు, గణ్యతే = లెక్కించబడుచున్నాడు?

**తాత్పర్యము :** భక్తి అనబడు అమృతసముద్రములో తరంగాలు అలజడి చేయవు. అది శాంతం. చల్లనిది, ఏవిధమైన తాపాలూ ఉండవు. అది స్వచ్ఛమైనది, రుచ్యమైనది. దాని ననుభవించటంలో సుఖంగా ఉన్నవారు ఎవరినీ లెక్కచేయరు.

లోకంలో సముద్రాలన్నిటికీ కల్లోలినీ అనే పేరు. అంటే, అలల అలజడితో అశాంతంగా ఉండేది, అని అర్థం. పేరుకు శాంతమహాసముద్రమైనా, అది కూడా కల్లోలినీ నామసార్థక్యం కలిగినదే. ఇవన్నీ లౌకికానుభవాలకు ప్రతీకలుగా చెప్పబడేవే. సంసారం సాగరతుల్యమనే పెద్దలంటారు. కాని ఈ సంసారకల్లోలమంతా భక్తిస్పర్శతో శాంతిస్తుంది. ప్రాకృతిక వికారాలు శివభక్తికి శాంతించి, ఈ లౌకిక సాగరంలోని ఆనందాన్నంతా ఉప్పుకషాయంగా మార్చే భావావేశాలు నశించి, జీవితం స్వచ్ఛమై, చల్లనై, తియ్యనవుతుంది. అంటే, సంసారసముద్రం భక్తిసముద్రంగా మారిపోయి ఆస్వాద్యమవుతుంది. ఈ అలౌకికానంద రసాన్ని ఆస్వాదిస్తూ సుఖించేవారు ఎవరినీ లెక్కచెయ్యరు.

ఒక వ్యక్తి మరియొక వ్యక్తిని ప్రత్యేకంగా గుర్తించి గౌరవించటం ఎందుకు జరుగుతుంది? వానివలన వీనికి లౌకిక లాభాలేవో కావాలి, అవి అందుతాయన్న ఆశ కారణంగా. ఏ వ్యక్తియైనా స్వయంసమృద్ధిని సాధించి, దేనిని గాని ఎవరినుండి గాని కోరవలసిన అవసరం లేని స్థితికి చేరుకుంటే, ఇక ఆ వ్యక్తి తన సుఖాన్ని ఆస్వాదించే కార్యంలో నిమగ్నుడవుతాడు తప్ప, ఎంతటివారికోసం గాని లేచి నిలబడటం, చేతులు జోడించటం చెయ్యడు. వారి ఉనికిని అసలు గుర్తించడు. భక్తిలో పరవశించే శివస్వరూపుడు మరి దేనినీ ఆశించడు, అసలు గుర్తించడు.

మరియొక విధంగా అన్వయిస్తే, ఆ అలౌకికభక్తిని సాధించినవాడు సాక్షాత్ శివమయుడవుతాడు. వాడు ఏ వ్యక్తిలోనూ ప్రాపంచికవైయక్తిక జీవిని దర్శించడు. జగత్తంతా శివమయమవుతుంది. కనుక జగత్తులోని వికారాలనతడు గౌరవించడు, జీవాహంకారాలను లెక్కసేయడు. అపకారి – ఉపకారి అన్న ద్వంద్వభావన వానిలో లేదు. ఆనందం అర్ణవమై, తానే ఆ అర్ణవమైన సమాధిస్థితిని పొందుతాడు. శ్రీ సదాశివబ్రహ్మేంద్రులు, శ్రీరామకృష్ణపరమహంసల ఉదంతాలు ఇందుకు తార్కాణం. ఈ లక్షణం వారిలో అహంకారజన్యం కాదు. విశ్వప్రేమకు మారు పేరయిన భక్తిపారవశ్యం వలన కలిగినది ఈ స్థితి.

**శ్లో॥ మాదృశైః కిం న చర్వ్యేత భవద్భక్తిమహౌషధిః ।**
**తాదృశీ భగవన్యస్యా మోక్షాఖ్యోఽనన్తరో రసః ॥ 22**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ స్వామీ!, మాదృశైః = మాబోటివారిచే, తాదృశీ = అటువంటి (అలౌకికమైనది), భవద్ = తమయొక్క, భక్తి = భక్తిరూపమున ఉన్న, మహౌషధిః = గొప్ప ఔషధిని, న చర్వ్యేత కిమ్ = నమలబడదా (ఆస్వాదింపబడదా) యేమి?, యస్యాః = దేనియొక్క ( ఆ నములుటయొక్క), అనంతరః = తరువాతిదైన, మోక్ష + ఆఖ్యః = మోక్షమను పేరుగల, రసః = రసము, భవతి = లభించుచున్నది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! భక్తి తత్త్వము నెఱిగిన మాబోటి వారు ఆ భక్తిని చక్కగా, పూర్తిగా ఆస్వాదింపకుందురా? భక్తియనునది ఒక గొప్ప ఓషధి కనుక దానిని ఎంతగా చర్వితచర్వణం చేస్తే అంతగా స్వాదురసాస్వాదనం లభిస్తుంది. మోక్షమనేదికూడ ఆ మహౌషధీరసమే కదా, అదికూడా మేము ఆస్వాదించగలము.

ఓషధులు ప్రత్యేక శక్తులు గలవి. ఎన్నో గొప్ప శక్తులు గల దానిని మహౌషధి అంటారు. భక్తి అటువంటిది. ఓషధీలక్షణం యేమంటే, మునగకాయవలె,

చెఱకుముక్కవలె, నమిలిన కొద్దీ రసాస్వాదనం కలుగుతుంది. కనుక భక్తి అనబడే మహౌషధి రుచినెఱిగినవారు దానిని సంపూర్ణంగా ఆస్వాదించక వదలరు. చివరంట ఆస్వాదించిన పూర్తి సంతృప్తి కలగటం అంటే భక్తికి పరాకాష్ఠ మోక్షమే, శివపారమ్యమే.

**శ్లో॥ తా ఏవ పరమర్థ్యన్తే సంపదః సద్భిరీశ! యాః ।**
**త్వద్భక్తిరససంభోగవిస్రంభపరిపోషికాః ॥ 23**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, సద్భిః = సత్పురుషులచేత, తా ఏవ = అవే, సంపదః = సంపదలు, పరమ్ = మిక్కిలిగా, అర్థ్యన్తే = కోరబడుచున్నవి, యాః = యేవి, త్వద్ = తమయొక్క, భక్తిరస = భక్తి అను ఆనందముయొక్క, సంభోగవిస్రంభ = సంభోగముతో సమానమైన ఆనందమునకు, పరిపోషికాః = అన్నివిధముల పోషించునవగుచున్నవో.

**తాత్పర్యము :** ఓ స్వామీ! సత్పురుషులు కోరే సంపదలు యెటువంటివంటే, స్త్రీపురుష సంయోగం వలన కలిగే బ్రహ్మానందసహోదరమైన ఆనందమేదో దానికి సరితూగునంతటి పారవశ్యమును కలిగించు భక్తి అను సంపదలు మాత్రమే.

తఱచుగా సంభోగానందాన్ని జీవాత్మ పరమాత్మల సంయోగంవలన కలిగే ఆత్మానందంతో పోల్చిచెప్పటం కద్దు. స్త్రీపురుషశరీరాల కలయికలో ఒక ఆత్మీయత జనిస్తుంది. ఆ క్షణంలో, కనీసం ఆ కొద్దిసేపు, తాము వేర్వేరు శరీరాలలో ఉన్నప్పటికీ నిజానికి తామిద్దరూ ఆనందస్వరూపులే, ఇద్దరూ ఆనందైకమూర్తులే, అన్న భావన కలుగుతుంది. ఈ తాదాత్మ్యం మానుషానందానుభవంలో మరెక్కడా లభించదు. అంతటి ఆనందం భక్తిలో కలగాలని ప్రార్థన. అంటే, భక్తిలో సమస్తాన్నీ మరచి, భక్తి, భక్తుడు భగవంతుడూ, సమస్త భావనలూ ఆనందైక్యమైన అనుభవం భక్తుడు కోరుతున్నాడు.

**సద్భిః** అనటంవలన భక్తులందఱూ ఒకే పారమార్థికస్థాయి గలవారు కారన్న ధ్వని. భక్తులలో లౌకికులూ ఉన్నారుకదా.

**శ్లో॥ భవద్భక్తిసుధాసారస్తైః కిమప్యుపలక్షితః ।**
**యే న రాగాదిపంకేఽస్మిన్ లిప్యన్తే పతితా అపి ॥ 24**

**ప్రతిపదార్థము :** భవద్ = తమయొక్క, భక్తిసుధా = భక్తి అను అమృతపు, ఆసారః = ధారాపాతము, తైః = వారిచేతనే, కిమపి = ఏదైతే, ఉపలక్షితః = ప్రత్యక్షముగ దర్శింపబడినదో, రాగ + ఆది = రాగద్వేషములు మొదలుగా గల, అస్మిన్ పంకే = ఈ బురదలో, యే = ఎవరు, పతితాః అపి = పడినవారైనప్పటికి, న లిప్యన్తే = తన్మయులు కారు.

**తాత్పర్యము :** నీ భక్తియను అమృతధారాపాతము యే భక్తులచేత ప్రత్యక్షంగా లోకోత్తరంగా అనుభవింపబడినదో, వారొకవేళ రాగద్వేషాలనే బురదలో పడినప్పటికీ శాశ్వతంగా ఆ బురదలోనే కూరుకుపోయి తన్మయులైపోరు. అంటే, నిన్ను మరచి, లౌకిక జీవితమే సర్వస్వమని భావించి జీవించరు, అని తాత్పర్యము.

**రాగ ఆది,** అంటే అభిమానము, ప్రేమ, ఈ భావానికి విరోధభావమైన ద్వేషము, ఇట్లే, సుఖము – దుఃఖము, కలిమి – లేమి, తృప్తి – అతృప్తి, అను ద్వంద్వ ప్రపంచం. ఇది **పంకము** బురదవంటిది. ఏ కొంత స్పర్శ తగిలినాగాని ఆ బురద అంటక మానదు. ఎంతటి మహాభక్తులకైనా ఈ స్పర్శ తప్పదు. కారణం, జీవి పుట్టి పెరిగే ఈ ప్రాకృతిక ప్రపంచం ఈ ద్వంద్వాలతో కూడినదే. దీని నుండి భక్తులైనా తప్పించుకోలేరు. మహాభక్తుల చరిత్రలే సాక్షి. కాని భగవద్భక్తిలోని ఆనందాన్ని సన్నిహితంగా అనుభవించినవారు ఆ బురదలోనే జీవిస్తున్నప్పటికీ, సాధారణ లౌకికులవలె సంసారం మాత్రమే సత్యమని, అంతకు మించిన ఆనందం లేదని, తన్మయులైపోరు, సుఖదుఃఖాలలో, కీర్తి – అపకీర్తులలో అన్నిటా ఆ పరమేశ్వరుని భక్తిని విడువరు. ఇది ఆశ్చర్యం కదా!

**శ్లో॥ అణిమాదిషు మోక్షాన్తేష్వంగేష్వేవ ఫలాభిధా ।**
**భవద్భక్తేర్విపక్వాయా లతాయా ఇవ కేషుచిత్ ॥ 25**

**ప్రతిపదార్థము :** అణిమా + ఆదిషు = అణిమా మొదలగు, మోక్ష + అంతేషు = మోక్షమువరకు గల అన్నిటియందు, ఫల + అభిధా = ఫలమను మాట, విపక్వాయాః = పరిపక్వతను పొందిన, భవద్ = తమయొక్క, భక్తేః = భక్తియను, లతాయాః ఏవ = లతయొక్కయే, అంగేషు = అవయవములందు, కేషుచిత్ = కొన్ని, ఇవ = వలె.

**తాత్పర్యము :** అణిమా మొదలైన అష్టసిద్ధులు మొదలుకొని చివరకు మోక్షము పర్యంతము అనుభవములోనికి వచ్చు సమస్త శక్తులు తమయందలి భక్తిలతయొక్క క్రమపరిణామ రూపాలే తప్ప వేరేమీ కావు.

**అణిమా ఆది :** అణిమా, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అను ఎనిమిది సిద్ధులు. ఇవి యోగసాధనలో సమకూడే ప్రత్యేక శక్తులు. భక్తి కూడ యోగమే కనుక భక్తులకు గూడా ఇవి సిద్ధిస్తాయి. కనుకే వీనిని భక్తిలతయొక్క క్రమపరిణామంయొక్క సాఫల్యచిహ్నాలుగా కవి ప్రస్తావించినాడు.

ఈ సిద్ధులు మొదలుమాత్రమే. వీనికి పరాకాష్ఠ మోక్షం. యోగానికి, భక్తికి కూడా మోక్షమే లక్ష్యం. ఇవన్నీ భక్తికి ఫలంగా లభించేవే. తీగ సాగినప్పుడు, ఆ క్రమంలో,

ఆకులు, మొగ్గలు, పూలు, కాయలు, పండ్లు, అన్నీ పరిణామఫలంగా ఉత్పన్నమయ్యేవేకదా. భక్తి కూడా లతవంటిదే. సాగిన కొలది ఆ లతలో భాగాలుగా అష్టసిద్ధులు లభిస్తాయి, మరెన్నో లభిస్తాయి, చివరకు మోక్షమూ లభిస్తుంది.

**శ్లో॥ చిత్రం నిసర్గతో నాథ! దుఃఖబీజమిదం మనః ।**
**త్వద్భక్తిరససంసిక్తం నిఃశ్రేయసమహాఫలమ్ ॥ 26**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, ఇదమ్ = ఈ, మనః = మనస్సు, నిసర్గతః = స్వభావసిద్ధముగ, దుఃఖ = దుఃఖమునకు, బీజమ్ = విత్తనమైనది, చిత్రమ్ = ఆశ్చర్యము!, త్వద్ = నీయొక్క, భక్తిరస = భక్తిలోని ఆనందముతో, సంసిక్తమ్ = బాగుగ తడిసినదై, నిఃశ్రేయస = బ్రహ్మానందరూపమైన, మహాఫలమ్ = గొప్ప ఫలము గలది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఇదేమాశ్చర్యం! నా మనస్సు పుట్టింది మొదలు దాని స్వభావమే దుఃఖాన్ని కలిగించటం కదా, నీ భక్తిలో కలిగే ఆనందస్పర్శతో దాని స్వభావమే మారిపోయింది. ఆ ఆనందంలో తడిసినకొలది అది బ్రహ్మానందానికి బీజమైపోయింది.

మానవుల సుఖదుఃఖాలకు మనస్సే కారణం అన్నదెంత నిజం! నీ భక్తి కుదరనంతకాలం అది దుఃఖకారణంగానే అనుభవంలో ఉన్నది. నీ భక్తిలో బాగా మునిగిన తరువాత సుఖం మాత్రమే కాదు, పరమసుఖప్రాప్తికి కారణంగా అనుభవంలోకి వచ్చింది. ఇనుము బంగారమైనట్లే!

మనస్సుకు (positive, negative) ధనధృవం, ఋణధృవం రెండూ ఉన్నాయి. సాధారణంగా ఋణధృవం అనుభవం అవుతుంది. భక్తియోగులకు క్రమంగా ధనధృవం తాలూకు శక్తి అనుభవమవుతుంది.



శ్రీః

# 2. సర్వాత్మపరిభావనాస్తోత్రమ్

**శ్లో॥ అగ్నీషోమరవిబ్రహ్మవిష్ణుస్థావరజంగమ -**
**స్వరూప!బహురూపాయ నమః సంవిన్మయాయ తే ॥ 1**

**ప్రతిపదార్థము :** అగ్నీ = అగ్ని, షోమ (సోమ) = చంద్రుడు, రవి = సూర్యుడు, బ్రహ్మ = బ్రహ్మ, విష్ణు = విష్ణువు, స్థావర = కదలనివి, జంగమ = కదలునవి, స్వరూప =

తనరూపమైనవాడా!, బహురూపాయ = అనేకరూపములుగల, సంవిద్ + మయాయ = సంవిన్మయుడవైన, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** అగ్ని, చంద్ర, సూర్య, బ్రహ్మ, విష్ణు, స్థావర, జంగమముల బహురూపములైన స్వరూపములతో ప్రకటమైన జ్ఞానమయుడవైన నీకు నమస్కారము.

కనిపించే జ్యోతిస్వరూపాలు సూర్యచంద్రులు, అగ్ని. వీనిని చెప్పినప్పుడు నక్షత్రాలను గూడ చెప్పినట్లే. కనరాక, జగత్తును నడిపించే శక్తిస్వరూపాలు బ్రహ్మ విష్ణులు. స్థావరములనబడే చెట్లు, గుట్టలు, రాళ్ళు ఇత్యాది, అట్లే నదులు, సముద్రములున్నూ, జంగమములనబడే ప్రాణిజాతులు సమస్తమూ కలిసి జగద్రూపము.

ఈవిధంగా, కనిపించే జగత్తు బహురూపాలతో ఉన్నది. ఈ జగత్తును నడిపించే శక్తిరూపాలైన దేవతామూర్తులున్నూ అనేక రూపాలతో ఉన్నారు. ఈ దృశ్యమాన జగత్తు ఉనికికి కారణమైన సాకారశక్తిజ్యోతులు కూడ బహురూపాలు గలవే.

ఇన్ని రూపాలతో తెలియబడుతూ, ప్రకటస్వరూపుడైన భగవంతుడు జ్ఞానస్వరూపుడు. బాగుగా తెలిపే శక్తికి **సంవిద్** అని పేరు.

**శ్లో॥ విశ్వేంధనమహాక్షారానులేపశుచివర్చసే ।**
**మహానలాయ భవతే విశ్వైకహవిషే నమః ॥ 2**

**ప్రతిపదార్థము :** విశ్వ = విశ్వము అను, ఇంధన = కట్టెలయొక్క, మహాక్షార = గొప్ప భస్మరాశి, అనులేప = మైపూతచే, శుచి = పరిశుద్ధమైన, వర్చసే = తేజస్సుతో కూడిన, విశ్వ = విశ్వమునకు, ఏక = ఒక్కడైన, హవిషే = ఆహుతిరూపధారియైన, మహా = గొప్ప, అనలాయ = అగ్నివైన, భవతే = తమకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ఈ విశ్వాన్నంతా కట్టెలుగా మండించి, ఆ బూదిని మైపూతగా ధరించి శుద్ధతేజస్సుతో వెలిగే, విశ్వాన్నంతా ఆహుతిగా గ్రహించగల ఒకే ఒక్క అగ్నిరూపుడవైన నీకు నమస్కారము.

విశ్వం నానారూపం. ప్రళయకాలంలో మహాగ్నిరూపాన ఈ నానారూపనామ గుణ లక్షణ ప్రపంచాన్ని భస్మం చేసి, కేవల తేజస్సుతో శుచియైన అద్వయరూపి ఆ పరమాత్ముడు. అంటే, అనేకత్వం దగ్ధమై ఏకత్వంగా నిలిచేది **తేజస్స్వరూపం.**

అగ్ని పరమేశ్వరుని అష్టమూర్తులలో ఒకటి. అది మహాగ్ని కావటం ప్రళయకాల రుద్రస్వరూపం.

ఇది యజ్ఞస్వరూపంగా భావించబడింది. ఈ యజ్ఞంలో హవిస్సుగా భస్మమయ్యేది విశ్వం. ఈ హవిస్సును అందించే దేవత అగ్ని. హోమం చేసేవాడు రుద్రుడు. హవిర్భోక్త ఆ రుద్రుడే, అగ్నిరూపుడు. యజ్ఞఫలమైన దివ్యతేజస్సును పొందేవాడు కేవలుడైన ఆతడే. **నమః శాంతాయ తేజసే** అన్నదే తాత్పర్యం.

**శ్లో॥ పరమామృతసాంద్రాయ శీతలాయ శివాగ్నయే ।**
**కస్మైచిద్విశ్వసంప్లోషవిషమాయ నమోఽస్తు తే ॥ 3**

**ప్రతిపదార్థము :** పరమ + అమృత = పరమైన అమృతముచే, సాంద్రాయ = దట్టమైన, శీతలాయ = అతి చల్లనైన, విశ్వ = జగత్తుయొక్క, సంప్లోష = దహించుటచేత, విషమాయ = భయంకరుడైన, కస్మైచిత్ = ఒకానొక, శివ + అగ్నయే = కళ్యాణప్రదమైన అగ్నిస్వరూపుడవైన, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగునుగాక!

**తాత్పర్యము :** మిక్కిలి అమృతమయమై చల్లనైనవాడు, జగత్తును దహించుటచేత భయంకరుడైన ఒకానొక కళ్యాణప్రదుడైన, అగ్నిరూపుడైన నీకు నమస్కారము.

జ్ఞానానందమయుడైనందువలన శివుడు అమృతమయుడు, సుఖస్వరూపుడు, సుఖప్రదుడు అయినందువలన శీతలుడు. నామరూపగుణాత్మకమైన పదార్థ ప్రపంచపు భౌతికానేకత్వాన్ని భస్మం చేసినవాడు కనుక భయంకరుడు. భయం భౌతికత్వపు లక్షణం, అది నశ్వరం కనుక. నిజానికి శివుడు భౌతికతలో అంతర్లీనంగా ఉన్న భయాన్ని, జ్ఞానప్రదుడై తొలగించి అమృతమయం చేయటమే త్రిపురాసురసంహారకథకు ప్రతీకార్థం. అట్లా అమృతత్వాన్ని పొందటమే 'సుఖం' అన్నమాటకు అర్థం. అనేకత్వభావన నశించి ఆత్మైకభావన పరమం కావటమే శివత్వం, సుఖస్వరూపం. ఆ స్థితియే కైవల్యం. కనుక, ఈ శ్లోకంలో వర్ణించబడిన శివాగ్ని విశ్వాత్మయే. వాని విశ్వదాహకత్వం అసత్తును దహించుటే.

దాహకుడుగా, శీతలుడుగా, అమృతమయుడుగా పరస్పరవిరోధం లేని పరమాత్ముడు ఎవరని వర్ణింపదగును? తత్ర **వాచో నివర్తన్తే.** అందుకే **కస్మైచిత్** అన్న ప్రయోగం.

**శ్లో॥ మహాదేవాయ రుద్రాయ శంకరాయ శివాయ తే ।**
**మహేశ్వరాయాపి నమః కస్మైచిన్మంత్రమూర్తయే ॥ 4**

**ప్రతిపదార్థము :** మహాదేవాయ = మహాదేవునకై, రుద్రాయ = రుద్రునకై, శంకరాయ = శంకరునకై, శివాయ = శివునకై, మహా + ఈశ్వరాయ = మహేశ్వరునకై, అపి =

కూడ, కస్మైచిత్ = ఒకానొకడైన, మంత్రమూర్తయే = మంత్రస్వరూపుడైన, తే = నీకై, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** మహాదేవుడు, రుద్రుడు, శంకరుడు, శివుడు, మహేశ్వరుడు అను ఇత్యాది పేర్లతో విరాజిల్లు ఒకానొక మంత్రస్వరూపుడైనవానికి నమస్కారము.

ఈ పేర్లన్నీ శివునివే. ఒక్కొక్కటీ, వ్యుత్పత్తిని బట్టి, శివుని ఒక్కొక్క మహత్వాన్ని ప్రకటించే పేర్లు.

**మహాదేవ** శబ్దానికి మహాంశ్చ అసౌ దేవశ్చ, అని ఒకటి, మహాన్ దేవో నృత్యాదిరూపా క్రీడా యస్యేతి, అని ఒకటి, వ్యుత్పత్తులు చెప్పబడినాయి. దేవతలలో శ్రేష్ఠుడు కనుక మహాదేవుడు; తాండవం మొదలైన కళారూపాలను ఆటగా ప్రదర్శించేవాడు కనుక మహాదేవుడు, అని. క్రీడా శబ్దానికి సృష్టిస్థితిలయాలని కూడా అర్థం చెప్పబడింది.

**రుద్రుడు** అంటే, రోదయతి శత్రూన్, శత్రువులను ఏడ్పించేవాడు, అనీ; స్వయం రురోద, తానే యేడ్చినవాడు, అనీ వ్యుత్పత్తి చెప్పబడింది. తానెందుకేడ్చినాడు? అన్నదానికి, ఒక సమయంలో బ్రహ్మవలన జన్మను పొంది యేడ్చినాడని ఒక పురాణకథ సమాధానం. మరొక వ్యుత్పత్తి, రుదం ద్రావయతి, దుఃఖాన్ని పోగొట్టేవాడు, అని.

**శంకరు**డంటే, శం = సుఖం, కరోతి = కలిగించేవాడు, అని అర్థం.

**శివుడు** అంటే, శామ్యతి నిర్వికారో భవతి, వికారాలు లేనివాడు, అనిన్నీ; శేరతే సజ్జనమనాంసి అస్మిన్, సజ్జనుల మనస్సులు వీనియందుంటాయి, అనిన్నీ, శేతే సజ్జనస్సు, సజ్జనుల మనస్సులలో ఉండువాడు, అనిన్నీ; శివం కల్యాణం తద్యోగాత్, శుభముతో కూడినవాడు, అనిన్నీ; శివప్రదత్వాత్, శుభముల నిచ్చువాడు, అనిన్నీ, అర్థాలు ప్రసిద్ధం.

**మహేశ్వరుడు** అంటే, మహాంశ్చ అసౌ ఈశ్వరశ్చ, ఐశ్వర్యము గలవారిలో శ్రేష్ఠుడు, అని వ్యుత్పత్తి.

ఈ లక్షణాలు గలవాడు **మంత్రమూర్తి.** మననాత్ త్రాయతే, జపించుటచేత కాపాడునది, అని మంత్రశబ్దానికర్థం. అటువంటి మంత్రమే మూర్తిగా, రూపముగా గలవాడు కనుక మంత్రమూర్తి. ఇది శివుని ధ్యాతస్వరూపాన్ని, అంటే ధ్యానం చేసేవాని స్వరూపాన్ని చెబుతుంది. కనుక మంత్రమూలమైన, పంచాక్షరీరూపుడైన శివునకు నమస్కారము. ఒక్క మాటలో, ఈ శ్లోకార్థం : ఓం నమః శివాయ.

**శ్లో॥ నమో నికృత్తనిఃశేషత్రైలోక్యవిగలద్వసా -**
**వసేకవిషమాయాపి మంగలాయ శివాగ్నయే ॥ 5**

**ప్రతిపదార్థము :** నికృత్త = ఖండింపబడిన, నిఃశేష = సమస్తమైన, త్రైలోక్య = మూడు లోకములకు సంబంధించిన, విగలత్ = చిమిడిపోయిన, వసా = మూలగయొక్క, అవసేక = ఆహుతిచే, విషమాయ = భయంకరుడై, **అపి** = కూడ, మంగలాయ = శుభప్రదుడైన, శివ + అగ్నయే = శివాగ్నికై, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** మూడు లోకాలయొక్క భౌతికతా సారాన్ని ఆహుతిగా గ్రహించి భయంకరుడవై యుండి కూడ మంగలప్రదుడవై లోకాశ్రయుడవైన శివాగ్నీ! నీకు నమస్కారము.

ఇక్కడ చెప్పబడిన మూడు లోకాలు భవ, అభవ, అతిభవ అనబడేవి. వీని గురించిన జ్ఞానాన్ని ఉద్దీపింపజేసేది శివజ్యోతి. ఈ చర్యవలన శివేతరక్షతి జరిగి, జగన్మంగళం సాధింపబడుతుంది.

ఈ శ్లోకంలోని దృశ్యం శ్మశానంలోని చితిలో దగ్ధమవుతూన్న శవం నుండి చిమిడిపోయి కాలుతూన్న ఎముకలు, వానిలోని మూలగ. ఇదంతా మూడు లోకాల పరంగా అన్వయం. మూలగ (వసా) అన్నది సారం అన్న అర్థంలో గ్రాహ్యం.

ప్రళయకాలంలో సైతం, బాహ్యనేత్రానికి భయంకరుడు ఉగ్రుడు, రుద్రుడు అనిపించేట్లు ఆ స్వామి ప్రవర్తన కనిపించినప్పటికి, నిజానికతడు శివుడే, కేవలం శివేతరాన్ని దగ్ధంచేసి శివాన్ని మిగిల్చే కార్యంలో ఈ దర్శనభేదం తప్ప స్వామి గుణభేదం, శీలభేదం కాదు.

**శ్లో॥ సమస్తలక్షణాయోగ ఏవ యస్యోపలక్షణమ్ ।**
**తస్మై నమోఽస్తు దేవాయ కస్మైచిదపి శంభవే ॥ 6**

**ప్రతిపదార్థము :** సమస్త = అన్ని, లక్షణ = లక్షణాలలో, అయోగః ఏవ = యోగము లేకుండుటే, యస్య = ఎవనియొక్క, ఉపలక్షణమ్ = అతి చేరువైన లక్షణమో, తస్మై = అట్టి, కస్మైచిద్ + అపి = ఒకానొక, దేవాయ = తేజోరూపియైన, శంభవే = కళ్యాణమూర్తికై, నమః = నమస్కారము, అస్తు = అగుగాక.

**తాత్పర్యము :** అన్ని లక్షణాలలో సంగము లేకుండుటే యే స్వామి ఆత్మలక్షణమో అట్టి జ్యోతిస్వరూపుడైన కళ్యాణమూర్తికి నమస్కారము.

ప్రకృతిలోని ప్రతిప్రాణికి, అప్రాణికి ప్రత్యేకంగాను, సమష్టిగా కూడ కొన్ని గుర్తింపులుంటాయి. జీవికైనా, నిర్జీవపదార్థానికైనా నామ, రూప, రస, గంధాది గుర్తింపులుంటాయి. ఇది భిన్నత్వ లక్షణం. ఇట్లాంటి లక్షణాలన్నింటితో యేవిధమైన సంబంధమూ లేని ఆత్మయైనవాడు శివుడు. ఈ ఆత్మ తేజోరూపి, కళ్యాణమూర్తి.

తమ తమ ప్రాకృతిక లక్షణాలతో కూడి ఉన్నప్పుడు, ఈ ఆత్మస్వరూపం యే ప్రాణికైనా దురవగాహం. ఈ సంగాన్ని విడిచినప్పుడు మాత్రమే ఆత్మప్రకాశం దర్శనీయ మవుతుంది. అప్పుడే జీవుడు ఆత్మకు చేరువవుతాడు. జ్ఞానదాతగా శివుడు ఈ సాధనలో సహకరిస్తాడు. దేవశబ్దానికి ప్రకాశమానుడు అని అర్థం. దేవతలు తేజోరూపులు. దేవదేవుడు పరంజ్యోతిప్రకాశుడు. ప్రాకృతిక లక్షణ మాలిన్యం లేనివాడు కనుక కల్యాణమూర్తి, శంభుశబ్దవాచ్యుడు.

**శ్లో॥ వేదాగమవిరుద్ధాయ వేదాగమవిధాయినే ।**
**వేదాగమసతత్త్వాయ గుహ్యాయ స్వామినే నమః ॥ 7**

**ప్రతిపదార్థము :** వేద = వేదములకు, ఆగమ = శాస్త్రములకు, విరుద్ధాయ = విరోధియైనవాడు, వేద = వేదముల, ఆగమ = శాస్త్రముల, విధాయినే = విధానముల నిర్ణయించువాడు, వేద = వేదములయొక్క, ఆగమ = శాస్త్రములయొక్క, సతత్త్వాయ = సారమైన రూపముగలవాడు, గుహ్యాయ = అగోచరమైనవాడు, స్వామినే = ప్రభువైనవానికై, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** వేదాలకూ శాస్త్రాలకూ ప్రభువు తానే కనుక వాని వాని లోపాలను నిరోధించేశక్తి, అధికారమూ కూడా శివునికే ఉంటుంది. తాను స్వయంగా వేదాలనూ శాస్త్రాలనూ ప్రవర్తింపజేసేవాడు కనుక తానే వేదార్థశాస్త్రార్థస్వరూపుడు. ఐనప్పటికి తన సర్వార్థసారరూపమగోచరమే. అట్టి స్వామికి నమస్కారము.

**వేదం** ఒకే రాశిగా ఉండేది. వేదవ్యాసుడు దానిని విభజించి నాలుగు చేసినాడట : 1. ఋక్, 2. యజుస్, 3. సామ, 4. అథర్వ. వీనిలో ప్రతియొక్కటి నాలుగు భాగములు : 1. సంహిత, 2. బ్రాహ్మణం, 3. ఆరణ్యకం, 4. ఉపనిషద్. వీనిలో ఋగ్వేదంలో 21 శాఖలు, యజుర్వేదంలో 109, సామవేదంలో 1000, అథర్వవేదంలో 50 శాఖలు ఉన్నాయి. ఋక్ శాఖలు ప్రార్థన, అర్చనలకు, యజుశ్శాఖలు కర్మకాండకు, యజ్ఞవిధులకు అనుకూలములు. కాగా సామశాఖలు గానరూపంలోని ప్రార్థనలు. ఇక అథర్వశాఖలు యజ్ఞనిర్వహణకు, ఆత్మరక్షణకు, శత్రునిర్మూలనకు, పనికివచ్చే మంత్రాలతో

కూడినవి. అనంతములైన వేదములలో ఋషులు దర్శించినవి ఇంతమాత్రమే. ఇది వేదస్వరూపం.

**ఆగమాలు** శాస్త్రాలు. దేవతల స్వరూపాలను, దేవాలయ నిర్మాణాది కార్యాలను, పూజావిధులను వివరించేవి. శైవాగమాలు, వైష్ణవాగమాలు వేరుగా ఉన్నాయి.

**తత్త్వము** అంటే మూలసత్యం, సారం.

**వేద + ఆగమవిరుద్ధాయ నమః :** వేదాలలోనూ ఆగమశాస్త్రాలలోనూ వర్ణింపబడిన భౌతిక గుణాలూ లక్షణాలూ లేనివాడు శివుడు, అంటే వానికతీతుడు. వేదాగమాలలో చెప్పినవన్నీ భౌతిక జీవితాన్ని శివమయం చేసికోవటానికి సాధనాలే తప్ప, వానివలన వశమయ్యేవాడు కాడు శివుడు. అట్టివానికి నమస్కారము.

**వేదాగమవిధాయినే నమః :** అయితే శివసాధనాలైన ఈ శాస్త్రాలను విధించినవాడు, వానికి మూలమైనవాడు శివుడే. వాని వలన తెలియదగిన సత్యస్వరూపుడు శివుడే. వానికి నమస్కారము.

**వేదాగమసతత్త్వాయ నమః :** ఈ శాస్త్రాల సారరూపం శివుడే.

**గుహ్యాయ నమః :** ఈ సారరూపం గోప్యంగా ఉంటుంది. కారణం, విధులు, ఆచారాలు, వీనిలో మునిగినవారు అవే శివుడనే భ్రాంతిలో ఉంటారు కనుక వానికి అందకుండా దాగి ఉంటాడు. అట్టి శివునకు నమస్కారము.

సమస్తానికీ యజమాని, అధికారి శివుడు కనుక **స్వామి** అనటం.

**శ్లో॥ సంసారైకనిమిత్తాయ సంసారైకవిరోధినే ।**
**నమః సంసారరూపాయ నిఃసంసారాయ శంభవే ॥ 8**

**ప్రతిపదార్థము :** సంసార = సృష్టికి, ఏక = ఒకేఒక్క, నిమిత్తాయ = కారణమైనవాడు, సంసార = సంసారమునకు, ఏక = ఒకేఒక్క, విరోధినే = విరోధియైనవాడు, సంసారరూపాయ = సంసారమే, ప్రకృతియే తన రూపమైనవాడు, నిఃసంసారయ = సంసారము అంటనివాడు, అయిన, శంభవే = శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** శివుడు తానే సంసారమనబడు సృష్టికి మూలం. తాను సృష్టించిన ఈ సంసారానికి తానే విరోధి, తాను ఈ సంసారంలో ఉండడు; ఈ సంసారం తన నంటదు. కాని తన రూపం ఈ సంసారమే.

పరస్పర విరుద్ధంగా తోచే వర్ణన శివునిపట్ల సార్థకం. శక్తితో కూడి సంసార కారణం సంసారరూపుడు తానే అవుతూ కూడా సంసారపు మాలిన్యాన్ని అంటించుకొనక, ఈ సంసారవికారాలకు దూరంగా ఉండేవాడూ, ఈ పాంచభౌతికప్రకృతిని దగ్ధం చేసేవాడు తానే. అందుచేతనే, శివునకు **భవుడు** అనిపేరు. అంటే, **సర్వమస్మాద్భవతి**, సర్వం దీనివలన కలుగుతూన్నది, అని వ్యుత్పత్తి. దీనిని బట్టి **సంసారైక నిమిత్తాయ** అనటం. లోకవిపరీతమైన చేష్టలు చేయటం వలన **వామదేవు**డనబడుతూ, ప్రలయకాలంలో సృష్టిసంహారం చేస్తూ **శర్వుడు, హరుడు, భర్గుడు** అనబడుతూండేవాడు కనుక **సంసారైకవిరోధినే** అనటం. జీవులకు ప్రభువు, రక్షకుడు కనుక **పశుపతియై;** చర్మాన్ని ధరించటం వలన **కృత్తివాసాః** అనబడుతూ; ఆకాశమే కేశములుగా గలవాడు కనుక **వ్యోమకేశః** అనబడుతూన్న శివుడు **సంసారరూపుడు** కనుక **సంసారరూపాయ** అనటం. త్రిపురాలను నాశనము చేయువాడు, **త్రిపురాంతకుడు** కనుక సంసారాతీతుడు, **నిఃసంసారాయ** అనటం.

**శ్లో॥ మూలాయ మధ్యాయాగ్రాయ మూలమధ్యాగ్రమూర్తయే ।**
**క్షీణాగ్రమధ్యమూలాయ నమః పూర్ణాయ శంభవే ॥ 9**

**ప్రతిపదార్థము :** మూలాయ = మూలమైనవానికొరకు, మధ్యాయ = మధ్యయైనవాని కొరకు, అగ్రాయ = కొన (చివర) యైనవాని కొరకు, మూల = మూలము, మధ్య = మధ్యభాగము, అగ్ర = కొన (చివర), మూర్తయే = స్వరూపమైనవాని కొరకు, క్షీణ = నశించిన, అగ్ర = (చివరి) కొన, మధ్య = మధ్యభాగము, మూలాయ = మూలముగలవానికొరకు, పూర్ణాయ = పరిపూర్ణ స్వరూపునకు, శంభవే = శంభునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** మూలము, మధ్యభాగము, చివరికొనభాగము తానేయైనవానికి నమస్కారము. మూలము, మధ్యభాగము, చివరకొనభాగముల రూపములన్నీ తానైనవానికి నమస్కారము. నశించిన మూలము, మధ్యము, అగ్రముగలవానికి నమస్కారము. పూర్ణుడైనవానికి నమస్కారము. శంభునకు నమస్కారము.

మూల, మధ్య, అగ్రములనేవి దేని విషయంలో? అంటే ఈ దృశ్యమాన జగత్తు విషయమని భావం. జగత్తుకు కారణము, అంటే, జగత్తు పుట్టుకకు కారణము తానే; మధ్య అంటే స్థితి, మనుగడకు కారణం తానే; అట్లే అగ్రము అంటే లయమునకు కారణము తానే. కారణరూపుడయిన శక్తిరూపునకు నమస్కారము.

మూలమూర్తి అంటే బ్రహ్మ, సృష్టికర్త. బృంహణాద్బ్రహ్మ, వ్యాపనము వలన బీజప్రాణమూర్తియై, జగద్రూప విస్తారమూర్తియైన బ్రహ్మ; ఆ విస్తార జగద్రూప పాలనపోషణాది నిర్వహణచేత విష్ణురూపుడు; ఆ భౌతిక లక్షణాలను దగ్ధం చేసి మరల తదతీత ఆత్మస్వరూపంగా భాసించే రుద్రమూర్తియు; ఈ మూడు మూర్తులు గల వానికి నమస్కారము.

నామరూపరసగంధాది లక్షణములు గల పాంచభౌతికప్రపంచ సృష్టి, స్థితి లయములు జరిగిపోయిన తర్వాత మూల, మధ్య, అగ్రములను విభాగము లేక పూర్ణుడైనవానికి నమస్కారము, నిర్వికారునకు నమస్కారము, శాంతునకు నమస్కారము.

ఈ మూడువిధాలుగా చెప్పినవి ఈ స్థితులు : (1) • (2) • • • (3) ○ (1) సృష్టికి పూర్వము బిందువు, (2) సృష్టివిస్తారము : మొదలు, మధ్య, చివర. (3) ప్రళయానంతరము శివశక్తులు, లేక, పదార్థము – శక్తి అనునవి కలిసిపోయి ఒక్కటైన రూపము. సృష్టిపూర్వము బ్రహ్మము బిందువైయున్నవాడు, గుణవికారములు లేనివాడు. శుద్ధసత్త్వస్వరూపుడు. (1) ఈ సత్త్వమున జనించిన ఇచ్ఛవలన సృష్టికర్త బ్రహ్మరూపమున రజోగుణమూర్తియై వెలిసి, ఆ రజోగుణ సంకల్ప క్రియాశక్తి రూపమైన సరస్వతిగా తనను తానే విభజించికొని, ఆమెతో కూడి బిందు బృంహణమును సాగించి విశ్వనిర్మాణము చేసినాడు. (2) అట్లేర్పడిన విశ్వాన్ని, మరల తానే విష్ణురూపియై సత్త్వ గుణవికారస్థితిలో, సత్త్వగుణశక్తిరూపిణియైన లక్ష్మియై, ఆమెతో గూడి విశ్వభర్తృత్వమును నిర్వహించినాడు. అటుపై మరల తానే తమోగుణ వికారమును పొంది ఉగ్రుడై, రుద్రుడై, తన సంకల్ప క్రియారూపిణియైన పార్వతియై, పరమశక్తియై, ఆమెతో గూడి ఈ భౌతిక ప్రపంచాన్ని భస్మం చేసినాడు.

(3) తదనంతరస్థితిలో, పూర్ణుడై, అన్నీ తానై, తనలో పరస్పర విరుద్ధమైన గుణవికారములుగల విశ్వముయొక్క ద్వంద్వప్రకృతిని, బహుళరూపకత్వమును ఉపసంహరించి, సమతౌల్యమున శాంతుడై శంభుడనబడుతూన్నాడు. ఏ వికారమూ లేని స్థితికి బిందువు (•) ప్రతీకయైనట్లు, అన్ని వికారములు సమతౌల్యమున ఉన్న స్థితికి ○ సున్న ప్రతీక. వర్తులాకారం నిజానికి మొదలు, మధ్య, చివర లేనిది, బిందువు వలెనే. బిందువు సాగి సరళరేఖయైనది. దీనికి మొదలు, మధ్య, చివర ఉన్నవి. ఈ సరళరేఖకు గల మొదలును చివరతో కలిపితే యేర్పడినది వర్తులం. దీనిలో మొదలు, మధ్య, చివర అంతర్ధానమైనవి. ప్రతి బిందువూ మొదలే, మధ్యే, చివరే. ఏదీ ఏదీ కాదు కూడా. ఇది సమతౌల్యానికీ, పూర్ణత్వానికీ, శాంతికీ చిహ్నమైనది. ఎవరికేది మొదలో వారికదే తుద అన్న భావానికి ప్రతీక. ఇట్టి శివునకు నమస్కారము.

**శ్లో॥ నమః సుకృతసంభారవిపాకః సకృదప్యసౌ ।**
**యస్య నామగ్రహః తస్మై దుర్లభాయ శివాయ తే ॥ 10**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనియొక్క, అసౌ = ఈ, నామ = పేరును, గ్రహః = స్మరించుట, సకృత్ + అపి = అరుదుగనైనను, సుకృత = మంచి కర్మలయొక్క, సంభార = రాశియొక్క, విపాకః = ఫలమో, తస్మై = వానికై, దుర్లభాయ = లభించుట కష్టసాధ్యమో, తే = అట్టి, శివాయ = శివునకై, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** శివనామస్మరణసైతము సుకృతము చేసికొన్నదానికి ఫలముగా మాత్రమే లభించును. సుకృతముగలవారికి అరుదుగనైన ఈ అవకాశము లభించగలదు. అట్టి శివునకు నమస్కారము.

**బోళాశంకరుడని** ప్రసిద్ధియున్నను, అట్టి శివునియందు భక్తి కలగటం కష్టమనీ, ఎన్నో జన్మల సుకృతఫలమనీ పెద్దలంటారు. సుకృతము గలవానికే శివనామస్మరణలో రుచి కలుగునని భావము.

**శ్లో॥ నమశ్చరాచరాకారపరేతనిచయైః సదా ।**
**క్రీడతే తుభ్యమేకస్మై చిన్మయాయ కపాలినే ॥ 11**

**ప్రతిపదార్థము :** చర + అచర = కదలునవి, కదలకుండునవి అగు, ఆకార = శరీరములు గలవాని, పరేత = ప్రేత, నిచయైః = సమూహములతో, సదా = ఎల్లవేళల, క్రీడతే = ఆడుకొనువాడైన, కపాలినే = తల పుఱ్ఱెలను ధరించిన, ఏకస్మై = అద్వితీయుడైన, చిన్మయాయ = జ్ఞానస్వరూపుడగు, తుభ్యమ్ = నీకొరకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** కపాలమాల ధరించి, నిత్యము చరాచరముల ప్రేతములతో ఆడుకొనుచుండు కేవలుడైన నీకు, జ్ఞానస్వరూపునకు నమస్కారము.

మెడలో పుఱ్ఱెల దండ, చేతిలో నొక పుఱ్ఱెను బట్టి, జీవుని భౌతికత అశాశ్వతమని బోధించే రూపంతో, శ్మశానంలో నివసిస్తూ నిత్యమూ అక్కడ ఖననం చేయబడుతూ దగ్ధం చేయబడుతూ ఉండే జీవుల కళేబరాలకు సంబంధించిన ప్రేతాత్మలతో ఆనందంగా ఆడుతూ ఉండే జ్ఞానస్వరూపుడు **శివుడు**. నిజానికి జంగమరూపంలోని జంతుజాలమూ స్థావరరూపంలోని చెట్టు చేమలే కాదు, ప్రాణంలేని నదులు, కొండలు ఇత్యాదివి కూడా తమ శరీరరూపాలలో మార్పులు చెందుతూనే ఉంటాయి. ఈ భూమిని ఎప్పుడు ఎక్కడ త్రవ్వినా కళేబరాల అవశేషాలు కనిపిస్తాయి. అంటే, మానవులు ఏర్పఱచుకొన్న సమాధులూ, శవదహనం చేసే శ్మశానాలు మాత్రమే కాదు, సమస్త భూమి ఒక సువిశాల

శ్మశానస్థితియే. అట్లే, నదీసముద్రాలున్నూ జలచరాలకు సమాధిస్థలాలైన శ్మశానాలే. ఈ జ్ఞానం నిత్యమూ మనసులో వెలుగుతూ ఉంటే, శరీరం యొక్క సత్యప్రయోజనం అవగతమై జ్ఞానదీపం వెలుగుతుంది. ఆ వెలుగులో సుఖమేదో దుఃఖమేదో, శాంతియేదో అశాంతి యేదో, శాశ్వతాశాశ్వతముల తత్త్వమేమో సత్యప్రబోధం జరిగి, మానవుడు భౌతికతా శవత్వాన్ని విడిచి నిర్మలజ్ఞానైక శివత్వాన్ని పొందగలడని తన ఈ రూపం ద్వారా శివుడు బోధిస్తున్నాడు. అట్టి ఆత్మబంధువు శివుడని చెప్పటమే **పరేతనిచయైః సదా క్రీడతే** అనటం.

**శ్లో॥ మాయావినే విశుద్ధాయ గుహ్యాయ ప్రకటాత్మనే ।**
**సూక్ష్మాయ విశ్వరూపాయ నమశ్చిత్రాయ శంభవే ॥ 12**

**ప్రతిపదార్థం :** మాయావినే = మాయగలవానికి, విశుద్ధాయ = విశుద్ధుడగువానికి, గుహ్యాయ = అగోచరునకు, ప్రకట = తెలియబడిన, ఆత్మనే = ఆత్మయైనవానికి, ఆత్మగలవానికి, సూక్ష్మాయ = సూక్ష్మరూపికి, విశ్వరూపాయ = విశ్వమే రూపముగా గలవానికి, చిత్రాయ = ఆశ్చర్యము కలిగించువానికి, శంభవే = శంభునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** మాయావి, విశుద్ధుడు, గుహ్యుడు, వ్యక్తాత్ముడు, సూక్ష్మరూపి, విశ్వరూపి, ఆశ్చర్యరూపి, శంభుడు అగువానికి నమస్కారము.

మాయావి అంటే మాయగలవాడు. మాయ అంటే **భేదోల్లాసహేతుః** అని వ్యాఖ్యానం. అంటే, భేదము ద్వారా ఉల్లాసాన్ని కలిగించేవాడు, అని అర్థం. మాయ అన్నది ప్రకృతికి పర్యాయపదం; ప్రకృతి భిన్నత్వంతో కూడినది. రూపభిన్నత్వం, గుణభిన్నత్వం, నామభిన్నత్వం, రసగంధాది భిన్నత్వం. భిన్నత్వంతో బాటు క్షణభంగురత్వం కూడా, అంటే, తఱచు మార్పు చెందే లక్షణం కూడా ప్రకృతి శీలం. ఈ మాయకు శివుడు అధికారి. వాని ఆజ్ఞమేరకు, వాని ఆనందంకోసం మాయ ప్రవర్తిస్తుంది. అయితే, ఈ మాయకు లోబడిన జీవులు గుణవికారాలకు లోనై తమ శుద్ధస్వరూపాన్ని తెలియలేరు. ఈ జీవులలో చేరి తాను సాక్షిగా ఉన్నప్పటికీ ఈ వికారాలకు లోనుగానివాడు శివుడు. అందుచేత విశుద్ధుడు.

గుహ్యుడు అంటే రహస్యంగా ఉన్నవాడు. ప్రకృతికిలోనైన జీవికి తనలోనే ఉన్న శివునిగూర్చి ఏమాత్రము తెలియదు. కనుక అతడు గుహ్యుడు. ఐతే, పాంచభౌతిక శరీరంతో, అహంకారంతో కూడి జీవుడుగా వ్యక్తమైనవాడు కూడ శివుడే. కనుక గుహ్యుడే

ప్రకటాత్మ. ఈ విషయానికి వివరణే సూక్ష్మాయ విశ్వరూపాయ అన్న వర్ణన కూడ. పరమాత్మ రూపంలో సూక్ష్మమైనవాడు, గుహ్యుడు, అవ్యక్తుడు. కాని నామరూపగుణాది లక్షణాలతో వ్యక్తమైనవాడు కూడ శివుడే. ఇట్లా స్థూల సూక్ష్మాలలో, వ్యక్తావ్యక్తాలలో ఉన్నది ఒకడే శివుడు. ఈ స్వభావమే చిత్రం. ఇది విరోధాభాసమైన సత్యం.

శివునిలో ఈ విరోధలక్షణాలు శమిస్తాయి, తమ వైరుధ్యాన్ని విడిచిపెట్టి నిర్వికారమవుతాయి. కనుక ఆతడు శంభుడు, శంకరుడు. శం అంటే శాంతి, నిర్విరోధం. ఈ లక్షణం కలవాడు శంభుడు, ఈ శాంతిని ప్రసాదించేవాడు శంకరుడు.

**శ్లో॥ బ్రహ్మేంద్రవిష్ణునిర్వ్యూఢజగత్సంహారకేలయే ।**
**ఆశ్చర్యకరణీయాయ నమస్తే సర్వశక్తయే ॥ 13**

**ప్రతిపదార్థము :** బ్రహ్మ = బ్రహ్మ, ఇంద్ర = ఇంద్రుడు, విష్ణు = విష్ణువు, వీరి ద్వారా, నిర్వ్యూఢ = సమగ్రముగా సృజించబడిన, జగత్ = ఈ ప్రపంచముయొక్క, సంహార = నశింపజేయుట అను, కేలయే = ఆట ఆడువానికి, ఆశ్చర్య = ఆశ్చర్యమగు, ఆశ్చర్యమును కలిగించు, కరణీయాయ = చేష్టలు, కార్యములు కలవానికి, సర్వ = అన్ని, శక్తయే = శక్తులు కలవానికి, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు అను వీరిచే నిర్మించబడిన జగత్తును నాశనముజేయుట అను ఆటాడువాడు ఉగ్రుడు, రుద్రుడు ఇత్యాది నామాలతో పిలువబడే శివుడు. ఆతడే హరుడు. ఆశ్చర్యకరమైన చర్యలు గలవాడు శివుడు. ఆతడు సర్వశక్తిమంతుడు. వానికి నమస్కారము.

సృష్టికర్త బ్రహ్మ, పోషకుడు, రక్షకుడు విష్ణువు. అయితే ఈ పోషణభారాన్ని విష్ణువు ఇంద్రునిద్వారా నిర్వహింస్తూంటాడు. ఇట్లా సాగిపోయే విశ్వాన్ని హరుడు ప్రలయకాలంలో నశింపజేస్తాడు. సృజించటం బ్రహ్మక్రీడ, పోషించటం ఇంద్రక్రీడ, రక్షించటం విష్ణుక్రీడ. అట్లాగే నాశనం చెయ్యటం హరక్రీడ.

శివుడు రూపంలో విచిత్రవేషధారి, బేసికన్నులవాడు, కపాలమాలాధరుడు, ఆదిభిక్షువు, నాగభూషణుడు, గజచర్మాంబరుడు, శ్మశానవాసి, ప్రేతసఖుడు, నిరాడంబరుడు, నిరాసక్తుడు, నిస్సంగుడు, అయినా అర్ధనారీశుడు, నటరాజు, చంద్రశేఖరుడు, వ్యోమకేశుడు, గంగాధరుడు, వృషభవాహనుడు, ధ్యానప్రియుడు. కాని అడిగిన వరమేదైన ఇవ్వగలవాడు, మృత్యుంజయుడు, యతీశ్వరుడు వాని విషయం అంతా ఆశ్చర్యమే.

**శ్లో ॥ తటేష్వేవ పరిభ్రాంతైః లబ్ధాస్తాస్తా విభూతయః।**
**యస్య తస్మై నమస్తుభ్యమగాధహరసింధవే ॥ 14**

**ప్రతిపదార్థము :** యస్య = దేనియొక్క, తటేషు ఏవ = తీరములందే, పరిభ్రాంతైః = తిరుగుచున్నవారిచే, తాః తాః = ఆ యా, విభూతయః = విభూతులు, లబ్ధాః = పొందబడినవో, తస్మై = అట్టి, తుభ్యమ్ = నీకు, అగాధహరసింధవే = ఆద్యంతములు లేని శివుడను సముద్రమునకు, నమః = నమస్కారములు.

**తాత్పర్యము :** శివుడు అగాధమైన సముద్రమును పోలిన వాడు. సముద్రతీరమున తిరుగాడు వారికి ఎప్పుడైన కొన్ని గవ్వలో ముత్తెపు చిప్పలో దొరకునట్లు శివుడను సముద్ర తీరమున, అనగా పంచాక్షరీ మంత్రార్థ జ్ఞానము, ముద్రాది సాధనలు గురించిన జ్ఞానము మాత్రము సంపాదించికొని, శివతత్త్వమెఱుగని వారికి కొన్ని మహిమలు లభించవచ్చు. ఆ శివసముద్రమునకు నమస్కారము.

**తాః తాః విభూతయః :** ఆ యా విభూతులు, అంటే, అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనబడు సిద్ధులు.

**పరిభ్రాంతైః –** అనునది తీరమున పై పైన మాత్రమే తిరుగు వారి చేత, అను అర్థముతో బాటు, తమకు లభించిన సిద్ధుల వంటి మహిమలతో అదే సంపద అను భ్రాంతిలో తిరుగాడు వారు అన్న అర్థ ధ్వని కూడ ఉన్నది. ఊర్మికౌలతంత్రంలోని

పవనభ్రమణప్రాణవిక్షేపాదికృతశ్రమాః ।
కుహకాదిషు యే భ్రాన్తా భ్రాన్తాస్తే పరమే పదే ॥

అన్న దానినిక్కడ సమన్వయించుకోవలెను. శివతత్త్వజ్ఞానము లేనంతవరకు వారు భ్రాంతులే.

**శ్లో ॥ మాయామయజగత్సాంద్రపంకమధ్యాధివాసినే ।**
**అలేపాయ నమః శంభుశతపత్రాయ శోభినే ॥ 15**

**ప్రతిపదార్థము :** మాయామయ = మాయతో నిండిన, జగత్ = జగత్త నెడి, సాంద్ర = దట్టమైన, చిక్కని, పంక = బురద యొక్క, మధ్య = నడుమ, అధివాసినే = నివసించునట్టి వానికి, అలేపాయ = పైపూత లేని వానికి, శోభినే = శోభించునట్టి, శంభుశతపత్రాయ = శంభుడను పేరుగల పద్మమునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** శంభుడు అను పేరు గల పద్మం మాయతో కూడిన జగత్తులో నివసిస్తూన్నది.

ఈ మాయ చిక్కని బురద. ఈ బురద మధ్యలో నివసిస్తూన్నప్పటికిన్ని, శంభుడనే పద్మానికి ఏమాత్రమూ బురద అంటనే అంటదు. శోభ తగ్గదు. అట్టి శంభునకు నమస్కారము.

పద్మానికి పంకజం అనే పేరు దాని జన్మ లక్షణాన్ని పురస్కరించికొని వచ్చినదే. అది బురదలోనే పుట్టి, పెరిగి, వికసించి, శోభిస్తుంది. చుట్టూ ఉన్న బురద దాని శోభను ద్విగుణీకృతం చేస్తుంది తప్ప బాధకం కాదు. అసలు పద్మ శోభకు ఆ బురద అంటనే అంటదు. ఇది ప్రాకృతిక సత్యం, జగమెఱిగిన సత్యం, శంభుడు ఈ పద్మంతో సమాన లక్షణం కలవాడు. సంసారం లేక జగత్తు మాయతో నిండినది. **యామ** అన్న దానికి నిరంతర పరివర్తన, పరిణామం లక్షణం. ఈ లక్షణం కలిగినది చిక్కబడటం, పొరుదల లేక పోవటం అన్న లక్షణాలకు విరుద్ధమైనది. అయినా గాని జగత్తు బురద అనటం ఎందుకంటే, ఊబిలో పడినవాడు కదిలిన కొలదీ, పెనుగులాడిన కొలదీ, కూరుకుపోయినట్లు ఈ మాయ సంసారంలో పడినవాడు కూడా బైట పడలేడు. కాని శంభుని విషయం ఇందుకు విపరీతం. అతడీమాయలో అంతర్యామిగా, మధ్యవర్తిగా ప్రవర్తిస్తూనే ఉంటాడు, కాని మాయకు లోనై మిగతాజీవులవలె స్వస్వరూపజ్ఞానాన్ని కోల్పోడు, వికారాలకు లోనుగాడు. శాంతుడు కనుకే తనదైన ఆత్మ శోభను నష్టపోడు. దానిపై మాయ ఒక పొరగా యేర్పడి శోభను తగ్గించదు. కాగా మాయామయ జగత్తులో తా నొకడు మాత్రం కాగా ప్రశాంతంగా ఆత్మ శోభతో వెలుగుతూ ఉంటాడు. వాని శోభపై పూతగా మాయ కప్పివేయదు.

**శ్లో ॥ మంగలాయ పవిత్రాయ నిధయే భూషణాత్మనే ।**
**ప్రియాయ పరమార్థాయ సర్వోత్కృష్టాయ తే నమః ॥ 16**

**ప్రతిపదార్థము :** మంగలాయ = మంగల స్వరూపము గల వానికి, పవిత్రాయ = పవిత్రునకు, నిధయే = నిధి స్వరూపుడైన వానికి, భూషణాత్మనే = అలంకారములకే అలంకారమైన వానికి, ప్రియాయ = ప్రియమైన వానికి, పరమార్థాయ = అర్థములన్నిటికి మూలమైనవానికి, సర్వ = అందరిలో, ఉత్కృష్టాయ = శ్రేష్ఠుడైన వానికి, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** కళ్యాణగుణము గలవాడు, పవిత్రుడు, భక్తులకు నిధి వంటివాడు, భూషణములకే భూషణుడు, సర్వ ప్రియుడు, సర్వ శ్రేష్ఠుడు, అర్థములన్నిటికి సారభూతమైన వాడు, అట్టి శివునకు నమస్కారము.

**మంగలాయ :** బేసి కన్నులు, జడలు గట్టెన సిగ, పాముల దండలు, బూది పూత, కపాలమాల, ఇది వాని ఆకారము. శ్మశానవాసము, ప్రేతముల సహవాసము. ఇందు మంగళ కరమనదగినది యేమున్నది ? పవిత్రమైన దేది ? భక్తులకు నిధి యనుటకు వాని వద్ద ఇచ్చుటకేమున్నది ? నాగ భూషలకు భూషణమా ? ఈ రూపము కారణముగనే సర్వోత్తముడు, ప్రియుడు అయినాడు. దేనినీ ఆశించని వాడు, అందరూ తిరస్కరించు వానిని ఆదరించువాడు, కోరిన వరమిచ్చు వాడు కనుకే మంగళుడు, పవిత్రుడు, నిధి, ప్రియుడు అనదగిన వాడు. హాలాహలాన్ని మ్రింగి లోకాలను రక్షించిన వాడు ప్రియుడు, మంగళుడు సర్వోత్తముడు కాడా ? రాక్షసులకు సైతము కోరిన వరములిచ్చే వాడు, మార్కండేయ ప్రాణత్రాత నిధి కాడా ? జగత్పంకాన్ని అంటించుకొనక పద్మము వలె శోభించే వాడు పవిత్రుడు కాడా ? స్వర్ణభూషలను తిరస్కరించి పన్నగములకు భూషణశోభను కల్పించిన వాడు, క్షీణించే చంద్రుని 16వ కళను తలదాల్చి తత్కళాబలమున చంద్రునికి వృద్ధిని ప్రసాదించిన వాడు భూషణాత్మకాడా ?

లౌకికార్థాలు, వాచికార్థాలు, శాస్త్రార్థాలు, చతుఃషష్టికళార్థాలు అన్నిటికీ ఆది మధ్యాంతములు తానైన వాడు పరమార్థ స్వరూపుడనటం స్వభావోక్తియే కదా.

గ్రాహ్యవిషయం రూపధారణను బట్టి గుణనిర్ణయం కాక, ఆ రూపధారణకు హేతుభూతమైన మానసిక వైఖరిని ప్రమాణంగా తీసికొని విలువలు నిర్ణయించవలెనన్నది.

**శ్లో ॥ నమః సతతబద్ధాయ నిత్యనిర్ముక్తిభాగినే ।**
**బంధమోక్షవిహీనాయ కస్మైచిదపి శంభవే ॥ 17**

**ప్రతిపదార్థము :** సతత = ఎల్లప్పుడు, బద్ధాయ = బద్ధుడైన వానికి, నిత్య = ఎల్లప్పుడు, నిర్ముక్తి = పారమార్థికముక్తికి, భాగినే = యోగ్యుడైన వానికి, బంధ = బంధింపబడుటగాని, మోక్ష = ముక్తుడగుటగాని, విహీనాయ = లేని వానికి, కస్మైచిద్ + అపి = ఒకానొక అలౌకికమైన, శంభవే = శంభునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** నిర్వికారుడై శాంతుడైన శంభునకు నమస్కారము. అతడొక అలౌకిక మూర్తి. ఎప్పుడూ మాయకు బద్ధుడై జీవులలో ఆత్మ రూపంలో ఉంటాడు. కాని ఆతడెప్పుడూ ఆధ్యాత్మికముక్తిని పొందటానికి అర్హత కలిగే ఉంటాడు. నిజానికి వానికి బంధమూ లేదు, మోక్షమూ లేదు.

ఇక్కడ భావించబడిన శంభుడు జీవుడు, సాక్షి అన్న రెండు రూపాలలో ఉన్నవాడు. జీవుడు ఎప్పుడూ బద్ధుడే. సాక్షిగా ఉన్న వాడు మాత్రం బద్ధుడూ కాదు

ముక్తుడూ కాడు. ఆతడెప్పుడూ ముక్తుడు కావటానికి అర్హుడు గానే ఉంటాడు. ఈ విరోధాభాసమూర్తి శాంతుడు, నిర్వికారుడు.

ముండకోపనిషత్, పంచమ ఖండం ఆరంభం ...

ద్వా సుపర్ణా సయుజా సఖాయా – సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి – అనశ్నన్నన్యో అభిచాకశీతి ॥

అన్న మంత్రార్థాన్ని స్మరిస్తే, గుణంలో సంచారంలో సములు, అందమైన రెక్కలు గల పక్షుల వంటి చేతను లిద్దరు వృక్షం వంటి పెరిగి నశించే శరీరాన్ని ఆశ్రయించి ఉన్నారు. ఒకడు జీవుడు; పిప్పలాన్ని ఇష్టంగా తింటూన్నాడు; రెండవ వాడు దాన్ని తినక వెలుగుతూంటాడు. – ఈ శ్లోకార్థం నిర్విరోధంగా భాసిస్తుంది.

**శ్లో ॥ ఉపహాసైకసారేఽస్మిన్నేతావతి జగత్త్రయే ।**
**తుభ్యమేవాద్వితీయాయ నమో నిత్యసుఖాసినే ॥ 18**

**ప్రతిపదార్థము :** ఉపహాస = పరిహాసము, ఏక సారే = మాత్రమే సారమైన, అస్మిన్ = ఈ, ఏతావతి = ఇంత పెద్దదైన, జగత్ త్రయే = మూడు లోకములలో, నిత్య = ఎల్లప్పుడు, సుఖ + ఆసినే = సుఖాసనము గల వానికి, అద్వితీయాయ = కేవలునికి, తుభ్యం ఏవ = నీకు మాత్రమే, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ఈ విశ్వం అంతా నవ్వులాటగా తోచేదే తప్ప అంతకంటె గొప్ప దేమీ కాదు. అటువంటి ముల్లోకాలలోనూ ఎప్పుడూ సుఖంగా కూర్చొని ఉండేవాడవు నీ వొక్కడవే. అందుకే నీకు మాత్రమే నమస్కారం.

భూలోక, భువర్లోక, స్వర్లోకాలు మూడున్నూ పరిశీలించి చూస్తే "యేమున్నది గర్వ కారణం?" అనిపిస్తుంది. భూలోకంలో సుఖాలకు, దుఃఖాలకు ఇంద్రియానుభవం కారణం. అది క్షణికం. భువర్లోకం భూలోకాన్ని ఆవరించి ఉండేదే. స్వర్లోకంలో మాత్రం యేముంది ఇంద్రియసుఖం తప్ప? కనీసం, భూలోకంలో సుఖదుఃఖసమ్మిశ్రణం వలన మార్పు కనిపిస్తుంది. అదీ లేని భోగలోకం స్వర్లోకం. ఇక్కడి జీవితాలకు గంభీరమైన అర్థమేమున్నది? అనుభవమేమున్నది? అందుకే **ఉపహాసైకసారం** అన్నాడు కవి. ఈ మూడు లోకాలలోనూ శాంతంగా వ్యాపించి ఉన్నవాడు శివుడు. వానికి నమస్కారం. వానిలాంటి వారు వేరొకరు లేరు కనుక వానికే నమస్కారం.

**నిత్యసుఖాసినే** అన్నది శివుని ధ్యాననిష్ఠను తెలిపే వర్ణన. చుట్టూ ఉన్న విశ్వం

నవ్వులాటగా సాగుతూన్నప్పటికీ శివుడు తాను మాత్రం దాని కతీతుడై ఆత్మానందకేవలుడై యోగముద్రలో ఉంటాడు అన్నది తాత్పర్యం.

**శ్లో ॥ దక్షిణాచారసారాయ వామాచారాభిలాషిణే ।**
**సర్వాచారాయ శర్వాయ నిరాచారాయ తే నమః ॥ 19**

**ప్రతిపదార్థము :** దక్షిణాచార = దక్షిణాచారపు, సారాయ = సారమైన వానికి, వామాచార = వామాచారమందు, అభిలాషిణే = అభిలాష కలవానికి, సర్వ + ఆచారాయ = అన్ని ఆచారముల స్వరూపమైన వానికి, శర్వాయ = శర్వునకు, నిర్ + ఆచారాయ = యే ఆచారము లేని వానికి, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** దక్షిణాచారసారమై, వామాచారాభిలాషియై సర్వాచారస్వరూపమై శర్వుడై నిరాచారుడైన నీకు నమస్కారము.

లోక వ్యవహారం అంతా ఆచారాల పుట్ట. ఈ ఆచారాల పుట్టుకను పరిశీలిస్తే, అన్నీ దైవాన్ని చేర్చే ప్రయత్నాలుగా, దైవీ మార్గాలుగా కనిపిస్తాయి. ఈ ఆచారాలన్నీ దైవంతో నిండినవే. అందుకే **సర్వాచారాయ** అనటం. అన్ని ఆచారరూపాలున్నూ ఆ ఒక్కనివే అయితే, ఆతని అసలు రూపమేది ? ఏ ఒక్కటీ కానిదే కదా. అందుకే **నిరాచారాయ** అనటం.

ఆచారం స్వభావాన్ని బట్టి సహజంగా కుడి చేయి, ఎడమ చేయి అన్నట్లే, దక్షిణ వామాలుగా లోకంలో ప్రవర్తిల్లటం కద్దు. **దక్షిణాచారం** పరిశుద్ధమైన పద్ధతిలో సాగే శక్తి ఆరాధన. దీనిలోని విధి విధానాలు పవిత్రమైనవి. దీని సారం శివుడు. అట్లే **వామాచారం** కూడా శక్తి సాధనే. అయితే దీని విధి విధానాలు కొన్ని జుగుప్సాకరంగా ఉంటాయి. అయినప్పటికీ, జీవునికి దీనియందు అభిలాష ఉంటుంది. ఇది ఒక మనోవైజ్ఞానికాంశం. కనుక శివుడు **వామాచారాభిలాషి.** భైరవతంత్రం దృష్టిలో ఆచరణీయమైనది దక్షిణాచారం కాగా వాదితంత్రం దృష్ట్యా వామాచారం కర్తవ్యం. ఈ రెండూ శక్తి సాధన కేర్పడినవే. నిజానికి, అన్ని యోగాలూ తంత్రాలూ మంత్రజపాలూ తపాలూ శక్తి సాధన ఏకైక లక్ష్యంగా సాగేవే. ఇవన్నీ శక్తి సాధక క్రియలే. శివ శక్తులను భావించిన తంత్రాలకు యామల తంత్రాలు, భైరవ తంత్రాలు అన్న పేరు. ప్రస్తుతం కవి భావించినది ఈ తంత్రాచారాలను.

**శ్లో ॥ యథా తథాపి యః పూజ్యో యత్ర తత్రాపి యోఽర్చితః ।**
**యోఽపి వా సోఽపి వా యోఽసౌ దేవస్తస్మై నమోఽస్తు తే ॥ 20**

**ప్రతిపదార్థము :** యథా తథా అపి = ఏ విధముగానైనను, యః = ఎవడు, పూజ్యః = పూజ్యుడో, యత్ర తత్ర అపి = ఎక్కడైనను, యః = ఎవడు, అర్చితః = అర్చింపబడినాడో, యః అసౌ = ఏ ఈతడు, దేవః = దేవుడో, యః అపి వా = ఎవడైనను, సః అపి వా = వాడుగూడ, తస్మై = వానికి, తే = నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** ఎక్కడైనా, యే పద్ధతిలోనైనా, పూజ్యుడై పూజింపబడిన దేవుడెవడో, ఆతడు ఈతడే. ఆతడైన నీకు నమస్సులు.

గుడిలోనా, ఇంటిలోనా, రైలుబండిలోనా, నదీతీరముననా, ఇత్యాది యోచన లేకుండ, ఏ తావుననైన పూజింపదగిన దేవుడు శివుడు. అట్లే, ఏ పద్ధతిలోనైన, యే ఆచారాన్ని అనుసరించియైన, అంటే జపతపాదులతోగాని, యంత్రతంత్రాదులతో గాని, ధ్యానావాహనాది పూజావిధానంతో గాని, దక్షిణ వామాచారాలననుసరించి గాని, ఎట్టైన శివుడు పూజింపదగినవాడు. విధానాన్ని బట్టి ఆచార సంప్రదాయాన్ని బట్టి ఫలం ఉండదు, అని తాత్పర్యం.

**శ్లో ॥ ముముక్షుజనసేవ్యాయ సర్వసంతాపహారిణే ।**
**నమో వితతలావణ్యవారాయ వరదాయ తే ॥ 21**

**ప్రతిపదార్థము :** ముముక్షు = మోక్షమును కోరుకొను, జన = జనులచే, సేవ్యాయ = సేవింపదగిన వానికి, సర్వ = అన్ని విధముల, సంతాప = దుఃఖములను, హారిణే = నశింపజేయువానికి, వితత = విస్తరించిన, లావణ్య = సౌందర్యపు, వారాయ = రాశియైన వానికి, వర = వరములను, దాయ = ఇచ్చు వానికి, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** నీవు మోక్షాన్ని కోరేవారికి సేవింపదగానవాడవు. సంతాపాలన్నిటిని పోగొట్టువాడవు. సౌందర్యరాశివి. నీకు నమస్కారము.

మోక్షం అంటే విడుదల. కట్టుబడినవారికి కదా విడుదలపై కోరిక. జగత్తులో కట్టుబడనివారెవరు ? కోరిక లేని వారెవరు ? చివరకు మోక్షకామన కూడ కోరికయే కదా? క్షుద్రమైన కోరికలు, ఉత్తమమైన కోరికలు, వేనినైన తీర్చి విడుదల ప్రసాదించ గలవాడు కనుక శివుడు వరదుడు, ముముక్షుసేవ్యుడు.

మానవునకు **తాపత్రయం** గుర్తించబడింది : 1) ఆధిభౌతికం, 2) ఆధిదైవికం, 3) ఆధ్యాత్మికం. **ఆధిభౌతికతాపాలు :** పాంచభౌతిక శరీరం వలన కలిగే ఆధి, వ్యాధులు, శరీరబాధలు, మానసికరుగ్మతలు. ఇవి కాక పశుపక్ష్యాదుల వలన కలిగే సర్ప, వృశ్చికాది

బాధలు. వీటి నుండి మోక్షం కావాలి కదా. **ఆధిదైవికతాపాలు :** మానవునకు దైవం ప్రతికూలమైనప్పుడు కలిగే బాధలు : ప్రాకృతికమైన కఱవు, వరద, ఉప్పెన, భూకంపమాది, చేసిన కార్యం సానుకూలం కాకపోవటం, ప్రయత్నవైఫల్యం, హఠాదనూహ్యసంఘటనలు, ఇవన్నీ దైవికంగా వచ్చేవే, వీటికి దేవుడే గతి. **ఆధ్యాత్మిక తాపాలు :** మనస్సు దైవోన్ముఖమవుతుంది, కాని యే రూపంలో ఆరాధించాలో తెలియని తాపం; దైవరూపం నిశ్చితమైనా, ఆరాధన విధి విధానాల జ్ఞానలోపం వలన కలిగే తాపం; సాధనక్లేశాలవలన తాపం ఇత్యాది.

లోకంలో దేని సౌందర్యం దానిదే. లలితసౌందర్యం కొన్నిట దర్శనమిస్తే, పరుషసౌందర్యం కొన్నిట, గంభీరసౌందర్యం మరికొన్నిట. కాని ఈ సౌందర్యాలన్నీ, ప్రకృతి సమస్తం పరమాత్ముని, శివుని సౌందర్య విస్తారాలే. అందుకే ఆతడు సౌందర్య రాశి అనటం.

త్రిమూర్తులు ముగ్గురూ వరదులే. కాని ముల్వురిలో సులభుడు శివుడు. అందుకే వరదుడు అన్న ప్రత్యేకనామం. సాధారణంగా, శివాద్ జ్ఞానమిచ్ఛేత్, అనిన్నీ, మోక్షమిచ్ఛేత్ కేశవాద్, అనిన్నీ అంటారు. అయితే, జ్ఞానం ముక్తికి ప్రాతిపదిక, జ్ఞానఫలంగా సాధనల ఏకాగ్రత, వైశిష్ట్యం, పర్యవసాయిముక్తి. కనుక శివుడు కూడా జ్ఞానదాతగా మోక్షదాతయే అనటం.

**శ్లో ॥ సదా నిరంతరానందరసనిర్భరితాఖిల- ।**
**త్రిలోకాయ నమస్తుభ్యం స్వామినే నిత్యపర్వణే ॥ 22**

**ప్రతిపదార్థము :** సదా = ఎల్లప్పుడు, నిరంతర = అంతరాయములేని, ఆనందరస = ఆనందరసముతో, నిర్భరిత = నిండింపబడిన, అఖిల = సర్వ, త్రిలోకాయ = మూడు లోకములు గల, నిత్య = నిత్యము, పర్వణే = ఉత్సవములు గల, స్వామినే = స్వామివైన, తుభ్యం = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** స్వామీ! ఎప్పుడూ మూడు లోకాలనూ, అంతరాయం లేకుండా ఆనందంతో నింపుతూంటావు, ఎప్పుడూ ఉత్సవాలు జరుపుకుంటుంటారు. నీకు నమస్కారం.

పర్వము అంటే కణుపు. **పర్వ్** ధాతువుకు పూరణార్థం. కనుక కణుపు కణుపున నిత్యము ఆనందాన్ని నింపే స్వామికి జేజేలు పలుకుతూ నిత్యమూ నూతనోత్సాహంతో మూడు లోకాలూ ఉత్సవాలు జరుపుతూ ఉంటారు. నిత్యమూ సుషుప్తిలో జీవుడు తన మనస్సూ శరీరమూ ఆ రోజు నష్టపోయిన శక్తినంతా మరల నింపుకొని ఉదయాన

పునర్నవమైన ఉత్సాహంతో జీవనానందానుభవానికి సిద్ధమవుతాడని అంటారు.

**శ్లో ॥ సుఖప్రధానసంవేద్యసంభోగైర్భజతే చ యత్ ।**
**త్వామేవ తస్మై ఘోరాయ శక్తివృందాయ తే నమః ॥ 23**

**ప్రతిపదార్థము :** యత్ చ = ఏదైతే, సుఖ ప్రధాన = సుఖము ప్రధానముగా, సంవేద్య = తెలియగల, సంభోగైః = భోగరూపమైన అనుభవములతో, భజతే = పూజ చేయునో, శక్తివృందాయ = పంచేంద్రియము లాది శక్తుల సముదాయము గల, తస్మై = అట్టి వాడగు, ఘోరాయ = భయంకరుడైన, తే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** సుఖస్వరూపుడవగు నీవు భోగానుభవంతో బాగా తెలియదగిన వాడవు. ఆ భోగ సాధనాలైన చక్షురాది ఇంద్రియసమూహంతో సేవించబడే ఘోర రూపుడవు నీవే. నీకు నమస్కారము.

లోకం భోగ స్వరూపం. ఈ భోగానికి ఆధారం ఇంద్రియాలు. ఈ ఇంద్రియాలు సంవిద్దేవీచక్రంగా శాక్తేయు లెఱిగినది. శివుడో సుఖ స్వరూపుడు, ఆనందమయుడు. కనుక ఈ ఇంద్రియసుఖాల ద్వారా అర్చింపబడేవాడు శివుడే. అట్లు శివారాధకులు తమ విశ్వభోగమునంతా శివునకే అర్పించి, శివపరము చేసివైతురు. ఈ ప్రక్రియలో విశ్వభోగాసక్తినంతా హరించి శివుడు ఘోరుడై భక్తుల కానందదాయకుడవుతాడు. ఈ భోగసంహార క్రియలో స్వామి ఘోరుడు కాగా, భక్తుడు శివస్వరూపుడవుతాడు.

**శ్లో ॥ మునీనామప్యవిజ్ఞేయం భక్తిసంబంధిచేష్టితాః ।**
**ఆలింగన్త్యపి యం తస్మై కస్మైచిద్భవతే నమః ॥ 24**

**ప్రతిపదార్థము :** మునీనాం అపి = మునులకైనను, అవిజ్ఞేయమ్ = తెలియ రాని వాడైన, యమ్ = ఎవనిని, భక్తిసంబంధి = భక్తి సంబంధము గల, చేష్టితాః = చేష్టలు గల వారు, ఆలింగన్తి అపి = కౌగిలింతురుకూడనో, తస్మై = అట్టి వానికి, కస్మైచిద్ = ఒకానొకడవైన, భవతే = నీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** తపోనిష్ఠులూ యోగనిష్ఠులూ అయిన మునులకు సైతం తెలియుటకు అసాధ్యమైన నిన్ను భక్తి సంబంధి చేష్టలుగలవారు కౌగలింతురు కూడ. అట్టి నీకు నమస్కారము.

భక్తులు ఒకరినొకరు కలిసికొన్నప్పుడు ఆ సమావేశానందంలో కౌగలించు కొందురు. అట్లే శివుని సైతము కౌగలింతురు. అది వాని ఆనందరసాస్వాదనంలో

తన్మయత్వాన్ని ప్రకటించే చర్య. భక్తునకు భగవంతుడు కూడ భోగ్యవస్తువే. ఇది మధుర భక్తియని వైష్ణవులంటారు.

**శ్లో ॥ పరమామృతకోశాయ పరమామృతరాశయే ।**
**సర్వపారమ్యపారమ్యప్రాప్యాయ భవతే నమః ॥ 25**

**ప్రతిపదార్థము :** పరమ = సర్వశ్రేష్ఠమైన, అమృత = అమృతమునకు, కోశాయ = నిధియైనవాడు, పరమ = సర్వశ్రేష్ఠమైన, అమృత = అమృతపు, రాశయే = రాశియైనవాడు, సర్వపారమ్య = అన్ని పరాకాష్ఠలకు, పారమ్య = పరాకాష్ఠను, ప్రాప్యాయ = పొందించువాడు, అయిన, భవతే = తమకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** శివుడు స్వయంగా అమృతరాశి, అమృతకోశము. పారమ్యములన్నిటిలోను శ్రేష్ఠమైన పారమ్యమును పొందించువాడు. అట్టి శివునకు నమస్కారము.

లోకంలో అమృతతుల్యమైనవి, మధురానుభూతిని కలిగించేవి చాలా ఉన్నవి. నిజానికి జీవి దేనిని ఇష్టపడితే, అదంతా అమృతప్రాయంగానే ఆ జీవికి అనుభవంలోనికి వస్తుంది. కాని ఈ అనుభవాలు తాత్కాలికానుభూతినే తప్ప శాశ్వతానందానుభూతిని ఇవ్వలేవు. కారణం, ఇవన్నీ ప్రాకృతికలక్షణం కలిగినవి. అనుభూతికి ఆధారమైనది ప్రాకృతికం, కనుక క్షణికం. ఆ విషయానుభవాన్ని అందించే ఇంద్రియాలు, ఆస్వాదించే మనస్సు, రెండూ చంచలమైనవే. కాని శివుడు ఇంద్రియ విషయమైతే, మనస్సు శివుని ఆస్వాదించనారంభిస్తే, ఆ అనుభవం పరమమూ చరమమూ అవుతుంది. అంటే, అతి శ్రేష్ఠమైనది, చిట్ట చివరది అవుతుంది. ఆపై కోరదగినది లేక శివ విషయికమై ఇంద్రియాలూ మనస్సూ పారమ్యాన్ని పొంది తమ చంచలత్వాన్ని విడిచి స్థిరమవుతాయి. ఈ స్థితి అమృత స్థితి. మృతం అంటే నశించునది. అమృతం నశించనిది. ఈ రెండూ ఇంద్రియ మనోఽనుభవానికి రెండు పారములు, తీరములు. ఈ రెంటినీ అనుసంధానించే స్వామి శివుడు. కనుక శివపారమ్యం అమృతకోశం. శివుడు అమృతరాశి. ఆతడు మృత్యుంజయుడు కదా!

**శ్లో ॥ మహామంత్రమయం నౌమి రూపం తే స్వచ్ఛశీతలమ్ ।**
**అపూర్వామోదసుభగం పరామృతరసోల్బణమ్ ॥ 26**

**ప్రతిపదార్థము :** మహామంత్రమయమ్ = మహామంత్రముతో నిండిన, స్వచ్ఛ = నిర్మలము, శీతలమ్ = శీతలమైన, అపూర్వ = అలౌకిక, ఆమోద = సుగంధము గల, సుభగమ్ = మనోహరమైన, పర = ఉత్తమ, అమృతరస = ఆనందరసముతో, ఉల్బణమ్ = నిండిన, తే = నీయొక్క, రూపమ్ = రూపమును, నౌమి = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** నీ రూపము ఆనందముతో నిండినది. సుగంధిలము, మనోహరము, నిర్మలము, శీతలము, మహామంత్రమయము. అట్టి నీ రూపమునకు నమస్కారము.

**ఓం నమఃశివాయ** అన్నది మహామంత్రం. ఇట్టివే మహామంత్రాలు **ఓం నమో నారాయణాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ** వీటన్నిటా ముందు ప్రణవం, ఓం ఉంటుంది. ఓం అన్నది అ + ఉ + మ్ అన్న ధ్వనుల ఏకీకృత రూపం. ఇది సృష్టి స్థితి లయాలకూ, సత్త్వరజస్తమోగుణాలకూ, ఆ యా గుణ ప్రధాన దేవతా మూర్తులకూ ప్రతీకలుగా స్వీకరించబడినది. ఈ మూడూ సమతులనంలో నిర్వికారంగా ఉన్న స్థితి ఓంకారం. దీనిని ముందుంచి జపించేది మహామంత్రం. తద్వారా మంత్రదేవతా స్వరూపంలోని గుణాహంకారం (కృత్రిమాహంకారం) అకృత్రిమదైవాహంకారంగా సంస్కరింపబడి, త్రిమూర్తుల తేజస్సులతో నిర్వికారమై, తాపహరమై, అలౌకికానందప్రద మవుతుంది.

**శ్లో ॥ స్వాతంత్ర్యామృతపూర్ణత్వదైక్యఖ్యాతిమహాపటే ।**
**చిత్రం నాస్త్యేవ యత్రేశ! తన్నౌమి తవ శాసనమ్ ॥ 27**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ స్వామీ!, తవ = నీయొక్క, తత్ = ఆ, శాసనమ్ = ఆదేశమును, నౌమి = నమస్కరించుచున్నాను, యత్ర = ఎక్కడ, యే శాసనమునందు, స్వాతంత్ర్య = స్వతంత్రరూపమైన, అమృత = అమృతముతో, పూర్ణ = నిండిన, త్వద్ = నీయొక్క, ఐక్య = స్వరూపాద్వైతము యొక్క, ఖ్యాతి = దర్శనము గల, మహాపటే = వస్త్రముపై, చిత్రం = విచిత్రమైనది, నాస్తి ఏవ = లేనే లేదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ శాసనమైన ఆగమమునకు నమస్కారం. నీతో అభేదరూపమై విశ్వవ్యాప్తమైన మహాపటం అదే. అందున్న విషయములు నానాత్వాన్ని విడిచి నీతో ఏకమైపోతూ ఉన్నవి. కనుక విశ్వం చిత్రం కాదు, అంటే రేఖావైవిధ్యం, వర్ణవైవిధ్యం, భావవైవిధ్యం యేమీ లేనిదే. వస్త్రం మీద వ్రాయబడిన శాసనం చిత్రరూపం కాదు కదా, అట్లే.

**శ్లో ॥ సర్వాశంకాశనిం సర్వాలక్ష్మీకాలానలం తథా ।**
**సర్వామంగల్యకల్పాన్తం మార్గం మాహేశ్వరం నుమః ॥ 28**

**ప్రతిపదార్థము :** సర్వ = అన్ని, ఆశంకా = సంశయములకు, అశనిమ్ = వజ్రమైనదానిని, నశింపచేయు దానిని, సర్వ = అన్ని, అలక్ష్మీ = దారిద్ర్యములకు, కాలానలమ్ = కాల్చివేయు అగ్ని రూపమైనదానిని, తథా = అట్లే, సర్వ = అన్ని, అమంగల్య =

అశుభములకు, కల్పాన్తమ్ = ప్రలయమైనదానిని, మాహేశ్వరమ్ = మహేశ్వరునిదైన, మార్గమ్ = మార్గమును, నుమః = నమస్కరింతుము.

**తాత్పర్యము :** మహేశ్వరమయమైన మార్గానికి నమస్కారము. ఈ మార్గము శంకలన్నిటిని వజ్రాయుధమువలె నిర్మూలించును; అన్ని విధముల దారిద్ర్యములను కార్చిచ్చువలె దహించును; అశుభములన్నింటిని ప్రలయకాలమువలె నశింపజేయును.

మానుషమైన మార్గం శంక, ప్రశ్న, సమాధానము అన్న మూడు మజిలీలతో సాగుతుంది. ఇది అనంతమైనది. కారణం సమాధానము నుండి ప్రశ్న ఉద్భవిస్తూనే ఉంటుంది. మరల సమాధానాపేక్ష నిత్యమవుతుంది. కనుకే **సర్వాశంకాశనిం** మహేశ్వర మార్గం అనటం, దారిద్ర్యమూ అంతే, ధనదారిద్రమో, భావదారిద్ర్యమో, క్రియా దారిద్ర్యమో, ఏదో ఒకటి ఉంటే చాలు మిగతావన్నీ పుట్టపగిలినట్లు వస్తాయి. వీటిని దహించగలది మాహేశ్వరమార్గం. ఈ మార్గం లక్ష్మీప్రదం. అశుభాలు పరంపరగా వస్తాయి. వాటిని లయం చేసేది మాహేశ్వరమార్గం. ఇంతకూ ఈ మాహేశ్వరమార్గమేది? ఇది శాక్తమార్గం, అంటే, శక్తిసాధన, శక్తివశీకరణ, శక్తినియంత్రణ. ఈ చివరి దశకు చేరినప్పుడే ఈశ్వరుడైనా, మహేశ్వరుడైనా కాగలడు మానవుడు. ఇదే ధ్యేయం. లక్ష్యసాధనకే దేవ, దానవ, మానవులంతా నిరంతరం ఎవరి పద్ధతిలో వారు తపించేది. ఇది స్వస్వరూపదర్శనం వలన మాత్రమే సిద్ధిస్తుంది. ఇది సిద్ధించినప్పుడు,

**శంకాపి న విశంకేత నిఃశంకత్వమిదం స్ఫుటమ్।**

అన్నట్లు శంకలన్నీ తీరిపోగలవు, సకల దారిద్ర్యాలూ, అమంగళాలూ తొలగిపోగలవు.

**శ్లో ॥ జయ దేవ నమో నమోఽస్తు తే - సకలం విశ్వమిదం తవాశ్రితమ్ ।**
**జగతాం పరమేశ్వరో భవాన్ - పరమేకః శరణాగతోఽస్మి తే ॥ 29**

**ప్రతిపదార్థము :** దేవ = ఓ స్వామీ!, జయ = నీకు జయమగుగాక!, తే = నీకు, నమః నమః = మరల మరల నమస్కారము, అస్తు = అగుగాక!, ఇదమ్ = ఈ, సకలమ్ = సమస్తమైన, జగత్ = జగత్తు, తవ = నీయొక్క, ఆశ్రితమ్ = ఆశ్రయమును పొందినది; భవాన్ = తమరు, జగతాం = అన్ని లోకాలకు, పరమ + ఈశ్వరః = సర్వోన్నతమైన అధికారి, ఏకః = ఒకే ఒకరు; తే = నీ యొక్క, శరణ + ఆగతః = శరణుజొచ్చినవాడను, అస్మి = అగుచున్నాను.

**తాత్పర్యము :** ఓ స్వామీ! అన్ని లోకాలూ నిన్నాశ్రయించుకొనియున్నవి. అన్నిలోకాలకూ తమరొకరే సర్వోన్నతాధికారి. నీవే శరణన్నాను, నీకు జయమగుగాక! నీకు మరల మరల నమస్కారము.

దీనిని, తే శరణాగతః = నిన్ను శరణుజొచ్చిన వాడను, పరమ + ఏకః (పరమః ఏకః) పరముడవైన నీతో ఏకమేనవాడను, అస్మి = అగుచున్నాను. అంటే, నిన్ను శరణు వేడిన నాకూ నీకూ నిజానికి భేదం లేదు. దేహాభిమానం వలన భేద భావం కలిగింది. దీన్ని తొలగించికొని శివాద్వైత భావంలో స్వస్వరూప జ్ఞానానందాన్ని పొందాలని నిన్నే శరణు వేడినాను. అనుగ్రహించగలవాడవు నీవొక్కడవే. ఇట్లాకూడా అన్వయించి చెప్పవచ్చును.



శ్రీః

## 3. ప్రణయప్రసాదస్తోత్రమ్

**శ్లో॥ సదసత్త్వేన భావానాం యుక్తా యా ద్వితయీ గతిః ।**
**తాముల్లంఘ్య తృతీయస్మై నమశ్చిత్రాయ శంభవే ॥ 1**

**ప్రతిపదార్థము :** సత్ + అసత్త్వేన = సత్, అసత్ అను, లేక మంచి – చెడు అను దృష్టితో, భావానామ్ = వస్తువులయొక్క, ద్వితయీ = రెండు విధములైన, గతిః = స్థితి లేక ఉనికి, యా = ఏది, యుక్తా = ఉచితమో, తామ్ = దానిని, ఉల్లంఘ్య = అతిక్రమించి, విడిచి, తృతీయస్మై = మూడవదైనదానికి, చిత్రాయ = ఆశ్చర్యరూపమైన, శంభవే = శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ప్రపంచంలోని వస్తువులను మంచియనీ చెడుఅనీ భేదబుద్ధితో విభజించి చూడటం పరిపాటి. ఇది సముచితంగానే లోకంలో పరిగణింపబడుతుంది. ఈ 'రెండు' అన్న బుద్ధిని విడిచి, మూడవదైన కేవలభావరూపుడైన శంభునకు నమస్కారము.

సాధారణార్థంలో **సత్** అంటే మంచి **అసత్** అంటే చెడు. ఇది లౌకికార్థం. **సత్** అంటే, బ్రహ్మము, సత్యము, ప్రాకృతనామరూపరసగంధాది విభాగము లేనిది, అనిన్నీ; **అసత్** అంటే, బ్రహ్మము కానిది, సత్యము కానిది, ప్రాకృత నామరూపాది విభాగము కలది అనిన్నీ వేదాంతపరమైన అర్థం. కనుక విశ్వం అంతా అసత్ అనబడేది. ఇది **భావానాం** భావములయొక్క లక్షణం. సృష్టిలోని బహుజీవ నిర్జీవ వస్తుజాలమంతా అసత్ అనబడుతుంది. ఈ నామరూపాది ప్రాకృతలక్షణాలు నిజానికి ఉనికి, శాశ్వతత్వం లేని వ్యష్టి లక్షణాలు. లోకం ఈ ద్వంద్వబుద్ధిలోనే జీవిస్తుంది. దీన్ని దాటి, సమష్టిరూపంలో విశ్వం అని వ్యవహరిస్తూన్నాం. ఈ విశ్వభావంలో అన్నిరూపాలూ ఇమిడి ఉన్నాయి,

కాని యే ఒక్కదానికీ ప్రత్యేకార్థంగాని గుర్తింపుగాని లేదు. అన్ని నామాలూ, రూపాలూ, రసాలూ గంధాలూ, వాని వాని మధ్య విరోధాలూ, ఏమీ గుర్తించబడవు. ఆకారవికారాలు సద్దుమణిగిన విశాలప్రశాంతరూపం విశ్వం. ఈ రూపమే శంభుశబ్దానికి సూచ్యార్థరూపం.

**శ్లో॥ ఆసురర్షిజనాదస్మిన్నస్వతంత్రే జగత్త్రయే ।**
**స్వతంత్రాస్తే స్వతంత్రస్య యే తవైవానుజీవినః ॥ 2**

**ప్రతిపదార్థము :** అస్మిన్ = ఈ, అస్వతంత్రే = స్వతంత్రము కానిదైన, జగత్ + త్రయే = మూడు లోకాలలో, ఆసుర + ఋషిజనాత్ = దేవతలు, ఋషులు, మొదలుగా గలవారిలో, తే ఏవ = వారు మాత్రమే, స్వతంత్రస్య = స్వతంత్రులకు, స్వతంత్రాః = స్వతంత్రులు, యే = ఎవరు, తవ = నీయొక్క, అనుజీవినః = భక్తులో.

**తాత్పర్యము :** ఈ జగత్తు అంతా అస్వతంత్రమే. ఇందులో కొంత స్వతంత్రులనదగినవారు జితేంద్రియులైన దేవతలు, ఋషులు. ఇట్టి స్వతంత్రులలోకెల్ల స్వతంత్రులు అనదగినవారు భక్తులు మాత్రమే.

ముల్లోకాలున్నూ కర్మబద్ధములే. కనుక అస్వతంత్రాలు. దేవతలూ ఋషులూ కూడా వారివారి కర్మఫలాలను అనుభవించేవారే, అయినా సాధారణులకంటె కొంత మేలు. కాని భక్తుడు ఈ విభక్తవిశ్వాన్నంతా మరచి భగవదేకపారమ్యంలో జీవిస్తాడు కనుక, స్వతంత్రుడు, భగవంతుడు సర్వతంత్ర స్వతంత్రుడు కనుక.

**శ్లో॥ అశేషవిశ్వఖచితభవద్వపురనుస్మృతిః ।**
**యేషాం భవరుజామేకం భేషజం తే సుఖాసినః ॥ 3**

**ప్రతిపదార్థము :** అశేష = సమస్త, విశ్వ = విశ్వముతో, ఖచిత = పొదుగబడిన, భవద్ = నీయొక్క, వపుః = శరీరముయొక్క, అనుస్మృతిః = సంస్మరణ, భవ = సంసారమను, రుజామ్ = రోగముగలవారికి, ఏకమ్ = ఒకే ఒక, భేషజమ్ = ఔషధము, యేషామ్ = ఎవరికో, తే = వారు, సుఖాసినః = సుఖులు.

**తాత్పర్యము :** సంసారమనేది రకరకాల రోగాలపుట్ట. దీనిలో కొట్టుమిట్టాడేవారికి ఒకేఒక్క ఔషధం నీ స్మరణ. నీ శరీరం విశ్వమయం. కనుక నీ స్మరణలో పరవశించేవారు సుఖులు.

విశ్వమంతా పరమేశ్వరుని శరీరం, విశ్వంలో అంతర్యామిగా ఈశ్వరుడున్నాడు కనుక. ఈ విషయాన్ని స్మృతిలో అనునిత్యమూ గుర్తుంచుకొన్నవారికి ప్రాపంచిక

బాధలుండవు, ఆధివ్యాధులుండవు. లౌకిక జీవితం తాపత్రయంతో నిండినది. ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములు త్రివిధ తాపాలు. ఇవి రోగంవలె మానవుని శరీరాన్ని, మనస్సును, ఆత్మను పీడిస్తాయి. కనుకే వీనిని భవరోగాలు (భవరుజా) అనటం. ఇవి సాధారణ వైద్యులిచ్చే మందులతో అన్నీ తీరిపోవు. ఈశ్వరాంకితబుద్ధితో జీవించే భక్తులకు ఇవి బాధ కలిగించవు. మహాత్ములు తమ జీవితాలలో దీనిని భౌతికంగా ఋజువు చేసినారు. ఉదాహరణ, రామకృష్ణ పరమహంస, వివేకానంద, కంచి పరమాచార్య, మరెందరో. వీరు మాత్రం ఎప్పుడూ సుఖాన్నే అనుభవిస్తారు.

**శ్లో॥ సితాతపత్త్రం యస్యేందుః స్వప్రభాపరిపూరితః ।**
**చామరం స్వర్ధునీస్రోతః స ఏకః పరమేశ్వరః ॥ 4**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనికి, స్వప్రభా = తన కాంతిచే, పరిపూరితః = నిండింపబడిన, ఇందుః = చంద్రుడు, సిత = తెల్లని, ఆతపత్త్రమ్ = గొడుగో, స్వర్ = స్వర్గలోకపు, ధునీ = నదియొక్క, స్రోతః = ప్రవాహము, చామరమ్ = వీవనయో, సః = అట్టి, పరమ + ఈశ్వరః = ఈశ్వరులకీశ్వరుడైనవాడు, ఏకః = ఒక్కడు.

**తాత్పర్యము :** పరమేశ్వరుని తలపై వెలిగే జాబిల్లి ఆయనకు తెల్లని గొడుగు లేక వెల్లగొడుగు; స్వర్గలోకపు మందాకినీ నది ఆయనకు చల్లని గాలివీచే వింజామరము. అట్టివాడు, పరమేశ్వరుడనదగినవాడు ఒక్కడే.

**స్వప్రభాపరిపూరితః** అంటే తన కాంతిచే నింపబడిన, అని అర్థం. అయితే, ఈ **స్వప్రభ,** తన కాంతి, అంటే, అది ఎవరి కాంతి? చంద్రుని కాంతి ఉద్దేశింపబడింది కనుక ఆ వెన్నెల చంద్రునిదే అనవలెనా? అనవచ్చు. కాని, శివుని తలపైనున్నవాడు పూర్ణచంద్రుడు కాడు కనుక, **స్వప్రభా,** తన కాంతి, అంటే శివుని కాంతి, అని కూడా చెప్పవచ్చు. అంటే, శివుని కాంతి చంద్రవంకలో కాంతిని నింపి (పరిపూరితః) వాని పున్నమి వెన్నెలతో సమంగా చేసినది శివుడు, సుఖస్వరూపుడు. చంద్రుడు నిమిత్తకర్తయే. అట్లే **స్వర్ధుని,** గంగానది, వాని శిరస్సుపై నుండి చల్లగాలి వీచే చామరం. శివుడు శంకరుడు, శంభుడు కనుక శాంతుడు, నిర్వికారుడు. ఆయనను చల్లబరచటం ఒక లౌకిక మర్యాద మాత్రమే. అందుకు గంగ నిమిత్తకర్త మాత్రమే. పరమకర్త తానే శివుడు. కనుకే ఆ స్వామి పరముడు. అట్టివాడు మరొకడు లేడు.

ఈ శ్లోకంలోని శబ్దాలకు సాంకేతికమైన తాత్త్వికార్థాలు ఉన్నాయి. వాని దృష్ట్యా తాత్త్వికార్థం ఇట్లా సాధ్యం – **ఇందు** శబ్దానికి ప్రకృతిసంబంధమైన పరిమితరూపం

అన్న అర్థం సాంకేతికం. ఈ అర్థంలో, **స్వప్రభా** అన్నది శివజ్యోతియొక్క ప్రభ. **ప్రభ** అన్నదానికి సాంకేతికంగా చైతన్యతరంగం అని అర్థం. కనుక, ఈ ప్రాపంచికమైన పరిమితరూపాలన్నిటిలో తన చైతన్యతరంగాలను నింపుతూన్న శివుడు ఉద్దేశింపబడినాడు.

అట్లే, **సితాతపత్త్రం** అన్నదానికిన్నీ ఇలా అర్థం చెప్పబడింది. సిత అంటే శివుని శుద్ధరూపం అనిన్నీ, బద్ధరూపం అనిన్నీ చెప్పబడింది. బద్ధరూపం అంటే ప్రాకృతికశరీరాలలో అంతర్యామిగా ఉన్న శివరూపం. దీనికి ఈ ప్రాకృతికశరీరం వలన కలిగే తాపాలను శుద్ధరూపం తొలగిస్తుంది కనుక అది బద్ధరూపానికి **ఆతపత్త్రం** అయింది. ఇట్లా, బద్ధుడూ శివుడే, ఈ బద్ధుని రక్షకుడూ శివుడే.

**స్వర్ధునీస్రోతః** అన్నదానికిన్నీ ఈవిధంగానే అర్థం – **స్వః** అంటే స్వర్గం. స్వర్గం వాచ్యార్థం కాగా నరకం చెప్పకనే చెప్పబడినట్లవుతుంది అన్న న్యాయంలో, స్వర్గనరకాలు రెండూ అర్థంగా స్వీకరింపబడతాయి. స్వర్గప్రాప్తికీ నరకప్రాప్తికీ మూలమైన ధర్మాచరణ, అధర్మాచరణ లక్ష్యార్థమవుతుంది. ఈ ధర్మాచరణాదుల ఫలాలైన స్వర్గనరకాదులను కడిగివేసే శక్తిగల జ్ఞానం లక్షితం. ఇది శివుని చిచ్ఛక్తి. ఈ శక్తి ప్రవాహరూపమైనది కనుక **స్వర్ధునీస్రోతః** అంటే శివుని చిత్‌శక్తి ప్రవాహం **చామరం,** అంటే, మాహాత్మ్యప్రకట హేతువు అవుతుంది.

ఈ తాత్త్వికలక్షణాలు గల ఈశ్వరుడు పరముడు. లోకంలోనూ పరంలోనూ కూడా అన్యమైన అధికారులు, ఈశ్వరులు, ఎందరో ఉన్నారు. వారు పరములు కారు. పరముడైన ఈశ్వరుడు, పై జెప్పిన కారణాల వలన, ఒకే ఒక్కడు, ఆతడే పరమేశ్వరుడు.

ఇట్లా పరమేశ్వరశబ్దసామర్థ్యాన్ని తెలిపే తాత్త్వికార్థం ప్రతిపాదింపబడింది.

**శ్లో॥ ప్రకాశాం శీతలామేకాం శుద్ధాం శశికలామివ ।**
**దృశం వితర మే నాథ కామప్యమృతవాహినీమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** నాథ = స్వామీ!, శశి = చంద్రునియొక్క, కలాం ఇవ = కళనువలె, ప్రకాశామ్ = ప్రకాశము గలిగిన, శీతలామ్ = చల్లని, శుద్ధామ్ = మలినములేని, అమృత = అమృతమును, వాహినీమ్ = వహించునదైన, కాం + అపి = ఏదేని ఒక, ఏకామ్ = ఒకే ఒక, దృశమ్ = దృష్టిని, మే = నాపై, వితర = పడనిమ్ము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ చూపు నాపై నిల్పుము. ఆ చూపు చంద్రకళవలె ప్రకాశిస్తూ, చల్లనిది, పరిశుద్ధమైనది, అమృతమును వర్షించునది కావలె. అమృతం అంటే ఆనందం.

శ్లో॥ త్వచ్చిదానందజలధేశ్చ్యుతాః సంవిత్తివిప్రుషః ।
ఇమాః కథం మే భగవన్నామృతాస్వాదసుందరాః ॥ 6

**ప్రతిపదార్థము :** భగవన్! = భగవంతుడా!, త్వత్ = నీయొక్క, చిత్ + ఆనంద = జ్ఞానానందరూపమైన, జలధేః = సముద్రమునుండి, చ్యుతాః = బయల్పడిన, ఇమాః = ఈ, సంవిత్తి = జ్ఞానముయొక్క, విప్రుషః = బిందువులు, మే = నాకు, అమృత = ఆనందపు, ఆస్వాద = ఆస్వాదనముచే, అనుభవముచే, సుందరాః = శోభించునవి, కథమ్ = ఎట్లు, న = కాదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవు జ్ఞానసముద్రుడవు, ఆనందసముద్రుడవు. నేనాస్వాదించే ఆనందం బిందువే, నాకున్న జ్ఞానమూ బిందువంతే. అయినా అవి నీనుండి లభించినవే కదా, మరి అవి మాత్రం శోభాయమానం కాకుండా ఎట్లా ఉంటాయి.

శివుడు జ్ఞాన, ఆనంద స్వరూపుడు. మానవుడు ఇంద్రియాలద్వారా పొందే జ్ఞానమూ ఆనందమూ అతి స్వల్పమే. అయినాగాని అది కూడా ఆ శివప్రసాదమే కనుక శివశోభ దానిలో కూడా ఉంటుంది. అమృతబిందువుకున్నూ అమృతలక్షణమే ఉంటుంది. ఉప్పునీటి చుక్కకైనా ఉప్పునీటి సముద్రలక్షణమే ఉంటుందికదా.

శ్లో॥ త్వయి రాగరసే నాథ! న మగ్నం హృదయం ప్రభో! ।
యేషామహృదయా ఏవ తేఽవజ్ఞాస్పదమీదృశాః ॥ 7

**ప్రతిపదార్థము :** నాథ = స్వామీ!, ప్రభో = ఓ ప్రభూ!, యేషామ్ = ఎవరియొక్క, హృదయమ్ = హృదయము, త్వయి = నీయందు, రాగరసే = అనురాగమను ఆనందమున, లేక, భక్తియను ఆనందమున, న మగ్నమ్ = మునిగినది కాదో, ఈదృశాః = ఈవిధమైన, అహృదయాః = హృదయము లేనివారైన, తే = వారు, అవజ్ఞా = అవమానమునకు, ఆస్పదం ఏవ = తగినవారే.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎవరి హృదయం మీ యందలి భక్త్యానందమున మునుగదో, అటువంటివారు హృదయమే లేనివారని అవమానమును పొందువారే.

హృదయం ప్రేమ, భక్తి, ఇటువంటి భావాలకు స్థానం. ఇది ఇట్టి భావాలతో సహజంగా నిత్యం మునిగే ఉంటుంది. కాని సాంసారికమైన యీ భావాలకు నిలకడ, ఆలంబన ఉండదు కనుక హృదయమెప్పుడూ డోలాయమానమే. కాని శివభక్తి కలిగితే మాత్రం ఆ ఆనందాస్వాదనం స్థాయీభావాన్ని పొందుతుంది. అప్పుడు భక్తుని హృదయంతో పోలిస్తే లౌకికుని హృదయం ఎప్పుడెక్కడ ఉండేది తెలియదు కనుక

హృదయ స్వరూపం అస్పష్టంగా ఉండి హృదయంలేనితనంతో సమానమవుతుంది.

**శ్లో॥ ప్రభుణా భవతా యస్య జాతం హృదయమేలనమ్ ।**
**ప్రాభవీణాం విభూతీనాం పరమేకః స భాజనమ్ ॥ 8**

**ప్రతిపదార్థము :** భవతా ప్రభుణా = ప్రభువైన తమతో, యస్య = ఎవనియొక్క, హృదయమేలనమ్ = హృదయపు కలయిక, జాతమ్ = కలిగినదో, పరమ్ = కేవలము, సః = ఆతడు, ఏకః = ఒక్కడే, ప్రాభవీణామ్ = ప్రభువుకు సంబంధించిన, విభూతీనామ్ = విభూతులకు, భాజనమ్ = పాత్రుడు.

**తాత్పర్యము :** ఎవని హృదయము ప్రభువైన తమలో లగ్నమైనదో ఆతడు మాత్రమే శివానుభూతులను పొందుటకు తగినవాడు.

**ప్రభు** శబ్దానికి యజమాని అని అర్థం కనుక **ప్రాభవీణాం విభూతీనాం** అంటే యజమానుని సంపదలకు అని అర్థం.

ఒక యజమానికి సేవకులెందరో ఉండవచ్చు, వారి వారి జీతభత్యాలు వారికి సక్రమంగా అందుతూనూ ఉండవచ్చు. కాని ప్రభుకార్యాన్ని ఎవడైతే స్వకార్యంగా భావించి శ్రద్ధగా చేస్తాడో ఆతడొక్కడే ఆ ప్రభువుకు హృదయానికి దగ్గరవాడవుతాడు, ఆతడే యజమానితో ఎప్పుడూ ఉంటాడు కనుక యజమానితోబాటు అన్నీ అనుభవిస్తాడు. మిగత సేవకులు దూరదూరాన ఉండి ఆ సేవకుని భాగ్యానికి ఆశ్చర్యపడతారు. ఇది లౌకికసత్యమూ, ఆధ్యాత్మికసత్యమూ కూడ. భగవంతునికెంత దగ్గరగా పోగలడో భక్తునకంత భగవద్విభూతి కలుగుతుంది, భక్తుడే భగవంతుడిగా ఆరాధింపబడతాడు.

**శ్లో॥ హర్షాణామథ శోకానాం సర్వేషాం ప్లావకః సమమ్ ।**
**భవద్ధ్యానామృతాపూరో నిమ్నానిమ్నభువామివ ॥ 9**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, ధ్యాన + అమృత + ఆపూరః = ధ్యానరూపమైన అమృతప్రవాహము, సర్వేషామ్ = సమస్తమైన, హర్షాణామ్ = సంతోషములకు, అథ = అట్లే, శోకానామ్ = దుఃఖములకు, నిమ్న + అనిమ్నభువామ్ = మెట్టపల్లముల భూమిని, ఇవ = వలె, సమమ్ = ఒకేవిధముగా, ప్లావకః = ముంచివేయునది.

**తాత్పర్యము :** స్వామీ!, నీ ధ్యానం అమృతం. అది ప్రవాహమై, నదీ ప్రవాహం మిట్టపల్లాలను ముంచెత్తి సమం చేసినట్లుగా, అన్నివిధములైన సంతోషాలనూ దుఃఖాలనూ సమం చేస్తుంది.

జీవితం సుఖదుఃఖద్వంద్వంతో కూడినది. కాని శివధ్యానంలో మనస్సు లగ్నం చేయగలవారికి ఆ ధ్యానానందం వెల్లువై లౌకిక జీవన సుఖదుఃఖాలను ముంచివేస్తుంది. ఆ వెల్లువలో మెరకభూమి, పల్లపుభూమి అన్న భేదం వంటి సుఖదుఃఖభేదం నశించి అంతయూ ఆనందసముద్రమైపోతుంది. ఇది ధ్యానలక్షణం. ధ్యానంలో లక్ష్యమైన శివునిపై ఏకాగ్రత కుదిరినపుడు శివానందపారవశ్యం కలుగుతుంది. శివుడు ఆనందమయుడు కనుక ఆ ఆనందం అర్ణవమై అశాశ్వతలోకానుభవాలకు ఉనికే లేకుండ చేస్తుంది.

**శ్లో॥ కేవ న స్యాద్దశా తేషాం సుఖసంభారనిర్భరా ।**
**యేషామాత్మాధికేనేశ! న క్వాపి విరహస్త్వయా ॥ 10**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, తేషామ్ = వారియొక్క, కా + ఇవ దశా = యే దశ, సుఖసంభార = సుఖభాండారముతో, నిర్భరా = పూర్తిగా నింపబడుట, న స్యాత్ = ఉండకపోవును, యేషామ్ = ఎవరియొక్క, ఆత్మ + అధికేన = ఆత్మప్రియుడవైన, త్వయా = నీచేత, క్వా + అపి = యేద్దైనను, విరహః = లేకున్నది, న = కాదో.

**తాత్పర్యము :** ఈశ్వరా! తమ ఆత్మతో సమానముగా నిన్ను ప్రేమించినవారి కెవరికైనా, వారు అన్ని దశలలో నీతో కూడి ఉంటారు కనుక, అన్ని దశలలోనూ సుఖం సంపూర్ణంగా ఉంటుంది.

శివుడు స్వయంగా సుఖస్వరూపుడు కనుక అతడే సుఖభాండారం. ఎప్పుడూ శివసహితుడై ఉండేవారికి ఆ సుఖభాండారం తమ దగ్గర నిండుగా ఉన్నట్లేకదా.

అన్ని దశలూ అంటే, లౌకికమైన వివిధానుభవాలు. కలిమిలేములు, సుఖదుఃఖాలూ, తనవారి ఎడబాటు ఇత్యాదులు. ఈ అనుభవాలు సంసారంలో వచ్చిపోతాయి, కాని శివపరమైన ఆత్మగలవారికి ఈ అనుభవాలు సుఖదుఃఖకారణం కావు. సదా శివునిగూడి యుండే వారికి అద్వితీయమైన సుఖానుభవమే ఉంటుంది.

**శ్లో॥ గర్జామి బత! నృత్యామి పూర్ణా మమ మనోరథాః ।**
**స్వామీ మమైష ఘటితో యత్త్వమత్యంతరోచనః ॥ 11**

**ప్రతిపదార్థము :** త్వమ్ = నీవు, మమ = నాయొక్క, అత్యంత = మిక్కిలి, రోచనః = ఇష్టుడవైన, స్వామీ = స్వామివిగా, ఘటితః = చేయబడితివో, యత్ ఏషః = అను నది ఇది, మమ = నాయొక్క, మనోరథాః = కోరికలు, పూర్ణాః = తీరినవి, బత = ఔరా!, గర్జామి = గర్జించుచున్నాను, నృత్యామి = నాట్యము చేయుచున్నాను.

**తాత్పర్యము :** నీవు నాకు మిక్కిలి ఇష్టుడవైన స్వామివైనావన్న విషయం ఒక అనిర్వాచ్యమైన అనుభవం. నా కోరికలన్నీ తీరినవి. ఆనందాతిరేకంతో కేకలు వేస్తూ నాట్యం చేస్తూ ఉన్నాను.

**శ్లో॥ నాన్యద్వేద్యం క్రియా యత్ర నాన్యో యోగో విదా చ యత్ ।**
**జ్ఞానం స్యాత్ కిన్తు విశ్వైకపూర్ణా చిత్త్వం విజృంభతే ॥ 12**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, దేనియందు, అన్యత్ = వేరొకటి, వేద్యమ్ = తెలియదగినది, న = లేదో, అన్యా = వేరొక, క్రియా = కర్తవ్యము, న = లేదో, అన్యః = మరియొక, యోగః = యోగసాధన, న = లేదో, విదా చ = సంవిత్తుకూడ, న = లేదో, కిన్తు = కాని, యత్ = ఏది, జ్ఞానమ్ = జ్ఞానము, స్యాత్ = అగునో, (తత్ = అది), విశ్వ = విశ్వము, ఏక పూర్ణా = సమస్తము పూర్ణమో, చిత్త్వమ్ = చిత్ తత్త్వము, విజృంభతే = వికసించుచున్నది.

**తాత్పర్యము :** చిత్ తత్త్వము వికసించినప్పుడు, అదే జ్ఞానంలో విశ్వమంతా ఒక్కటే పూర్ణత్వం అనుభూతమవుతుంది. అదికాక తెలియదగినది వేరొకటి ఉండదు, వేరొక కర్తవ్యమూ ఉండదు యోగసాధనా ఉండదు, సంవిత్తున్నూ ఉండదు.

శివుడు జ్ఞానస్వరూపుడు కనుక, శివానుభవం గలిగి శివునిలో జీవించే భక్తునకు వేరుగా తెలిసికొనవలసినదేదీ ఉండదు. శివుడు సుఖస్వరూపుడు, అంటే పరమానంద స్వరూపుడు కనుక శివునితో తన సత్తను నింపికొన్నవానికింక వేరుగా చేయవలసినది వేరేమీ ఉండదు. యోగవిధానములన్నిటికి శివచైతన్యప్రాప్తియే లక్ష్యం కనుక శివయోగికింక వేరుగా సాధనలు పనిలేదు. అంటే, శివాద్వైతజ్ఞానానందానుభవం గలవానికి శివుడు తప్ప వేరుగా యేమీ ప్రకాశింపక శివచేతనుడైపోతాడని భావం. ఎందుచేతనంటే, వానికి పూర్ణత్వం సిద్ధిస్తుంది కనుక. అదెలా సాధ్యమయింది? విశ్వంగా సమస్తజీవులకూ తెలియవచ్చేది, అనుభవం కలిగేది, బహుళత్వం. ఈ నామరూపాది బహుళత్వం శివాగ్నిలో హుతం కాగా, ఆ భక్తునకు దృశ్యమానమూ సక్రియమూ వేద్యమూ సాధ్యమూ అయి భాసించేది శివైక భావన. దీనికే చిత్త్వం అని పేరు. ఆగమం ఇట్లా అంటుంది –

న యోగోఽన్యః క్రియా నాన్యా తత్త్వారూఢా హి యా మతిః ।
స్వచిత్తవాసనాశాన్తౌ సా క్రియేత్యభిధీయతే ॥

సంవిద్ అంటే పూర్ణజ్ఞానం, పూర్ణప్రజ్ఞ.

శ్లో॥ దుర్జయానామనంతానాం దుఃఖానాం సహసైవ తే ।
హస్తాత్పలాయితా యేషాం వాచి శశ్వచ్ఛివధ్వనిః ॥ 13

**ప్రతిపదార్థము :** యేషామ్ = ఎవరియొక్క, వాచి = వాక్కునందు, శశ్వత్ = నిరంతరము, శివధ్వనిః = శివనామము ధ్వనించుచుండునో, తే = వారు, దుర్జయానామ్ = జయించుట కష్టమైన, అనంతానామ్ = అంతులేని, దుఃఖానామ్ = దుఃఖములయొక్క, హస్తాత్ = చేతినుండి, సహసా ఏవ = వెంటనే, యకాయకి, హుటాహుటి, పలాయితాః = పారిపోవజేయబడుదురు, తప్పింపబడుదురు.

**తాత్పర్యము :** ఎవరు ఏమరక ఎల్లవేళల శివనామస్మరణ చేయుచుందురో వారు అజేయమై అనంతమైన దుఃఖములనుండి నేరుగా తప్పింపబడుదురు.

**ఆబ్రహ్మణశ్చ కీటాన్తం న కశ్చిత్ తత్త్వతః సుఖీ** అన్న ఆర్యవాక్కు ననుసరించి బ్రహ్మాది దేవతలుగాని, మానవులుగాని, కీటకపర్యన్తప్రాణులలో యేవిగాని నిజంగా సుఖము నెఱుగవు, లౌకిక బాధలకులోనై దుఃఖించునవే. విశ్వవ్యాప్తమైన ఈ దుఃఖ నివారణకు తగిన ఉపాయం శివనామధ్యానమే. నిరంతరాయంగా శివనామస్మరణతో శివమనస్కులైనవారికి యే బాధలూ చేరువ కావు. బాధలో ఉన్నవారు కూడ బాధావిముక్తులు కాగలరు. **దుఃఖానాం హస్తాత్** అనటంవలన సర్వప్రాణి సాధారణ దుఃఖానుభవమున్నూ, తద్దుఃఖనివారణమున్నూ చెప్పబడినట్లయినది. **శివధ్వనిః** శివనామస్మరణ అన్న వాచ్యార్థంతో బాటు, సాక్షాత్ శివుని ఢమరుధ్వని, శంఖధ్వని అన్న సూచ్యార్థం కలిగి **సహసైవ** అన్నదానికి బలం చేకూరుతుంది.

శ్లో॥ ఉత్తమః పురుషోఽన్యోఽస్తి యుష్మచ్ఛేషవిశేషితః ।
త్వం మహాపురుషస్త్వేకో నిఃశేషపురుషాశ్రయః ॥ 14

**ప్రతిపదార్థము :** యుష్మద్ = నీకు, శేష = మిగిలినవానికి, విశేషితః = విశేషించిన, విశేషముగా, ఉత్తమః = ఉత్తముడైన, పురుషః = పురుషుడు, అన్యః = వేరొకడు, అస్తి = ఉన్నాడు, త్వం తు = నీవేమో, నిఃశేషపురుష = పురుషులందరికీ, ఆశ్రయః = ఆధారమైనవాడవు, ఏకః = ఒక్కడవు, మహాపురుషః = మహాపురుషుడవు.

**తాత్పర్యము :** నీకున్నూ, మిగిలినవారికిన్నీ, విశేషంగా ఉత్తమ పురుషుడింకొకడున్నాడు. నీవేమో పురుషులందరకూ ఆధారమైనవాడవు ఒక్కడవే కనుక మహాపురుషుడవు.

హరి పురుషోత్తముడని ఖ్యాతుడు. ఆతడు నీకంటె భిన్నుడు కాడని **"శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః ।"** ఇత్యాది ఆర్యోక్తులవలన తెలుస్తూన్నది.

శివుడు తమోగుణ ప్రధానుడు, విష్ణువు సత్త్వగుణ ప్రధానుడు, అంటారు కదా, మరి వీరికభేధం ఎట్లా పొసుగుతుంది? అన్నది ప్రశ్న. అయితే, ప్రధానగుణాలు వేరైనా, వాటితోబాటు ద్వితీయ ప్రాధమ్యగుణాలు విష్ణువుకు రజస్తమో గుణాలు కాగా శివునకు సత్వరజోగుణాలు. అవతారాలెత్తి విష్ణువు దుష్టఖండనం చేసే సమయంలో వాని హృదయంలో శివుడే వెలుగుతూంటాడు. ఈ రీతిగా హరి యుష్మచ్ఛబ్దవిశేషితుడు. ఇదికాక, వ్యాకరణం రీత్యా, హరి పురుషోత్తముడు అంటే ఉత్తమపురుషుడు, అస్మచ్ఛబ్దవాచ్యుడు. శివుడు యుష్మచ్ఛబ్దవాచ్యుడు. ఈశ్వరుడు సాక్షి కనుక, కర్త విష్ణువైతే, సాక్షి శివుడవుతాడు. ఇట్లా విష్ణువు యుష్మచ్ఛబ్ద విశేషితుడవుతాడు. కాని, సాక్షియైన ఈశ్వరుడు కర్తా కాడు, భోక్తా కాడు, వీరిద్దరికీ అతీతుడైన సః, అంటే, సర్వనామశబ్దంగా, అతడు, పరుడు, అని అర్థం. కనుకే శివుడు ప్రథమపురుష, మధ్యమపురుష, ఉత్తమపురుష లకు అతీతుడైన మహాపురుషవాచ్యుడు, మహాదేవుడు, మహేశ్వరుడు.

**శ్లో॥ జయన్తి తే జగద్వంద్యా దాసాస్తే జగతాం విభో! ।**
**సంసారార్ణవ ఏవైష యేషాం క్రీడామహాసరః ॥ 15**

**ప్రతిపదార్థము :** జగతాం విభో! = లోకాల ఏలికా!, జగద్ = లోకాలకు, వంద్యాః = పూజనీయులైన, తే = నీయొక్క, దాసాః = దాసులు, భక్తులు, యేషామ్ = ఎవరికి, ఏషః = ఈ, సంసార + అర్ణవః = సంసారము అను సముద్రము, క్రీడా = మనోరంజనమునకైన ఆటకు, మహా = పెద్ద, సరః = సరస్సు (అగునో), తే = వారు, జయన్తి = ధన్యులు.

**తాత్పర్యము :** లోకాలనేలు స్వామీ! లోకపూజ్యులైన నీ భక్తులకు ఎవరికి సముద్రమంతటి ఈ సంసారము కేవలము మనోల్లాసానికై ఆటలాడుకొను సరస్సువలె ఉంటుందో, వారు ధన్యులు.

శివభక్తివలన లోకపూజ్యత కలుగుతుంది. ఆ భక్తిలో పండిపోయిన వారికి సంసారంలో కలిగే కష్టాలు, దుఃఖాలు, అన్నీ ఆటలో వలె మనోరంజకమవుతాయి. మానవుడు తాను నిత్యమూ అనుభవించే బాధలనే యే కథలోనో చదివినప్పుడు, యే నాటకంలోనో చూచినప్పుడు, తనవి కాదనే భావంతో చూచి ఆనందించినట్లు, శివభక్తిలో పండిన మహనీయులు సంసారదుఃఖాలను ఒక మనోరంజకమైన ఆటగా, ఈశ్వరక్రీడగా చూస్తూ శివానందాన్ని అనుభవిస్తూంటారు కనుక వారికి ఈ సంసారమనే సాగరం క్రీడా సరస్సువలె తోస్తుంది. ఈ విషయం **స్పందం**లో ఇలా చెప్పబడింది : **"ఇతి వా యస్య సంవిత్తిః క్రీడాత్వేనాఖిలం జగత్ । సంపశ్యన్.... ॥"** అట్టివారు ధన్యులు.

ఎందుకంటే, ఆ భక్తి కుదరక, సాధారణ ప్రజావాహిని, సంసారసముద్రంలోబడి, సుఖదుఃఖాల అలలపై క్రింద మీదులవుతూంటారు, క్షణికానందాలకోసం అర్రులు చాచుతూంటారు.

**శ్లో॥ ఆసతాం తావదన్యాని దైన్యానీహ భవజ్జుషామ్ ।**
**త్వమేవ ప్రకటీభూయా ఇత్యనేనైవ లజ్జ్యతే ॥ 16**

**ప్రతిపదార్థము :** ఇహ = ఈ విషయంలో, ఇక్కడ, భక్తిమార్గంలో, భవత్ = తమయొక్క, జుషామ్ = భక్తిలో తృప్తులై ఆనందించువారికి, తావత్ = నిజముగా, అన్యాని = ఇతరములైన, దైన్యాని = దైన్యములు, ఆసతామ్ = విశ్రమించుగాక!, త్వం + ఏవ = నీవుమాత్రమే, ప్రకటీభూయాః = ప్రకటమవుదువుగాక, ఇతి = అని, అనేన + ఏవ = దీనిచేతనే, తైః = వారిచేత, లజ్జ్యతే = లజ్జింపబడుచున్నది.

**తాత్పర్యము :** నీ భక్తిలో తత్పరులై సంతుష్టులైయున్నవారికి, నీ దర్శనాభిలాషదప్ప వేరొక కోరిక ఉండదు. మిగత కోరికలు విరమించును.

మానవునకు అన్నవస్త్రధనములాదిదైన్యములు లెక్కకు మిక్కిలిగా ఉండటం సహజం. ఇవికాక, కామ్యభక్తులకు ప్రత్యేకమైన అనూహ్యమైన కోరికలున్నూ ఉండటం పురాణప్రసిద్ధమే. శక్తిసాధనలో కొందరు అణిమాది సిద్ధులను కోరేవారూ ఉంటారు. కాని శివతత్పరులైనవారిలో ఇవన్నీ విరమించి, శివసాక్షాత్కారం కావాలన్న కోరిక ఒక్కటే మిగిలి ఉంటుంది.

**శ్లో॥ మత్పరం నాస్తి తత్రాపి జాపకోఽస్మి తదైక్యతః ।**
**తత్త్వేన జప ఇత్యక్షమాలయా దిశసి క్వచిత్ ॥ 17**

**ప్రతిపదార్థము :** మత్‌పరమ్ = నాకంటె వేరైనది, న అస్తి = లేదు, తత్ర + అపి = అట్టి సందర్భంలో కూడా, జాపకః = జపము చేయువాడను, అస్మి = అగుచున్నాను, తత్ = ఆ కారణముగ, ఐక్యతః = ఐక్యత వలన, తత్త్వేన = తత్త్వదృష్టితో, జపః = జపము, ఇతి = అని, క్వచిత్ = ఒకానొక సత్యమును, అక్షమాలయా = రుద్రాక్షమాలను ధరించుటచే, దిశసి = ఉపదేశించుచున్నావు.

**తాత్పర్యము :** నాకంటె వేరేదీ లేదు, అయినప్పటికిన్నీ నేను జపం చేస్తూన్నాను. ఈ జపం ఎవరి గురించి? ఎందుకు? అన్న ప్రశ్నలు మీకు రావాలనీ, సమాధానాలు తెలిసికొని మీరు కూడా జపించవలెననిన్నీ, ఈ రుద్రాక్షమాలను ధరించినానని మాకు ఉపదేశించుటకు నీకీ రుద్రాక్షమాలాధారణ.

**మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ ।** అన్న భగవద్గీత సప్తమాధ్యాయ సప్తమశ్లోక తాత్పర్యమిక్కడ స్మరించవచ్చు. అట్లే తృతీయాధ్యాయం, 22, 23 శ్లోకాలనూ అనుసంధానం చేసికొనవచ్చు :

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥

మూడు లోకాలలో నేను కర్మాచరణంతో పొందవలసింది లేదు. కాని నేను కర్మచేయకున్న లోకులు నన్ను అనుసరించగలరు.

శివుడు కూడ ఇదే సందేశాన్నివ్వటానికే రుద్రాక్షజపమాలను ధరించటం. జపం కూడా కర్మయే. దైవసాక్షాత్కారం కర్మద్వారా సాధించవలసినదే. శివకేశవులిద్దరూ సృష్టికర్మలో చొరబడినవారే. తమలోనుండి సృష్టిరూపంలో వెలువడిన జీవాత్మలు మరల పరమాత్మతో అనుసంధానం కావటానికి, పరమాత్మానుభవం పొందటానికి సాధనం కర్మయే. నానాత్వమూ, జననమరణాది అశాశ్వతత్వానుభవమూ రూపంలో మాయావృతమైన జీవులు (పశువులు) మరల పశుపతిని పొందేందుకు విడుదల లభించేది కర్మద్వారముననే. దీని ఉపదేశం కోసమే శివుని జాపకవేషం.

తత్త్వం అన్నది పదార్థశక్తుల సత్యస్వరూపదర్శనమే. ఆ దర్శనానికి సాధనం జపం అనబడే కర్మ.

శివుని అనేక రూపాలలో భక్తులు దర్శించి అర్చిస్తూంటారు. ఈ నానాత్వం ఇహలోక నానాత్వం వంటిదే అనిన్నీ, శివుడు ప్రాకృతుడే అనిన్నీ భక్తిమార్గంలోని వారు కూడ భావించే ప్రమాదమున్నది. శివధ్యానానికి ఆలంబనమైన మూర్తి యేదైనప్పటికిన్నీ శివుడొక్కడే అన్న సత్యమే ఐక్యత. దీనిని బోధించటానికే శివుని రుద్రాక్షమాలాధారణ, జాపకవేషం, జపకర్మ.

**శ్లో॥ సతోఽవశ్యం పరమసత్సచ్చ తస్మాత్పరం ప్రభో ।**
**త్వం చాసతస్సతశ్చాన్యస్తేనాసి సదసన్మయః ॥ 18**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ స్వామీ!, అసత్ = అసత్తు, అవశ్యమ్ = తప్పక, సతః = సత్తుకంటె, పరమ్ = వేరైనది, సత్ చ = సత్తుకూడ, అస్మాత్ = దానికంటె, అసత్తుకంటె,

పరమ్ = వేరైనది, త్వం చ = నీవన్ననో, అసతః = అసత్తుకంటె, సతః చ = సత్తుకంటెను కూడ, అన్యః = వేరైనవాడవు, తేన = దానిచే, సత్ + అసత్ + మయః = సత్తు – అసత్తుల రెండిటి రూపమైనవాడవు.

**తాత్పర్యము :** సత్తు అసత్తు అనునవి పరస్పరం భిన్నమైనవి. నీవు సదసత్తుల రెండిటికంటె భిన్నుడవు. అందుచేతనే, సత్తువు నీవే, అసత్తువూ నీవు అగుచున్నావు.

**సత్** (సత్తు) ఉనికి, సత్యము, మంచిది. ఉనికి గల సత్యము పరబ్రహ్మ. **"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్"** అనిన్నీ, **"అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః"** అనిన్నీ శ్రుతి. ఇది కాలాతీతమైనది, గుణాతీతమైనది. ఇది అవ్యక్తమైన పరబ్రహ్మము. **అసత్** (అసత్తు) ఉనికి లేనిది, త్రికాలముల భేదముచే, నామరూపాది భేదములచే నెఱుగదగిన త్రిగుణాత్మకమైన సృష్టి. ఇది వ్యక్తపరబ్రహ్మము.

దీనినిబట్టి పరమాత్మ సదసన్మయుడు, వ్యక్తావ్యక్తనామరూపగుణములు కలవాడే కాని అదేదియు తాను కానివాడు. అన్నీ తానైనది, ఇది మాత్రమే తానని చెప్పరానిది. ఆకాశకుసుమం అంటే ఆకాశమా? కుసుమమా? రెండూనా? ఈ ఏదీ కానిది, అన్నిటా ఉన్నది కదా. అట్లే, పరబ్రహ్మ వ్యక్తము, అవ్యక్తమూ, వ్యక్తావ్యక్తమూ, ఇవేమీ కానిదీ కూడా.

**శ్లో॥ సహస్రసూర్యకిరణాధికశుద్ధప్రకాశవాన్ ।**
**అపి త్వం సర్వభువనవ్యాపకోఽపి న దృశ్యసే ॥ 19**

**ప్రతిపదార్థము :** సహస్ర = వెయ్యిమంది, సూర్య = సూర్యులయొక్క, కిరణ = కిరణములకంటె, అధిక = ఎక్కువైన, శుద్ధ = నిర్మలమైన, ప్రకాశవాన్ = ప్రకాశము గలవాడవు, అపి = అయినను, సర్వ = అన్ని, భువన = లోకాలలో, వ్యాపకః = వ్యాపించినవాడవు, అపి = అయినను, త్వమ్ = నీవు, న దృశ్యసే = కనిపించకున్నావు.

**తాత్పర్యము :** వెయ్యి మంది సూర్యుల వెలుగుకంటే మించి వెలిగే శుద్ధ తేజశ్శాలివి; అన్ని లోకాలలో వ్యాపించియున్నవాడవు. అయినప్పటికిన్నీ నీవు దృగ్గోచరము కావు.

వెలుగుయొక్క లక్షణం ప్రకటించటం : తాను ప్రకటమవుతూనే సమస్తాన్నీ ప్రకాశింపజేస్తుంది. తానూ కనబడుతుంది, ఉనికి గలవాని నన్నిటినీ కనబడేటట్లు చేస్తుంది. శివుని తేజస్సు జ్ఞానకాంతి, కనుక శుద్ధం. మాలిన్య స్పర్శ ఉంటే, అది అజ్ఞానం అవుతుంది కదా. అయినా శివుడు కనబడుటలేదు.

అంతటా వ్యాపించినవాడు అన్నిటా కనబడవలెకదా! ఐనా కనబడడు. ఈ కనబడకపోవటానికి కారణం, జ్ఞానకాంతిని చూడగల చర్మచక్షువులు లేకపోవటం. శివుడు యోగదృష్టికిమాత్రమే సాక్షాత్కరించేవాడు, మాయచే కప్పబడిన సాధారణదృష్టికి, అవగాహనకు అందేవాడు కాడు.

**శ్లో॥ జడే జగతి చిద్రూపః కిల వేద్యోఽపి వేదకః ।**
**విభుర్మితే చ యేనాసి తేన సర్వోత్తమో భవాన్ ॥ 20**

**ప్రతిపదార్థము :** యేన = దేనిచే, కిల = నిజముగా, జడే = నిర్జీవమైన, జగతి = జగత్తులో, చిద్ + రూపః = చేతనస్వరూపుడవు, వేద్యః అపి = తెలియదగినవాడవు, వేదకః = తెలియజేయువాడవు, మితే చ = పరిమితమైనవాడవు గూడ, విభుః = వ్యాపించినవాడవు, అసి = అయియున్నావో, తేన = దానిచే, భవాన్ = తమరు, సర్వ + ఉత్తమః = అందరికంటె ఉత్తములు.

**తాత్పర్యము :** నిర్జీవపదార్థరాశిలో పరిమితుడవై వ్యాపించి, చేతనస్వరూపంతో తెలియదగినవాడవు, తెలియజేయువాడవుగూడ నీవై ఉన్నందున నీవు అందరికంటె ఉత్తముడవు.

సృష్టిలో చేతనను తీసివేస్తే మిగిలేది అచేతన పదార్థం. ఈ చేతనరూపంలో శివుడు పదార్థంలో వ్యాపించినందువలన అపరిమితుడైన తాను పరిమితుడై పశుపక్షి క్రిమికీటనరాది ప్రాణులలోనూ, ప్రాణం లేని సికతశిలాది పదార్థములలోను రూపుదాల్చి యున్నాడు. ప్రకృతిలోని ఈ ఉపదేశకతత్త్వంవలన బుద్ధిజీవులకు శివుని ఉనికి తెలియవస్తూన్నది. కనుకే వేద్యుడు, వేదకుడూ శివుడైనాడు. లేకుంటే వాని గురించి తెలిపేవాడూ లేడూ తెలుసుకునే మార్గమూ లేదు. అవ్యయుడైన ప్రభువు తానే జ్ఞానవిషయమూ, జ్ఞానమూ, జ్ఞానదాతా అయినాడు కనుక సర్వోత్తముడనటం.

**శ్లో॥ అలమాక్రందితైరన్యైరియదేవ పురః ప్రభోః ।**
**తీవ్రం విరౌమి యన్నాథ! ముహ్యామ్యేవం విదన్నపి ॥ 21**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, అన్యైః = ఇతరములైన, ఆక్రందితైః = ఏడ్పులతో, అలమ్ = చాలును, ఇయత్ ఏవ = ఇంతమాత్రము, ప్రభోః = ప్రభువుయొక్క, పురః = ఎదుట, తీవ్రమ్ = బిగ్గరగా, విరౌమి = అరచి చెబుతూన్నాను, యత్ = అదేమంటే, ఏవమ్ = ఈవిధంగా, విదన్ = తెలిసియుండి, అపి = కూడ, ముహ్యామి = నేను మోహములో పడుచున్నాను.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఇతరమైన ఏడ్పులింక చాలు. ఇంతమాత్రం ప్రభువు నెదుర ఎలుగెత్తి చెబుతూన్నాను. అదేమంటే, ఈ విషయం తెలిసికూడ నేను మోహంలో పడుతూన్నాను.

ఇతరమైన యేడ్పులు అంటే లౌకికబాధలతో, కోరికలతో దేవునకు చేసే ప్రార్థనలు. ఈ యేడ్పులు చాల చిన్నవిషయాలు. వీటినట్లా ఉంచితే, అన్నిటికంటె ముఖ్యమైన, తీరని యేడ్పున్నది. అదేమంటే, లోకం తీరూ, శివుని తీరూ తెలిసికూడా మాటిమాటికి తాను, తానే కాదు అందరున్నూ, మోహంలో పడుతూన్నారు.



శ్రీః

# 4. సురసోద్బలస్తోత్రమ్

**శ్లో॥ చపలమసి యదపి మానస! – తత్రాపి శ్లాఘ్యసే యతో భజసే ।**
**శరణానామపి శరణం – త్రిభువనగురుమంబికాకాన్తమ్ ॥ 1**

**ప్రతిపదార్థము :** మానస = ఓ మనసా!, చపలమ్ = నిలుకడలేనిదానవు, అసి = అగుచున్నావు, యత్ + అపి = అన్నది యేదో అది అట్లైనను, తత్ర + అపి = ఆ విషయంలో కూడ, శ్లాఘ్యసే = మెచ్చదగినదానవు, యతః = ఏ కారణమువలన, శరణానాం + అపి = రక్షకులకు సైతము, శరణమ్ = రక్షకుడైన, త్రిభువనగురుమ్ = ముల్లోకములకు స్వామియైన, అంబికా = పార్వతీదేవియొక్క, కాన్తమ్ = మగనిని, భజసే = భజించుచున్నావు.

**తాత్పర్యము :** ఓ మనసా! నీవు చంచలమైనదానవు. ఐనను, మెచ్చదగినదానవు. ఎందుకంటే, రక్షకులకు రక్షకుడు, మూడు లోకాలకు ప్రభువు, పార్వతీపతిని సేవిస్తూన్నావు.

చంచలం కనుక మనస్సు అనేక విషయాలపై లౌకికంగా తిరుగుతూంటుంది. ఐనప్పటికీ, ఆ చంచలత్వపు చర్యలలో భాగంగానే, శివనామస్మరణ, ఆలయంలో శివదర్శనం, శివభక్తదర్శనం, ఇట్లాంటి శివస్పర్శతో పునీతమవుతూన్నావు. చాపల్యంతోనైనా ఆ స్వామి ప్రభుతను అంగీకరించి, పరశరణ్యుడా శివుడే అని ప్రవర్తించినావు. అందుకు నిను మెచ్చవలసినదే సుమా!

**శ్లో॥ ఉల్లంఘ్య వివిధదైవత – సోపానక్రమముపేయ శివచరణాన్ ।**
**ఆశ్రిత్యాప్యధరతరాం భూమిం – నాద్యాపి చిత్రముజ్ఝామి ॥ 2**

**ప్రతిపదార్థము :** వివిధ = అనేకవిధములైన, దైవత = దేవతలయొక్క, సోపానక్రమమ్ = మెట్లవరుసలను, ఉల్లంఘ్య = దాటి, ఉపేయ = చేరదగిన, శివచరణాన్ = శివుని పాదములను, ఆశ్రిత్య అపి = ఆశ్రయించి కూడ, అద్య + అపి = ఇప్పటికిని, అధరతరాం భూమిమ్ = అధమాధమమైన అవస్థను, న ఉజ్ఝామి = విడువకున్నాను, చిత్రమ్ = ఏమాశ్చర్యము!

**తాత్పర్యము :** ఎందరో దేవతలున్నారు, శక్తిలో హెచ్చుతగ్గులతో మెట్లవరుసవలె. వీరందరినీ దాటి శివచరణాల నాశ్రయించినాను. ఎందుకంటే, ఆశ్రయింపదగినవి శివచరణాలే కనుక. అయినాగాని, అదేమి చిత్రమో!, అధమాధమ లౌకికావస్థను మాత్రం విడువలేకున్నాను.

బ్రహ్మ – విష్ణు – రుద్ర – ఈశ్వర – సదాశివ – శివ, ఈ రూపాలు సోపానక్రమం. వీనిలో పైమెట్టు శివుడు. మెట్లున్నంతవరకు పైకి, పైపైకి ఎక్కవలె నన్నదే లక్ష్యం. లౌకికజీవితంలోనైనా లేక పారలౌకికజీవితంలోనైనా ఇదే నియమం. అయితే ఎక్కటానికి సాధనాలైన మెట్లే దిగటానిక్కూడ సాధనాలవుతాయి. ఎక్కినవాడు దిగరాదన్నది కూడ నియమమే. అయినా, మానవచరిత్ర మొత్తం ఎగుడు దిగుడులే కదా! పైనున్నవాడికి పతనం భయపెడుతూ ఉండటం సహజం. అందుకే నేలను విడువలేకపోతూన్నానని కవి విలాపం. నిమ్నభూమికి ఆకర్షణ అధికం.

**శ్లో॥ ప్రకటయ నిజమధ్వానం – స్థగయ తరామఖిలలోకచరితాని ।**
**యావద్భవామి భగవం – స్తవ సపది సదోదితో దాసః ॥ 3**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ స్వామీ!, యావత్ = ఎంతవరకు, తవ = నీయొక్క, సదా = ఎల్లవేళల, ఉదితః = తత్పరతగల, దాసః = సేవకుడను, సపది = సత్వరం, భవామి = అగుచున్నానో, నిజమ్ = నాదైన, అధ్వానమ్ = లోకములయొక్క, లేక, లౌకిక, చరితాని = వ్యవహారములను, తరామ్ = పూర్తిగా, స్థగయ = స్తంభింపజేయుము, నశింపజేయుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నేనెంతవరకు శివతత్పరతగల శివదాసుడనో అంతవరకు నా శాక్తేయమార్గాన్ని ప్రకటంగా వెలుగొందనిమ్ము, అంతవరకు లౌకిక వ్యాపారములన్నిటిని స్తంభింపజేయుము, నశింపజేయుము.

**అఖిలలోకచరితాని** అనటం లౌకికపారలౌకికచరితలని భావం. ఒక్క శాక్తేయమార్గాన్ని మాత్రమే స్ఫురింపజేయుమని ప్రార్థన.

**శ్లో॥ శివ! శివ! శంభో! శంకర! - శరణాగతవత్సలాశు కురు కరుణామ్ ।**
**తవ చరణకమలయుగళ - స్మరణపరస్య హి సంపదోఽదూరే ॥ 4**

**ప్రతిపదార్థము :** శివ = కళ్యాణస్వరూపా!, శివ = ఓ శివా!, శంభో = ఓ శాంతిదాయకా!, శంకర = ఓ సుఖప్రదా!, శరణాగతవత్సల = శరణన్నవారిని తల్లివలె రక్షించువాడా!, ఆశు = సత్వరం, కరుణామ్ = కరుణను, కురు = చూపుము, హి = ఏలనగా, తవ = నీయొక్క, చరణకమలయుగళ = చరణములను పద్మముల జంటను, స్మరణపరస్య = స్మరించుటలో తత్పరుడైనవాని, సంపదః = సంపదలు, అదూరే = చేరువయందే.

**తాత్పర్యము :** కళ్యాణరూపా! శాంతిదాయకా! సుఖప్రదా! శరణన్నవారిని తల్లివలె కాపాడువాడా! శివా! దయజూపుము. నీ పాదపద్మధ్యానపరులకు సంపదలు దూరం కావు కదా.

**తవ చరణకమలయుగలం** అన్నది సాంప్రదాయికంగా, జ్ఞానము, క్రియా అనబడునవి. **సంపదలు,** సందర్భోచితంగా, పరమానందమునకు సంకేతములు.

**శ్లో॥ తావకాంఘ్రికమలాసనలీనా - యే యథారుచి జగద్రచయన్తి ।**
**తే విరించిమధికారమలేనా- లిప్తమస్వవశమీశ! హసన్తి ॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, తావక = నీయొక్క, అంఘ్రి = పాదములరూపమున నున్న, కమల = పద్మముల, ఆసన = స్థానమున, లీనాః = సుఖమున్నవారు, యథారుచి = తమ అభిరుచి ప్రకారము, జగత్ = జగత్తును, యే = ఎవరు, రచయన్తి = రచించుచున్నారో, తే = వారు, అధికార = అధికారమున కలుగు, మలేన = వికారముచే, ఆలిప్తమ్ = మొదలంట పూతపూయబడిన, అస్వవశమ్ = పరాధీనుడైన, విరించిమ్ = బ్రహ్మను, హసన్తి = అపహాస్యము చేయుచున్నారు.

**తాత్పర్యము :** ఈశ్వరా! నీ పాదపద్మములపై మనస్సును లీనము చేసి ఎవరు జగత్తును తమకు రుచించినట్లు రచించుకొనుచున్నారో, వారు, అధికారవికారమనే పూతబూసికొని, పరాధీనుడైన బ్రహ్మను జూచి నవ్వుచున్నారు.

ఎంత గొప్పగా కన్పించినప్పటికిన్నీ, బ్రహ్మదేవుని అధికారము జీవుల కర్మఫలముననుసరించి, దానికి లోబడవలసినదే. సుకృతికి దుష్కర్మఫలభోగమునుగాని,

లేక, దుష్కృతికి సత్కర్మఫలభోగమును గాని బ్రహ్మ విధించి సృష్టిచేయలేడు. కనుక ఆతడు పరాధీనుడు. స్రష్టయను అధికారముద్రవలన తానే ఆయా జీవుల సుఖదుఃఖములకు కర్తయన్నట్లు ఒక వికారమునకు లోనగుట సహజము. కాని పరమేశ్వర పాదపద్మములపై మనసుంచిన భక్తులు తాదాత్మ్యమున ఈ నామరూపగుణప్రాకృత జీవులలో శివత్వమును మాత్రమే దర్శించి నిర్మలులై ఆనందైకజగత్తును తమ ఇచ్చ వచ్చినట్లు సృజించుకొందురు. వారు శివమయులు కనుక నిర్వికారులు, స్వతంత్రులు. బ్రహ్మసృష్టిలోని వికారములను చూచి నవ్వుకొందురు.

**తావకాంఘ్రికమలాసనలీనా** అనుటలో శివభక్తుల బ్రహ్మత్వము ప్రదర్శింపబడినది. **కమలాసనా** అంటే బ్రహ్మకదా, ఆ బ్రహ్మలో లీనాః అంటే బ్రహ్మత్వమును పొందినవారు. వీరు కేవల బ్రహ్మలు కారు, శివబ్రహ్మలు, ఆనందబ్రహ్మలు, బ్రహ్మానందమయులు. **యథారుచి** అనటం ఆ శివభక్తుల స్వాతంత్ర్యమును స్వేచ్ఛను ప్రకటించటం.

**శ్లో॥ త్వత్ప్రకాశవపుషో న విభిన్నం – కించన ప్రభవతి ప్రతిభాతుమ్ ।**
**తత్సదైవ భగవన్! పరిలబ్ధోఽసీశ్వర! ప్రకృతితోఽపి విదూరః ॥ 6**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ దేవా!, త్వత్ = నీయొక్క, ప్రకాశవపుషః = తేజశ్శరీరము కంటె, విభిన్నమ్ = వేరయిన, కించన = ఏదైన, ప్రతిభాతుమ్ = వెలుగులీనుటకు, న ప్రభవతి = సమర్థము కాదు, తత్ = ఈ కారణాన, ఈశ్వర = ఓ స్వామీ!, ప్రకృతితః = స్వభావముచేత, విదూరః అపి = విశేషదూరము అయినప్పటికి, సదా + ఏవ = ఎల్లప్పుడును, పరిలబ్ధః = పొందబడినవాడవు, అసి = అగుచున్నావు.

**తాత్పర్యము :** దేవా, ఈశ్వరా! నీవు స్వరూపగోపనంద్వారా స్వభావసిద్ధంగా దుర్లభమైనవాడవు. అయినప్పటికి నీవు నాబోటివారికి లభిస్తూనే ఉన్నావు. నీ ప్రకాశమాన శరీరంకంటె భిన్నమైనది యే ఒక్కటిగాని నామరూపాలు దాల్చి జన్మించినది లేదు.

జీవునిలో దాగియున్న ఈశ్వరుని జీవుడు గుర్తించలేడు. ఇది వాని అశక్తతే తప్ప నిజానికి శివుడు దాగటం కాదు. అయినా, దేవుడు ఎక్కడో దాగియున్నాడని జీవుడు భావిస్తూంటాడు. ఇది ఆ దేవుని స్వభావమనిన్నీ భావిస్తాడు. తనకాదేవుడు దూరంగా ఉన్నాడనుకుంటాడు. ఇది అంతా జీవుని భావన. ఇది అజ్ఞానజన్యం.

శివుని తేజోమయరూపం దాచినా దాగేది కాదు. అంతటా చరాచరప్రకృతిలో ప్రకాశిస్తూనే ఉన్నది. ఈ విశ్వం అంతా ఆ పరమేశ్వరుని శరీరమే. జీవులందరిలో

చైతన్యరూపుడై వెలిసినది ఆ దేవుడే. కనుక "భావము లోన బాహ్యము నందున" గోప్యంగానూ కట్టెదుట కనిపిస్తూనూ ఉన్నది ఆ దైవమే. ఎంతో దూరాన ఉన్నా డనుకునేవాడు నిజానికి అన్నిటికంటె దగ్గరవాడు.

ప్రకృతిలో జీవించే జీవుడు మాత్రం తనకు దేవుడు చాల దూరంలో ఉన్నాడన్న భ్రాంతిలో ఉంటాడు. ఆ భ్రాంతి తొలిగిపోతే సత్యం గోచరిస్తుంది. **"సర్వమయో జీవః, భోక్తైవ భోగ్యభావేన సదా సర్వత్ర సంస్థితః"** ఇత్యాది స్పందవాక్యాలు స్మరణీయాలు.

**శ్లో॥ పాదపంకజరసం తవ కేచిద్ - భేదపర్యుషితవృత్తిముపేతాః ।**
**కేచనాపి రసయన్తి తు సద్యో - భాతమక్షతవపుర్ద్వయశూన్యమ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** కేచిత్ = కొందరు, భేద = భేదరూపమైన, పర్యుషిత = నీరసమైన, వృత్తిమ్ = వృత్తి లేక బుద్ధితో, ఉపేతాః = కూడినవారై, తవ = నీయొక్క, పాదపంకజ = పాదపద్మముల, రసమ్ = ఆనందమును, అమృతమును, రసయన్తి = ఆస్వాదించు చున్నారు, కేచన + అపి = మరి కొందరేమో, సద్యః = వెంటనే, భాతమ్ = ప్రకాశించి ప్రకటమైన, అక్షత = నిరంతర నిరంతరాయమైన, మొక్కవోని, వపుః + ద్వయశూన్యమ్ = రెండు తనువులు లేనట్టిదానిని.

**తాత్పర్యము :** కొందరు భేదబుద్ధిగలవారై నీయందలి భక్తితో ఆనందాన్ని పొందుతూ ఉంటారు. మరికొందరు భేదబుద్ధి లేనివారై సూటిగా, మరే మాధ్యమం లేకుండ, శివానందాన్ని పొందుతూంటారు.

భక్తులందరూ ఒకే స్థాయికి సంబంధించినవారు కారు. కొందరు భక్తులు జ్ఞాననిష్ఠులై, మరికొందరు క్రియానిష్ఠులై, ఇట్లా ద్వైతనిష్ఠతో, పూజావిధానాన్ని అనుసరిస్తూ, అందులో ఆనందాన్ని పొందుతారు. మరికొందరు మహాత్ములవలన శక్తిపాతంతో పవిత్రీకరింపబడి, జ్ఞానక్రియాదుల నధిగమించి, సద్యః స్వరూపానందంలో మునిగిపోయి శివాద్వైతాన్ని సిద్ధింపజేసికొంటారు.

**శ్లో॥ నాథ! విద్యుదివ భాతి విభాతే - యా కదాచన మమామృతదిగ్ధా ।**
**సా యది స్థిరతరైవ భవేత్తత్ - పూజితోఽసి విధివత్కిముతాన్యత్ ॥ 8**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, అమృతదిగ్ధా = పరమానందంతో మత్తిల్లిన, యా = ఏ, తే = నీయొక్క, విభా = తేజస్సు, కదాచన = ఎప్పుడైన, మమ = నాకు, విద్యుద్ + ఇవ = విద్యుత్తువలె, భాతి = ప్రకాశించునో, సా = అది, స్థిరతరా ఏవ = మరింత స్థిరమైనదే, భవేత్ యది = అయినట్లయిన, తత్ = అది, విధివత్ = విధివిధానముగా,

పూజితః = పూజింపబడిన వాడవు, అసి = అగుచున్నావు, కిం ఉత అన్యత్ = అది కాక మరేమి?

**తాత్పర్యము :** ఓ స్వామీ! పరమానందమయమైన నీ తేజస్సు ఎప్పుడైన నాకు విద్యుల్లతవలె ప్రకాశించి, అది నిలుకడగలదే అయినట్లయిన, అందుమూలముగా నీవు విధిని తప్పక పూజలందినవాడవే అవుతూన్నావు. అంతగాక మరేమిటి?

ఇక్కడ చెప్పబడిన శివానందానుభవము మెఱుపు వంటిది. ధ్యానంలో ఎప్పుడో అట్లా మెఱిసి ఇట్లా మాయమయ్యేది. ఒకవేళ ఎప్పుడైనా ఆ ఆనందం మరింత స్థిరమై నిలుకడగా ఉంటే, నిత్యమైతే, అప్పుడు స్వామికి జ్ఞానక్రియాకలాపాల విధిననుసరించి పూజ జరిగినట్లే అవుతుంది. ఎందుకంటే, ఫలం దక్కింది, అంటే అర్థం, కర్తవ్యం నిర్వహించబడింది అనే కదా!

**శ్లో॥ సర్వమస్యపరమస్తి న కించిద్ – వస్త్వవస్తు యది వేతి మహత్యా ।**
**ప్రజ్ఞయా వ్యవసితోఽత్ర యథైవ – త్వం తథైవ భవ సుప్రకటో మే ॥ 9**

**ప్రతిపదార్థము :** వస్తు = వస్తువు, సత్తు, యది వా = లేకుంటే, అవస్తు = వస్తువు కానిది, అసత్తు, సర్వమ్ = సమస్తము, అసి = నీవైయున్నావు, అపరమ్ = వేరొకటి, కించిత్ = ఏదియు, న అస్తి = లేదు, ఇతి = అని, మహత్యా = గొప్పదైన, ప్రజ్ఞయా = బుద్ధిచే, యథా ఏవ = ఎట్లయితే, అత్ర = లోకంలో, త్వమ్ = నీవు, వ్యవసితః = నిశ్చయింపబడితివో, తథా ఏవ = అట్లే, మే = నాకు, సుప్రకటః = చక్కగా ప్రకాశించు వాడవు, భవ = కమ్ము.

**తాత్పర్యము :** సర్వము నీవే.వేరొకటేదియు లేదు, వస్తువుగాని అవస్తువుగాని లేదు. అని ఇట్లు లోకంలో నిశ్చిత జ్ఞానమేది ఉన్నదో, అదే నాకు చాలు. అట్లే నాకు ప్రకటముగమ్ము.

**వస్తువు** అంటే వాస్తవమైనది. వస్తుసంబంధమైనదే వాస్తవము. అంటే ఉనికి శాశ్వతమైనది వస్తువు. ఆ శాశ్వతత్వం వాస్తవం. దీనినే వేదాంతపరిభాషలో సత్తు (సత్) అంటారు. సత్ అంటే ఉనికి, సత్యం, మంచిది. ఇది శివుడు. అంటే పరమాత్మ, బ్రహ్మము అనబడే మూలశక్తి, మూలపదార్థం. **అవస్తువు** అంటే, వస్తువు లక్షణాలతో ప్రకాశిస్తూ అశాశ్వతమైనది. ఉనికి అశాశ్వతం, సత్యత అశాశ్వతం, మంచి (సద్గుణం) అశాశ్వతం. ఇట్లాంటిది **అసత్తు.** ఇదే ప్రకృతి. ఇది కూడ శివప్రకాశమే. మూలపదార్థానికి, శక్తికి వ్యాపకరూపం, పరిమితం, శుద్ధం కానిది, వికారములు గలది. లోకంలో ఇట్లా

రెండిటా, ద్వైతభావంలోనూ అద్వైతభావంలోనూ కూడా, వ్యక్తవిశ్వంగానూ, అవ్యక్తబ్రహ్మంగానూ కూడా ఉన్నదంతా శివప్రజ్ఞ, శివప్రకాశం అని మహాత్ములు అనుభూతిపూర్వకంగా ప్రకటించినారు. అంతమాత్రము ఎఱుక నాకు చాలును, అంటూన్నాడు భక్తకవి. జ్ఞానక్రియలనబడు ఈ రెండు నీ చరణాలు. వాని సేవ నాకు చాలును అని భావము.

**శ్లో॥ స్వేచ్ఛయైవ భగవన్నిజమార్గే – కారితః పదమాహం ప్రభుణైవ ।**
**తత్కథం జనవదేవ చరామి – త్వత్పదోచితమవైమి న కించిత్ ॥ 10**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ స్వామీ!, ప్రభుణా ఏవ = ప్రభునిచేతనే, స్వేచ్ఛయా ఏవ = నా ఇష్టానుసారమే, అహమ్ = నేను, నిజ = నాదైన, మార్గే = మార్గమున, పదం కారితః = అడుగుపెట్టినాను, తత్ కథమ్ = అది ఎట్లు, జనవత్ + ఏవ = లౌకికులవలెనే, చరామి = ప్రవర్తించుచున్నాను, త్వత్ = నీయొక్క, పద = స్థానమునకు, ఉన్నతికి, ఉచితమ్ = తగినదో, కించిత్ = కొంచెమైన, న అవైమి = ఎఱుగకున్నాను.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నా ఇష్టానుసారంగా, ప్రభువు ఆజ్ఞమేరకే, నేను నాదైన మార్గంలో అడుగుమోపినాను. అయినప్పుడు నేను లోకంతోపాటు వ్యవహరించినట్లు ఎట్లా అవుతుంది? నీ స్థానానికి తగినట్లు నేను ప్రవర్తిస్తూన్నానా? అన్నది నా కసలు తెలియదు.

ఈ మాటలు కవి సూటిగా శివునితో పలికినవే. ఓ స్వామీ! అన్న సంబోధన సాక్షి. మరి అయితే, **ప్రభుణైవ** అనటంలోని ప్రభువెవరు? త్వయైవ అని ఉంటే ఆ భగవన్ కే అన్వయమయ్యేది. ఆ భగవన్, ఈ ప్రభువు వేరన్న భావానికిప్పుడు తావున్నది. అట్లే, **త్వత్పదోచితం** అన్నదానిలోని **త్వత్,** వ్యాకరణానుసారం, భగవన్ తోనే. ఐనా, ఈ ప్రభువుతో కాదా? అన్న సంశయచ్ఛాయ తప్పదు. **భగవన్** అన్న సంబోధన అవ్యక్తశివునకు అన్వయం కాగా, **ప్రభు** శబ్దం కవి అంతరాత్మనధిష్ఠించిన వ్యక్తశివునకు అన్వయం అవుతుందనవచ్చు. అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరించి జీవుడైన ఈ కవి తన మార్గాన సుప్రతిష్ఠితుడైనాడు. ఇదే సత్యాన్ని పరమశివునకు నివేదిస్తూన్నాడు. కనుకే కవి ప్రశ్న : ఈ స్థితిలో నేను అందరివలె లౌకికమార్గావలంబినని చెప్పటం ఎట్లా పొసగుతుంది? ఇక నా వ్యవహారమంటావా? అది నా శక్తి విజృంభణమేరకు సాగుతుంది. **త్వత్పదోచితం** అంటే, నీ స్థానం అన్న అర్థం అన్వయమైతే, శివపదం, కైవల్యం కనుక, కైవల్యోచితచరితం అవునో కాదో ఎఱుగనంటూన్నాడు కవి. లేక, **త్వత్పద** అన్నదానికి

నీ పాదముల అని అర్థం చెప్తే, సాంప్రదాయికంగా శివుని జ్ఞానక్రియా మరీచికలన్న సంకేతార్థం యేర్పడుతుంది. ఈ మరీచికల పరిచయావేశానుసారం సముచితానుచితాల విషయం నేనెఱుగనంటున్నాడు కవి.

**శ్లో॥ కోఽపి దేవ! హృది తేషు తావకో - జృంభతే సుభగభావ ఉత్తమః ।**
**త్వత్కథాంబుదనినాదచాతకా - యేన తేఽపి సుభగీకృతాశ్చిరమ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** దేవ! = ఓ దేవా!, తావకః = తమదైన, కః అపి = ఏదేని, ఉత్తమః = ఉత్తమమైన, సుభగభావః = సౌభాగ్యము, తేషు = వారి, హృది = హృదయమున, జృంభతే = వికసించును, యేన = దేనిచే, తే = వారు, త్వత్ = తమయొక్క, కథా = కథారూపమైన, అంబుద = మేఘములయొక్క, నినాద = గర్జనల (ఉఱుముల) సవ్వడిని కోరు, చాతకాః అపి = చాతకపక్షులు కూడ, చిరమ్ = చాలకాలమువరకు, సుభగీకృతాః = సౌభాగ్యముగలవారుగా, ఆనందముగలవారుగా చేయబడుచున్నారు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! తమ సౌభాగ్యమేదైన ఉత్తమమైనది తమ భక్తుల హృదయాలలో వికసించినప్పుడు, దానిచే వారు, చాతక పక్షులు మేఘగర్జనలకు పులకించినట్లు పులకించి, ఆ సౌభాగ్యాన్ని చిరకాలంవరకు ఆనందంగా స్మరించుకుంటారు. తమ కథలను చాతకపక్షులవలె వింటారు.

మేఘం గర్జిస్తే వర్షం వస్తుంది. ఆ వర్షం కోసం ఎదురుచూచే వారందరికీ ఆనందం కలుగుతుంది. ముఖ్యంగా చాతకపక్షులు, వీటిని వానకోయిలలంటారు, అమితంగా సంతోషిస్తాయి. ఎందుకంటే స్వభావసిద్ధంగా అవి వాన కురుస్తూండగా ఆ నీటిని భూమ్మీద పడకుండా త్రాగుతాయి. నేలపైబడిన నీటిని త్రాగవు. వర్షాకాలం ఏడాదికొకసారే వస్తుంది. ఆ కాలంలోనే చాతకాలు తృప్తిగా ఆ ఆకాశగంగను త్రాగి ఆనందిస్తాయి. ఈ సంతోషం వానిలో సంవత్సరమంతా, మళ్ళీ వానాకాలం వరకు ఉంటుంది. శివభక్తులు ఈ చాతకపక్షుల వంటివారే. శివారాధన చేసే సమయంలో ఎప్పుడో ఒకసారి ఆ శివానుభూతి వారి హృదయాలను తాకుతుంది. అసాధారణమైన ఆ ఆనందాన్ని వారు మరొక్కసారి ఆ అనుభూతి కలిగే వరకు తమలో దాచుకొని, శివకథాశ్రవణంతో పునర్నవం చేసికొని ఆనందిస్తారు.

ఈ శ్లోకంలో, శివభక్తులు చాతకపక్షులు. శివకథలు మేఘగర్జనలు. శ్రవణానందం సమానధర్మం. అట్లే, మబ్బు నుండే నీటిని నేరుగా చాతకాలు త్రాగినట్లు, ఈ భక్తులు అలౌకికమైన శివకథాశ్రవణంతో **సుభగీకృతాః** సౌభాగ్యవంతులవుతారు.

మబ్బులు నీటిని విడిచినట్లు శివకథలు శివశక్తిని విడిచి, సహజ శక్తిపాతాన్ని కలిగిస్తాయని కవి భావం. కథాశ్రవణమాత్రాన ఆ భక్తులకు శివానుభవం కలుగుతుందని భావం.

**శ్లో॥ త్వజ్జుషాం త్వయి కయాపి లీలయా - రాగ ఏష పరిపోషమాగతః ।**
**యద్వియోగభువి సంకథా కథా - సంస్మృతిః ఫలతి సంగమోత్సవమ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** త్వత్ = నీయొక్క, జుషామ్ = ఆనందమగ్నులైనవారికి, త్వయి = నీయందు, ఏషః రాగః = ఈ అనురాగము, కయా అపి = ఏదేనొక, లీలయా = లీలచేత, పరిపోషం ఆగతః = వృద్ధిచెందినది, యత్ = ఏదో, వియోగభువి = వియోగదశలో, తథా = అట్లే, సంకథా = సత్కథ, సంస్మృతిః = సంస్మరణము, సంగమ = సమాగమముయొక్క, ఉత్సవమ్ = సంతోషమును, ఫలతి = కలిగించుచున్నది.

**తాత్పర్యము :** నీ సేవలో ఆనందించువారికి నీయందు అనురాగము ఏదేని ఒక లీల కారణముగా వృద్ధియవుతుంది. అది నీ విరహదశలో కూడా సత్కథాశ్రవణంవలన, నిన్ను సంస్మరించుటచేత నీతో సంగమానందాన్ని కలిగిస్తుంది.

ఈ శ్లోకంలోని భక్తుడు ఒక ప్రేయసియైనాడు. ప్రియునితో కలిసియున్నవేళ ప్రియుని చమత్కారమేదో ప్రియురాలి మనస్సులో సుస్థిరమైన జ్ఞాపకంగా నిల్చిపోయి, ఆ ప్రియుడు దూరమైనవేళ కూడా వాని వార్తలను విన్నప్పుడు, వాని లేఖలను చదివినప్పుడు, వానిని స్మరించుకొన్నప్పుడు లౌకికమైన కాలం స్తంభించిపోయి అనంతమైన అమృతత్వం అనుభూతమై ప్రియసమాగమానుభూతి కలిగి భావప్రాప్తి లభిస్తుంది. భక్తునికి భగవంతునియందును రాగం అధికంగా ఉన్నప్పుడు, తన అనుభవంలోని ఒక భగవల్లీల మనసును పులకింపజేసి, భగవత్కథాశ్రవణంవలన, భగవన్నామస్మరణం వలన, విరహవేళలోసైతం, భగవద్వ్యక్తస్థితి కలిగి, శివపారమ్యంలో భావప్రాప్తి కలుగుతుందని, కవి తన అనుభవాన్ని ప్రకటిస్తూన్నాడు.

**శ్లో॥ యో విచిత్రరససేకవర్ధితః - శంకరేతి శతశోఽప్యుదీరితః ।**
**శబ్ద ఆవిశతి తిర్యగాశయే - ష్వప్యయం నవనవప్రయోజనః ॥ 13**

**ప్రతిపదార్థము :** విచిత్ర = ఆశ్చర్యకరమైన, రససేక = ఆనందపుజల్లువలన, వర్ధితః = పెంచబడిన, శతశః అపి = వందల సార్లయినను, యః = యేది, ఉదీరితః = చెప్పబడిన, అయమ్ = ఈ, శంకర ఇతి = శంకర అను, శబ్దః = శబ్దము, పేరు, తిర్యగ్ = పశు వులయొక్క, ఆశయేషు = హృదయాలలో, అపి = కూడ, నవనవ = కొంగ్రొత్త, ప్రయోజనః = ప్రయోజనమును, ఆవిశతి = ఆవేశించుచున్నది.

**తాత్పర్యము :** శంకర అను ఈ శబ్దము వందలసార్లు పలుకబడినదై పశువులయొక్క హృదయాలను కొంగ్రొత్త ఆవేశముతో నింపుచున్నది. ఈ శబ్దమును ఉచ్చరించుటలో ఆనందం వర్షించి మరల మరల పలుకబడుచు విచిత్రముగా ఆనందవివర్ధకమగుచున్నది.

శంకరశబ్దానికి అర్థం శమితసర్వవికారః, వికారములన్నీ శమించినవాడనీ, శాంతిని కలిగించువాడని. ఆ శబ్దార్థాన్ని భావించినట్లయితే శంకరశబ్దమే ఆనందవర్ధకం. అది శివుని పేరు. శివుడు పశుపతి. పశువులంటే జీవులు. జీవుల హృదయాలలో ఆ పశుపతి నామస్మరణం ఎప్పటికప్పుడు క్రొత్త క్రొత్త ప్రయోజనాలను కలిగిస్తూ ఉంటుంది.

**శ్లో॥ తే జయన్తి ముఖమండలే భ్రమన్ - అస్తి యేషు నియతం శివధ్వనిః ।**
**యః శశీవ ప్రసృతోఽమృతాశయాత్ - స్వాదు సంస్రవతి చామృతం పరమ్ ॥14**

**ప్రతిపదార్థము :** యః చ = మరియును యేది, శశీ ఇవ = చంద్రునివలె, అమృత + ఆశయాత్ = అమృతమయమైన కళనుండి, ప్రసృతః = ప్రసారింపబడినవాడై, స్వాదు = మధురము, చ = మరియు, పరమ్ = మిక్కిలి, అమృతమ్ = అమృతమును, సంస్రవతి = చక్కగా స్రవించుచున్నాడో, (సః = అట్టి), శివధ్వనిః = శివనామోచ్చారణ, యేషు = ఎవరియందు, ముఖమండలే = నోళ్ళలో, నియతమ్ = నిశ్చయముగా, భ్రమన్ అస్తి = తిరుగుచున్నదో, తే = వారు, జయన్తి = ధన్యులు.

**తాత్పర్యము :** మరియు, ఎవరి నోట శంకర, శివ అను ఈ శబ్దము ధ్వనిస్తూ నియతంగా ఉంటుందో, అట్టివారు చంద్రునివలె అమృతకళనుండి పుట్టినవారై మధురమైన అమృతమును అధికముగా ప్రవహింపజేస్తూ ఉంటారు.

చంద్రుడు తొలుత పాలసముద్రమునుండి అమృతంతో లక్ష్మితో కూడి జన్మించినవాడు. **అమృతాశయాత్ ప్రసృతః** అనటం అందుకు. అదికాక, దక్షప్రజాపతి శాపంవలన క్షీణిస్తూన్న చంద్రుడు అమావాస్యనాడు లేనట్టే లోకానుభవం, కాని, చంద్రుని 16వ కళ **అమ** అన్నది శివుని శిరసున అమృతమయంగా ఉండే ఉన్నది కనుక మరల చంద్రుడు దానినుండి అమృతత్వాన్ని పొంది వృద్ధియవుతూన్నాడు.

ఈవిధంగానూ చంద్రుడు అమృతాశయాత్ ప్రసృతః అనదగినవాడే. కాగా, చంద్రునకు **అమృతకరుడు** అన్న ప్రశస్తనామం ఉండనే ఉన్నది. ఆబాలగోపాలం అమృతప్రాయంగా వెన్నెలనాస్వాదించటం నిత్యానుభవమేకదా. ఈ కారణంగా **స్వాదు స్రవంతి చామృతం పరమ్** అనటం. నియతంగా శివ పంచాక్షరిని జపిస్తూ ఆనందామృతాన్ని వర్షించే భక్తులు ఆ చంద్రునివలె అమృతాశయప్రసృతులున్నూ

అమృతసంస్రవులున్నూ కావటం సహజోక్తి. శివస్పర్శ యే రూపంలో ఉన్నా అది అమృతనిష్యందినియే.

**శ్లో॥ పరిసమాప్తమివోగ్రమిదం జగద్ - విగలితోఽవిరలో మనసో మలః ।**
**తదపి నాస్తి భవత్పురగోపురా - ర్గలకవాటవిఘట్టనమణ్వపి ॥ 15**

**ప్రతిపదార్థము :** ఇదమ్ = ఈ, ఉగ్రమ్ = భయంకరమైన, జగద్ = జగత్తు, పరిసమాప్తం ఇవ = లయమైనదానివలె, మనసః = మనస్సుయొక్క, అవిరలః = అతిపెద్ద, మలః = వికారము, విగలితః = జారిపోయినది, తద్ + అపి = అయినప్పటికి, భవత్ = తమయొక్క, పుర = పురముయొక్క, గోపుర = పురద్వారమునకు గల, అర్గల = గడియతో కూడిన, కవాట = తలుపులయొక్క, విఘట్టనమ్ = తెరువబడుట, అణు అపి = కొంచెమైనను, నాస్తి = లేదు.

**తాత్పర్యము :** భయంకరమైన ఈ ప్రపంచం నాశనమైనట్లే, మనస్సుయొక్క పెద్ద వికారం తొలగిపోయింది. అయినప్పటికి, తమ పురద్వారానికి గల తలుపులను బిగించిన గొలుసులు కొంచెమైన ఊడిపోనేలేదు.

ఈ జగత్తు ఉగ్రమైనది. ఎందుకంటే ఇక్కడ నిరంతరం పోరాటం, అశాంతి, దుఃఖం నిండి ఉంటుంది. అన్నీ వికారాలే. కాని శివధ్యానంతో ఆ మనోవికారాలన్నీ తొలగినట్లే అయింది. అయినా శివసాన్నిధ్యం లభించలేదని భక్తుని ఆవేదన. శివధ్యానసమాధిలో ఉన్న భక్తునకు ఈ ప్రపంచంలోని ద్వంద్వం, అశాంతి, వికారాలన్నీ తొలిగిపోయి శాంతి లభించినట్లే అనిపించింది. ఇంక శివసాక్షాత్కారం చేరువలోనే ఉన్నదని భావించిన భక్తునకు అది లభించలేదు. అనగా, మనస్సు శాంతమై వికారాలు తొలగినంతమాత్రాన శివపారమ్యం లభించినట్లు కాదు. కారణం,

సర్వథా త్వన్తరాలీనానన్తతత్త్వౌఘనిర్భరః ।
శివః చిదానందఘనః పరమాక్షరవిగ్రహః ॥

శివుడు అన్నివిధాలా అంతరాళంలోని అనంతత్వాన్ని భరించేవాడు, జ్ఞానానందుడు, ఆయన రూపం పరమం, అవినాశం. ఆ అనంతత్వాన్ని ప్రవేశించటం సాధించినవానికే శివసాక్షాత్కారం. మనస్సు కొంత శాంతించినంతమాత్రాన ఆ అంతరాళానంతత్త్వం అవగతమవుతుందా? **సర్వాతీతశ్శివో జ్ఞేయో,** శివుడు సర్వానికి అతీతుడని తెలియవలెను, అంటుంది శ్రీపూర్వశాస్త్రం.

**శ్లో॥ సతతపుల్లభవన్ముఖపంకజో - దరవిలోకనలాలసచేతసః ।**
**కిమపి తత్కురు నాథ! మనాగివ - స్ఫురసి యేన మమాభిముఖస్థితిః ॥16**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ ప్రభూ!, సతత = ఎల్లప్పుడు, పుల్ల = వికసించిన, భవత్ = తమయొక్క, ముఖ = ముఖమనెడు, పంకజ = పద్మముయొక్క, ఉదర = మధ్యభాగమును, విలోకన = చూచుటయందు, లాలస = ఆసక్తమైన, చేతసః = మనస్సుగలవారు, మనాక్ ఇవ = కొంచెము, కిం + అపి = అదియేదైనను, యేన = దేనిచే, మమ = నా, అభిముఖస్థితిః = ఎదుటగలరూపమున, స్ఫురసి = ప్రకటమగుచున్నాదో, తత్ = దానిని, కురు = చేయుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎప్పుడూ వికసించి ఉండే పద్మమువంటి తమ ముఖ మధ్యభాగంపై చూపునిల్పి ఉండటంలో ఆసక్తిగలవారియందు తమకు యే విధమైన అనుగ్రహం ఉంటుందో అటువంటి అనుగ్రహావేశాన్ని నాపై ప్రసరించి, నా కట్టెదురగల రూపంలో తమరు ప్రకాశింతురుగాక!

పద్మగర్భాన నిలిచి ఉండేది పూదేనె. శివుని ముఖపద్మగర్భాన నిలిచి ఉండేది జ్ఞానామృతం. ఆ అమృతంలో ఆసక్తివలన భక్తుల చూపులు అక్కడే నిలిచి ఉంటాయి. ఆ స్థితి సహజంగా లభించినవారు దేవతలు. అట్టి దేవతలపై శివుని అనుగ్రహం అసాధారణం. తనపై అంత అనుగ్రహం కాకున్నా, అందులో ఎంతో కొంత ప్రసరింపజేసి, తన నిత్యారాధనలో కన్నులకెదురుగా ఉన్న లింగరూపుడైన శివునిలో సాక్షాత్ శివప్రకాశం కలిగే విధంగా ఆశీర్వదించుమని కవి ప్రార్థన. ఇది నిజానికి దేవత్వాన్ని మించిన శివత్వసిద్ధి, శివానుగ్రహం లేనిదే లభించదుకదా!

ఇది సాధారణాన్వయం. ఇక శాక్తేయసంప్రదాయంలో చెప్పబడే సాంకేతికార్థం ఇట్లా ఉన్నది -

శక్త్యవస్థాం ప్రవిష్టస్య నిర్విభాగేన భావనా ।
తదాసౌ శివరూపీ స్యాత్ శైవీముఖమిహోచ్యతే ॥

శక్తి అవస్థను ప్రవేశించినవాని భావన నిర్విభాగంచేత శైవీమయం అవుతుంది. అట్టివాడు శివరూపి కాగా, వాని ముఖం శైవీముఖం అవుతుంది. ఆ పద్మపు మధ్యభాగం పరశక్తి సామరస్యయుక్తమై శాంభవం రూపం అనబడుతుంది. దానిని విలోకనం, చూడటం, అంటే ఆ శాంభవరూపంతో సమావేశం కావటం అని భావం. ఆ సమావేశాభిలాష కల భక్తుని ప్రార్థన ఇది : ఏదో ఒక ఉపాయంతో, హేలామాత్రంగా, ఆ శివుడే నాకు అభిముఖుడై ప్రకటమగుగాక! అని.

**శ్లో॥ త్వదవిభేదమతేరపరం ను కిం - సుఖమిహాస్తి విభూతిరథాపరా ।**
**తదిహ తావకదాసజనస్య కిం - కుపథమేతి మనః పరిహృత్య తామ్ ॥17**

**ప్రతిపదార్థము :** ఇహ = లోకంలో, త్వద్ = తమకు, అవిభేద = భిన్నముగాని, మతేః = బుద్ధికంటె, కిం ను = మరేది, అపరమ్ = రెండవది, సుఖమ్ = సుఖము, అస్తి = ఉన్నది?, అథ = అదిగాక, అపరా = రెండవది, విభూతిః = సంపద (ఉన్నది)?, తత్ = అయినను, తావక = తమయొక్క, దాసజనస్య = దాసుని, మనః = మనస్సు, తామ్ = దానిని, పరిహృత్య = విడిచి, కుపథమ్ = కుమార్గమును, ఏతి = పొందుచున్నది, కిమ్ = ఏమి?

**తాత్పర్యము :** శివునితో అభిన్నమైన బుద్ధి సర్వోత్తమమైన సుఖాన్నీ సంపదనూ ఇస్తుంది. అంతకు మించినదేదీ లేనే లేదు కదా, మరి మనస్సు ఆ శివాభిన్నతను విడిచి కుత్సితమైన మార్గాన ఎందుకు నడుస్తూన్నది?

మనస్సు చంచలమైనది. దానికి లభించినదెంత శ్రేష్ఠమైనదే అయినాగాని అది అక్కడే ఆగిపోదు. దీనిని వదిలితే లభించేది ఇంతకంటె గొప్పదా? సంతోషాన్నిస్తుందా? అన్న ఆలోచన మనస్సుకు రాదు. ఈ చాంచల్యాన్ని అరికట్టటానికే యోగసాధన.

**శ్లో॥ క్షణమపీహ న తావకదాసతాం - ప్రతి భవేయమహం కిల భాజనమ్ ।**
**భవదభేదరసాసవమాదరా - దవిరతం రసయేయమహం న చేత్ ॥ 18**

**ప్రతిపదార్థము :** అహమ్ = నేను, ఆదరాత్ = ఆదరమున, అవిరతమ్ = అంతరాయము లేకుండ, భవద్ = తమయొక్క, అభేదరస = అద్వయానందరూపమైన, ఆసవమ్ = మదిరను, న చేత్ రసయేయమ్ = ఆస్వాదించకపోయినచో, అహమ్ = నేను, ఇహ = లోకమున, తావకదాసతాం ప్రతి = మీ దాసుడనను భావమునకు, భాజనమ్ = పాత్రుడను, క్షణం + అపి = ఒక్క నిముషమైన, కిల = నిజముగా, న భవేయమ్ = కాబోను.

**తాత్పర్యము :** స్వామీ! అంతరాయం లేకుండా నేను తమతో అద్వయానందానుభవాన్ని పొంది పరవశించనివాడనైనచో, మీ దాసుడనని భావించుటకు చెప్పికొనుటకు నిజంగా నేను యోగ్యుడను కాను.

సంసారంలో ఎన్నో చికాకులతో సతమతమయ్యే లౌకికుడు, శివభక్తుడైనంత మాత్రాన, అన్నీ వదలి శివస్మరణ చేస్తూ పరశించటం, అది కూడా నిరంతరాయంగా!,

సాధ్యమా? అన్నది లౌకికుని ప్రశ్న. అయితే, ఇక్కడి భక్తుడు శివాద్వయభావాన్ని రుచి మరిగినవాడని తెలుస్తూన్నది కదా. అట్టివాని విషయం వేరు. ఆ పరమానందానికి ఒక్క క్షణం దూరమైనాగాని అట్టి భక్తుడు తన భక్తి అర్థరహితంగా భావిస్తాడు. శివానందలహరి తాకేంతవరకే సంసారజంజాటం. ఆపై అప్రయత్నంగా అన్ని చింతలూ చికాకులూ దూరమైపోతాయి. అట్లా జరుగకుంటే ఆ భక్తి భక్తియే కాదు, అన్న భావం కలుగుతుంది.

**శ్లో॥ న కిల పశ్యతి సత్యమయం జన - స్తవ వపుర్ద్వయదృష్టిమలీమసః ।**
**తదపి సర్వవిదాశ్రితవత్సలః - కిమిదమారటితం న శృణోషి మే ॥ 19**

**ప్రతిపదార్థము :** సత్యమ్ = నిజము, ద్వయదృష్టి = ద్వైతదృష్టియను, మలీమసః = మలినముగల, అయం జనః = ఈ జీవుడు, తవ = నీయొక్క, వపుః = శరీరమును, న పశ్యతి కిల = నిజముగా చూచుటలేదు, తద్ + అపి = అది అట్లయినను, సర్వవిత్ = సర్వజ్ఞుడు, ఆశ్రిత = ఆశ్రయించినవారికి, వత్సలః = తంఢ్రివలె రక్షకుడు అగు స్వామివి, ఇదం మే = ఈ నాదగు, ఆరటితమ్ = ఆక్రోశమును, కిం న శృణోషి = వినకున్నావా?

**తాత్పర్యము :** ద్వయదృష్టి అన్నది ఒక మలినం. జీవునకు ఆ మలినం అంటి ఉంటుంది. ఆ కారణాన జీవుడు శివస్వరూపాన్ని చూడలేడు. ఇది నిజం. కాని, స్వామి సర్వజ్ఞుడు, ఆశ్రితవత్సలుడు, మరి నా ఆక్రోశాన్ని వినిపించుకోడేమి?

ద్వయదృష్టి అంటే రెండుగా చూడటం. దేనిని? జీవుని, దేవుని, వీరు వేర్వేరని భావించటం. ఇది దృష్టిదోషం. జీవుని దృష్టిని ఇంద్రియాలు మాయ చేయటం వలన ఇది యేర్పడినది. అందుచేత జీవుడు తనను దా తెలియక, దేవునెఱుగక ద్వయదృష్టికి లోనైనాడు. ఇది లోకసాధారణానుభవం. తనకూ తనవారికీ భేదాన్ని దర్శించే జీవుడు శివునితో తన అభేదాన్ని గ్రహంచలేడు. నిజం.

ఇది శివుడెఱుగును. నేను శివదర్శనం కోసం తపించి ఆక్రోశిస్తూన్నానని కూడ శివుడెఱుగును, సర్వజ్ఞుడు కదా! అట్లే ఆశ్రితవత్సలుడు శివుడు. వత్సల అంటే దూడ తల్లి, ఆవు. దూడ తల్లిని వెదుకుతూ అంబారవం చేస్తూంటే, తల్లీ తండ్రీ కూడా తానే అయిన శివుడు వినడేమి!? ఇదేమి వింత! వత్సల శబ్దప్రయోగంలో శివుని పశుపతిత్వం ధ్వనిస్తుంది.

**శ్లో॥ స్మరసి నాథ! కదాచిదపీహితం - విషయసౌఖ్యమథాపి మాయార్థితమ్ ।**
**సతతమేవ భవద్వపురీక్షణా - మృతమభీష్టమలం మమ దేహి తత్ ॥ 20**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, మయా = నాచేత, కదాచిత్ అపి = ఒకప్పుడైనను, విషయసౌఖ్యమ్ = ఇంద్రియసుఖము, ఈహితమ్ = కోరబడినదా?, అథాపి తత్ = లేకున్న, అర్థితమ్ = యాచించబడినదా?, త్వమ్ = నీవు, స్మరసి కిమ్ = గుర్తుదెచ్చు కొనుచున్నావా?, మమ = నాకు, భవద్ + వపుః = తమ స్వరూపముయొక్క, ఈక్షణ = చూచుట అను, అమృతం ఏవ = అమృతము మాత్రము, సతతమ్ = ఎల్లవేళల, అలమ్ = చాలును, తత్ అభీష్టమ్ = ఆ ప్రియమైనదానిని, దేహి = నాకిమ్ము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎప్పుడైన, ఒకప్పుడైన, నేను నాకు ఇంద్రియసుఖాల నిమ్మని కోరినానా? యాచించినానా? గుర్తుదెచ్చుకో స్వామీ! నాకు నీ స్వరూపదర్శనమే అమృతప్రాయం. అది చాలు. ఆ అభీష్టాన్ని తీర్చు, అనగా, నీ దర్శనభాగ్యాన్ని ప్రసాదించు.

**శ్లో॥ కిల యదైవ శివాధ్వని తావకే – కృతపదోఽస్మి మహేశ! తవేచ్ఛయా ।**
**శుభశతాన్యుదితాని తదైవ మే – కిమపరం మృగయే భవతః ప్రభో ॥ 21**

**ప్రతిపదార్థము :** మహేశ! = ఓ పరమేశ్వరా!, కిల = నిజముగా, యదా ఏవ = ఎప్పుడైతే, తవ = నీయొక్క, ఇచ్ఛయా = కోరికచేత, తావకే = తమదైన, శివ + అధ్వని = కళ్యాణమయమైన మార్గమున, కృతపదః = పాదమునుంచినవాడను, అస్మి = అగుచున్నాను, తదా ఏవ = అప్పుడే, మే = నాయొక్క, శుభశతాని = లెక్కలేనన్ని శుభములు, ఉదితాని = ఉదయించినవి, ప్రభో = ఓ స్వామీ!, భవతః = తమకంటె, అపరమ్ = వేరైనదానిని, కిమ్ = దేనిని, మృగయే = వెదుకుదును? కోరుదును?

**తాత్పర్యము :** ప్రభో మహేశ్వరా! ఎప్పుడైతే తమ కృపచేత నేను శివమార్గాన సాగనారంభించినానో అప్పుడే నాకు శతాధికంగా శుభాలు కలిగినవి. తమకంటే వేరుగా నేను కోరేది యేమున్నది?

భగవత్సేవామార్గం యే జీవికైనా, భగవత్ కృపాలబ్ధమే అన్నది మహాత్ముల వాక్కు. అన్ని శుభాలకూ మూలం శివుడు. ఆతని మార్గాన్ని అవలంబించినవానికి శుభాలుకాక అశుభాలు కలగవు. నీ మార్గాన్ని నాకు చూపించినావు కదా, స్వామీ! నిర్విఘ్నంగా ఆ మార్గాన సాగి లక్ష్యాన్ని, గమ్యాన్ని చేరుకునే విధంగా ఆశీర్వదించు, అని ప్రార్థన సారాంశం.

**శ్లో॥ యత్ర సోఽస్తమయమేతి వివస్వాం – శ్చంద్రమః ప్రభృతిభిః సహ సర్వైః ।**
**కాపి సా విజయతే శివరాత్రిః – స్వప్రభాప్రసరభాస్వరరూపా ॥ 22**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, సః వివస్వాన్ = ఆ సూర్యుడు, చంద్రమః =

చంద్రుడు, ప్రభృతిభిః సర్వైః సహ = మొదలైన అందరితో కూడి, అస్తమయమ్ = అస్తమయాన్ని, ఏతి = పొందుచున్నాడో, సా స్వప్రభా = అట్టి స్వయంప్రకాశముయొక్క ప్రసర = ప్రసార, భాస్వరరూపా = కాంతి, తేజోరూపముగల, కా అపి = అలౌకికమైన, శివరాత్రిః = శివరాత్రి, విజయతే = ధన్యమైనది.

**తాత్పర్యము :** చంద్రుడు మొదలైనవారందరితో కూడి సూర్యుడు ఎక్కడ అస్తమిస్తూన్నాడో, అది ఒక అలౌకికమైన, స్వయంప్రకాశమైన, కాంతిప్రవాహమైన తేజోరూపము. అది శివరాత్రి. ఆ రాత్రి ధన్యమైనది.

సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, తారలు అన్నీ పడమటే అస్తమిస్తాయి. కాని సూర్యుడు సాయంసంధ్యతోనూ, మిగతా అన్నీ ఉదయసంధ్యతోనూ అస్తమిస్తాయి కదా, యత్ర అన్నదానికి దిక్కు ప్రధానంగా పశ్చిమం అని అర్థం చెప్పవలెనా? లేక సమయం అనవలెనంటే, పొసగటం ఎట్లా? పైగా ఆ సమయాన్ని **శివరాత్రి** అని కవి అభివర్ణించి నాడు కనుక సమయమే ప్రధానార్థం అనటం సముచితమా? సూర్యచంద్రాదులన్నీ, అన్నీ అన్నప్పుడు భూమిసైతం లెక్కకు వస్తుంది కదా, అస్తమించే కాలం మహాప్రళయ కాలం. ఆ కాలంలో సూర్యాదులందరూ అస్తమించే ప్రదేశమేది? దేనియందు అన్నీ విశ్రమిస్తాయి? అంటే శివునియందు అనాలి. అంటే తేజోమయుడైన శివునిలో సూర్యాది తేజోరాశులన్నీ లీనమవుతాయి. ఆ సమయం శివరాత్రి అంటూన్నాడు కవి. అంటే తన వ్యక్తరూపాలైన పృథివ్యాపస్తేజోవాయురాకాశాలన్నిటినీ శివుడు తన అవ్యక్త జ్ఞాన తేజస్సులోనికి ఉపసంహరించికొనిన రాత్రి సృష్టి నష్టమై జ్ఞానకేవలమైన రాత్రి ఈ శివరాత్రి.

జీవసృష్టికి సూర్యుడు మూలమని, కనుక ఆతడు ప్రమాతయని శాస్త్రం. అట్లే, ఆ సూర్యప్రభను ప్రతిఫలిస్తూ చంద్రాది గ్రహాలు ప్రమేయాలవుతూన్నవని శాస్త్రం. నేటి విజ్ఞానశాస్త్రం దీనిని సమర్థిస్తూన్నది. కాగా సూర్యుడు అశేషప్రపంచానికి ప్రాణమవు తూన్నాడు. చంద్రుడాది సమస్తమూ అపానాదికాగా, ప్రాణాపానవ్యానోదాన సమాన ప్రాణపంచకమూ ఏ సుఖస్వరూపడైన శివునియందు తమ వ్యక్తిత్వాలను కోల్పోయి పరమానందైకరూపంగా మారిపోతూన్నవో ఆ శివుని రాత్రి, అంటే, శివకేవలమైన రాత్రి, ఆ రాత్రి ధన్యమైనది, అని కవి హృదయం. ఈ స్థితి మహాప్రళయమే. కాని, ఇట్టి సమాధిస్థితి కలిగిన భక్తునకు మాత్రమే వ్యక్తప్రపంచం లయం అవుతుంది, శివనిలయం అవుతుంది, వాని చేతన శివం అవుతుంది. ఆ చేతనప్రభాప్రసారం లోకాలన్నింటినీ శివమయంగా ప్రకాశరూపంగా మార్చివేస్తుంది. కనుక ధన్యమవుతుంది.

శ్లో॥ **అప్యుపార్జితమహం త్రిషు లోకే - ష్వాధిపత్యమమరేశ్వర! మన్యే ।**
**నీరసం తదఖిలం భవదంఘ్రి - స్పర్శనామృతరసేన విహీనమ్ ॥ 23**

**ప్రతిపదార్థము :** అమరేశ్వర! = ఓ దేవేశా!, అహమ్ = నేను, భవత్ = తమయొక్క, అంఘ్రి = పాదముల, స్పర్శన = స్పర్శరూపమైన, అమృతరసేన = అమృతానందము, విహీనమ్ = లేక, ఉపార్జితమ్ = పొందబడిన, త్రిషు లోకేషు = మూడులోకాల, తత్ అఖిలమ్ = ఆ సంపూర్ణమైన, ఆధిపత్యం అపి = అధికారమైనను, నీరసమ్ = రసములేనిదిగా, మన్యే = తలంతును.

**తాత్పర్యము :** ఓ దేవేశ్వరా! నీ పాదస్పర్శవలన కలిగే అంతేలేని ఆనందం లభించ నట్లయితే, ముల్లోకాలపై సంపూర్ణాధికారం లభించినాగాని, అది ఆనందాన్నివ్వలేదు.

లౌకికమైన రాజ్యాధికారం, లోకం యేదైనగాని, కావాలని ప్రాజ్ఞులు కోరరు. ఎందుకంటే, ఎవరివలన యే అపాయం కలుగుతుందో అన్న భయం అధికారాన్ని అంటి ఉంటుంది. మనశ్శాంతి కొరవడుతుంది. ఈ వికారాలను తొలగించగలది ఈశ్వరధ్యానమూ సేవ మాత్రమే. కాని లౌకిక జంజాటాలలో బడినవానికి శివధ్యానానికి సమయం ఉండదు. కనుక నిరాశా నిఃస్పృహలావరిస్తాయి. లేదా అజ్ఞానం అనే ఊబిలో కూరుకుపోయి తామసులై పతనమవుతారు. కనుకే దైవస్పర్శరుచినెరిగినవారు ఆ ఆనందంతో పోల్చి చూస్తే రాజరికం రసహీనం సుమా అంటారు. **రాజ్యాంతే నరకం ధృవం** అన్న సామెత ఉండనే ఉన్నది కదా!

శ్లో॥ **బత! నాథ! దృఢోఽయమాత్మబంధో - భవదఖ్యాతిమయస్త్వయైవ క్లప్తః ।**
**యదయం ప్రథమానమేవ మే త్వా - మవధీర్య శ్లథతే న లేశతోఽపి ॥ 24**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, బత = అహో!, త్వయా ఏవ = నీ చేతనే, క్లప్తః = చేయబడిన, భవత్ = తమను, అఖ్యాతిమయః = దాచి యుంచునట్టి, అయం ఆత్మబంధః = ఈ ఆత్మలముడి, దృఢః = బలమైనది, యద్ = ఏదో, అయమ్ = ఇది, మే = నాకు, ప్రథమానం ఏవ = ప్రకాశమానుడవగు, త్వామ్ = నిన్ను, అవధీర్య = అవమానించి, లేశతః = అపి = కొంచెమైనను, న శ్లథతే = మొక్కవోదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఈ ఆత్మల బంధాన్ని మీరే నిర్మించినారు. ఈ బంధం వెనుకే తమ స్వరూపం దాగి ఉంటుంది. ఇది చాల బలమైనది. ఇది ఇట్లు తమరు నాకు ప్రకాశమానులు కాకుండ చేసి అవమానించి కూడా, కొంచెమైన మొక్కవోదు.

దేహమూ, ఇంద్రియాలూ ఇవే ప్రమాతలన్న అభిమానం శివుని అప్రథారూపం.

దీనిని దృఢంగా యేర్పరచినది శివుని శక్తియే. ఈ కారణం చేతనే జీవుడు శివుని కీర్తించేవాడే అయినప్పటికి, శివుడు భక్తునకు సమావేశమున ప్రకాశించువాడే అయినప్పటికి, ఈ అప్రథారూపం ధిక్కారభావంతో ప్రవర్తిస్తూన్నది. అయినాగాని లేశమాత్రం కూడ నష్టపోవటం లేదు. వ్యుత్థానసమయంలో తన ప్రాధాన్యాన్ని కోల్పోవటం లేదు. ధ్యానసాధనలో ప్రముఖంగానే నిలుస్తూన్నది. ఎంత ఆశ్చర్యము!

**శ్లో॥ మహతామమరేశ! పూజ్యమానో – ఒప్యనిశం తిష్ఠసి పూజకైకరూపః ।**
**బహిరన్తరపీహ దృశ్యమానః – స్ఫురసి ద్రష్టృశరీర ఏవ శశ్వత్ ॥ 25**

**ప్రతిపదార్థము :** అమరేశ = ఓ దేవేశ!, అనిశమ్ = ఎల్లప్పుడు, పూజ్యమానః = పూజింపబడువాడవు, అపి = అయినను, మహతామ్ = మహాపురుషుల, భక్తులకు, పూజక ఏకరూపః = పూజించువాని రూపమొక్కటియే కలవాడవై, తిష్ఠసి = నిలచుచున్నావు, ఇహ = లోకంలో, అన్తః = లోపల, బహిః = బయలును, దృశ్యమానః అపి = కనబడువాడవు అయినను, శశ్వత్ = ఎల్లవేళల, ద్రష్టృ = చూచువానియొక్క, శరీరః ఏవ = శరీరమే అయి, స్ఫురసి = ప్రకాశించుచున్నావు.

**తాత్పర్యము :** ఓ దేవదేవా! నీవు సర్వదా పూజ్యుడవే, పూజలందుకొంటూనే ఉన్నావు. అయినప్పటికి, మహాత్ములైన భక్తులరూపంలో పూజించేవాడవై కనబడుతూన్నావు. లోకం లోపల, లోకం బయట కూడ నీవు కనబడుతూనే ఉన్నావు. అయినప్పటికి, ఎల్లవేళల నీవు ద్రష్ట రూపంలోనే ప్రకాశిస్తూన్నావు.

పదార్థమూ శక్తీ, రెండూ శివుడే. ఈరెండింటినీ సంధించే జీవుడూ శివుడే. అయితే, జీవభావంలో వెలుపలి పదార్థరూపాన్నీ లోపలి శక్తిరూపాన్నీ చూస్తూ ద్రష్ట అవుతూన్నాడు శివుడు. శక్తిరూపాన పూజ్యుడవుతూన్నాడు. ద్రష్టయై, లోని శక్తిని చూస్తూ భక్తుడవుతూన్నాడు, పూజకుడవుతూన్నాడు. లోకం దృష్టికి పూజకుడైన భక్తుడే కనబడుతూన్నాడు తప్ప పూజ్యుడైన శివుడు కాడు. ఇది కేవలం అజ్ఞానుల దృష్టికి. మహాజ్ఞానుల దృష్టికి సర్వం శివమయమే, లోన – బయట అన్న భేదం లేదు.



శ్రీః

# 5. స్వబలనిదేశనస్తోత్రమ్

**శ్లో॥ త్వత్పాదపద్మసంపర్కమాత్రసంభోగసంగినమ్।**
**గలేపాదికయా నాథ! మాం స్వవేశ్మ ప్రవేశయ॥ 1**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, త్వత్ = నీ యొక్క, పాదపద్మ = పద్మములవంటి పాదములతో, సంపర్కమాత్ర = స్పర్శరూపమాత్రమైన, సంభోగ = ఆస్వాదమున, సంగినమ్ = సంగముగలవాడనగు, మాం = నన్ను, గలేపాదికయా = హఠశక్తిపాత క్రమమున, స్వ = నాదగు, వేశ్మ = ఇంటిని, ప్రవేశయ = ప్రవేశింపజేయుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ పాదముల స్పర్శమాత్రమున నేను నీ సంగమును అనుభవించువాడను. హఠశక్తిపాతక్రమమున నన్ను నా ఇంటియందు ప్రవేశపెట్టుము.

పాదపద్మములనుటవలన అమృతత్వము సూచింపబడినది. పద్మస్పర్శవలన పరవశించిన తుమ్మెద అమృతాస్వాదనము ననుభవించిన రీతిగా నేను నీ పాదస్పర్శ మాత్రమున భావప్రాప్తిని పొందుతున్నాను, అన్న భావం సంభోగశబ్దం వలన ప్రకట మవుతూన్నది.

**గలేపాదిక** యనునది హఠయోగంలో సాధకునకు లభించు శక్తిపాతక్రమం. హఠయోగమనునది రాజయోగసాధనకంటే వేరుగా క్లేశముతో కూడిన ఒక విధమైన తీవ్రమైన అరూపశక్తిసాధన. శరీరమును హింసించు విధముగ సాగునది. ఒంటి కాలిపై నిలిచి ధ్యానమగ్నుడగుట, తలక్రిందులుగ నుండి ధూమాఘ్రాణము చేయుచు ధ్యానమున నిలచుట, ఇత్యాది తీవ్రసాధనలు. ఈ సాధనల ఫలముగా శక్తిని పొందే విధానం గలేపాదిక. **స్వవేశ్మ** అంటే చిత్ స్వరూపం అని సాంకేతికార్థం. భౌతికరూపానికి విపరీతమైన జ్ఞానరూపం, ఆనందరూపం, శివరూపం, అది జీవుని స్వస్వరూపం.

**శ్లో॥ భవత్పాదాంబుజరజోరాజిరంజితమూర్ధజః ।**
**అపారరభసారబ్ధనర్తనః స్యామహం కదా ॥ 2**

**ప్రతిపదార్థము :** అహమ్ = నేను, భవత్ = తమయొక్క, పాద = పాదములు అను, అంబుజ = పద్మములయొక్క, రజః = ధూళియొక్క, రాజి = సమూహముచే, రంజిత= ప్రకాశింపజేయబడిన, మూర్ధజః = కేశములు గలవాడనగుచు, అపార = అంతులేని, రభసా = సంతోషముతో, ఆరబ్ధ = మొదలిడబడిన, నర్తనః = నృత్యముగలవాడను, కదా = ఎప్పుడు, స్యామ్ =అగుదును?

**తాత్పర్యము :** మీ పాద పద్మముల ధూళితో నిండిన తలకట్టుతో, అంతులేని హర్షోద్రేకమున నేనెప్పుడు నాట్యము చేయనారంభింతునో కదా!

శివుని పాదధూళి పద్మపరాగధూళి. దాని గుణము, అంటిన దానిని ఫలవంతముజేయుట. ఆ ధూళిని తలనిండ దాల్చిన భక్తుడు కోరునది శివపారవశ్యము. ఆ పారవశ్యము సద్యఃఫలమై వానికి లభించగా భక్తుడు నాట్యమాడమొదలిడును. ఆ నర్తనము సాక్షాత్ శివానందనర్తనమే. అట్టి స్థితి తనకు కలుగవలెనన్నది కవి ఆశయము. పాదాంబుజరజము శివానుగ్రహరూపము. దాని స్పర్శ శిరస్సున కలగగానే భక్తుని శరీరమంతటా ప్రసరించి, ఆ పరశక్తి అంకురించి, అనంతమైన ఆనందము వెల్లువై అప్రయత్నముగ ఆనందతాండవము ప్రారంభమగును.

**శ్లో॥ త్వదేకనాథో భగవన్నియదేవార్థయే సదా ।**
**త్వదన్తర్వసతిర్మూకో భవేయం మాఽన్యథా బుధః ॥ 3**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ స్వామీ !, త్వద్ = నిన్ను, ఏక = మాత్రమే, నాథః = నాథుడుగా గలవాడనైన (అహం=నేను), ఇయత్+ఏవ = ఇంతమాత్రమే, సదా = ఎల్లప్పుడు, అర్థయే = యాచించుచున్నాను, త్వద్+అన్తర్ = నీ యందు, వసతిః = నివాసముగల, మూకః = మూగవాడను, భవేయమ్ = అయియుందును, అన్యథా = (వేరువిధముగా) అట్లుకాకున్నచో, బుధః = జ్ఞానవంతుడనగుట, మా = వద్దు.

**తాత్పర్యము :** ఓ భగవాన్ ! నాకు నీవు మాత్రమే నాథుడవు. కనుక నేను నిన్ను కోరునది ఇంతమాత్రమే: మూగవాడనై నీయందు వసింతును, కాదేని జ్ఞానినై యుండుట కోరను.

ఉపాసనావిధిలో యేదేని ఒక దేవతా స్వరూపమును మనసులో ప్రతిష్ఠించికొని, ఆ దేవతనే తన సర్వస్వముగా భావించుట తప్పనిసరి. ఈ విధానంలో ఈ భక్తకవి తాను శివుని మాత్రమే ఆశ్రయించినవాడనని ప్రకటించి, ఈ శివాశ్రయమునకు తానాశించిన ప్రయోజన మేమో అటుపై ప్రకటిస్తూన్నాడు. శివునియందు నివాసమే ఆ ప్రయోజనం. అయితే శివునివలన జ్ఞానలబ్ధిని కోరదగునన్న ప్రసిద్ధవాదానికి విపరీతంగా తాను జ్ఞానిగా జ్ఞానబోధచేస్తూ లోకంలో గురువనిపించుకోవాలన్న కోరిక తనకు లేదంటూన్నాడు. మరేమి కావాలి? అంటే, శివుడు సుఖస్వరూపుడు కనుక, ఆ సుఖంలో తాను నివసించాలంటూన్నాడు. శివుని సుఖం కేవలం చిదానందమే కనుక అందులో జ్ఞానమూ ఉంటుంది. అట్లా జ్ఞానానందమయత్వాన్ని పొందినప్పుడు తనకింక మాటలతో పనిలేదు. మూగనై ఉంటానని తన నిశ్చితబుద్ధిని ప్రకటిస్తూన్నాడు ఈ భక్తకవి.

**శ్లో॥ అహో సుధానిధే! స్వామిన్! అహో మృష్ట! త్రిలోచన! ।
అహో స్వాదో! విరూపాక్షేత్యేవ నృత్యేయమారటన్ ॥ 4**

**ప్రతిపదార్థము :** స్వామిన్ = ఓ స్వామీ, అహో సుధానిధే = ఓ అమృతసముద్రమా, అహో మృష్ట = ఓ అభిషిక్తుడా, స్వయంపవిత్రుడా, త్రిలోచన = మూడు కన్నులవాడా, అహో స్వాదో = ఓ ఆనందరూపా, విరూపాక్ష = రూపభయంకరనేత్రుడా, ఇతి ఏవ = అనియే, ఆరటన్ = నినదించుచు, నృత్యేయమ్ = నృత్యము చేయుచుందును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఓ అమృతసముద్రా! ఓ పవిత్రా! ఓ ముక్కంటీ! ఓ ఆనందరూపా! ఓ వికృతనేత్రా! అని నీ నామములు నినదించుచు నృత్యము చేయుచుందును.

క్రిందటి శ్లోకంలో వలెనే ఈ శ్లోకంలోగూడ కవి తన స్వామియైన శివునియందే మనస్సును నిల్పి ఆనందిస్తానని ప్రకటిస్తూన్నాడు. తన స్వామి రూపాన్ని వర్ణిస్తూ, గుణాలను కీర్తిస్తూ ఆనందంలో మునిగి నృత్యం చేస్తానంటూన్నాడు. ఏమిటా రూప గుణాలు?

శివుడు మృత్యుంజయుడు కనుక అమృతత్వనిధి. ఆ స్వామి అభిషేకప్రియుడు కనుక నిత్యాభిషిక్తుడైన స్వయం పవిత్రుడు. సూర్యచంద్రాగ్ని నేత్రుడు. మూడు కన్నులతో వికారమైన ఆకారము గలవాడు కనుక విరూపాక్షుడు. అట్లే, రూపవికారమును గుర్తించని జ్ఞాననేత్రుడు. ఆనందస్వరూపుడు కనుక అవిచ్ఛిన్నమాధుర్యమూర్తియై భక్తులకు ఆసేవ్యుడైనవాడు. ఇట్టి రూపగుణసంపదగల స్వామిని మనసారా తలచి, పారవశ్యంతో నోరార పిలుస్తూ ఆనందతాండవం చేస్తానని ఈ భక్తకవి ప్రకటన.

**శ్లో॥ త్వత్పాదపద్మసంస్పర్శపరిమీలితలోచనః ।
విజృంభేయం భవద్భక్తిమదిరామదఘూర్ణితః ॥ 5**

**ప్రతిపదార్థము :** త్వత్ = మీ యొక్క, పాదపద్మ = పద్మముల బోలిన పాదములయొక్క, సంస్పర్శ = చక్కని స్పర్శచేత, పరిమీలిత = అరమోడ్పుగల, లోచనః = కన్నులుగలవాడనై, భవత్ = మీ యొక్క, భక్తిమదిరా = భక్తియను మదిరయొక్క, మద = మత్తుచే, ఘూర్ణితః = ప్రేరేపించబడినవాడనై, విజృంభేయమ్ = విజృంభింతును, నాట్యముజేతును.

**తాత్పర్యము :** స్వామీ! నీ పాదపద్మస్పర్శచేత కలిగిన అరమోడ్పుకనుదోయితో, భక్తిపారవశ్యమున నాట్యము జేయుదును.

స్పర్శకు అవ్యక్తానందాన్ని కలిగించే శక్తియున్నది. ఇది అందరికీ అనుభవమే. పసిబిడ్డల మెత్తని శరీరస్పర్శ ఎంత సుఖాన్నిస్తుందో తల్లులకే కాదు, ఎల్లరకూ తెలుసు.

అంతటి మహదానందాన్ని పువ్వుల స్పర్శకూడా కలిగిస్తుంది. కుసుమస్పర్శను పోలినదే శిశుస్పర్శ. అట్లే, దయతోకూడిన పెద్దల స్పర్శకూడ ఆనందదాయకం. శివుని పాదస్పర్శ వలన అంతటి సుఖం కలగటంలో ఆశ్చర్యమేమున్నది, ఆతడు సుఖస్వరూపుడేకదా! ఆనందం కలిగినప్పుడు అప్రయత్నంగా కన్నులు అరమోడ్పులవుతాయి. ఇది మనస్సు అంతర్ముఖమైనదని సూచిస్తుంది, అంటే పరిసరాల స్పృహలేదనీ భావం. అంతటి ఆత్మానందంలో వివశుడై నృత్యం చేస్తాడు భక్తుడు. **విజృంభ** శబ్దప్రయోగం దీన్ని తెలుపుతుంది. దైవయుక్తుని ఈ పారవశ్యాన్ని కనులకు బొమ్మకట్టేట్లు చెప్పాలంటే, తప్పత్రాగినవాని వివశమైన నృత్యంతో పోల్చక తప్పదు. అందుకే యోగానందంలో మునిగిన వారిని గురించి చెప్పేటప్పుడు, పసిపిల్లల ఆనంద చర్యలతోను, ఉన్మత్తులతోను పోలుస్తారు. **మదిర** ఒక పానీయం. ఇది మత్తును కలిగిస్తుంది. భక్తికూడ మదిరవలెనే మత్తును కలిగిస్తుంది. ఆ మత్తు ఒక ఆనందాతిరేకం. అది శరీరాన్ని ఆడిస్తుంది. ఈ స్థితిని కవి వర్ణిస్తూన్నాడు.

**శ్లో॥ చిత్తభూభృద్భువి విభో! వసేయం క్వాపి యత్ర సా ।**
**నిరన్తరత్వత్ప్రలాపమయీ వృత్తిర్మహారసా ॥ 6**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, చిత్తభూభృత్ = చిత్తమను పర్వతముయొక్క, భువి = భూమిపై(శిఖరముపై), క్వా అపి = ఏదైన నొకచోట, యత్ర = ఎక్కడ, నిరన్తర = ఎడలేని, త్వత్ = నీ యొక్క, ప్రలాపమయీ = సంకీర్తనముతో కూడిన, సా = అట్టి, మహారసా = మహదానందపూర్ణమైన, వృత్తిః = వర్తనమో,(తత్ర = అక్కడ), వసేయమ్ = నివసింతును.

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపి శివా! నా మనస్సులో యే తావున నీ నామస్మరణ, కీర్తనమూ నిరంతరము సాగుతూ మహదానందము నెలకొని ఉంటుందో, అక్కడ నేను నివాస మేర్పరచుకుంటాను.

మనస్సు పర్వతంవలె దాటరాని ఆటంకం, శిలవలె కఠోరమైనది. అయితేనేమి? నీవు సర్వవ్యాపివి కనుక ఆ మనశ్శిలాపర్వతసానుప్రదేశాలలో ఎక్కడనో ఒకచోట నీవున్నావన్న గుర్తింపు కలుగకపోదు. ఏమిటా గుర్తింపు? అంటే, అక్కడ నిరంతరం నీ స్మరణ మారుమ్రోగుతూంటుంది. ఆ చోటునెఱిగి నేనక్కడే నివసిస్తాను. అలౌకికమైన మహదానందాన్ని అనుభవిస్తాను.

మనస్సుకు వివేకవృత్తి ఉన్నది కదా, ఆ వృత్తివలననే కదా ఆనందానుభవం కలుగుతుంది. అట్లా ఆ వివేకమే నీ ఉనికిని నాకు పరిచయం చేస్తుంది, శివస్వరూప

ఆనందాన్ని కలిగిస్తుంది. అప్పుడింక శిలవంటి ఈ మనస్సు రసార్ద్రమవుతుంది, పర్వతోన్నతమై లోకం క్రొత్తగా కనబడుతుంది, పర్వతాగ్రాన నిల్చినవానికి కనిపించినట్లు. ఆనందం పెల్లుబికి చుట్టివేస్తుంది. చంచలమైన మనస్సు నిజంగానే అచలానందకైలాసమే అవుతుంది. నేనక్కడే కైలాసవాసినై ఉంటాను.

**శ్లో॥ యత్ర దేవీసమేతస్త్వమాసౌధాదా చ గోపురాత్ ।**
**బహురూపః స్థితస్తస్మిన్వాస్తవ్యః స్యామహం పురే ॥ 7**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, దేవీసమేతః = దేవితో కూడి, త్వమ్ = నీవు, ఆసౌధాత్ = భవనమునుండి, ఆ చ గోపురాత్ = గోపురమునుండియు, బహురూపః = అనేక రూపములుగల వాడవై, స్థితః = ఉన్నావు, తస్మిన్ పురే = ఆ నగరమునందు, అహమ్ = నేను, వాస్తవ్యః = నివాసముచేయువాడను, స్యామ్ = అగుదును.

**తాత్పర్యము :** ఏ పురంలో దేవితోగూడి భవనము మొదలు గోపురద్వారమువరకు అనేక రూపములతో వెలిసియున్నావో ఆ పురమునందు నేను నివసింతును.

స్వామితో నిండియున్న చిదాత్మరూపమైనది పురము, అనగా శరీరము. అక్కడ పరాశక్తితో శివుడున్నాడు. కనుక శరీరములోని అంతరంగము ఉన్నతమైన పరప్రమాత పరము నెఱిగిన కూటస్థుని ప్రత్యక్ చైతన్యము. ఇది సౌధము. అనగా ఆంతరమైన అమృతత్వరూపము. ఈ సౌధానికి ద్వారాలు ఇంద్రియ విషయాలు. వానినే గోపురమని వర్ణించినాడు. ఈ ద్వారమువరకు బహురూపములలో శివుడున్నాడు. మరియొక విధంగా, అంతఃకరణంతో కలిసి ఇంద్రియాల ద్వారా జ్ఞానంపొందే జీవుడు బహురూపి. ఈ జీవులకు, అనగా పశువులకు శివుడు పతి. కనుక శివుడున్నచోట, పతితోగలిసి పత్నియున్నట్లు, శరీరమనే నగరంలో శివునితో గూడి జీవుడున్నాడు, ఉండవలె కనుక కవి తాను అట్లే ఉందునని చెప్పుట. ఈ కలయిక మహదానంద స్థితి. జీవుల బహుళత్వం బహురూపః అనటంలో స్పష్టం.

**శ్లో॥ సముల్లసన్తు భగవన్! భవద్భానుమరీచయః ।**
**వికసత్వేష యావన్మే హృత్పద్మః పూజనాయ తే ॥ 8**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ భగవంతుడా!, భవద్ = తమయొక్క, భానుమరీచయః = సూర్యకిరణములు, యావత్ = ఎంతకాలము, ఏషః మే = ఈ నాయొక్క, హృత్పద్మః = హృదయపద్మము, తే = నీయొక్క, పూజనాయ = పూజకై, వికసతు = విప్పారి యుండునో, (తావత్ = అంతవరకు), సముల్లసన్తు = ఉల్లాసమును కలిగించుగాక! (ప్రకాశించుగాక!).

**తాత్పర్యము :** నీ సేవకై పుట్టిన నా హృదయపద్మము వికాసమున పూర్ణత్వమును సాధించువరకు నీ సూర్యకాంతి కిరణములు నాపై ప్రకాశించునుగాక!

సూర్యకాంతికిరణాలు సోకినప్పుడే పద్మం వికసిస్తుందన్నది ప్రాకృతికసత్యం. భక్తుని హృదయం పద్మంతో సమానమైనదే: అది భగవంతుని అనుగ్రహశక్తులు తనపై ప్రసరిస్తూంటే క్రమపరిణామంగా పరిపూర్ణవికాసం చెందుతుంది. ఆ అనుగ్రహాన్ని భగవానుడుపసంహరించికుంటే, ముకుళిస్తుంది కూడ. అందువలన భక్తుడెప్పుడూ భగవదనుగ్రహం తన హృదయవికసనం సమగ్రమయ్యేంతవరకు తనపై నిలిచి ఉండాలని కోరుకుంటాడు, అందుకై ప్రార్థిస్తూంటాడు.

శివుడు అష్టమూర్తి: పంచభూతాలు, సూర్యచంద్రులు, జీవుని అంతర్వర్తి పురుషుడు, ఈ అష్టమూర్తులు. భక్తుని జన్మస్థానమైన భూమి, నీరు, వానికి జీవశక్తిప్రదుడైన సూర్యుడు, వానిలోని కర్తృత్వ పురుషుడు, అన్నీ తానేయైన శివుడు భక్తుడనబడు జీవుడు శివుడుగా వికసించటానికి తన అనుగ్రహాన్ని ప్రసరిస్తూనే ఉంటాడు. దానికవాంతరాలు కలుగరాదని భక్తుని ప్రార్థన.

**శ్లో॥ ప్రసీద భగవన్ యేన త్వత్పదే పతితం సదా ।**
**మనో మే తత్తదాస్వాద్య క్షీవేదివ గలేదివ ॥ 9**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ దేవా!, ప్రసీద = ప్రసన్నుడవగుము, యేన = దేనిచే, త్వత్ = నీయొక్క, పదే = పాదమునందు, సదా = ఎల్లప్పుడు, పతితమ్ = పడిన, మే = నాయొక్క, మనః = మనస్సు, తత్+తత్ = వానిని, ఆస్వాద్య = ఆస్వాదించి, క్షీవేత్ ఇవ = మత్తెక్కునట్లు, గలేత్ ఇవ = లయమొందునట్లు.

**తాత్పర్యము :** ఓ దేవా! నీ పాదములందు ఎల్లప్పుడు నా మనస్సు ఆర్పితమై, ఆ స్థితి నాస్వాదించి, పరవశించి, అందే లయమగునట్లు నా యందు ప్రసన్నత వహించుము.

**పదము** అనగా పాదమని, స్థానమని అర్థాలున్నవి. ఇక్కడ రెంటిని గ్రహించవచ్చు. కనుక, నీకు శరణాగతిచేసిన, నీదైన శాక్తమార్గముననుసరించిన, అని రెండు విధాలుగా **త్వత్పదే** అన్నదానికి అర్థమేర్పడుతుంది. భక్తుని మనస్సు భగవానుని కర్పితమై శాక్తమార్గముననుసరించినదని భావము, ఆ స్థితిని ఆనందంగా స్వీకరించి, పరవశించి, అందే మగ్నమగునట్లు తన మనస్సు ప్రసాదగుణాన్ని సంతరించికొనగలందులకు భక్తుని ప్రార్థన. అందుకు దైవానుగ్రహం కావాలి, భగవంతుని ప్రసన్నతను ప్రార్థిస్తూన్నాడు భక్తకవి. ప్రసాదము, అంటే, తనలోని మాలిన్యాన్ని వడకట్టి నిర్మలమయ్యే

సహజగుణం నీటికున్నట్లు తన మనస్సుకు కలగవలెనని భక్తుని భావాన్ని ప్రకటించే క్రియాపదం **ప్రసీద.** ఆనందం ఎంత గాఢానుభవమైతే అంతగా మనస్సు అంతర్ముఖమై మత్తత కలుగుతుంది. ఈ మత్తత గాఢమైన కొలదీ మనస్సు భగంతునిలో లీనమవుతుంది, ప్రాకృతిక మనోధర్మం లయమవుతుంది. ఈ భావాన్ని చెప్పేవే **క్షీవేత్, గలేత్** అన్న క్రియా పదాలు.

**శ్లో॥ ప్రహర్షాద్వాఽథ శోకాద్వా యది కుడ్యాద్ఘటాదపి ।**
**బాహ్యాదథాన్తరాద్భావాత్ప్రకటీభవ మే ప్రభో ॥ 10**

**ప్రతిపదార్థము :** ప్రభో = ఓ ప్రభూ!, ప్రహర్షాత్ = సంతోషమునుండి, అథవా = లేక, శోకాత్ = శోకమునుండి, యది వా = లేక, కుడ్యాత్ = గోడనుండి, ఘటాత్ అపి = కుండనుండిగాని, మబ్బునుండిగాని, బాహ్యాత్ = బైటనుండి, అథ = లేక, ఆన్తరాత్ = లోపలినుండి, భావాత్ = వస్తువునుండి లేక భావమునుండి, మే = నాకు, ప్రకటీభవ = ప్రకటముగమ్ము.

**తాత్పర్యము :** ఓ ప్రభూ!, నాకు నీ దర్శనము కావలె. ఎక్కడనుండి ఆవిర్భవించిననూ సరియే. సంతోషము, దుఃఖము, గోడ, కుండ, మబ్బు, ఏ వస్తువునుండైనా, నా బైటనుండిగాని లోపలనుండిగాని నీవు ప్రకటమై దర్శనమిమ్ము.

ప్రభువు అంటే అంతటా ప్రభవము, పుట్టుకగలవాడు. కనుక శివుడు భక్తునికొరకు ఎక్కడైనా ప్రభవించగలడు. ఎక్కడ ప్రభవించినప్పటికీ, అది భక్తుని బైటగల వస్తువులనుండిగాని లేక లోపలి సంతోష దుఃఖాది భావాలలోగాని, తనకు ప్రత్యక్ష దర్శనం కావాలి. అంతటా వానిని చూడగల శక్తి మానవమాత్రుడెంత భక్తుడైనా, వానికి లేదు. దేశకాలనామరూపాది లక్షణాలతో ప్రకటమయ్యేది మాత్రమే వానికి ప్రత్యక్షం. కానిది పరోక్షం. శివుడా సర్వత్ర ప్రభవించగల ప్రభువు కనుక ఆతడే భక్తుని పరిమితులెఱిగి ప్రత్యక్షం కావాలి.

**శ్లో॥ బహిరప్యన్తరపి తత్ స్యన్దమానం సదాస్తు మే ।**
**భవత్పాదాంబుజస్పర్శామృతమత్యన్తశీతలమ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** తత్ = అది, అత్యన్త = అమితమైన, శీతలమ్ = చల్లనిది, బహిః అపి = బయటను, అన్తః అపి = లోపలను గూడ, స్యన్దమానమ్ = చిందుచున్న, స్రవించుచున్న, భవత్ = తమయొక్క, పాద = పాదములుఅనబడు, అంబుజ = పద్మములయొక్క, స్పర్శ = స్పర్శయను, అమృతమ్ = అమృతము, మే = నాకు, సదా = ఎల్లవేళల, అస్తు = కలుగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! మీ అమృతమయ పాదస్పర్శ నాకు అన్నివేళల కలుగుగాక! అది నా జీవితపు బాహ్యావరణాన్నీ, నా అంతరావరణాన్నీ కూడా చల్లబరుస్తుంది.

భారతదేశంలోని వాతావరణం మొత్తంమీద సమశీతోష్ణంగానే ఉన్నప్పటికిన్నీ, తాపమే ఒక పాలు అధికంగా ఉండటం అనుభవంలో ఉన్నదే. కనుకే ఈ ప్రభావం వలన చల్లదనం భారతీయులకు స్నేహానికీ, సౌహార్దానికీ, శుభానికీ, సుఖానికీ, క్షేమానికీ సంకేతమయింది. కాని కవోష్ణత పాశ్చాత్యులకు ఈ భావాలకు సంకేతమైనది. వారికి చల్లదనం మృత్యువుకు, దుఃఖానికి, అమంగళానికి ప్రతీక అయినది. ఈ నేపథ్యంలో **అత్యన్తశీతలమ్** అనటంలోని ఔచిత్యం గ్రాహ్యం. లౌకికజీవితం, వ్యక్తికి బైటగల పరిస్థితులు, లోపల మనస్సు స్థితి, అన్నీ అత్యధికంగా తాపాన్ని కలిగెంచేదే. కనుక భారతీయుడు శాంతికి పర్యాయమైన చల్లదనాన్ని ఆహ్వానిస్తాడు. ఎప్పుడూ నీటిలో ఉంటూ మెత్తని, చల్లని సుఖస్పర్శను కలిగించే తామరపూవులూ, కలువలూ కూడా తాపహారులై లక్ష్మీప్రదాలుగా భావింప బడుతూన్నాయి. సుఖస్వరూపుడైన శివుని పాదం పద్మంగా భావింపబడి, లౌకికాధ్యాత్మిక తాపాలను హరించేదిగా పూజింపబడుతూన్నది. పద్మం అమృతానికి నెలవు. అట్లే శివుడు మృత్యుంజయుడైన అమృతమూర్తి. తనను ఆశ్రయించిన తుమ్మెదలకు పద్మం తన గర్భంలోని తేనెనందించినట్లే, శివుడు తన నాశ్రయించిన భక్తులకు అమృతత్వాన్ని ప్రసాదించగలడు. అదే ఈ భక్తకవి ఆకాంక్ష.

**శ్లో॥ త్వత్పాదసంస్పర్శసుధాసరసోఽన్తర్నిమజ్జనమ్ ।**
**కోఽప్యేష సర్వసంభోగలంఘీ భోగోఽస్తు మే సదా ॥ 12**

**ప్రతిపదార్థము :** త్వత్ = తమయొక్క, పాద = పాదములయొక్క, సంస్పర్శ = సుఖకరమైన స్పర్శ అనబడు, సుధా = అమృతపు, సరసః = సరస్సునకు, అంతర్ = లోపల, నిమజ్జనమ్ = మునుగుట, ఏషః = (అను)ఇది, కః అపి = ఏదేనొక, సర్వ = అన్ని, సంభోగ = భోగములకంటే, లంఘీ = అధికమైన, భోగః = భోగము, మే = నాకు, సదా ఎల్లప్పుడు, అస్తు = కలుగుగాక!

**తాత్పర్యము :** నీ పాద సంస్పర్శ అనబడే అమృతసరస్సులో లోతుగా మునగటం, స్నానం చేయటం అన్నది అన్నివిధాల భోగాలను మించిన అనిర్వాచ్యమైన ఒక భోగం. అది సర్వదా నాకు కలుగుగాక!

లోకంలో భోగాలన్నీ ఇంద్రియ విషయసంబంధమైనవే. అన్నీ క్షణికాలే. అన్ని భోగాలలో శ్రేష్ఠమైనది, బ్రహ్మానందసహోదరంగా చెప్పబడేది, స్త్రీ పురుషుల కలయికలోని

ఆనందం. అందుకే దానిని మాత్రం సంభోగమని వర్ణిస్తారు పరిపాటిగా కాని అదికూడ క్షణికమే. అయితే, వీనినన్నిటినీ మించినదీ, ఇంద్రియవిషయం కానిదీ, కనుకే శాశ్వతమైనదీ ఒక భోగమున్నది. అదియే శివపాదసంస్పర్శసుధానందం. అది స్పర్శ అని చెప్పబడినప్పటికిన్నీ, ఇంద్రియవిషయంకాదు. ఇంద్రియానుభవం తప్ప అతీంద్రియానుభవంగాని లేక ఆత్మానుభవంగాని లేని లౌకికులకు ఇంద్రియానుభవ భాషమాత్రమే అర్థమవుతుంది. అందుకే **స్పర్శ, సరస్సు, నిమజ్జనం** వంటి పదాలే ఆధారంగా చెప్పక తప్పదు. శివపదం అమృతపదం. దాని స్పర్శ తగిలిన తరువాత మర్త్యలోకానుభవానికి విలువ ఉండదు. కనుకే **సదా అస్తు మే** నాకు ఎల్లప్పుడు ఆ అనుభవమే కావాలని ఈ భక్తకవి అభ్యర్థన.

శాక్తేయానుభవంలో, శివపాదసంస్పర్శ అంటే భక్తునిలో రుద్రశక్తి సమావేశం కావటం. ఆ రుద్రశక్తికే సుధాసరస్సు అని పేరు. ఇది రసాబ్ధి. రసం అంటే ఆనందం. కనుకే **రసో వై సః,** అంటే శివుడు ఆనందమే, అని అర్థం. ఈ ఆనంద సరస్సులో నిమజ్జనం అంటే పూర్తిగా మునిగిపోవటం, లౌకికతను దూరంగా నెట్టివేయటం. ఈ స్థితి అసాధారణం, అనిర్వాచ్యం. అందుకే దానిని **కోఽపి,** ఇది-అది అని చెప్పరానిదేదో ఒకటి, అనటం. ఈ రుద్రపరంపరలో ఒక్కొక్క మూర్తికొక్కొక్క భోగం, వీనిలో శ్రేష్ఠం సదాశివభోగం. దాన్నికూడా మించినది కనుక **సర్వాన్** అనటం.

**శ్లో॥ నివేదితముపాదత్స్వ రాగాది భగవన్మయా ।**
**ఆదాయ చామృతీకృత్య భుంక్ష్వ భక్తజనైస్సమమ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ భగవంతుడా!, మయా = నాచేత, నివేదితమ్ = అర్పించబడిన, రాగ+ఆది = రాగద్వేషములు మొదలుగాగలవానిని, ఉపాదత్స్వ = గ్రహింపుడు, స్వీకరించండి, చ = మరియు, ఆదాయ = స్వీకరించి, అమృతీకృత్య = అమృతమయంగా, ఆనందమయంగా చేసి, భక్తజనైః = భక్తులతో, సమమ్ = కలిసి సమముగా, భుంక్ష్వ = అనుభవించండి.

**తాత్పర్యము :** ఓ భగవన్! సంసారాదినుండి నేను సంపాదించిన రాగద్వేషాదులను మీకు సమర్పిస్తూన్నాను. స్వీకరించి, వానిని అమృతప్రాయమైన ఆనందానుభవంగా మార్చి, తమరు తమ భక్తులందరితో కలిసి ఆస్వాదించండి.

లోకయాత్ర మొదలైననాటినుండి మానవుడు సంపాదించినవి కొన్నిటిపై మక్కువ, కొన్నిటిపై అనిష్టము. కామక్రోధలోభమోహమదమాత్సర్యాలన్నీ ఈ రాగద్వేషాల

రూపాంతరాలు, స్థాయీభేదాలున్నూ. ఇవన్నీ తీసివేస్తే మానవునికి ఉనికిలేదు. వీటి అనుభవంలోనుండే భక్తివైరాగ్యాలు సాకారం కావాలి, కొందరిలో అవుతాయి. వీరి భక్తి కూడా రాగద్వేషరహితం అనటానికి వీలులేనిదే. భక్తి దైవసంబంధమే. అయినా శివభక్తులూ, విష్ణుభక్తులూ, శక్తిమాతభక్తులూ, అల్లాభక్తులూ, ఏసుభక్తులూ అంటూ ఇట్లా రాగమయమైనవే. రాగమున్నచోట ద్వేషం ఉండక తప్పదు. అందుకే, ఎవరి దేవుడు వారికే దేవుడు, మిగతవారికి దేవుడు కాడు, దెయ్యం, సాతాను, ఈ వికారం సరియైనది కాదని అంతరాత్మప్రబోధం అందరికీ ఉంటుంది. common sense చెబుతుంది. కాని తన ఆధ్యాత్మికతకు ఆలంబన, అనుభవభూమి అయిన దేవతామూర్తి దైవత్వమే ఎవరికి వారికి ఆనందదాయకం, అంగీకారయోగ్యం. మిగతవానిని తాను గౌరవించలేడు. అందుచేత తన రాగద్వేషాలనే తాను తన దేవునకు అర్పిస్తూన్నాడు. తన దేవుడు స్వీకరించవలసినదే. అవి విషప్రాయమైతే, వానిని సంస్కరించి, అమృతీకరించి తన భక్తులందరితో పంచికొని ఆస్వాదించవలసినదే. తాను శివభక్తుడని, విష్ణువూవైష్ణవులూ ప్రక్కకు నెట్టినట్లే, శివుడుకూడా భక్తుడు తనదైవత్వాన్ని సంకుచితం చేసినాడని కోపగించి తనను వదిలేస్తే ఎట్లా? శివభక్తులకు తాను బంధువు కనుక శివునకూ బంధవే. తన నివేదననందరూ ఆస్వాద్యంగా స్వీకరించవలసిందే. ఇదీ భక్తకవి హృదయం.

భక్తుడు భగవంతునికి నివేదించేది లౌకికవాసనామయమైన భావమో వస్తువో, ఏదైనగాని అది భగవత్ స్పర్శతో అలౌకికమై ఆనందమయమవుతుంది. శివుడు విషాన్ని గళంలో నిల్పికొని, లోకాలకమృతత్వాన్ని ప్రసాదించినాడు కదా. ఈ రాగద్వేషా లెంతపాటి?!

**శ్లో॥ అశేషభువనాహారనిత్యతృప్తః సుఖాసనమ్ ।**
**స్వామిన్! గృహాణ దాసేషు ప్రసాదాలోకనక్షణమ్ ॥ 14**

**ప్రతిపదార్థము :** స్వామిన్ = ఓ స్వామీ!, అశేష = సమస్త, భువన = లోకముల, ఆహార = ఆహారముచే, నిత్య = ఎల్లవేళల, తృప్తః = తృప్తుడవై, దాసేషు = భక్తులయందు, సుఖాసనం = సుఖమైన ఆసనమును, ప్రసాద = అనుగ్రహరూపమైన, ఆలోకన = దృష్టియొక్క, క్షణమ్ = క్షణకాలము, గృహాణ = స్వీకరించుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ!, అశేషలోకాలకు ఆహారమును నిత్యం యేర్పఱచిన తృప్తితో, నీ భక్తులననుగ్రహించి ఒక్కక్షణం వారియందు సుఖాసనాన్ని స్వీకరించు.

**అశేషభువనాహారేణ** అన్నసమాసానికి (1) సమస్త భువనములకు ఆహారాన్ని యేర్పఱచటంచేత, (2) సమస్త భువనములు నివేదించిన ఆహారాన్ని స్వీకరించటంచేత, (3) సమస్త భువనాలను ఆహారంగా నిత్యం స్వీకరించటంచేత, అని మూడు విధాలుగా అన్వయించవచ్చు. అర్థం (1) ననుసరించి, అన్ని లోకాలకు శివుడు సుఖప్రదాతగా ఆహారాన్ని నిత్యం యేర్పఱుస్తాడు. ఆ తృప్తితో భక్తుల హృదయాల్లో సుఖాసనం స్వీకరించి అనుగ్రహించుమని భావం. అర్థం (2) ననుసరించి, శివుని పశుపతిగా భావించి సమస్తలోకాలు వివిధాహారాలను నైవేద్యంగా సమర్పిస్తూంటే, వారి భక్తికి సంతోషించి నిత్యం తృప్తితో భక్తుల హృదయాలలో సుఖంగా నివసిస్తూ అనుగ్రహించుమని భావం. అర్థం (3) ననుసరించి సమస్త లోకాలను రుద్రమూర్తియై నిత్యం ఆహారంగా స్వీకరిస్తూ భక్తులననుగ్రహించి వారి హృదయాలలో క్షణకాలం సుఖాసనాన్ని స్వీకరించుమని భావం. అయితే, రుద్రుడు లయకారుడై సమస్తాన్నీ ఆహరించేది ప్రళయకాలంలో కదా, మరి నిత్యతృప్తుడెట్లా అవుతాడు? భక్తులను అనుగ్రహరూపంలో ఒక్కక్షణంసేపు దృష్టిసారించి, ఆ రూపంలో సుఖాసనం స్వీకరించగలడు ఆ స్వామి. ఆ క్షణకాలానుగ్రహం చాలు భక్తులకు. భగవంతుడు పదార్థసేవనంతో తృప్తుడుకాడు. భక్తునిలోని, సమస్తలోకాలలోని అశివగుణాలను రుద్రుడై ఆహరిస్తాడు. ఇది నిత్యక్రియ. కనుకే నిత్యతృప్తుడు శివుడు.

భగవంతుడు ఆనందమయుడు, భగవదనుగ్రహం ఆనందమయం. దాన్ని పొందినవారు ధన్యులు, అన్నదే ఈ శ్లోక తాత్పర్యం.

**శ్లో॥ అన్తర్భక్తిచమత్కారచర్వణామీలితేక్షణః ।**
**నమో మహ్యం శివాయేతి పూజయన్ స్యాం తృణాన్యపి ॥ 15**

**ప్రతిపదార్థము :** అన్తః = లోపల, భక్తి = భక్తియొక్క, చమత్కార = ప్రకాశనముయొక్క, చర్వణ = ఆస్వాదనముచే, ఆమీలిత = మూయబడియున్న, ఈక్షణః = కన్నులుగలవాడనై, మహ్యం శివాయ = నేనైన శివునికొరకు(లేక, శివుడనైన నాకొరకు, శివాయ మహ్యం), నమః = నమస్కారము, ఇతి = అని, తృణాని+అపి = గడ్డిపరకలనుగూడ, పూజయన్ = పూజించుచు, స్యామ్ = ఉందును.

**తాత్పర్యము :** నాలోని భక్తి పారవశ్యమున కన్నులుమూతబడగా, నాలోనే శివుడవైన నిన్ను జూచుచు, శివమయుడనై తృణములోగూడ నిన్నే చూచుచు, **నమః శివాయ** అనుచు పూజించుచుందును.

మానవునిలో అహంకారము మూడు రీతులు: జీవాహంకారము,

దేవాహంకారము, విశ్వ,లేక, విరాడహంకారము. జీవాహంకారము ఇంద్రియవశమై ప్రవర్తించేది. విరాడహంకారం లేక విశ్వాహంకారం ప్రేమతో ప్రవర్తించేది. జీవాహంకారం దేవాహంకారంగానూ, ఆపై విశ్వాహంకారంగానూ పరిణామం చెందవలసిన ప్రక్రియకే జీవితం అన్నపేరు. ఇంద్రియాలు కట్టిపడవేసినందువలన పరిణామక్రమం ఒక జీవితకాలంలో సంపన్నంకావటం తఱచు జరుగదు. కాని అప్పుడప్పుడు దేవాహంకారానుభవమూ, విశ్వాహంకారానుభవమూ కూడ తటిత్ ప్రకాశంగా మానవునకు కలగటం గమనించవచ్చు. ఈ పరిణామసాధ్యతకు ఇదే బీజం అనవచ్చు. ఈ బీజావాపం మానవునిలో జన్మతః జరిగే ఉన్నది. దాని వికసనంలో దోహదకారిగా భక్తి గ్రాహ్యం. కొందరిలో ఇది దైవభక్తిగానూ, మరికొందరిలో ఇది దేశభక్తిగానూ, ఇంకనూ కొందరిలో ఇది మతధర్మభక్తిగానూ, అన్యులలో ఇది విశుద్ధ మానవతావాదంగానూ పరిఢవిల్లుతుంది. ఈ కారణంగా, వీరిలో తెగువ, ఆత్మవిశ్వాసం, త్యాగశీలం కలిగి కార్యసాధకులుగా, ప్రవక్తలుగా వారు వారు తమ తమ మార్గాలలో పరిక్రమిస్తూంటారు.

దైవభక్తి ప్రధానులలో తొలుత భక్తి ప్రకటనం ఇంద్రియప్రీణనశీలంగా సాగవచ్చు, క్రమంగా ఈ స్థాయినిదాటి మనః ప్రీణనశీలంగా పరిణమించి, దానినీ అధిగమించి అంతరాంతరవర్తి ఆత్మప్రీణనశీలంగా మారి ఆత్మతో తాదాత్మ్యంచెంది తన స్వస్వరూపమయిన సచ్చిదానందానుభవాన్ని పొందగలుగుతాడు దైవభక్తుడు. ఇదే స్థితి పై నుదహరించిన ఇతరవిధముల భక్తులలోనూ కలుగవచ్చు. కనుకే, మానవసేవే మాధవసేవ, జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ, ఇత్యాది నానుడులు అనుభవం నుండి పుట్టినవి. ఈ మార్గాలలో యే మార్గాన పయనించినప్పటికీ గమ్యం సచ్చిదానంద స్వరూపుడైన శివుడు తానే అని భక్తుడు గ్రహించటం, సోఽహం (సః = శివుడు, అహం = నేను) అన్న సత్యాన్ని గ్రహించి, తాను ద్వేషించదగినదిగాని, పరిహసించదగినదిగాని, తనకు అపకారిగాని, ఉపకారిగాని, తాను కానిదిగాని వేరొకటి లేనే లేదన్న ప్రమ కలిగి లోకభ్రమ తొలిగిపోతుంది.

ఈ శ్లోకంలో భక్తకవి ఈ చరమసత్యానుభవాన్ని పొందుతూ కలకాలం ఉండిపోవాలని తపిస్తూన్నాడు. అన్తర్భక్తి అంటే బాహ్యాడంబరానికి దూరంగా, బాహ్యస్పృహలేకుండా, ఆనందమగ్నమనస్కమైన భక్తి, ఈ స్థితిలో శరీరమూ మనస్సూ దాటి 'ఆత్మ' అనబడే విరాడహంకార దర్శనంతో సమాధిస్థితుడవుతాడు భక్తుడు. **ఆమీలితేక్షణః** అన్న వర్ణన ఈ స్థితిని తెలిపేది. ఆ స్థితిలో భక్తుడు, భక్తి, శివుడు,

మూడూ ఏకరూపమైపోతాయి. కాగా తృణం తృణంగా కన్పించదు, శివుడుగానే కన్పిస్తుంది. ఆ శివుడైన తృణాన్ని శివుడైన తాను పూజిస్తాడు. ఇది, ఆంగ్లకవి John Keats చెప్పినట్లు Being too happy in thy happiness, నీ ఆనందంలో నేను ద్విగుణీకృతానందాన్నిపొందే స్థితి, విశ్వప్రేమానుభవాన్ని చర్వణంచేసే ఆత్మయొక్క విశ్వరూపసందర్శనస్థితి. నిజానికిక్కడ మనకు పరిచయమున్న పూజావిధానం, ఆవాహనం, ఆసన సమర్పణం, పాద్యం, పానీయం, నైవేద్యం, ఇట్లాంటిదేమీ ఉండదు. తన ఉనికి, తన జ్ఞానం, సర్వం ఆనందమయమన్న దర్శనం మాత్రమే. అందుకు నారదమహర్షికూడా భక్తి అన్నది ప్రేమకు మరొక పేరు అంటాడు. నొక్కి చెప్పటానికి ప్రేమభక్తి అనికూడ దీనిని అంటాడు.

**శ్లో॥ అపి లబ్ధభవద్భావః స్వాత్మోల్లాసమయం జగత్ ।**
**పశ్యన్ భక్తిరసాభోగైర్భవేయమవియోజితః ॥ 16**

**ప్రతిపదార్థము :** లబ్ధ = పొందబడిన, భవద్ = తమయొక్క, భావః = భావముగలవాడనై, జగత్ = విశ్వమును, స్వ = నాయొక్క, ఆత్మ = ఆత్మయొక్క, ఉల్లాస = ప్రకాశముతో, మయమ్ = నిండినదానినిగా, పశ్యన్ అపి = దర్శించుచున్నప్పటికిని, భక్తిరస = భక్తియను ఆనందముయొక్క, ఆభోగైః = వైభవములచేత, అవియోజితః = వంచితుడను కానివాడను, భవేయమ్ = అగుదును.

**తాత్పర్యము :** (పై శ్లోకమున చెప్పినట్లు), స్వామీ! తమలో తాదాత్మ్యముపొంది నా ఆత్మప్రకాశముతో జగత్తంతయు నిండియుండుటను దర్శించుచు, ఆ స్థితిలోకూడ నీయందలి భక్తిభావములో కలుగు ఆనందవైభవములచేత ఆకర్షింపబడకుండ ఉందును.

శివుడే ఆత్మ, ఆత్మయే శివుడు అన్న సత్యాన్ని భక్తిపారవశ్యంలో కలిగిన సమాధిస్థితిలో దర్శిస్తూ, విశ్వమంతా తానై ప్రకాశిస్తూన్న అసమానతలులేని స్థితిలో భక్తుడు ఎంతసేపు నిలువగలడు? అన్న ప్రశ్న అనుభవంలోకి వస్తుంది. Individual Consciousness, వైయక్తిక స్పృహను కోల్పడిన తాదాత్మ్య స్థితినుండి Universal Consciousness, విశ్వస్పృహను అందుకొనికూడా భక్తుడు సాధారణంగా ఆ విశ్వాత్మస్పృహలో నిలువలేక అతి త్వరలో మరల వైయక్తిక స్పృహలోనికీ దైవీ చేతనలోనికి జారిపోవటం పరిపాటి. తపస్సుకు ఫలంగా ఆరాధ్యదైవం ప్రత్యక్షమై వరాలు ప్రసాదించటమే పురాణగాథలన్నిటా సర్వోత్తమంగా కనిపిస్తుంది. అంటే, భగవంతుడు, భక్తుడు, భక్తి అన్న త్రయీస్థితినిదాటి నిలవటం, స్థిరంగా ఉండటం, అసంభవమా? ఆ స్థితిలో ఈ వ్యక్తాత్మ తన ఉపాధినాశ్రయించి ఎంతోకాలం నిలువలేదా? ఉపాధిని

త్యజించి అనంతాత్మచైతన్యంగా పరివర్తనం చెందటమో లేక మరల వ్యక్తాత్మదైన ఉత్తమమైన త్రయీస్థితిని పొందటమో జరుగక తప్పదా? అన్నది ప్రశ్న. మహాయోగుల అనుభవం, 'తప్పదని' సమాధానమిస్తూన్నది. అయినప్పటికీ, ఆ విశ్వాత్మానుభవంలో ఆ ప్రేమసింధుస్థితిలో ఈ శరీరంలోనే ఉండిపోతే ఎంత బాగుండును! అనిపిస్తుంది. ఆ అనిపించటంలోనే భక్తుని దైహికస్పృహా బీజం ఇమిడి ఉన్నది. అదే ఆతడు ఆ అత్యుత్తమ అనంతస్థితిలో నిలువకుండటానికి కారణమవుతున్నది. ఆ డోలయమానస్థితిలో కాక దైహికవంచనలేని స్థితిలో సంపూర్ణ తాదాత్మ్యంలో తాను ఉండవలెనన్నది ఈ భక్తకవి సంకల్పం. సర్వాత్మగా తాను భాసించే స్థితిలో విశ్వంలేదుకదా. ఆ సత్యానుభవం ఒక్కక్షణం కలిగితే, దాని ప్రభావం వలన మరల బాహ్యలౌకికస్పృహసైతం దివ్యంగా పరివర్తనం చెందుతుంది. ఆ విశ్వాహంకారం లేక విశ్వప్రేమ ఇహలోకమంతా ప్రసరించి పవిత్రం చేస్తుంది. ఇది లోకోద్ధరణ. భక్తుడు సాధించదగినది. తన వ్యక్తి అనంతునిలో లీనమైతే ఆ ఆనందం ఎంత గొప్పదైనా లోకాన్నిమాత్రం ఉద్ధరించదు. విశ్వపరిణామ ప్రణాళికను సాకారం చెయ్యలేదుకదా! కనుక భక్తి భక్తిగానే నిలవాలి.

**శ్లో॥ ఆకాంక్షణీయమపరం యేన నాథ! న విద్యతే ।**
**తవ తేనాద్వితీయస్య యుక్తం యత్ పరిపూర్ణతా ॥ 17**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ ప్రభూ!, యేన = దేనిచేత, తవ = నీకు, అపరమ్ = వేరైనదైన, ఆకాంక్షణీయమ్ = కోరదగినదైనది, న విద్యతే = ఉండదో, తేన = దానిచేత, అద్వితీయస్య = అద్వితీయుడవైన, తవ = నీయొక్క, పరిపూర్ణతా = పరిపూర్ణత, యత్ = ఏదో, (తత్ = అది), యుక్తమ్ = సరియైనదే, తగినదే.

**తాత్పర్యము :** ఓ ప్రభూ!, నీకు వేరేదీ కోరదగినదిలేదు. కారణము నీ పరిపూర్ణత్వము. ఇది సరియైనదే.

వెలితియున్నచోట మాత్రమే మరియొకదానికి తావుండును. వెలితిలేని పాత్ర, అంటే, నిండైనది, అనేకదా అర్థం. ఇంక అది ఇముడ్చుకో దగినది లేదు, అంటే కోరదగినది లేదు. మానవుడు ఎన్నో కోరికలతో మనుగడ సాగిస్తూన్నాడు, అంటే, ఆతనిలో వెలితి చాలా ఉన్నది అనికదా అర్థం. ఎన్ని కోరికలు తీరినాగాని ఇంకా కోరికలు, వెలితి ఉన్నది అంటే అర్థం అతడు నిజానికి అనంతుడనియే కదా. ఆ ఆనంత్యమే మానవునిలోని శివాంశ, కాగా, ఆ జ్ఞానం మానవునకు లేనంతకాలం పరిమితుడై, అసంపూర్ణుడై ఉంటాడు. కాని శివుడు సంపూర్ణుడు కనుక కోరికలులేనివాడు.

అన్నీ నిండార ఉన్నవానిలో వెలితి యెక్కడ? కనుక పరిపూర్ణుడైన స్వామికి వేరే కోరిదగినదిలేదు. ఇది తర్కబద్ధమే.

**శ్లో॥ హస్యతే నృత్యతే యత్ర రాగద్వేషాది భుజ్యతే ।**
**పీయతే భక్తిపీయూషరసస్తత్ప్రాప్నుయాం పదమ్ ॥ 18**

**ప్రతిపదార్థము :** తత్ పదమ్ = ఆ స్థానమును, ప్రాప్నుయామ్ = పొందుదును, యత్ర = ఎక్కడ, ఏ స్థానమందు, హస్యతే = నవ్వు వికసించునో, నృత్యతే = నాట్యము చేయబడునో, రాగద్వేష + ఆది = అనురాగము ద్వేషము మొదలైనవి, భుజ్యతే = అనుభవింపబడునో, భక్తి = భక్తిరూపమైన, పీయూషరసః = అమృతరసము, పీయతే = త్రాగబడునో.

**తాత్పర్యము :** ఏ స్థానం పొంది భక్తిపారవశ్యంతో ఆనందామృతపానంచేసి, రాగద్వేషాది వికారాలు అనుభవింపబడునో, నవ్వుచూ భక్తుడు నాట్యముచేయునో, ఆ స్థానాన్ని నేను పొందుతాను.

భగవద్భావంలో తాదాత్మ్యం చెందిన భక్తునకు సర్వమూ అమృతప్రాయమూ, ఆనందమయమూ అవుతుంది. ఆ భావం మనసులో నాటుకుపోయినవానికి సర్వభావాలూ ఆనందంలో పర్యవసిస్తాయి. మధురభక్తి విశేషమూ ఇదే. దేశభక్తుడు తన దేశంకోసం, అంటే ప్రజలందరికోసం, ఒక మానవతావాది, ఒక నాస్తికుడు, తమ తమ లక్ష్యాలను సాకారం చేసికొనే ప్రయత్నంలో తన వ్యక్తిత్వాన్నంతా తన ఆదర్శంతో నింపికొని శ్రమించి, బాధలుపడి త్యాగాలు చేసినప్పటికీ లక్ష్యశుద్ధిలో లీనమైపోయి ఆనందానుభూతిని పొందుతాడు. దైవభక్తునకూ ఇదే అనుభవం కలుగుతుంది. ఆ ఆనందానికి అభివ్యక్తి నవ్వు, నాట్యం అవుతుంది.

**శ్లో॥ తత్తదపూర్వామోదత్వచ్చిన్తాకుసుమవాసనా దృఢతామ్ ।**
**ఏతు మమ మనసి యావన్నశ్యతు దుర్వాసనాగంధః ॥ 19**

**ప్రతిపదార్థము :** యావత్ = ఎంతవరకు, ఎప్పటికి, దుర్వాసన = చెడువాసనారూపము గల, గంధః = వాసన, నశ్యతు = నశించునో, (తావత్ = అంతవరకు, అప్పటివరకు), మమ = నాయొక్క, మనసి = మనస్సులో, తత్ తత్ = ఆయా, అపూర్వ = అలౌకికమైన, ఆమోద = ఆనందపూర్ణమైన, త్వత్ = నీయొక్క, చిన్తా = చింతనము, స్మరణము, అనబడు, కుసుమ = పుష్పముయొక్క, వాసనా = సుగంధము, దృఢతామ్ = స్థిరత్వమును, ఏతు = పొందునుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నాలో లౌకికమైన దుర్గంధము పూర్తిగా నశించిపోయి, అలౌకికానందపూర్ణమై నా మనస్సు నీ యందు స్థిరముగ నిలిచిపోవునంతవరకు నీ స్మరణమను పుష్పము నాలో వికసించి సువాసనలీనుచునే యుండుగాక!

లోకసంబంధమైన స్పృహ, భావనలన్నీ ద్వంద్వములే, అంటే, పరస్పర విరుద్ధమైన వికారములే. సుఖము, మంచి, ఇత్యాదులు సైతము వికారములుగనే అనుభవమగుతూన్నవి. అందుచేతనే పాపపుణ్యములు రెండును వాసనలుగనే, వదిలించుకోదగిన దుర్వాసనలుగనే వేదాంతము పరిగణిస్తుంది. ఈ ద్వంద్వ స్పృహ వీడనంతవరకు Absolute Positive అన్నది ఊహకైనా అందదు అంటుంది. అందుకని ఈ దుర్వాసన నశించేంతవరకు, అలౌకికానందం వెల్లివిరిసేవరకు, అందు మనస్సు నిశ్చలంగా నిలిచేంతవరకు, శివరూపస్పృహ, శివనామస్మరణ, శివతత్త్వచింతనం, అర్థాత్, శివభక్తి తనలో నిలిచి ఉండాలని ఈ కవి కోరిక. ఆ తర్వాత ఇవేమీ అక్కరలేదా? అంటే, ఆ శివచైతన్యానందం అందగానే రూపనామ గుణప్రకృతి తొలిగిపోతుంది కదా, దాని అవసరం లేదనేకదా అర్థం? పరిణామక్రమంలో రూపనామగుణజ్ఞానం ఒక మజిలీమాత్రమే, అదే గమ్యం కాదు. ఈ పరిణామక్రమానికి సంకేతమే కుసుమం. కుసుమం వికసిస్తేనే సుగంధం పరిసరాలంతా వ్యాపించేది. అందుకే సంపూర్ణంగా వికసించేంతవరకు శివచింతనలో తన మనస్సు దృఢంగా నిలిచి ఉండాలని ఆకాంక్షిస్తూన్నాడు భక్తకవి.

**శ్లో॥ క్వ ను రాగాదిషు రాగః క్వ చ హరచరణాంబుజేషు రాగిత్వమ్ ।**
**ఇత్థం విరోధరసికం బోధయ హితమమర మే హృదయమ్ ॥ 20**

**ప్రతిపదార్థము :** అమర = ఓ దేవా!, రాగ + ఆదిషు = రాగము మొదలైనవానియందు, రాగః = అనురాగము, క్వ ను = ఎక్కడ?!, చ = మరియు, హరచరణ = హరుని పాదములనబడు, అంబుజేషు = పద్మములయందు, రాగిత్వమ్ = భక్తి, అనురాగమును కలిగియుండుట, క్వ = ఎక్కడ?!, ఇత్థమ్ = ఈ విధముగా, హితమ్ = శుభమును, విరోధ = విరోధించు, రసికమ్ = రక్తిగల, మే = నాయొక్క, హృదయమ్ = మనస్సును, బోధయ = బోధించుము.

**తాత్పర్యము :** ఓ దేవా! రాగద్వేషాది లౌకికభావానుభవములందు ఆసక్తి ఎక్కడ?! శివుని పాదపద్మములందాసక్తి ఎక్కడ?! అను జ్ఞానము నా హృదయానికి కలుగునట్లు బోధించుము.

To love is human nature. So, in the absence of the right object to love, Man loves the wrong. అన్నాడొక మనోవిజ్ఞాని. అంటే, ప్రేమించటం మనిషి స్వభావం. కనుక, యోగ్యమైనవి లభించనప్పుడు మానవుడు అయోగ్యమైన విషయాలనే ప్రేమిస్తాడు, అని తాత్పర్యం. ఈ స్వభావంవలన మానవుడు రాగద్వేషాది లౌకిక భావాలకు ప్రభావితుడవుతూ ఈ లౌకికవస్తుప్రేమ, జంతుప్రేమ, స్త్రీ పురుష లైంగిక ప్రేమ, ఇదంతా నిజమైన ప్రేమ అనీ, వీనికోసం తపనపడిపోతూ ప్రాణాలను సైతం త్యాగం చేసేందుకు సిద్ధపడుతూ జీవిస్తూన్నాడు. ఇదేమి ప్రేమ!? నిలిచిన చోట నిలువనివ్వని తాపాన్ని కలిగించేది ప్రేమ ఎట్లా అవుతుంది!? అది కోరిక స్వభావం. తీరినా తీరకున్నా లౌకిక కామ్యాలు అసంతృప్తినీ, అలజడినీ, దుఃఖాన్నీ మాత్రమే మిగల్చటం కోరిక లక్షణం. **ప్రేమ శాంతినీ, ఆనందాన్నీ కలిగిస్తుంది.** తాత్కాలికంగా కాదు, శాశ్వతంగా, జీవితం అంతా నిండిపోతుంది, అన్నిటినీ సత్యకాంతిమయం చేసివేస్తుంది. ఈ ప్రేమ ఒక్క భగవత్ప్రేమ మాత్రమే, అని ఈ విధంగా నా మనస్సు లౌకిక – అలౌకిక ప్రేమలమధ్య విరోధాన్ని భావించటంలో రసానందాన్ని పొందుతూన్నది. ఓ స్వామీ! ఈ విరోధాన్ని హరించి బోధిని కలిగించు. నీవు హరుడవుకదా, నా ఈ మనోవైకల్యాన్ని హరించు, అని భక్తకవి ప్రార్థన. బోధి, సుజ్ఞానము కలిగితే, జీవితం విరోధాభాసమవుతుంది, రసానందప్లావితమవుతుంది, అన్నది ఆకాంక్ష.

**శ్లో॥ విచరన్ యోగదశాస్వపి – విషయవ్యావృత్తివర్తమానోఽపి ।**
**త్వచ్చిన్తా మదిరామద – తరలీకృతహృదయ ఏవ స్యామ్ ॥** 21

**ప్రతిపదార్థము :** యోగదశాసు = యోగసాధనలోని వివిధావస్థలలో, విచరన్ అపి = సంచరించుచున్నప్పటికిని, విషయ = ఇంద్రియ విషయములనుండి, వ్యావృత్తి = మనస్సును తొలగించుటలో, వర్తమానః అపి = లగ్నమైయున్నప్పటికిని, త్వత్ = నీయొక్క, చిన్తా = చింతన, స్మరణ యను, మదిరామద = మదిరవలన కల్గు మత్తుచే, తరలీకృత = చంచలమైన, హృదయః ఏవ = హృదయము లేక మనస్సుగలవాడను మాత్రమే, స్యామ్ = అగుదును.

**తాత్పర్యము :** యోగసాధనలో నేను యే యే స్థితులను అనుభవిస్తూన్నప్పటికిని, లౌకికమైన జీవనంలో ఇంద్రియవిషయాకర్షణనుండి మనస్సును విముఖంచేసే ప్రయత్నంలో ఉన్నప్పటికిని, నీ రూపనామగుణస్మరణము నా మనస్సునకు మదిరాపానమువలె పారవశ్యమును కలిగించును గాక!

మనస్సునకు చాంచాల్యము స్వభావము. దానికాలంబన ఇంద్రియ విషయానుభవము. దానినుండి మనస్సును దూరము లాగిపట్టి యోగసాధనయందుంచుట కష్టసాధ్యము, కాని నిజమైన సాధకునకు అసాధ్యము కాదు. ఈ ప్రయత్నం సఫలం కావటానికి ఇష్టదేవతానామస్మరణ, రూపదర్శనం, గుణగానం తగిన శక్తినిస్తాయి. కనుక ఆ దశలో దాని ఆవశ్యకత ఉన్నది. అట్లే, యోగములో లగ్నమైన మనస్సుకూడ అన్ని దశలలోను స్థిరానుభవాన్ని సాధించాలంటే పై జెప్పిన మూడూ అవసరమే. కనుక ఆ భక్తి పారవశ్యాన్ని అన్నిటా కలుగనిమ్మని ప్రార్థన.

**శ్లో ॥ వాచి మనోమతిషు తథా శరీరచేష్టాసు కరణరచితాసు ।**
**సర్వత్ర సర్వదా మే పురః సరో భవతు భక్తిరసః ॥ 22**

**ప్రతిపదార్థము :** వాచి = వాక్కు, మాట, మనః = మనస్సు, మతిషు = బుద్ధి అను వీనియందు, కరణ = ఇంద్రియములచేత, రచితాసు = రచింపబడిన, శరీర = శరీరసంబంధమైన, చేష్టాసు = చేష్టలు, కర్మలు, వీనియందు, సర్వత్ర = అంతటనూ, సర్వదా = అన్నివేళలనూ, భక్తిరసః = భక్తియను ఆనందము, మే = నాకు, పురః = ముందు, సరః = నడచునది, భవతు = అగుగాక!

**తాత్పర్యము :** నా మాటలో, బుద్ధిలో, ఇంద్రియప్రచోదితమైన సర్వశరీరకర్మలలో అన్నిటా అన్నివేళలా భక్తియే నాకు మార్గదర్శియగుగాక!

శరీరకర్మలన్నీ ఇంద్రియాల ప్రేరణవలన జరుగునవే. అయితే, ఈ ఇంద్రియ విషయాలను మనస్సు గ్రహించగా బుద్ధి వివేకించి స్వీకరిస్తుంది. దానికనుగుణంగా శరీరం ప్రవర్తిస్తూంటుంది. ఈ మనస్సు సహజంగా ఇంద్రియాలను లౌకిక విషయాలలో ప్రవర్తింపజేస్తుంది. ఒకవేళ, ఆ మనస్సు భక్తిభరితమయితే, ప్రాపంచికత నశించి భగవదానందం దిశగా మనస్సు ఇంద్రియాలను ప్రేరేపిస్తుంది. పర్యవసానంగా మాట, మనస్సు, శరీరమూ అను త్రికరణాలు నిర్వికారమై విశుద్ధమైన ఆత్మానందంవైపు నడుస్తాయి. ఈ స్థితి అన్నివేళల అన్ని విషయాలలో తనకు కలగాలి అన్నది ఈ భక్తకవి ఆకాంక్ష.

**శ్లో॥ శివశివశివేతి నామని – తవ నిరవధి నాథ! జప్యమానేఽస్మిన్ ।**
**ఆస్వాదయన్ భవేయం – కమపి మహారసమపునరుక్తమ్ ॥ 23**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, శివశివశివ = శివ, శివ, శివ, ఇతి= అని, తవ = నీయొక్క, అస్మిన్ = ఈ, నామని = నామమునందు, నిరవధి = అనంతముగ,

జప్యమానే = జపించుచున్నవాడనైన, (అహమ్ = నేను), కమపి = ఇదియని చెప్పలేని, అపునరుక్తమ్ = ముందు చెప్పబడని, క్రొత్తదైన, మహః = పారమార్థికమైన, రసమ్ = ఆనందమును, ఆస్వాదయన్ = అనుభవించుచు, భవేయమ్ = ఉందును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! శివనామాన్ని నిరంతరం జపిస్తూన్న నేను వర్ణించి చెప్పలేని, ముందెవ్వరూ చెప్పని, ఒక పారమార్థికమైన ఆనందాన్ని ఆస్వాదిస్తూ జీవింతునుగాక!

శివనామాన్ని **'శివశివశివ'** అంటూ పునరుక్తిగా చెప్పటంవలన నామజపంలోని పారవశ్యం సూచింపబడుతూన్నది. ఆ నామంలో లీనమైనాడన్న ఈ భావానికి **'నామని'** అన్న సప్తమీ విభక్తికూడా దోహదం చేస్తూంది. ఈ పారవశ్యం ఆనందజనితం. ఈ ఆనందం అలౌకికం కనుకే వర్ణించటం అసాధ్యం, నిత్యనూతనానుభవంగా భాసించేది. కనుకే అది నిరవధి. ఆనందరహితమైనదేదీ నిరవధిగా కొనసాగదు.

**శ్లో॥ స్ఫురదనన్తచిదాత్మకవిష్టపే - పరినిపీతసమస్తజడాధ్వని ।**
**అగణితాపరచిన్మయగండికే - ప్రవిచరేయమహం భవతోఽర్చితా ॥ 24**

**ప్రతిపదార్థము :** పరినిపీత = నష్టముగావింపబడిన, సమస్త = అన్ని, జడ = అచేతనరూపమైన, అధ్వని = మార్గములందు, అగణిత = లెక్కకురాని, అపర = వేరొక, చిన్మయ = జ్ఞానమయమైన, గండికే = తిప్పల్లో, స్ఫురత్ = ప్రకాశమానమైన, అనంత = అంతములేని, చిద్+ఆత్మక = జ్ఞానరూపమైన, విష్టపే = భువనమునందు, భవతః = మీయొక్క, అర్చితా = అర్చకుడనై, ప్రవిచరేయమ్ = విహరింతును.

**తాత్పర్యము :** అచేతనమార్గముల సమస్తము నష్టముకాగా, లెక్కించుటకు వీలుకాని వేరొక జ్ఞానమయ తిప్పల్లో ప్రకాశించు అనంతజ్ఞానమునకు కేంద్రమైన భువనములో తమ అర్చకుడనై విహరిస్తాను.

**గండికా** శబ్దానికి పురీ అన్న అర్థాన్ని ఈ శ్లోకవ్యాఖ్యాత క్షేమరాజనునాత–డిచ్చినాడు. పదార్థకోశంలో శిలయన్న అర్థమే కనబడుతున్నది. క్షేమరాజవ్యాఖ్యనే అనుసరించుట సముచితం.

లౌకిక మార్గాలన్నీ జడమైనవని వేదాంతమంటుంది. ఎందుకంటే, అవన్నీ ఆత్మచైతన్యాన్ని పరిగణించనివి కనుక. ఇట్లా ఈ ఇహలోకమార్గాలన్నీ ప్రమేయమార్గాలు అనబడుతూన్నవి. ఇవన్నీ స్పష్టంగా పంచేంద్రియాలకు అవగతమయ్యేవి. ఈ మార్గాలకు అందనిది, ఈ మార్గాలు నష్టమైనప్పుడే స్ఫురించేది వేరొక మార్గమున్నది. అది జ్ఞానమార్గం, ఆ మార్గంలో సంచరిస్తే ఈ భువనమంతా జ్ఞానకేంద్రమై అనంతంగా

కనిపిస్తుంది. అదెట్లా సాధ్యం? శివపాదార్చనవలన సాధ్యం. లోకమంతా ఈ దృష్టికి శివమయంగా కనిపిస్తుంది. అక్కడే విహరిస్తాను అంటున్నాడీ భక్తుడు.

**శ్లో॥ స్వవపుషి స్ఫుటభాసిని శాశ్వతే - స్థితికృతే న కిమప్యుపయుజ్యతే ।**
**ఇతి మతిః సుదృఢా భవతాత్ పరం - మమ భవచ్చరణాబ్జరజః శుచేః॥25**

**ప్రతిపదార్థము :** స్ఫుట = వికసించిన, భాసిని = ప్రకాశముగలదైన, శాశ్వతే = శాశ్వతమైన, స్వ = తనదైన, వపుషి = శరీరమునందు, స్థితికృతే = స్థిరమైన, కిమపి = ఏదేనొకటి, న ఉపయుజ్యతే = ఉపయోగించదు, ఇతి = అను, మతిః = బుద్ధి, భవత్ = మీయొక్క, చరణ+అబ్జ = పాదములు అను పద్మములయొక్క, రజః = ధూళి, శుచేః = పవిత్రుడనైన, మమ = నాకొరకు, పరమ్ = మిక్కిలి, సుదృఢా = స్థిరమైనది, భవతాత్ = అగుగాక!

**తాత్పర్యము :** వికసిత పూర్ణప్రకాశముగల తన శాశ్వత శరీరమున నివసించుటకు ధ్యాన జపాదులలో యేదిగాని ఉపయోగించదు. కారణం, నేను నీ శక్తి ప్రసారం వలన శుద్ధుడను, అను బుద్ధి నాలో స్థిరమగుగాక!

శరీరం వికాస ప్రకాశం కలిగియుండటం అంటే, ఈ భౌతిక శరీరంలోని జ్ఞానశరీరము శాశ్వతం, ప్రకాశవంతం, అని భావం. ఎందువల్లనంటే, శివపాదధూళి సోకి ఆ జ్ఞానం పవిత్రం అయింది. అది స్థిరమనే బుద్ధి నిలిచియుండాలన్నది భక్తుని కోరిక. ఈ జ్ఞానప్రకాశకమైన చిత్ శరీరము స్థిరం కావటం అన్నది ధ్యాన జపాది విధులవలన కాదు. స్థిరబుద్ధియొక్కటే ఉపాయం.

**శ్లో॥ కిమపి నాథ కదాచన చేతసి - స్ఫురతి తద్భవదంఘ్రితలస్పృశామ్ ।**
**గలతి యత్ర సమస్తమిదం సుధా - సరసి విశ్వమిదం దిశ మే సదా ॥26**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, భవత్ = తమయొక్క, అంఘ్రితల = పాదముల యొక్క, స్పృశామ్ = స్పర్శను, చేతసి = మనస్సునందు, కదాచన = ఒకప్పుడు, తత్ = ఆ, కిమ్ +అపి = ఏదేనొక అలౌకికమైన అవస్థ, స్ఫురతి = ప్రకాశించుచున్నది, యత్ర = ఎక్కడ, ఇదమ్ = ఈ సమస్తం, విశ్వమ్ = విశ్వమంతయు, సుధాసరసి = అమృత సరస్సులో, గలతి = లయమగుచున్నది, మే = నాకు, సదా = ఎల్లవేళల, దిశ = ప్రసాదించండి.

**తాత్పర్యము :** ఓ స్వామీ! మనస్సులో నీ పాదస్పర్శ కలిగిన వేళలలో అప్పుడప్పుడు ఏదో ఒక అలౌకికావస్థ కలుగుతూన్నది. ఆ స్థితిలో అమృతప్రాయమైన ఆనందసరస్సువలె

మనస్సు ప్రశాంతమై, ఈ విశ్వమంతా ఆ ఆనందమే తప్ప మరేమీ లేదన్న అనుభూతి కలుగుతూన్నది. ఆ ప్రశాంత అమృతానందాన్నీ అద్వైతానుభూతినీ నాకు ఎల్లవేళలా ప్రసాదించు స్వామీ!

స్పృశాం అన్నదానికి స్పర్శగలవారికి అని అర్థంచేసి, శివపాదస్పర్శ సోకిన వారికి మనస్సులో ఒక అనిర్వచనీయమైన ఆనందానుభూతి కలుగుతుందనీ, అదే అనుభూతిని సదా తనకూ ప్రసాదించుమనిన్నీ భక్తకవి ప్రార్థనగా చెప్పవచ్చు. లేదా, ఆ స్థితి కవియే అనుభవించి అది శాశ్వతం కావాలని ప్రార్థిస్తూన్నట్లూ భావించవచ్చు.

సరసి శబ్దం ప్రశాంతతా సూచకం. విశ్వప్రేమానందస్థితి భక్తికి పారమ్యమన్నది కవి హృదయం.



## శ్రీః

# 6. అధ్వవిస్ఫురణాస్తోత్రమ్

**శ్లో॥ క్షణమాత్రమపీశాన! వియుక్తస్య త్వయా మమ ।**
**నిబిడం తప్యమానస్య సదా భూయా దృశః పదమ్ ॥ 1**

**ప్రతిపదార్థము :** ఈశాన! = ఓ ఈశ్వరా!, క్షణమాత్రం + అపి = ఒక్క క్షణకాలముకూడ, త్వయా వియుక్తస్య = మీతో కూడియుండనివాడై, నిబిడమ్ = అత్యన్తము, తప్యమానస్య = సంతాపమునొందువాడైన, మమ = నాయొక్క, దృశః = చూపులయొక్క, పదమ్ = స్థానము, విషయము, సదా = ఎల్లప్పుడు, భూయాః = ఉండుగాక!

**తాత్పర్యము :** ఈశ్వరా! నా దృష్టి ఎల్లప్పుడు మీపై లగ్నమై ఉండుగాక! ఒక్కక్షణమైన మీనుండి తొలిగి నాకు అమితమైన సంతాపకారణము కాకుండు గాక!

దృష్టి అన్నది లౌకికమైనది కాక, జ్ఞానదృష్టి యని అర్థం. లౌకికదృష్టి లౌకిక విషయాలపైనే ప్రసరిస్తూంటుంది. ఈ దృష్టిని ప్రసరించనియ్యక నియంత్రించినప్పుడు అంతర్దృష్టి, జ్ఞానదృష్టి ప్రసరిస్తుంది. ఆ దృష్టినుండి ఈశ్వరుడు తొలగరాదని భక్తకవి ప్రార్థన. దీనినే అన్నమయ్య "వెలుపల గలిగిన లోపల లేదు" అన్నాడు. ఈ అంతర్దృష్టి సాధన తీవ్రమైనప్పుడు అది నిత్యమవుతుంది. అంటే, బాహ్యదృష్టితో లోకాన్ని చూస్తూ లౌకిక కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూన్నప్పుడు కూడా ఆతడు దైవయుక్తుడే అయి ఉంటాడు.

ఇది పరమహంసల స్థితి. రామకృష్ణుడు వివేకానందునితో, "నిన్ను చూస్తూన్నంత స్పష్టంగానూ దేవుని చూస్తూన్నాను" అనటంలోని పరమార్థమిదే.

**శ్లో॥ వియోగసారే సంసారే ప్రియేణ ప్రభుణా త్వయా ।**
**అవియుక్తః సదైవ స్యాం జగతాపి వియోజితః ॥ 2**

**ప్రతిపదార్థము :** జగతా = జగత్తుచే, వియోజితః అపి = వేరుచేయబడినవాడనైనప్పటికి, వియోగసారే = వియోగమే, ఎడబాటే సారమైన, సంసారే = ప్రపంచమునందు, ప్రియేణ = ప్రియమైన, ప్రభుణా = ప్రభుడవైన, త్వయా = నీచేత, అవియుక్తః = ఎడబాటు లేనివాడనై, సదా ఏవ = ఎల్లప్పుడును, స్యామ్ = ఉందును.

**తాత్పర్యము :** ఈ ప్రపంచలక్షణం ఎడబాటు. కనుక ఈ ప్రపంచం నన్ను నీనుండి వేరుచేసింది. ఈ ప్రపంచంలో, ప్రపంచంతో బ్రతుకవలసినవాడనైనాను. అయినప్పటికి, నీవు నాకు స్వామివే, ప్రియమైనవాడవే. కనుక ఈ ప్రపంచవాసినై మనుగడ సాగిస్తూ ఉన్నప్పటికీ ఎడబాటును సహించలేను, నీతో కలిసే ఉంటాను.

సంయోగవియోగాలు లోకధర్మం. తమకెంత ప్రియమైన వ్యక్తితో గాని వస్తువుతోగాని ఎల్లకాలం ఎవ్వరూ కలిసి ఉండలేరు. కనుకే జీవుడు తన ప్రభువు, ప్రియుడు అయిన ఈశ్వరు నుండి వేరై ఈ పాంచభౌతిక ప్రపంచంలో సాగుతూన్నాడు. అయినా, తన ప్రభువును, ప్రియుని మరువలేదు, విరహంలో కొట్టుమిట్టాడుతూ వాని కోసమే వెదుకుతూన్నాడు. వాని వియోగంలోని అసంతృప్తిని అనుభవిస్తూన్నాడు. ఈ భక్తకవి కూడ వారిలో ఒకడే, అందుకే తప్పించుకోలేనంతకాలం ఈ ప్రపంచంలోనే ఉంటానుగాని, ఓ స్వామీ! నీ వియోగాన్ని మాత్రం సహించలేను. నీతోనే ఉంటాను, ప్రపంచంతో ఉండను. మనోనేత్రంతో నీ రూపాన్ని దర్శిస్తూ, జ్ఞానేంద్రియ విషయంగా నీమాటలు వింటూ, నీ స్పర్శను, నీ శరీరగంధాన్ని, నీ నామజపంలోని రుచిని అనుభవిస్తూంటాను.

**శ్లో॥ కాయవాఙ్మనసైర్యత్ర యామి సర్వం త్వమేవ తత్ ।**
**ఇత్యేష పరమార్థోఽపి పరిపూర్ణోఽస్తు మే సదా ॥ 3**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడికైన, ఎక్కడనైన, కాయ = శరీరము, వాక్ = మాట, మనసైః = మనస్సును ఈ మూడింటితో, యామి = వెళ్ళుదునో, తత్ = అది, సర్వమ్ = అంతయు, త్వమ్ ఏవ = నీవే, ఇతి = అను, ఏషః = ఇది, పరమార్థః అపి = సత్యమైనను, మే = నాకు, సదా = ఎల్లప్పుడు, పరిపూర్ణః = సిద్ధము, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** నేను నా శరీరంతో, వాక్కుతో, మనస్సుతో, అంటే త్రికరణములతో, ఏయే విషయాలలో ప్రవర్తిస్తానో, అది అంతా శివమయమే అన్నది నిజమే అయినప్పటికిన్నీ, ఆ పరిపూర్ణశివత్వం నాకు ఎల్లవేళల కలుగుగాక!

**యద్యత్కర్మ కరోమి శంభో! తవారాధనమ్** అన్నది సిద్ధాంతం. కర్మ చేయక మనలేడు జీవుడు. ఈతడు చేసే కర్మలన్నిటికీ మూడు పనిముట్లున్నాయి. అవే త్రికరణాలు : శరీరము, వాక్కు, మనస్సు. మరి ఇంద్రియాల మాట?! అవీ మనస్సే, మనస్సు చేత జరిగే క్రియలే. ఈ మూడింటితో జీవుడేమి చేస్తాడు? అంటే, శివపూజ చేస్తాడని సిద్ధాంతం. తెలిసిగాని తెలియకగాని జీవకర్మలుగా మానవుడాచరించేవన్నీ శివపూజావిధులే. శివుడు సుఖస్వరూపుడు, ఆనందరూపి, ఆ ఆనందదర్శనం, స్పర్శనం, అనుభవం కలగాలన్నదే జీవుని కర్మల పరమార్థం. ఇది సిద్ధాంతం, సత్యం. కాని ఈ సత్యాన్ని గుర్తించి జీవించటం యే కొద్దిమంది మహాత్ములకో తప్ప తక్కినవారికి అసాధ్యం. ఇది భక్తిపరమార్థం కనుక ఆ పరమార్థజ్ఞానంతో తాను జీవించాలన్నది ఈ భక్తకవి ఆకాంక్ష.

**శ్లో॥ నిర్వికల్పో మహానందపూర్ణో యద్వద్భవాంస్తథా ।**
**భవత్ స్తుతికరీ భూయాదనురూపైవ వాఙ్మమ ॥ 4**

**ప్రతిపదార్థము :** యద్వత్ = ఏవిధముగా, భవాన్ = తమరు, నిర్వికల్పః = వికల్పములేని మహానందపూర్ణః = పరమానందభరితుడు, తథా = ఆ విధముగా, భవత్ = తమయొక్క, స్తుతికరీ = స్తుతిచేయునట్టి, మమ = నాయొక్క, వాక్ = వాక్కు, మాట, అనురూపా ఏవ = తగినదే, నిర్వికల్పమే, భూయాత్ = అగును.

**తాత్పర్యము :** దేవా! తమరు అంతరాయములేని పరమానందముతో నిండినవారు. తమరిని స్తుతించే నా వాక్కుకూడా అందుకు తగినట్లే నిరంతరము, నిర్వికల్పము అగుగాక!

శివుడు విశుద్ధజ్ఞానానందమయుడు. కనుక నిర్వికారుడు. అందుచేతనే నీ స్తుతులు కూడ ఆనందమయములు, నిర్వికారాలు. ఆ భక్తిపారవశ్యాన్ని నిరంతరం ప్రసాదించవలసిందిగా ఈ భక్తుని కోరిక.

**శ్లో॥ భవదావేశతః పశ్యన్ భావం భావం భవన్మయమ్ ।**
**విచరేయం నిరాకాంక్షః ప్రహర్షపరిపూరితః ॥ 5**

**ప్రతిపదార్థము :** భవత్ = తమదైన, ఆవేశతః = ఆవేశమువలన, భావం భావమ్ = ప్రతియొక్క వస్తువును, భవత్ + మయమ్ = తమతో నిండినదానినిగా, పశ్యన్ =

చూచుచు, నిరాకాంక్షః = ఏ కోరికయు లేనివాడనై, ప్రహర్ష = బ్రహ్మానందముచే, పరిపూరితః (సన్) = నిండినవాడనగుచు, విచరేయమ్ = విహరింతును.

**తాత్పర్యము :** మీ స్వరూపస్వభావాల సాక్షాత్కారం వలన ప్రతివస్తువులోను తమనే దర్శిస్తూ, మరెట్టి కోరికగాని లేనివాడనై మహదానందంతో విహరిస్తాను, స్వామీ!

శివరూపాన్ని శివస్వభావాన్ని మనస్సులో దర్శిస్తూన్న భక్తునకు బాహ్య ప్రపంచంలోని ప్రతివస్తువూ, ఆంతరంగికమైన ప్రతిభావమూ శివమయమైపోతుంది. శివుడు ఆనందస్వరూపి కనుక. శివదర్శనం అంటే ఆ పరమానందస్థితిని పొందటమే అవుతుంది. మానవుడు సర్వదా సర్వత్ర పొందగోరేది ఆ ఆనందాన్నే కనుక, ఇప్పుడది లభించగా, ఇక కోరిక అంటూ యేదీ ఉండదు. ఆ **శివానందలహరిలో** మునకలువేస్తూన్న భక్తునకు లోక స్పృహ ఉండదు కనుక ఉన్మత్తునివలె దిశానిర్దేశం లేక గమ్యం లేని గమనంతో సంచరిస్తూంటాడు. ఈ భావాన్ని బోధించేదే **విచరేయం** అన్నదానిలోని వి అను ఉపసర్గ.

**శ్లో॥ భగవన్! భవతః పూర్ణం పశ్యేయమఖిలం జగత్ ।**
**తావతైవాస్మి సంతుష్టస్తతో న పరిఖిద్యసే ॥ 6**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ స్వామీ!, జగత్ = విశ్వము, అఖిలమ్ = అంతయు, భవతః = మీయొక్క, పూర్ణమ్ = పూర్ణత్వముగా, పశ్యేయమ్ = చూచుచుందును, తావతా ఏవ = అంతమాత్రముచేతనే, సంతుష్టః = సంతృప్తిచెందినవాడను, అస్మి = అగుచున్నాను, తతః = అందువలన, పరిఖిద్యసే = నీవు ఖేదము చెందింపబడిన వాడవు, న = కావు.

**తాత్పర్యము :** విశ్వమంతా మీతో నిండియున్నది, అని తలచుచు, అట్లే దర్శించుచున్నాను. అంతమాత్రముతో తృప్తి చెంది నిన్నింక బాధించకున్నాను.

శివుడు పూర్ణుడు. వానితో నిండియున్న విశ్వము పూర్ణమే. **పూర్ణమదః పుర్ణమిదం** అని కదా శ్రుతివాక్యము. ఈ సత్యమును గుర్తెఱిగి చూడగా విశ్వము శివమయమై సాక్షాత్కరిస్తుంది. అంతటితో జీవుడను ఈ పశువుగూడ పూర్ణత్వాన్ని పొందుతూన్నాడు. కనుక ఈ పశువును బంధించియుంచిన పాశము తొలగిపోగా, ఇంక కోరదగినది మిగిలియుండదు. కాగా మరల మరల ఏదో కోరికతో శివుని ప్రార్థించవలసిన అవసరము కలుగదు.

శ్లో॥ విలీయమానాస్త్వయ్యేవ వ్యోమ్ని మేఘలవా ఇవ ।
భావా విభాన్తు మే శశ్వత్క్రమనైర్మల్యగామినః ॥ 7

**ప్రతిపదార్థము :** వ్యోమ్ని = ఆకాశమున, విలీయమానాః = కలిసిపోవుచున్న, మేఘలవాః ఇవ = మబ్బు తునకలవలె, భావాః = భావములు, శశ్వత్ = శాశ్వతముగా, క్రమ = క్రమముగా, నైర్మల్యగామినః = నిర్మలములగుచు, త్వయి ఏవ = నీయందే, మే = నాకు, విభాన్తు = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :** మబ్బుతునకలు ఆకాశంలో కలిసిపోతాయి. అదేవిధంగా నా భావాలు క్రమంగా నిర్మలములై నీలోనే కలిసిపోయి నాకు ప్రకాశించుగాక!

మబ్బు యేర్పడేది ఆకాశంలోనే అయినప్పటికీ ఆకాశ స్వభావమైన కాంతికి భిన్నంగా నల్లగా ఉంటాయి. కాని అదే వర్షించిన వెనుక క్రమంగా తెల్లగా మారిపోయి ఆ ఆకాశంలోనే కలిసిపోతాయి కదా. ఆ ఆకాశం శివుడు, లేక చిదాకాశం, లేదా దహరాకాశం. ఇందేర్పడిన భావాలు మబ్బులవలె నల్లనివి, ఇంద్రియవిషయమాలిన్యం కలిగినవి. క్రమంగా ఈ విషయమాలిన్యం తొలగిపోగా, భావాలు నిర్మలమై తెల్లని మబ్బు తునకలవలె అవుతాయి, తమస్సు, రజస్సు వీగిపోయి సత్త్వపూర్ణమవుతాయి. కాగా శివసత్త్వమయమై శివునిలో కలిసిపోయి ప్రకాశిస్తాయి. శివుడు తేజఃస్వరూపుడు, తెల్లనివాడు. కనుక శివభావనలో నల్లగా మబ్బులవలె యేర్పడిన లౌకికసంస్కారాలు క్రమంగా తొలగి స్వచ్ఛమైన శివభావన విశుద్ధమై వెలుగుతుందని కవి భావం. ఇది శాశ్వతం కావాలని వాని కోరిక.

శ్లో॥ స్వప్రభాప్రసరధ్వస్తాపర్యన్తధ్వాన్తసన్తతిః ।
సన్తతం భాతు మే కోఽపి భవమధ్యాద్భవన్మణిః ॥ 8

**ప్రతిపదార్థము :** స్వప్రభా = తనయొక్క దీప్తి, ప్రసర = ప్రసారముచే, ధ్వస్త = ధ్వంసము చేయబడిన, అపర్యన్త = ఎల్లలులేని, ధ్వాన్త = చీకటుల, సన్తతిః = సమూహము, భవత్ = తమయొక్క, కః అపి = ఏదేని అలౌకికమైన, మణిః = రత్నము, మే = నాకు, సన్తతమ్ = ఎల్లప్పుడు, భవమధ్యాత్ = 'భవము' అనబడు ఈ సంసారకేంద్రమునుండి, భాతు = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :** ఈ సంసారము చీకటిమయము. తన దీప్తిచే ఆ చీకట్లను చీలుస్తూ, నాశనం చేస్తూ, తమదైన ఒక అలౌకికమైన రత్నం ఈ సంసారము మధ్యనుండియే ఎల్లప్పుడు ప్రకాశించుగాక!

ఈ సంసారం లక్షణమేమంటే, ప్రతి విషయంలోనూ అడుగు ముందుకు వెయ్యవలెనా? లేదా? అన్న సంశయం పీడిస్తుంది. ఏదీ స్పష్టంగా భాసించదు. అన్నీ అర్ధసత్యాలే గోచరిస్తాయి. ఏమి చేస్తే ఏ ఫలం లభిస్తుందో తెలియదు. శాస్త్రాలు వివరిస్తూనే ఉన్నప్పటికీ సంశయాలు వదలవు. శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదని ఎంత సర్దిచెప్పి కొన్నప్పటికీ భయం తీరదు. జ్ఞానదీప్తిలేని లోపంవలన ఈ చీకటి యేర్పడుతూన్నది. దీన్ని తొలగించగల జ్ఞానదీపం మానవునిలో ఉన్నది. కాని,

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ – దేహే తిష్ఠన్తి తస్కరాః ।
జ్ఞానరత్నాపహారాయ – తస్మాజ్జాగృధ జాగృధ ॥

అంటూ ఎంతగా గురువులు మేల్కొల్పు పాడినాగాని, ఈ జ్ఞానరత్నం జ్ఞానదాతయైన ఆ శివుని అనుగ్రహం లేనిదే కాంతులీనదు. కనుక ఈ భక్తకవి అంటూన్నాడు, చీకట్ల మధ్యలోనుండే నీ వరప్రసాదంగా ఆ జ్ఞానరత్నం నాలో ప్రకాశించుగాక! నాకై ప్రకాశించుగాక! అని.

**శ్లో॥ కాం భూమికాం నాధిశేషే కిం తత్ స్యాద్యన్న తే వపుః ।**
**శ్రాన్తస్తేనాప్రయాసేన సర్వతస్త్వామవాప్నుయామ్ ॥ 9**

**ప్రతిపదార్థము :** కాం భూమికామ్ = యే భూమిపై, యే ప్రదేశమున, న అధిశేషే = అధివసించి లేవు?, యత్ = యేది, తే = నీయొక్క, వపుః = శరీరము, న స్యాత్ = కాదో, తత్ = అది, కిమ్ = యేమి?, తేన = దానిచే, శ్రాన్తః = దుఃఖితుడనై, తామ్ = నిన్ను, సర్వతః = అన్ని ప్రదేశములలో, అప్రయాసేన = శ్రమలేకుండ, అవాప్నుయామ్ = పొందుదును.

**తాత్పర్యము :** నీవెక్కడలేవో, నీ శరీరము కానిదేదో, అది యేది? దానిని తెలియక దుఃఖితుడనైన నేను, అట్టి ప్రదేశములను, వస్తువులను తెలిసికొని, అట్టిచో అంతటా, అన్నిటా నిల్పికొని శ్రమలేకుండ నిన్ను పొందగలను.

శివుడు సర్వవ్యాపి అంటారు. కాని ఈ ప్రపంచంలో ఎక్కడా నీవున్న గుర్తే కనరాదు. నీవెక్కడ ఉన్నావో, ఎక్కడ లేవో తెలియక దుఃఖితుడనైనాను. నీవు జ్ఞానదాతవు కదా, నాకు ఈ రహస్యాన్ని బోధించు. అప్పుడు అనాయాసంగా నేను నిన్ను అంతటా ప్రతిష్ఠించికొని దర్శించి పరవశిస్తాను, అంటూన్నాడు ఈ శివభక్తుడు.

**అప్రయాసేన** అంటే ధ్యానపూజాదికం లేకుండా, అని.

**శ్లో॥ భవదంగపరిష్వంగసంభోగః స్వేచ్ఛయైవ మే ।**
**ఘటతామియతి ప్రాప్తే కిం నాథ! న జితం మయా ॥ 10**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, భవత్ = తమయొక్క, అంగ = శరీరమును, పరిష్వంగ = కౌగిలించుటలోని, సంభోగః = ఆనందము, మే = నాకు, స్వేచ్ఛయా ఏవ = నా ఇష్టానుసారముగనే, ఘటతామ్ = సంభవించుగాక!, ఇయతి = ఇంతమాత్రము, ప్రాప్తే = లభించగా, మయా = నాచేత, కిమ్ = ఏది, న జితమ్ = జయింపబడలేదు?

**తాత్పర్యము :** ఓ స్వామీ! తమ శరీరాన్ని కౌగిలించటంలోని ఆనందాన్ని నా ఇష్టానుసారం నేను అనుభవించగలగాలన్నది నా కోరిక. ఈ కోరిక తీరితే ఇంక నేను జయించని దేమున్నది?

శివుడు లింగస్వరూపుడు. ఈ లింగరూపాన్ని తాను ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు మనసారా కౌగిలించుకోగలగాలని ఆశ. ఈమాత్రం అవకాశం తనకు లభిస్తే తాను సమస్తాన్నీ జయించినట్లేనని కవి భావం.

**శ్లో॥ ప్రకటీభవ నాన్యాభిః ప్రార్థనాభిః కదర్థనాః ।**
**కుర్మస్తే నాథ తామ్యన్తస్త్వామేవ మృగయామహే ॥ 11**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, ప్రకటీభవ = ప్రత్యక్షముగమ్ము, అన్యాభిః = ఇతరములైన, ప్రార్థనాభిః = ప్రార్థనలచేత, తే = నీకు, కదర్థనాః = కష్టములు, న కుర్మః = కలిగించము, తామ్యన్తః = దుఃఖితులమై, త్వాం ఏవ = నిన్నే, మృగయామహే = అన్వేషింతుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ప్రత్యక్షముగమ్ము. ఇతర ప్రార్థనలతో నిన్ను కష్టపెట్టము. దుఃఖంతో నీకోసమే అన్వేషిస్తున్నాము.

ఇతర ప్రార్థనలు అంటే లౌకికమైన కామ్యపరిపూర్తికోసం చేసే తపస్సులూ, యజ్ఞయాగాదులూ, పూజాదికాలూ అన్నీ. నీ దర్శనం మాత్రమే కావాలి. ఎందుకంటే, మిగతావన్నీ మేము ఎఱిగినవే. శివుడున్నూ లోకంలో ఉన్నాడుకదా, అంటే, ఈ లౌకిక రూపాలలో ఉన్న శివునితో మాకు, నీ భక్తులకు, తృప్తి, సంతోషం కలుగదు. మాకు నీ దివ్యతేజోమూర్తి దర్శనం కావాలి. దానికోసమే మా అన్వేషణ. – ఇదీ ఈ శివభక్తుని విన్నపము.



శ్రీః

# 7. విధురవిజయం స్తోత్రమ్

శ్లో॥ త్వయ్యానందసరస్వతి సమరసతామేత్య నాథ! మమ చేతః ।
పరిహరతు సకృదియన్తం భేదాధీనం విధురతా మహానర్థమ్ ॥ 1

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, త్వయి = నీయందు, ఆనందసరస్వతి = 'ఆనందము' అను ప్రవాహమునందు, సమరసతామ్ = తన్మయత్వమును, ఏత్య = పొంది, మమ = నాయొక్క, చేతః = మనస్సు, భేద = భిన్నత్వమునకు, అధీనమ్ = లోనైనట్టి, ఇయన్తమ్ = ఇంతటి, విధురతా మహానర్థమ్ = బాధ అనే గొప్ప ఆపదను, సకృత్ = ఒకేసారి, శాశ్వతముగా, పరిహరతు = దూరముచేయుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ దర్శనానందప్రవాహంలో తన్మయుడనై నేనుండగా నా మనస్సునుండి భేదబుద్ధియను మహా ఆపద శాశ్వతముగా దూరమగుగాక!

**విధురతా** అంటే బాధ, ప్రత్యేకించి విరహబాధ. విరహం అంటేనే ఎడబాటు కదా. కనుక ఇది ప్రేయసీ ప్రియులకు సంబంధించినది. ఈ సందర్భంలో ప్రేయసి భక్తుడు, ప్రియుడు శివుడు. ఈ విరహం ప్రేయసి అనుభవం మాత్రమే. కారణం, ఆమె తాను వేరు, తన ప్రియుడు వేరు అన్న భేదబుద్ధితో బాధపడుతూన్నది. కాని ఈ భేదబుద్ధి తొలగటం సాధ్యమే. ఎట్లా? తన ప్రియుని తలచుకున్నప్పుడు తనలో ఉప్పొంగే ఆనంద ప్రవాహంలో తనను తాను మరచిపోతున్నది కదా. ఆ క్షణం తనలో యే భేదబుద్ధీ లేదుకదా. అదే భావం, అద్వైతభావం శాశ్వతంగా మనసులో నిలిచిపోతే ఈ అనర్థం తొలిగిపోయినట్లే. ఈ అదృష్టాన్ని అనుగ్రహించుమని ప్రార్థన. భేదబుద్ధి వలన మాత్రమే భక్తుడు భగవంతునకు దూరమవుతూన్నాడు తప్ప భగవంతుడెప్పుడూ భక్తునితోనే ఉన్నాడన్నది తత్త్వం.

శ్లో॥ ఏతన్మమ న త్విదమితి – రాగద్వేషాది నిగడదృఢమూలే ।
నాథ! భవన్మయతైక్య – ప్రత్యయపరశుః పతత్వన్తః ॥ 2

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, ఏతత్ = ఇది, మమ = నాయొక్క, ఇదం తు = ఇదియైన, న = కాదు, ఇతి = అని, రాగ = ప్రేమ, ద్వేష = ద్వేషము, ఆది = మొదలైన, నిగడ = సంకెలల, దృఢ = బలమైన, మూలే = వేరులై, భవన్మయతా = తమతో నిండియుండుట అను, ఐక్య = ఏకత్వముయొక్క, ప్రత్యయ = పూర్ణరూపమైన, పరశుః = గండ్రగొడ్డలి, అన్తః = ఉనికిపై, పతతు = పడుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఇది నాదైతే కాదు, అని ప్రేమ ద్వేషము మొదలైన సంకెలల దృఢమైన వేరుపై, దాని ఉనికిపై నేను – నీవు ఒక్కటే అన్న అద్వైతభావము గండ్రగొడ్డలియై పడుగాక!

**ఏతత్** అంటే సుఖం, ఈ సుఖానికి హేతువు. ఇది నా సుఖమూ కాదు, దాని హేతువూ కాదు. ఏది? **ఇదం,** ఇది, రాగద్వేషాదిరూపమైన ద్వంద్వప్రకృతి. ఇదియే సుఖకరమన్న నా భేదబుద్ధివలన మాత్రమే దుఃఖం కలుగుతూన్నది. కాని ఈ జ్ఞానం కలిగేదెట్లా? శివాద్వైతభావం వలన. ఆ భావమే గండ్రగొడ్డలిగా మారి ద్వైతమయమైన సంసారభావాన్ని మూలచ్ఛేదం చేస్తే, రాగద్వేషాదుల ఉనికి లేకుండా పోతుంది. అప్పుడు దుఃఖమూ ఉండదు, దుఃఖకారణమూ ఉండదు. శివత్వం, అంటే విశుద్ధానందం మాత్రమే మిగులుతుంది.

**శ్లో॥ గలతు వికల్పకలంకావలిః – సముల్లసతు హృది నిరర్గలతా ।**
**భగవన్నానందరస – ప్లుతాస్తు మే చిన్మయీ మూర్తిః ॥ 3**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ భగవంతుడా! వికల్ప = వికల్పము, సంశయము, అనిశ్చితి, అనబడు, కలంక = కళంకముల, ఆవలిః = మాల, గలతు = జారిపోవుగాక!, హృది = హృదయములో, నిరర్గలతా = పూర్ణస్వతంత్రభావము, సముల్లసతు = వెలుగుగాక!, మే = నాయొక్క, చిన్మయీ మూర్తిః = చైతన్యమూర్తి, ఆనందరస = ఆనందానుభవముతో, ప్లుతా = తడిసినది, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** నాలోని అనిశ్చితి, సంశయము మొదలుగా గల కళంకముల సమూహము జారిపోవుగాక! నా మనస్సులో పూర్ణత్వము వెలుగుగాక! నా చైతన్యమూర్తి ఆనందానుభవములో ఆర్ద్రమగుగాక!

వికల్పాలు భేదాన్ని సృష్టించేవి కనుక వానిని దోషాలుగా పరిగణించి కలంకాలు అన్నాడు కవి. ఇవి అనేకం కనుక మాల అనటం. ఈ వికల్పాల కారణంగా మానవుడు అస్వతంత్రుడై భేదభావానికి దాసుడవుతూన్నాడు. అవి లేకపోతే, ఆతడు తనకు తానే అధికారి, యజమాని. కనుక స్వతంత్రుడు, పూర్ణుడు అవుతాడు. అప్పుడు అసలైన ఆనందానుభవం కలుగుతుంది. వికల్పాలవలన కలిగేది ఆనందచ్ఛాయమాత్రమే. అది దుఃఖరాహిత్యం వలన కలిగినదే. కనుక సాపేక్షం. నిరపేక్షం, నిరర్గలం కాదు. అయితే వికల్పానికి ముందు సంకల్పం ఉండనే ఉంటుంది. కనుక జారిపోవలసినవి ఈ రెండూను. సంకల్పం లేకుండా జీవించటం సాధ్యమా? సంకల్పాన్ని శివునకు వదిలేస్తే,

వికల్పమూ నీది కాదు. శిశువు ఈ రెండిటినీ తల్లికి వదలినంత కాలం సుఖి, తాను స్వీకరించినంతనే దుఃఖి ఎట్లా అవుతూన్నాడో గమనిస్తే విషయం బోధపడుతుంది. అందుకే ఈ భక్తకవి వాటిని కాదని, నిరర్గలానందం కావాలంటూన్నాడు.

**శ్లో॥ రాగాదిమయభవాండక - లుఠితం త్వద్భక్తిభావనాంబికా తైస్తైః ।**
**ఆప్యాయయ తు రసైర్మాం - ప్రవృద్ధపక్షో యథా భవామి ఖగః ॥ 4**

**ప్రతిపదార్థము :** రాగ + ఆదిమయ = రాగము మొదలగువానిచే నిండియున్న, భవ + అండక = సంసారమను గ్రుడ్డునందు, లుఠితమ్ = పొరలాడుచున్న, మామ్ = నన్ను, త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియొక్క, భావనా = భావనారూపియైన, అంబికా = తల్లి, తైః తైః రసైః = ఆయా రసములచేత, ఆప్యాయయ తు = పుష్టిగలవానిగా చేయుగాక!, యథా = ఏ విధముగా, ప్రవృద్ధ = చక్కగ పెరిగిన, పక్షః = ఱెక్కలు గల, ఖగః = పక్షిని, భవామి = అగుదునో.

**తాత్పర్యము :** నేను రాగద్వేషాదులతో నిండిన బ్రహ్మాండమనే ఈ గ్రుడ్డులో పొరలుచున్నవాడను. అట్టి నాకు తల్లియై నీయందలి భక్తిభావన సముచితమైన రసములతో పోషించి పుష్టిని కలిగించుగాక! ఆ విధముగా నేను చక్కగా ఱెక్కలు విప్పారిన పక్షినగుదును.

బ్రహ్మసృష్టి కనుక ఈ జగత్తు బ్రహ్మాండము. ఈ గ్రుడ్డులో అన్ని జీవుల వలెనే సరిగా యేర్పడని అవయవములతో సదమదమవుతూన్న వాడను నేను. నీ యందు భక్తివిశ్వాసాలతో జీవిస్తూన్నవాడను. కనుక నాకు నీయందుగల భక్తి తల్లి. ఈ తల్లియే పోషించవలె. ఎప్పుడెప్పుడు యే ఆహారాన్నిస్తే నిరపాయంగా నేను బలంగా ఎదుగుతానో ఆమెకే తెలుసు. నన్నావిధంగా భక్తిమాత పోషిస్తే, నేను చక్కగా పుష్టిగలిగి ఱెక్కలు సారించి ఎగురగలను, శివానందమనే ఆకాశంలోకి చొచ్చుకుపోగలను. శివుడు పశుపతి, నేను వాని పశువును. కనుక నాకు జీవానందమూ, ఆత్మానందమూ కూడా శివభక్తితోనే లభించగలవు. శివభక్తితోనే నాకు ఈ సంసారమనే రాగాది ద్వయీభావం నుండి స్వేచ్ఛ లభించగలదు. శివభక్తి నన్నట్లు అనుగ్రహించుగాక!

**శ్లో॥ త్వచ్చరణభావనామృత - రససారాస్వాదనైపుణం లభతామ్ ।**
**చిత్తమిదం నిఃశేషిత - విషయవిషాసంగవాసనావధి మే ॥ 5**

**ప్రతిపదార్థము :** నిఃశేషిత = మిగులు లేకుండ చేయబడిన, విషయ = ఇంద్రియ విషయములనబడు, విష = విషమునందలి, ఆసంగ = ఆసక్తియొక్క, వాసనా =

సంస్కారము, అవధి = పొలిమేరయైన, ఇదమ్ = ఈ, మే = నాయొక్క, చిత్తమ్ = మనస్సు, త్వత్ = నీయొక్క, చరణ = పాదముల, భావనా = స్మరణయను, అమృతరస = అమృతద్రవముయొక్క, సార = సారమును, ఆస్వాద = స్వీకరించి ఆనందించుటలో, నైపుణ్యమ్ = నేర్పును, లభతామ్ = పొందుగాక!

**తాత్పర్యము :** నాలోని ఇంద్రియసుఖేచ్ఛ విషప్రాయమైన వాసనలను మనసులో మిగుల్చును. ఈ వాసనలు నశించి, నేను నీ స్మరణయను అమృతపానమును అనుభవించుటలో నాకు నేర్పు లభించుగాక!

ఆహారంగా ఆనందంగా స్వీకరించే పదార్థాలూ భావాలూ అన్నీ అనుభవాంతంలో శరీరంలోనూ మనస్సులోనూ విషాన్ని మిగల్చటం ప్రకృతిధర్మం. శరీరంలోని జీర్ణక్రియ, తదితర జీవక్రియలు ఆ దైహిక విషాలను (Toxins) విసర్జనల రూపంలో శరీరంనుండి బైటకు నెట్టివేస్తాయి. అయినాగాని వాటి నిల్వ సూక్ష్మరూపంలో ఉండి శరీరాన్ని దుర్బలం చేస్తూనే ఉంటుంది, శరీరం నిష్క్రియమయ్యే పర్యంతం. ఇంద్రియాల ప్రేరణతో అనుభవించే భోగాలు కూడా ఇట్లాగే ప్రవర్తిస్తాయి. అనుభవాలు క్షణికాలే అయినప్పటికిన్నీ, ప్రతి అనుభవమూ అందలి ఆసక్తిని బలవత్తరం చేస్తూంటుంది. ఈ ఆసక్తి వాసనరూపంలో మనసును శాసిస్తుంది. మరణం తరువాత కూడా ఈ ఆసక్తి మరల మరల జన్మకు కారణం అవుతూ మానవుని చేతనకు సంకెలలై బంధించగలదు. కనుక ఈ వాసన నశించి శుద్ధభక్తి నిలిచినపుడు అమృతానందం అనుభవంలోకి వస్తుంది. ఆ నేర్పును ప్రసాదించుమని ఈ శివభక్తకవి ప్రార్థన.

**శ్లో॥ త్వద్భక్తితపనదీధితి – సంస్పర్శవశాన్మమైష దూరతరమ్ ।**
**చేతోమణిర్విముంచతు – రాగాదికతప్తవహ్నికణాన్ ॥ 6**

**ప్రతిపదార్థము :** ఏషః = ఈ, మమ = నాయొక్క, చేతః మణిః = మనస్సు అను రత్నము, త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియను, తపన = సూర్యునియొక్క, దీధితి = కాంతికిరణములయొక్క, సంస్పర్శవశాత్ = స్పర్శవలన, రాగ + ఆదిక = రాగము మొదలయిన, తప్త = వేడియైన, వహ్నికణాన్ = అగ్నికణములను, దూరతరమ్ = దూరదూరముగ, పూర్తిగ, విముంచతు = విడుచునుగాక!

**తాత్పర్యము :** నా మనస్సను ఈ మణి నీ భక్తియను సూర్యుని కిరణాల స్పర్శ సోకి, రాగద్వేషాదులనబడు నిప్పుకణికలను దూరముగ విసరివేయుగాక!

సాధారణంగా సూర్యకాంతికిరణాలను జ్ఞానోదయానికి చిహ్నంగా చెబుతారు.

ఆ కిరణాలు చీకటిని తొలగిస్తాయికదా. మనస్సు అనబడే మణి చీకట్లో ప్రకాశిస్తుంది. సూర్యకిరణస్పర్శ కలుగగానే ఆ కాంతిలో తన కాంతిని కోల్పోతుంది. అజ్ఞానంలో వెలిగి, జ్ఞానంలో వెలుగును కోల్పోతుంది. కేవలం జ్ఞానకాంతితోనే తానూ వెలుగుతుంది. అంతవరకు చీకట్లలో, అజ్ఞానంలో, ఎగసిపడిన నిప్పురవ్వల వంటి తన కాంతులు రాగద్వేషాది మనోవికారాలు. ఈ వికారాలు జ్ఞానదీప్తిలో మణిగిపోతాయి. ఈ జ్ఞానం భక్తివలన కలుగవలెనంటాడు కవి. భక్తికి మూలం విశ్వాసం కదా, దానినుండి జ్ఞానం కలుగుతుందా? అంటే, కలుగుతుంది, అన్నది ఆర్యోక్తి. అట్లా కలిగితే, అది సద్భక్తి అవుతుంది. కలుగకుంటే, మూఢభక్తి అవుతుంది. అంటే, సద్భక్తి విశ్వాసం నుండి సుజ్ఞానానికి పరిణమించగా, మూఢభక్తి విశ్వాసాన్ని సంకుచితం చేసి అజ్ఞానం దిశగా లాగుతుందని భావం. తన భక్తి సుజ్ఞానదాత కావలెనని ఈ భక్తకవి కోరిక.

**శ్లో॥ తస్మిన్ పదే భవన్తం – సతతముపశ్లోకయేయమత్యుచ్చైః ।**
**హరిహర్యశ్వవిరించా – అపి యత్ర బహిః ప్రతీక్షన్తే ॥ 7**

**ప్రతిపదార్థము :** సతతమ్ = ఎల్లప్పుడు, తస్మిన్ = ఆ, అతి ఉచ్చైః = అత్యంత ఉన్నతమైన, పదే = స్థానమున, భవన్తమ్ = తమరిని, ఉపశ్లోకయేయమ్ = భక్తితో నుతించుచుందును, యత్ర = ఎక్కడ, హరి = విష్ణువు, హర్యశ్వ = ఇంద్రుడు, విరించాః = బ్రహ్మ, అను వీరు, అపి = కూడ, బహిః = వెలుపల, ప్రతీక్షన్తే = నిరీక్షించుచుందురో (అక్కడ).

**తాత్పర్యము :** ఏ స్థానమునకు వెలుపల బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు మొదలైన దివ్యులు కూడ నీ యాజ్ఞకై వేచియుందురో, అట్టి ఉన్నతోన్నత స్థానమున నేను పారవశ్యమున నిన్ను కీర్తించుచుందును.

దేవతల స్థానాలు ఒకరికంటె ఒకరివి ఉన్నతమైనవి. అన్నిటికంటె సర్వోన్నత మైనది పరశక్తి స్థానం. దానికి చేర్చేది పరశక్తిమార్గం. ఆ మార్గం వెలుపలనే బ్రహ్మాది దేవతలు నీకై వేచి ఉంటారు. వీరికి పరాశక్తిని దర్శించవలెనన్న కోరిక ఉన్నప్పటికి అదెట్లో గుర్తుదెలియక వెలుపలనే వేచియుంటారు. కాని, ఆ మార్గమేదో నేనెఱుగుదును. అది భక్తిమార్గం. ఆ మార్గాన పరాశక్తివైపుగా పయనిస్తూ నేను మాత్రం నిన్ను ఎల్లవేళల స్తుతిస్తూంటాను, అంటాడీ భక్తకవి.

అయితే, తనకు పయనించవలసింది పరాశక్తిని చేర్చేమార్గం కదా, అది పరాశక్తిపట్ల భక్తియుతం కావలెను కదా, మరి ఈతడు శివభక్తిమార్గాన నడుస్తూ

శివస్తోత్రాలు పాడుతూంటే పరాశక్తిని ఎట్లా చేరుకోగలడు? అనవచ్చు. గమనార్హం శివశక్తులభేదరూపులని. శివుని గాని శక్తిని గాని చేర్చే మార్గం శివభక్తిమార్గమే, అని. ఈ రహస్యం తెలియనివారు దేవతలయినా సరే, బాట వెలుపలే వేచి ఉండక తప్పదు, అంటాడీ భక్తకవి.

**శ్లో॥ భక్తిమదజనితవిభ్రమ – వశేన పశ్యేయమవికలం కరణైః ।**
**శివమయమఖిలం లోకం – క్రియాశ్చ పూజామయీ సకలాః ॥ 8**

**ప్రతిపదార్థము :** భక్తిమద = భక్తిపారవశ్యమున, జనిత = కలిగిన, విభ్రమవశేన = భ్రమకారణముగా, కరణైః = ఇంద్రియములతో, అవికలమ్ = విభజింపబడని, అఖిలమ్ = పూర్ణరూపమైన, లోకమ్ = జగత్తును, శివమయమ్ = శివునితో నిండినదానినిగా, చ = మరియు, సకలాః = సర్వవిధముల, క్రియాః = కార్యములు, పూజామయీః = పూజారూపమైనవిగా, పశ్యేయమ్ = చూతును.

**తాత్పర్యము :** ఇంద్రియగోచరమైన లోకమంతా భక్తిపారవశ్యంలో శివరూపముగాను, కాలు సేతులు మొదలైన కరణేంద్రియములతో నిత్యము చేయబడు పనులన్నియు పూజా విధులుగాను నాకు దర్శనమిస్తూన్నవి.

మానవునకు జ్ఞానేంద్రియాలు కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అనేవి అయిదున్నూ కర్మేంద్రియాలు వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు అనబడు అయిదున్నూ వెరశి ఇంద్రియాలు మొత్తం పది. వీని పనులను మనస్సు శాసిస్తుంది. ఈ మనస్సు శివభక్తిలో మునిగియున్న వేళ దాని సహజమైన విభజించి చూచే లక్షణాన్ని కోల్పోతుంది. అందువలన బాహ్యప్రకృతి దర్శనం కనుమరుగై, సర్వాంతర్వ్యాప్తి శివదర్శనం కలుగుతుంది. అందువలన వికలప్రపంచం సకలమై అద్వయశివంగా భాసిస్తుంది. అట్లే, కర్మేంద్రియ క్రియలు లౌకికతను కోల్పడి ఆ అద్వయశివార్చనగా అనుభూతిని కలిగిస్తాయి, **యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్** అన్న భావావేశాన్ని కలిగిస్తాయి. ఆ స్థితిని అనుభవంలో పొందినానని ఈ భక్తకవి అంటూన్నాడు. సాధక భక్తులకివి ఉత్ప్రేరకమైన వాక్యాలు.

**శ్లో॥ మామకమనోగృహీత – త్వద్భక్తికులాంగనాణిమాదిసుతాన్ ।**
**సూత్వా సుబద్ధమూలా – మమేతి బుద్ధిం దృఢీకురుతామ్ ॥ 9**

**ప్రతిపదార్థము :** మామక = నాదైన, మనః = మనస్సు, గృహీత = స్వీకరించబడిన, త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియను, కులాంగనా = భార్య, అణిమా ఆది = అణిమా

మొదలగు, సుతాన్ = సుతులను, సూత్వా = ప్రసవించి, సుబద్ధ = బాగుగా, దృఢముగా కట్టబడిన, మూలా = మూలముగలదై, మమ = నాది, ఇతి = అను, బుద్ధిమ్ = బుద్ధిని, దృఢీకురుతామ్ = స్థిరము చేసికొనుగాక!

**తాత్పర్యము :** నీ భక్తి అను భార్యను నా మనస్సు స్వీకరించి ఆమె ద్వారా అణిమా మొదలైన కుమారులను కని, ఈ సంసారము నాది అను స్థిరమైన బుద్ధితో నుండుగాక!

ఈ భక్తకవి ఆకాంక్ష ఇది : అంగీకార తిరస్కారాలకు మూలం మనస్సు. కనుక తన మనస్సు శివభక్తిని అంగీకరించి, భార్యతో భర్తవలె, జీవించవలె. వారి సంసారంలో అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, మహిమ, ఈశిత్వం, వసిత్వం, కామావసాయిత అనబడే ఎనమండుగురు కుమారులను కనవలె. ఈ సంతానం వలన తన భక్తిసంసారం సుస్థిరం కావలె. సంసారబంధం సంతానం వలన బిగుస్తుంది. ఇది ఇహ సంసారమే కాదు భక్తి విషయం కూడ. తన సాధనల ద్వారా భక్తునకు అలౌకికానుభవాలూ, అలౌకికశక్తులు లభించినప్పుడు తాను దోవతప్పలేదని నమ్మకం కుదిరి, పూర్వశ్లోకాలలో ప్రస్తావింపబడిన శివపారమ్యాన్ని చేరుకోగలడు. ఇది యోగసాధకులకు విహితమైన మార్గం. భక్తి కూడ యోగమే కదా!



శ్రీః

## 8. అలౌకికోద్బలనమ్ స్తోత్రమ్

**శ్లో॥ యః ప్రసాదలవ ఈశ్వరస్థితో - యా చ భక్తిరివ మాముపేయుషీ ।**
**తౌ పరస్పరసమన్వితౌ కదా - తాదృశే వపుషి రూఢిమేష్యతః ॥ 1**

**ప్రతిపదార్థము :** ఈశ్వరస్థితః = ఈశ్వరయుక్తుడైనవాడు, యః = ఎవడు, ప్రసాదలవః = అనుగ్రహావేశముగలవాడో, యా చ = ఏదియును, భక్తిః ఇవ = భక్తివలె, మామ్ = నన్ను, ఉపేయుషీ = పొందినదో, తౌ = ఈ రెండున్ను, పరస్పర = ఒకదానితోనొకటి, సమన్వితౌ = కలిసియుండునవి, తాదృశే = అటువంటి, వపుషి = శరీరమునందు, కదా = ఎప్పుడు, రూఢిమ్ = స్థిరవికాసమును, ఏష్యతః = పొందుచున్నవో!

**తాత్పర్యము :** ఈశ్వరునియందు స్థిరచిత్తముగల భక్తుడు ఈశ్వరయుక్తుడు. వానికి ఈశ్వరానుగ్రహము లేశమైన ఉన్నదనవచ్చు. నన్ను పొందినది భక్తియనదగిన భావము.

ఇది వికాసము చెంది, శరీరమై, అందు భగవంతుడు విరాజమానుడై, నేనెప్పుడు ఈశ్వరయుక్తుడనగుదునో కదా!

ఈ లోకాన్ని ఆవరించి చిత్తభ్రాంతిని కలిగించే మాయ ఉపశమించినప్పుడు చిత్తం నిర్మలమవుతుంది. ఈ నైర్మల్యం యేర్పడినప్పుడు చిత్తం ఈశ్వరస్థానమవుతుంది. దీనికి భక్తి సాధనమవుతుంది. ఆ నైర్మల్యమే ప్రసాదగుణం అనబడుతుంది. భక్తివలన ఈ గుణం లేశమాత్రంగా యేర్పడుతుంది. అయినా, మాయావరణం పూర్తిగా తొలగిపోదు. ఇటువంటి స్థితియే ఈ భక్తకవికి కలిగింది. అయితే ఈ చిత్తనైర్మల్యం, ఈ ప్రసాదం, స్వయంగా దేహమైపోతే, అంటే ఈ లౌకికదేహధ్యాస నశించి, పూర్ణనైర్మల్యం సిద్ధిస్తే, ఆ చిత్తం చిత్సహితమవుతుంది. అప్పుడది శివత్వసిద్ధిని పొందుతుంది. అంతటి మహద్భాగ్యం తనకెప్పుడు కలుగుతుందో కదా, అన్నది ఈ భక్తుని ఆరాటం.

**శ్లో॥ త్వత్ప్రభుత్వపరిచర్వణజన్మా – కోఽప్యుదేతు పరితోషరసోఽన్తః ।**
**సర్వకాలమిహ మే పరమస్తు – జ్ఞానయోగమహిమాది విదూరే ॥ 2**

**ప్రతిపదార్థము :** ఇహ = ఈ లోకంలో, సంసారంలో, పరమ్ = కేవలము, త్వత్ = నీయొక్క, ప్రభుత్వ = స్వామిత్వమును, పరిచర్వణ = ఆస్వాదించుటచే, జన్మా = కలిగిన, కః అపి = ఏదేని యొక అలౌకిక, పరితోషరసః = ఆనందాస్వాదనము, సర్వకాలమ్ = ఎల్లకాలము, మే = నాయొక్క, అన్తః = లోపల, హృదయములో, ఉదేతు = ఉదయించునుగాక!, జ్ఞాన = జ్ఞానము, యోగ = యోగము, మహిమా = మహిమ, ఆది = మొదలైనవి, విదూరే = విశేషదూరమున, అస్తు = ఉండుగాక!

**తాత్పర్యము :** ఈ లోకంలో కేవలం నీ ప్రభుతను అంగీకరించటం ద్వారా కలిగే ఆనందమే నాకు ఎల్లకాలం లభించుగాక! జ్ఞానం, యోగం, మహిమ అని చెప్పబడేవి, అటువంటి మిగతావన్నీ నాకు, నా అనుభవానికి సుదూరంలో ఉండుగాక! నా చెంతకు రాకుండుగాక!

లౌకికం సమస్తం భావస్థిరత్వం వలన అలౌకికమయిపోతాయి. అటువంటి అద్భుతభావాలలో ప్రథమస్థానంలో నిలిచేది భక్తి, విశ్వాసం, ప్రేమ అని వివిధ నామాలతో పిలువబడే భావన. ఈ భావం దృఢమైతే, మిగత అన్ని భావాలపైనా అదే పెత్తనం చేస్తుంది. ఆ ఒక్క భావంలో అలౌకికానందం ఉత్పన్నమవుతుంది. మిగత భావాలు చేరవు. ఈ స్థితి తనకు మనసా కలగాలని ఈ శివభక్తుని కోరిక.

మరి తాను యే స్వామిని ఆరాధిస్తున్నాడో ఆ స్వామిని గురించి జ్ఞానం

వద్దా? ఆ స్వామితో సంయోగానికి యోగసాధన వద్దా? యోగసాధనలో లభించే మహిమలు లోకాన్ని తనకు బానిసను చేస్తాయి కదా, అవేవీ వద్దా? అంటే, వద్దు అన్నదే సమాధానం. ఆ స్వామి ప్రభుతలో సడలని విశ్వాసం, భక్తి ఒక్కటే చాలు, అన్నది ఆతని మనోనిశ్చయం.

**శ్లో॥ లోకవద్భవతు మే విషయేషు - స్ఫీత ఏవ భగవన్పరితర్షః ।**
**కేవలం తవ శరీరతయైతాన్ - లోకయేయమహమస్తవికల్పః ॥ 3**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ ఈశ్వరా!, లోకవత్ = లోకంలో అందరి వలెనే, మే = నాకు, విషయేషు = ఇంద్రియభోగాలలో, స్ఫీతః ఏవ = చాలా అధికంగానే, పరితర్షః = తృష్ణ, లాలస, భవతు = ఉండుగాక!, కేవలమ్ = కేవలము, అహమ్ = నేను, అస్త = నష్టమైన, వికల్పః = అనిశ్చితి, సంశయములు కలవాడనుగా, ఏతాన్ = ఈ విషయములను, తవ = నీయొక్క, శరీరతయా = శరీరమనుభావముతో, లోకయేయమ్ = చూచుచుందును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! లోకంలో అందరికీ ఉన్నట్లే నాకుగూడ విషయవాంఛలు ఎక్కువగానే ఉండనివ్వు, పరవాలేదు. కాని నాలో కేవలం సంశయం, అనిశ్చితి అన్నవి యే విషయంలోనూ ఉండకపోతే చాలు. ఈ విషయాలన్నీ తమ శరీరమే అన్న భావంతో చూస్తూ ఉండిపోగలను.

ఇంద్రియవాంఛలు సహజమైనవి. అవేవో అసహజమన్న భావనవలన అవి కలంకితమవుతూన్నవి. విశ్వమంతా శివశరీరమైతే అందులో భాగమైన ఈ భక్తుడు కూడా శివశరీరమే కదా! ఆ శరీరసంబంధమైన విషయలాలస, అల్పమో అధికమో, అది తుచ్ఛమనవచ్చునా లేక అదికూడ దివ్యమా? శివమా? అనిశ్చితి, సంశయం సహజం. అది కలగకపోతే, నేను ఈ లోకంలో అనుభవించే ఇంద్రియసుఖాలుసైతం శివమయమైపోతాయి. **సంశయాత్మా వినశ్యతి** అన్న గీతావాక్యాన్ననుసరించి, నా కోరిక, సంశయాలను నష్టం చేయుమని మాత్రమే. అప్పుడిక నేను దేహమూ ఆత్మా శివమే అన్న ఏకైకభావంతో జీవించి ధన్యుడను కాగలను అంటాడు ఈ భక్తుడు.

**శ్లో॥ దేహభూమిషు తథా మనసి త్వం - ప్రాణవర్త్మని చ భేదముపేతే ।**
**సంవిదః పథిషు తేషు చ తేన - స్వాత్మనా మమ భవ స్ఫుటరూపః ॥ 4**

**ప్రతిపదార్థము :** దేహభూమిషు = దేహావస్థలలో, తథా = అట్లే, మనసి చ = మానసిక భూములలో గూడ, భేదమ్ = భేదమును, ఉపేతే = పొందియున్న, ప్రాణవర్త్మని =

ప్రాణము సంచరించుమార్గములలో, చ = మరియు, తేషు = ఆ, సంవిదః = జ్ఞానసంబంధమైన, పథిషు = మార్గములలో, త్వమ్ = నీవు, తేన = ఆ, స్వాత్మనా = నీదైన చిదానందరూపముతో, మమ = నాకు, స్ఫుటరూపః = ప్రత్యక్షదర్శనుడవు, భవ = కమ్ము.

**తాత్పర్యము :** ఒక మానవుడైనందువలన నాకు గల దేహావస్థలలో, మానసికావస్థలలో, ప్రాణావస్థలలో, జ్ఞానావస్థలలోనూ నీవు నీదైన చిదానందరూపదర్శనమును నాకు ప్రసాదించుము.

**దేహభూములు** అంటే దేహానికి ఉనికినిచ్చే వివిధ దశలు, అవస్థలు. ఇవి శైశవ, బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య మరణములు అనునవి. **మనస్సుకు సంబంధించినవి** సంకల్ప, వికల్ప, భయ, సంశయ, ఆశా, స్పృహ, నిఃస్పృహాదులు. **ప్రాణసంచారమార్గాలు** సుఖం, దుఃఖం, క్లేశం, ఇత్యాదులు. **జ్ఞానమార్గాలు :** పుట్టినది మొదలు దేహాంతం వరకు ఇంద్రియాల ద్వారా పొందే సమస్తజ్ఞానము. ఒక వస్తువు పొడవు, వెడల్పు, ఆకారము, రంగు, రుచి, వాసన, స్పర్శ ఇత్యాది జ్ఞానమున్నూ వ్యావహారిక జ్ఞానమున్నూ. ఇవన్నీ మానవునకు జీవితమంతా సాక్షాత్కరించే భూములు. వీటిద్వారా తాను పొందే సాక్షాత్కారం శివమయంగా ఉండాలని ఈ భక్తకవి కోరిక.

**శ్లో॥ నిజనిజేషు పదేషు పతన్త్విమాః – కరణవృత్తయ ఉల్లసితా మమ ।**
**క్షణమపీశ! మనాగపి మైవ భూత్ – త్వదవిభేదరసక్షతిసాహసమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, ఇమాః = ఈ, మమ = నావియైన, ఉల్లసితాః = ఆనందముతో నిండిన, కరణ = జ్ఞాన కర్మేంద్రియములయొక్క, వృత్తయః = చేష్టలు, నిజనిజేషు = వానివానివైన, పదేషు = స్థానములలో, పతన్తు = లగ్నమైయుండునుగాక!, త్వద్ = నీయొక్క, అవిభేద = అద్వయమైన, రస = ఆనందముయొక్క, క్షతి = క్షీణత, లేకుండుట అను, సాహసమ్ = సాహసము, క్షణం అపి = క్షణమైనను, మనాక్ అపి = యే కొంచెమైనను, మా ఏవ భూత్ = కాకుండుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! నా కర్మజ్ఞానేంద్రియములన్నీ వానివాని పనుల్లో ఆనందంతో ప్రవర్తించునుగాక! శివాద్వయమైన ఆనందం క్షణమైనను యే కొంచెమైనను లేకపోవటం అన్న సాహసం నేను చేయకుందునుగాక!

కర్మేంద్రియాలూ జ్ఞానేంద్రియాలూ మనసుతో ముడిపడి పనిచేస్తూంటాయి. వాటిని వాటివాటి చర్యలలో నిర్దేశించి ఆనందించేది మనస్సు. అయితే ఈ బంధం

బిగిసిన కొలది మనస్సు వాటి నుండి, వాటివలన తాను పొందే ఆనందంనుండి విముఖం కాలేదు. పోనీగాని, ఓ ఈశ్వరా!, ఆ ఆనందం లౌకికతకు దూరంగా శివాద్వయానందంగా అలౌకికానుభూతిని నాకు ఎల్లకాలం మననివ్వు. నీనుండి విడిపోయి కేవలం పాంచభౌతిక ప్రాపంచికానందంగా పరిణమించనివ్వకు. అటువైపు నా మనస్సు తలత్రిప్పిచూచే సాహసం చేయకుండుగాక! అన్నది ఈ భక్తుని ప్రార్థన.

దోషం ఇంద్రియాలలోనూ లోకంలోనూ లేదు. కేవలం అనంతాన్ని సైతం సంకుచితం చేసే మానుషవైఖరిలో ఉన్నది. దానిని సంస్కరించుకోవలెనన్నది సారాంశము.

**శ్లో॥ లఘుమసృణసితాచ్ఛశీతలం – భవదావేశవశేన భావయన్ ।**
**వపురఖిలపదార్థపద్ధతే – ర్వ్యవహారానతివర్తయేయ తాన్ ॥ 6**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, ఆవేశవశేన = స్వరూపసమావేశ ప్రభావముతో, లఘు = తేలికయైన, మసృణ = కోమలమైన, సిత = తెల్లని, అచ్ఛ = నిర్మలమైన, శీతలమ్ = చల్లనైన, వపుః = శరీరమును, భావయన్ = భావించుచు, తాన్ = ఆ, అఖిల = సమస్తమైన, పదార్థ = భావవర్గ సంబంధమైన, పద్ధతేః = ప్రణాలికలయొక్క, వ్యవహారాన్ = వ్యవహారములను, అతివర్తయేయ = వదలివేయుదును.

**తాత్పర్యము :** స్వామీ! తమతో సమావేశమైన కారణంగా, మాయయొక్క ఆకర్షణ తొలగి నందువలన తేలికయైన, కాఠిన్యమును మాని కోమలమైన, తెల్లనైన, నిర్మలమైన, శీతలమైన నా శరీరాన్ని మనసులో ఊహించుకొని, భావప్రణాళికల వ్యావహారికతను వదలివేస్తాను.

లోకవ్యవహారమంతా ఒక జ్వరతీవ్రతవలె సాగిపోతూందని తెలిసినదే. నిజంగా మనసుకు హాయిగొల్పే స్థితి కనరాదు. శరీరం మనస్సు కూడా బరువెక్కి, పైత్యం ప్రకోపించి ఉన్నది ఉన్నట్లు కాక వింత వింత రూపాలు సంతరించికొని దర్శన మిస్తూంటాయి. కాయిక మాలిన్యం, మనోమాలిన్యం దేనినీ సరిగా చూడనివ్వవు. ఇది ఇహలోకస్పర్శ, లోకావేశం వలన వ్యక్తికి కలిగిన అస్వస్థత. ఇది తప్ప మరేమీ తెలియని మానవుడు ఇదే జ్ఞానమనీ, ఇదే దివ్యానుభూతియనీ భావిస్తూ బ్రతికేస్తూంటాడు. కాని ఒక్కసారి భగవదావేశం కలిగితే ఈ భవజ్వరం, fitful fever of life, తొలిగిపోయి, జీవితంలోని పెళుసుదనం, భారం, మాలిన్యం మాయమైపోతాయి. వాన వెలిసిన తర్వాత ప్రకృతివలె, జ్వరం తొలిగిన తర్వాత రోగికి వలె సర్వం శుద్ధమూ, స్వచ్ఛమూ, కోమలమూ, సుందరమూ, ఆనందమయమూ, శివస్వరూపమూ అవుతుంది. ఈ దర్శనాన్నే స్థిరంగా

పొందుతూ వ్యావహారిక, లౌకిక మాలిన్యాన్నీ, కాఠిన్యాన్నీ వదలివేస్తానని ఈ భక్తకవి మనోనిశ్చయాన్ని ప్రకటిస్తున్నాడు.

**శ్లో॥ వికసతు స్వవపుర్భవదాత్మకం - సముపయాన్తు జగన్తి మమాంగతామ్ ।**
**వ్రజతు సర్వమిదం ద్వయవల్గితం - స్మృతిపథోపగమేఽప్యనుపాఖ్యతామ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** స్వ = నాయొక్క, వపుః = శరీరము, సౌందర్యము, సారము, భవత్ = తమయొక్క, ఆత్మకమ్ = కేంద్రముగా, వికసతు = పరిణామము చెందుగాక!, జగన్తి = లోకములు, మమ = నాయొక్క, అంగతామ్ = శరీరభావమును, సముపయాన్తు = పొందుగాక!, ఇదమ్ = ఈ, సర్వమ్ = సమస్తము, ద్వయ = భేదభావనచే, వల్గితమ్ = నటింపజేయబడినది, స్మృతిపథ = జ్ఞాపకమునకు, ఉపగమే అపి = వచ్చినదైనను, అనుపాఖ్యతామ్ = చెప్పదగనిది, వ్రజతు = అగుగాక!

**తాత్పర్యము :** నా శరీరం తమ నివాసముగా పరిణమించునుగాక! లోకాలు నా శరీరభావాన్ని పొందుగాక! ద్వయబుద్ధితో వ్యవహరించే ఈ సమస్తం నా జ్ఞాపకాలలో మెరిసినప్పటికిన్ని, అది ఎన్నదగినది కాకుండుగాక!, దానికెటువంటి ప్రాముఖ్యమూ లేకుండుగాక!

నా శరీరమునకు ఆత్మ మీరే అగుదురుగాక! అని కూడ **స్వవపుర్భవదాత్మకం వికసతు** అన్నదానికి అర్థం చెప్పవచ్చు. **జగన్తి** పదం భూమి మొదలు సదాశివుని పర్యంతం వ్యాప్తమైన లోకాన్ని సూచిస్తుంది. ఈ వ్యాప్తవిశ్వం అంతా నాకు శరీరం కావాలి. ఇది భావనలో సాధ్యం కావాలి. అప్పుడు ఆ విశ్వశరీరంలో విశ్వనాథుడు ఆత్మయై నివసిస్తాడు. ఈ స్థితి కలిగే ముందు తన స్థితి ద్వయబుద్ధితో వ్యవహరించే లోకస్థితి. ఇది ఎప్పుడూ ఇట్లాగే ఉన్నది, ఉంటుంది. దాని జ్ఞాపకాలు నా మనస్సులో ఎడనెడ మెరిసినప్పటికి, అవి నిలువక జారిపోవలె. వానికి తన జీవితంలో యే పాత్రా ఉండకూడదు. అవి లేనట్లే నేను శివమయుడనై జీవించవలె. ఇది ఈ భక్తుని ఆకాంక్ష.

**శ్లో॥ సముదియాదపి తాదృశతావకా - ననవిలోకపరామృతసంప్లవః ।**
**మమ ఘటేత యథా భవదద్వయా - ప్రథనఘోరదరీపరిపూరణమ్ ॥ 8**

**ప్రతిపదార్థము :** తాదృశ = అటువంటి, తావక = తమయొక్క, ఆనన = ముఖముయొక్క, విలోక = దర్శనము అను, పర + అమృత = పరమామృతముయొక్క, సంప్లవః = వెల్లువ, వరద, అపి = కూడా, సముదియాత్ = రావచ్చును, యథా = ఏ ప్రకారముగా, మమ = నాకు, భవద్ = తమయొక్క, అద్వయ = అద్వైతరూపముయొక్క, అప్రథన =

దర్శనము లేకుండుటయను, ఘోర = భయంకరమైన, దరీ = గుహ, పరిపూరణమ్ = నిండింపబడుట, **ఘటేత** = సంభవించునో.

**తాత్పర్యము :** ఏ రీతిలో నాకు తమ ముఖదర్శనామృతము అను వెల్లువ రాగలదో, తమ అద్వైతరూపదర్శనము లేనందువలన యేర్పడిన భయంకరమైన అఖాతము పూరింపబడునో, ఆ స్థితి వచ్చుగాక!

లోకం ద్వైతభావనతో నిండియున్నది. సృష్టి, సృష్టికర్త వేర్వేరు అన్న భావనతో ఎదురైన శివుని గ్రహించలేని ఘోరమైన అజ్ఞానమనే అఖాతంలో పడియున్నది. ఈ స్థితినుండి ఉద్ధరింపబడటానికి మార్గమొక్కటే, **శివాద్వైతానుభూతి**. ఆ జ్ఞానం కలిగినప్పుడు ఈ ద్వైతాజ్ఞానాఖాతం పూడిపోతుంది. శివస్వరూపం సమస్తంలోనూ వెల్లువై దానిని పూడ్చివేస్తుంది. శివానుగ్రహం లేక ఆ జ్ఞానదృష్టి ప్రాప్తించదు. శివదర్శనం, శివానుగ్రహం లేక కలుగదు. ఆ అమృతదర్శనంవలన శివేతరభావం నశిస్తుంది. సృష్టియంతా స్రష్ట రూపమై భాసిస్తుంది. **అమృతసంప్లవమన్నది** రుద్రశక్తిసమావేశానందంగా క్షేమరాజవ్యాఖ్య.

**శ్లో॥ అపి కదాచన తావకసంగమా - మృతకణాచ్ఛురణేన తనీయసా ।**
**సకలలోకసుఖేషు పరాఙ్ముఖో - న భవితాస్మ్యుభయచ్యుత ఏవ కిమ్ ॥ 9**

**ప్రతిపదార్థము :** కదాచన = ఒకప్పుడైన, తనీయసా = కొంచెము, తావక = నీదైన, సంగమ = సమాగమము అను, అమృతకణ = అమృతబిందువులయొక్క, ఆచ్ఛురణేన = చిలకరించుటవలన, సకల = సమస్తమైన, లోకసుఖేషు = సాంసారిక, ప్రాపంచిక సుఖములపై, పరాఙ్ముఖః = విముఖతగలవాడను, ఉభయచ్యుతః + ఏవ = రెండిటికి దూరమైనవాడను, న భవితా + అస్మి కిమ్ = కాను గదా? అగుదునా ఏమి?

**తాత్పర్యము :** ఎప్పుడైన, యే కొంచెమైన, నీవు నన్నావేశించగా, ఆ అమృతబిందు పరిషేచనమువలన నాకు ప్రాపంచికసుఖములపట్ల ఆసక్తి తొలగి వాటికి నేను ఎడమొగమగుదును. కాని అంతలో ఆ స్థితినుండి జారిపోయి ఇహపరములు రెంటికిని చెడినవాడనైపోదునా?

ఈ సంశయార్థమేకాక, ఎప్పుడైన నీ సమావేశానందాన్ని యే కొంచెమైన పొందటం అంటూ ఒక్కసారి జరిగితే, ఆ అమృతాస్వాదనం వలన ప్రాపంచికసుఖాలకు విముఖుడనైన నేను మరల దానినుండి పతనమై లౌకికుడనవుతానా యేమి? ఎన్నటికీ కాను సుమా! అన్న వ్యంగ్యార్థమూ ఉన్నది.

సాధకునకు ఆరంభదశలో సంశయముండటం సహజం. సాధనలో ప్రగతిని

సాధించినవానికి ధ్యేయంపట్ల విశ్వాసం పెరుగుతుంది, పట్టుదల గట్టిపడుతుంది. ఇక తనకు కావలసినది ఒక్కసారి తన స్వామి దర్శనం మాత్రమే, దానితో సంశయవిచ్ఛిత్తి, సంపూర్ణానందమూ తథ్యం. ఈ ద్వైతబుద్ధిలోనే కదా సంశయం? శివదర్శనంతో ఇది నశించి, అద్వయానందం సిద్ధమవుతుంది. **ఉభయచ్యుతః** అన్నదానికి ఈ అర్థమూ చెప్పవచ్చు.

**శ్లో॥ సతతమేవ భవచ్చరణాంబుజా - కరచరస్య హి హంసవరస్య మే ।**
**ఉపరి మూలతలాదపి చాన్తరా - దుపనమత్వజ! భక్తిమృణాలికా ॥ 10**

**ప్రతిపదార్థము :** అజ! = ఓ జన్మలేనివాడా!, సతతం ఏవ = ఎల్లప్పుడును, భవత్ = తమయొక్క, చరణ = పాదములు అను, అంబుజ = పద్మములకు, ఆకర = సరోవరమైనదానిలో, చరస్య = సంచారముచేయు, హంసవరస్య = రాజహంసనగు, మే = నాకు, భక్తి = భక్తియను, మృణాలికా = తామరతూడు, ఉపరి = పైన, మూలతలాత్ అపి = క్రిందనుండి కూడ, చ = మరియు, అన్తరాత్ అపి = మధ్యనుండియు, ఉపనమతు = లభించుగాక!

**తాత్పర్యము :** ఓ అనాదిదేవా! తమ పాదపద్మాలకు నెలవైన సరోవరంలో రాజహంసనై సంచరించే నాకు నీ భక్తియను తామరతూడు ఆద్యంతమధ్యాంతరోపరిభాగాలన్నీ ఎల్లప్పుడూ సంపూర్ణంగా ఆస్వాద్యమగుగాక!

శివుని పాదపద్మాలకు నెలవైన సరస్సు ఈ విశ్వమే. దానిలో విహరించే రాజహంస భక్తుడు. వాని మనుగడకు ఆధారమైన తామరతూడు భక్తి. తామరతూడుకు మొదలు - చివర - మధ్య - పైభాగం ఉన్నట్లే భక్తిలో కూడా అనుభూతిభేదం ఉంటుంది. రాజహంస ఈ రుచిభేదాలను పాటించకుండా తామరతూడును మొత్తంగా ఆస్వాదిస్తుంది. భక్తుడు కూడా భక్తిలోని స్థాయీభేదాల అనుభూతులన్నింటిని ఆస్వాదించగలడు. మనస్సు లగ్నం కాకుండా హస్తవిన్యాసాలతో చేసే అర్చాది క్రియలు ఉపరిభక్తి. దీనికైనా కొంత దైవవిశ్వాసం కావాలి కదా, అది మూలభక్తి. ఉపరిభక్తియే తలభక్తి. మనస్సు లగ్నమై శివత్వాస్వాదనం కలిగేది అన్తర్భక్తి. దేని రుచి దానిదే. కనుక సంపూర్ణంగా తనకు ఆ భక్తి ఆస్వాద్యం కావాలి, అంటూన్నాడీ భక్తకవి.

కవి తనను **హంసవర** అనటంలోని ఆంతర్యం హంసశబ్దానికిగల ఆత్మ అన్న అర్థాన్ని తలపిస్తుంది. ఆత్మ శివమైనదే కనుక భక్తిద్వారా శివత్వరుచినాస్వాదించి పారమ్యాన్ని పొందగలదన్నది భావం.

**శ్లో॥ ఉపయాన్తు విభో! సమస్తవస్తూన్యపి - చిన్తావిషయం దృశః పదం చ ।**
**మమ దర్శనచిన్తనప్రకాశా - మృతసారాణి పరం పరిస్ఫురన్తు ॥ 11**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, సమస్త = అన్ని, వస్తూని = వస్తువులు, అపి = కూడా, మమ = నాయొక్క, చిన్తా = చిన్తకు, విషయమ్ = మూలము, చ = మరియు, దృశః = కన్నులకు, పదమ్ = లక్ష్యము, ఉపయాన్తు = అగుగాక!, పరమ్ = కేవలము, దర్శన = దర్శించుట, చిన్తన = చింతించుట, అను వేళలలో, ప్రకాశ = ప్రకాశించు, అమృత = అమృతతుల్యమైన, సారాణి = అనుభవములు, పరిస్ఫురన్తు = వికసించుగాక!

**తాత్పర్యము :** స్వామీ! ప్రకృతిలోని వస్తువులన్నీ నా కన్నులకు ఆకర్షకములు, నా ఆలోచనలకు, భావనకు విషయాలు అయితే కానిండు. కాని వాని దర్శనం వలన, చిన్తనం వలన నాలో అమృతమయమైన ఆనందం మాత్రం కలుగనిండు.

**విభో** శబ్దప్రయోగం సాభిప్రాయం. ఆ శబ్దానికి ఈశ్వరుని వ్యాపకత్వం వ్యుత్పత్తి. ఈశ్వరుడు సర్వవస్తువులలో వ్యాపించియుండగా ప్రకృతిదర్శనం పరమపురుషదర్శనమే అవుతుంది కదా. దాన్నెందుకు నిషేధించాలి!? కాని ప్రకృతి ద్వయభావంతో కూడినది కనుక ఆ దర్శనం సైతం దుఃఖాది ప్రతీప భావాలను కలిగించవచ్చు. ఆ ద్వయభావం నా దృష్టిని, మనస్సును అంటకపోతే, అది సాక్షాత్ శివదర్శనమే. ఫలం శివానందమే. కనుక ఈ భక్తకవి తన ప్రపంచదర్శనంలో పరమేశ్వరదర్శనానందం లభించాలని, తన చింత ఆ అనుభూతికోసమే కావాలని, చింతన శివమయం కావాలని ఆకాంక్షిస్తూన్నాడు.

గీతాచార్యుడు చెప్పినట్లు, **యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,** అన్నది సూత్రం. వస్తువు ఆధారం మాత్రమే. ద్రష్ట తాను కోరినదే దర్శిస్తాడు తప్ప ఎదుట ఉన్నదానిని కాదు.

**శ్లో॥ పరమేశ్వర! తేషు తేషు కృచ్ఛ్రే - ష్వపి నామోపనమత్స్వహం భవేయమ్ ।**
**న పరం గతభీస్త్వదంగసంగా - దుపజాతాధికసమ్మదోఽపి యావత్ ॥12**

**ప్రతిపదార్థము :** పరమేశ్వర! = ఓ ఈశ్వరా!, అహమ్ = నేను, తేషు తేషు = ఆయా, కృచ్ఛ్రేషు = దుఃఖముల, ఉపనమత్సు = రాకడలయందు, అపి = కూడ, పరమ్ = కేవలము, గతభీః = దూరమైన భయముగలవాడను, న భవేయమ్ = కాకుందును, యావత్ = ఎట్లంటే, త్వద్ = నీయొక్క, అంగ = శరీరముయొక్క, సంగాత్ = స్పర్శవలన, ఉపజాత = కలుగునట్టి, అధిక = అధికమైన, సమ్మదః = హర్షము, అపి = కూడ, భవేయమ్ = అగుదును.

**తాత్పర్యము :** ఈశ్వరా! నీ స్పర్శవలన, అంటే రుద్రశక్తిసమావేశము కారణంగా, నేను పొందే వివిధమైన దుఃఖాలలో కూడ నాకు భయం కలుగకపోగా అమితానందమే కలుగుతుంది.

ఈశ్వరస్పృహ కలవాడికి దుఃఖాలు వస్తూ పోతూ ఉన్నాగాని, వానివలన భయం కలుగదు. పైగా తాననుభవిస్తున్న ఒక్కొక్క క్లేశంతో తాను దుఃఖవిజేతయవుతూ పరిపూర్ణుడనవుతూన్నానన్న భావం ఆనందాన్ని కలిగిస్తుంది. కారణం, ఈ దుఃఖాలన్నీ పరమాత్మను చేరుకొనే యాత్రలో మజిలీలుగా, ఒక్కొక్క మజిలీని దాటుతూ తాను తన గమ్యానికి దగ్గరవుతూన్నానన్న విశ్వాసం బలపడుతుంది. అది సంతోషకారణమవుతుంది. ఆ సంతోషం మజిలీపై మజిలీని దాటిన కొలది అధికమవుతుంది.

**శ్లో॥ భవదాత్మని విశ్వముంభితం యద్ - భవతైవాపి బహిః ప్రకాశ్యతే తత్ ।**
**ఇతి యద్దృఢనిశ్చయోపజుష్టం - తదిదానీం స్ఫుటమేవ భాసతామ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** యత్ = యే, విశ్వమ్ = జగత్తు, భవత్ = తమయొక్క, ఆత్మని = ఆత్మయందు, ఉంభితమ్ = నిక్షిప్తమైయున్నదో, తత్ = అది, భవతా ఏవ = తమచేతనే, బహిః అపి = బాహ్యమున, బయలున కూడ, ప్రకాశ్యతే = ప్రకాశింపజేయబడుచున్నది, ఇతి = అని, యత్ = యే, దృఢనిశ్చయ = గట్టి నమ్మకము, ఉపజుష్టమ్ = స్వీకరింపబడినదో, తత్ = అది, ఇదానీమ్ = ఇప్పుడు, స్ఫుటం ఏవ = ప్రత్యక్షముగనే, భాసతామ్ = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :** యే జగత్తు నీయందున్నదో, అదే జగత్తు నీచేతనే బాహ్యంలో కూడ సృష్టిరూపాన ప్రకాశింపజేయబడుచున్నదని నా దృఢనిశ్చయం. నా నిశ్చయంలోని సత్యత్వాన్ని నిరూపిస్తూ నీవు ఈ పాంచభౌతికజగత్తులో కూడ స్పష్టంగా ప్రత్యక్షమవుదువు గాక!

సృష్టిగా పిలువబడుతూన్న ఈ పదార్థజగత్తు ఈశ్వరునిలోనుండి బైటకు ప్రకటింపబడినదని, అది స్వతంత్రం కాదని, ఈశ్వరుని అంగమే అని ప్రాచీన భారతీయ విశ్వాసం. **సృజ్** ధాతూద్భవం **సృష్టి** అన్న పదం. ఈ ధాతువుకు వెలువరించు అని అర్థం. అంటే ఈశ్వరుడు తన లోపల ఉన్నదానిని ఒక మాతృమూర్తి తన సంతానాన్ని ప్రసవించినట్లు బహిర్గతం చేసినాడని భావం. కనుకే కొడుకును, కూతురిని చూచి తల్లిదండ్రులను గుర్తించినట్లు సృష్టిని చూచి స్రష్టను గుర్తించవలె అన్న భావంతో సృష్టిని ఉపదేశంగా వర్ణిస్తారు పెద్దలు. ఇది శూన్యం నుండి శూన్యమే జనిస్తుంది, పూర్ణం

నుండి పూర్ణమే ప్రకటమవుతుందన్న సూత్రాన్ని తృప్తిపరుస్తుంది. ఈ తర్కమే ఉపనిషద్వాక్యం **పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతి ।** అన్న దానిలో కనబడుతుంది. ఈ జగత్తు అంతంలో మరల ఆ ఈశ్వరునిలోనే లీనమవుతుంది. కనుక జగత్తు శివమే. ఆ సత్యదర్శనం కోసమే ఈ భక్తుని తపన.



శ్రీః

## 9. స్వాతంత్ర్యవిజయం స్తోత్రమ్

**శ్లో॥ కదా నవరసార్ద్రార్ద్ర - సంభోగాస్వాదనోత్సుకమ్ ।**
**ప్రవర్తేత విహాయాన్యన్ - మమ త్వత్ స్పర్శనే మనః ॥ 1**

**ప్రతిపదార్థము :** నవ = కొంగ్రొత్త, రస = భక్త్యానందముతో, ఆర్ద్ర + ఆర్ద్ర = అత్యంత స్పృహణీయమైన, సంభోగ = సమావేశముయొక్క, ఆస్వాదన = అనుభవముకొరకై, ఉత్సుకమ్ = ఉత్సాహముగల, మమ = నాయొక్క, మనః = హృదయము, అన్యత్ = వేరైనవానిని, విహాయ = వదలి, త్వద్ = నీదైన, స్పర్శనే = స్పర్శసుఖమునందు, కదా = ఎప్పుడు, **ప్రవర్తతే** = లగ్నమగునో.

**తాత్పర్యము :** క్రొత్తగా పొటమరించిన భక్తివలన కలిగిన ఆనందము మురిపించగా, నీ సమాగమానందస్పర్శకై ఉత్సాహముతో పొంగిన నా మనస్సు, వేరు సుఖములన్నిటిని వదలి, నీ స్పర్శానందమునందే లగ్నమగు సమయమెప్పుడో కదా!

అన్యములు అంటే యథార్థము కాని మానసికకల్పనలు, ఊహలు. లౌకికమైన ఇంద్రియవిషయభోగాలన్నీ నిజానికి ఆనందాలు కావు, ఆనందరసాభాసాలే. ఆనందమన్నది ఈశ్వరస్పర్శసుఖమొక్కటే. అది భక్తిద్వారా సాధ్యమవుతుంది. క్రొత్త పెండ్లికూతురు తొలిరాత్రి భర్తను గూడిన అనంతరం, మరునాటి పగలంతా శరీరం యే యే నిత్యకృత్యాలలో ప్రవర్తిస్తూన్నప్పటికీ, ఆమె మనస్సు, హృదయం మాత్రం గడచిన రాత్రి భర్త అనురాగ స్పందనలనే నెమరువేసుకుంటూ తదేకస్పృహతో మళ్ళీ ఎప్పుడెప్పుడు రాత్రి అవుతుందో, భర్త అనురాగస్పర్శతో పులకించగలనో అని ఎదురు చూస్తూ తపిస్తుందో, అదే ఈ భక్తుని అనుభవస్థాయి. ఈశ్వరభక్తి తత్పరతకంటె మధురానుభవం మరేదీ ఉండదని గ్రాహ్యం.

శ్లో॥ త్వదేకరక్తస్త్వత్పాదపూజామాత్రమహాధనః ।
కదా సాక్షాత్కరిష్యామి భవన్తమయముత్సుకః ॥ 2

**ప్రతిపదార్థము :** త్వద్ + ఏక = నీయందు మాత్రమే, నీ ఒక్కనియందే, రక్తః = అనురాగము గలవాడనై, త్వద్ = నీయొక్క, పాద = పాదముల, పూజామాత్ర = పూజయొక్కటే, మహాధనః = మహాసంపదగా గలవాడనై, ఉత్సుకః = ఉత్సాహము గలవాడనై, అయమ్ = వీడు, భవన్తమ్ = తమరిని, కదా = ఎప్పుడు, సాక్షాత్ = కన్నుల ఎదుట, కరోమి = చూడగలను?

**తాత్పర్యము :** నా అనురాగము నీయందే, నా ధనము నీ పూజయే, అను ఉత్సాహముతో ఉన్న వీడు (ఈ భక్తుడు), తమరిని తన కన్నులముందే మూర్తీభవించియుండగా ఎన్నటికి దర్శించగలనో!

ఈ భక్తునకు సాక్షాదీశ్వరదర్శనానందం తప్ప మరో విభూతి, అనుభూతి అక్కరలేదు. లౌకికప్రయోజనాలు మాత్రమే కాదు, అలౌకికమైన ఈశ్వర స్పర్శానుభూతి యైన అణిమాది ఐశ్వర్యాలు గాని, అక్కరలేదు. ఈ స్థితి ఔత్సాహికభక్తికాదు, పరిణత భక్తియే, కనుక **ఉత్సుకః** శబ్దానికి ఎడబాటు సహించలేని స్థితి అర్థం. అంటే ఈతడు ఈశ్వరయుక్తుడుగా పరిణతిచెందవలెనని భావించి తపించే ఔత్సాహికుడు కాదు.

శ్లో॥ గాఢానురాగవశతో నిరపేక్షీభూతమానసోఽస్మి కదా ।
పటపటితి విఘటితాఖిలమహార్గలస్త్వాముపైష్యామి ॥ 3

**ప్రతిపదార్థము :** గాఢానురాగవశతః = అమితమైన ప్రేమ కారణంగా, నిరపేక్షీభూత-మానసః = కోరికలేని మనస్సుగలవాడను, అస్మి = అగుచున్నాను, పటపట్ ఇతి = పటపటయను శబ్దంతో, విఘటిత = త్రెంచబడిన, అఖిల = సమస్తమైన, మహా = పెద్ద, అర్గలః = బంధముగలవాడనై, కదా = ఎప్పుడు, త్వామ్ = నిన్ను, ఉప + ఏష్యామి = దరిజేరగలనో!

**తాత్పర్యము :** నీయందలి అమేయానురాగంతో మరి యే ఇతరమైన కోరికగాని లేనివాడనై, లౌకికబంధాలన్నీ తెగద్రెంచికొని ఎప్పుడు నీ దరికి చేరగలనో!

పశువైన జీవాత్మ పశుపతియైన పరమాత్మను చేరుకోవాలన్న తపన ఇది. ఆటంకం, లౌకికబంధాలు పాశాలై పశువును కట్టివేసినవి. ఆ బంధాలు త్రెంచుకోవట మెట్లా? పెనుగులాడినకొలది ఆ బంధాలు బిగుస్తాయి తప్ప సడలవు, తెగిపోవు. దీనికి మార్గం, పెనగులాట కొనసాగిస్తూ పశుపతిపై అనురాగాన్ని బలవత్తరం చేసికొనటం.

ఒకప్పటికి అనురాగబలం బంధాలను త్రెంచివేస్తుంది. భక్తితత్పరత గాఢమూ గాఢతరమూ అయిన కొలది పశువుబలపడి పాశాలను త్రెంచివేస్తుంది. అదెప్పుడు? దైవానుగ్రహం లభించినప్పుడు. అంతవరకు తపన, తహతహ.

శ్లో॥ స్వసంవిత్సారహృదయాధిష్ఠానాః సర్వదేవతాః ।
కదా నాథ! వశీకుర్యాం భవద్భక్తిప్రభావతః ॥ 4

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, భవత్ = తమయొక్క, భక్తి = భక్తియొక్క, ప్రభావతః = శక్తివలన, స్వ = నాదైన, ఆత్మదైన, సంవిత్ = విద్యయొక్క, సార = బలముతో, హృదయ = హృదయములో, అధిష్ఠానాః = స్థానమును పొందియున్న, సర్వదేవతాః = దేవతలందఱను, కదా = ఎప్పుడు, వశీకుర్యామ్ = వశమముజేసికొనగలను?

**తాత్పర్యము :** ఓ స్వామీ! నాలో ఎందఱో దేవతలు వసించియున్నారు. వారందరూ నా మనస్సుకు నా స్థితిగతుల ననుసరించి తోస్తూ విరాజమానులవుతూన్నవారు వీరు నాపై అధికారం చేస్తూన్నారు. నేను బలం లేనివాడను కనుక వారికి వశుడను. కాని నీ భక్తి అంకురించి ప్రబలమై నాలో ఆత్మజ్ఞానం కలిగి అవిద్య నశించి ఆత్మవిద్య పరిఢవిల్లితే, ఇక ఈ దేవతల ఆధిపత్యానికి తలవంచను. వారినే నా వశవర్తులుగా చేసికొనగలను. ఆ సుదినమెప్పుడు వస్తుంది, ప్రభూ!

మానవుని మనస్సులో కలిగే కామక్రోధాది భావాలన్నిటికీ అధిష్ఠాన దేవతలున్నారని, అట్లాగే శరీరాంగాలకు విడివిడిగా అధిష్ఠానదేవతలున్నారనీ ప్రాచీన ఋషుల దర్శనం. శరీరంలో శక్తి వివిధరూపాలలో ప్రసరించే స్థానాలు, శక్తికేంద్రాలు ఉన్నాయని గుర్తించి, వాటిని మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములుగా పిలుస్తారు. ఇవి గుదస్థానమునకు పైగా వెన్నెముక చివరినుండి భ్రూమధ్యం వరకు వ్యాపించి ఉన్నాయి. వీనిలో ఒక్కొక్కదానికి వేరుగా అధిష్ఠాన దేవతలున్నారు. ఈ ఆరుచక్రాలపైన బ్రహ్మరంధ్రానికి దిగువన సహస్రారమున్నదని, ఇది చిత్కలాస్థానమని యోగశాస్త్రం చెబుతుంది. మానవుని మనసు, మాట, చేత, అన్నీ ఈ అధిష్ఠానదేవతల అధీనంలో ఉంటాయి. ఈ చక్రాలను పద్మాలనికూడా పిలుస్తారు.

ఈ భక్తకవి అంటాడు కదా, ఈ అధిష్ఠానదేవతలు మానవులను తమ వశవర్తులుగా ఆడించగలగటానికి కారణం మానవులలో గూడుగట్టుకున్న అవిద్య అని. ఈ అవిద్య భక్తివలన నశించి శివచైతన్యం ప్రసరించగానే ఈ దేవతలు పదవీచ్యుతు

లవుతారు. ఆత్మసామ్రాజ్యం స్థాపించబడుతుంది. అదెప్పుడు? అన్నది శివానుగ్రహం మీద జరుగవలసినదే కనుక ఆ శివుడే ఎఱుగును.

**శ్లో॥ కదా మే స్యాద్విభో! భూరి భక్త్యానందరసోత్సవః ।**
**యదాలోకసుఖానందీ పృథఙ్నామాపి లప్స్యతే ॥ 5**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, భక్తి + ఆనందరస + ఉత్సవః = భక్తిరూపమైన ఆనందోత్సవము, మే = నాకు, కదా = ఎప్పుడు, భూరి = గొప్పగా, స్యాత్ = ప్రాప్తమగునో, యదా = ఎప్పుడైతే, పృథక్ = వేర్వేరు, నామా అపి = పేర్లు కలదైనను, ఆలోక = దర్శన, సుఖ = సుఖముచే, ఆనందీ = ఆనందించినదియని, లప్స్యతే = పిలువబడునో.

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! భక్తి అనునది నాలో ఆనందామృతాన్ని పూరించుటెప్పుడో! వేర్వేరు పేర్లతో ప్రసిద్ధమైన చిత్ప్రకాశముయొక్క దర్శనం నాకు కలిగినప్పుడే కదా నాకు ఆ ఆనందం లభించేది!

**భూరి** శబ్దాన్ని క్రియాపదంతో అన్వయిస్తే, కవిలో భక్తి లేకపోలేదు కాని చిత్ప్రకాశదర్శనానికి తగినంత గొప్పగా లేదని ఆ పరిణతి తనకెప్పుడు కలుగునా అని కవి భావమనీ చెప్పవచ్చును. లేక **భూరిభక్త్యానంద** అని భక్త్యానందానికి అన్వయించి నట్లయితే అంతటి గొప్ప భక్త్యానందం అని చెప్పవచ్చు. తాత్పర్యభేదం లేదు.

అట్లాగే **యదా** అన్న పదాన్ని సమాసం నుండి విడదీస్తే, **లోకసుఖానందీ** అని యేర్పడి లౌకికసుఖాలు భిన్నభిన్నమైన వాటిలో ఆనందించే నాకు ఈ ఆనందం భిన్నత్వాన్ని విడిచి ఒకే చిత్ప్రకాశానందంగా భాసించేటంత గొప్ప భక్త్యానందం నాకెప్పుడు కలుగునా అన్న తపన అర్థమవుతుంది. సమాసంలో **ఆలోకసుఖానందీ** అన్న అన్వయం సాధ్యం.

భక్తి ఆరంభదశలో ఔత్సాహికంగా ప్రయత్నమాత్రానందక్రియగా ఉంటుంది. క్రమంగా మనసు కుదిరేకొలది తాదాత్మ్యం లభిస్తుంది. ఇది ఆనందంగా పరిణమించి, ఈ ఆనందం తనకెల్లవేళల కావాలన్నభావం, దానికి దూరం కారాదన్న పట్టుదల, అదే తనకు సర్వస్వమన్న అనంతప్రేమ, ఇట్లా క్రమేణ పరిణామం చెందుతుంది. ఈ పరిణామానికి చరమదశ చిత్ప్రకాశదర్శనం. లౌకిక సంతోషాలు నిజానికి ఆ చిత్ప్రకాశ చ్ఛాయలే తప్ప వేరు కావు అన్న అనుభూతి కేవల పూజాదికాలనిర్వహణానందం కంటె పైమెట్టు. ఇక్కడనుండి ఇంకా ఉత్తమభావనకు ఎదగనూవచ్చు లేదా అధఃపతనం కానూవచ్చు. లౌకిక, దైహిక సంతోషాలు శివానందమే అన్న భావంతో లౌకికానందాలు తప్పుకాదనీ అవశ్యం పొందవలసినవే అనీ భ్రమ కలుగవచ్చు, భోగలాలసలోనికి పతనం

చెందవచ్చు. ఇటువంటివారే అధికంగా తారసపడతారు. ఈ భక్తుడు ఊర్ధ్వగామి గావాలని తపించేవాడు.

**శ్లో॥ ఈశ్వరమభయముదారం పూర్ణమకారణమపహ్నుతాత్మానమ్ ।**
**సహసాఽభిజ్ఞాయ కదా స్వామిజనం లజ్జయిష్యామి ॥ 6**

**ప్రతిపదార్థము :** ఈశ్వరమ్ = సర్వైశ్వర్యసంపన్నుని, అభయమ్ = అభయస్వరూపుని, ఉదారమ్ = ఉదారస్వభావుని, పూర్ణమ్ = పూర్ణుని, అకారణమ్ = కారణరహితుని, అపహ్నుత = దాచబడిన, ఆత్మానమ్ = ఆత్మస్వరూపుని, స్వామిజనమ్ = స్వామియైన తమను, సహసా = వెంటనే, అభిజ్ఞాయ = గుర్తించి, కదా = ఎప్పుడు, లజ్జయిష్యామి = లజ్జితుని చేయగలను?

**తాత్పర్యము :** స్వామీ! తమరు సర్వైశ్వర్యసంపన్నులు, అభయస్వరూపులు, ఉదారులు, పూర్ణులు, కారణరహితులు, ప్రకటము కాని ఆత్మస్వరూపులు. ఇట్టి మిమ్ము గుర్తించి లజ్జితుడుగా చేయగలుగుటెన్నడో కదా!

సమస్తానికీ అధికారి కనుక ఈశ్వరుడు. తనకు ప్రతియోగియనువాడెవ్వడూ లేడు కనుక అభయుడు. తను సర్వులకు సర్వాన్నీ ఇచ్చేవాడు కనుక ఉదారుడు. తను కోరవలసినది లేదు కనుక పూర్ణుడు. ఒక కారణానికి కార్యరూపంగా తాను జన్మించిన వాడు గాక, నిత్యుడు గనుక అకారణుడు. కారణము లేకుండగనే జగద్రూపమును ధరించినవాడు గనుక కూడ అకారణుడు. స్వస్వరూపగోపనమువలన అపహ్నుతాత్మ. అనగా, జగద్రూపములలో అనీశ్వరుడై గోచరించుచుండుటవలన అపహ్నుతాత్మ. అదియు గాక పాంచభౌతికశరీరములలో అపహ్నుతమైన ఆత్మ కనుక అపహ్నుతాత్మ.

**అభిజ్ఞాయ** అంటే గుర్తుదెలియటం. ఈ గుర్తుదెలియటం అంటే వివిధమైన జగద్రూపాలలో గుప్తంగా ఉన్న శివుని దర్శించటమే గుర్తించటం. అందుకు శాంభవావేశయుక్తి ఉపకరణం. తద్వారా దర్శించిన స్వామిని భక్తజనులలో ప్రకటం చెయ్యటం ద్వారా స్వామి గోప్యతను లజ్జితం చెయ్యటం అని భావం. గుట్టు రట్టు చెయ్యటం, అని.

**శ్లో॥ కదా కామపి తాం నాథ! తవ వల్లభతామియామ్ ।**
**యయా మాం ప్రతి న క్వాపి యుక్తం తే స్యాత్పలాయితుమ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, తవ = మీయొక్క, తాం కాం అపి = ఆ యేదో ఒక, వల్లభతామ్ = ప్రేమపాత్రతను, కదా = ఎప్పుడు, ఇయామ్ = పొందుదును?,

యయా = దేనిచే, మాం ప్రతి = నన్ను గూర్చి, తే = మీయొక్క, పలాయితుమ్ = పారిపోవుటకు, క్వా అపి = యే దశలోను, యుక్తమ్ = తగినది, న స్యాత్ = కానే కాకుండును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! అలౌకికమైన అగోచరమైన మీ ప్రేమపాత్రతను ఎప్పుడు పొందగలను? దానిచే, మీరు యే దశలోగాని నానుండి మీ గోపనయుక్తితో అదృశ్యం కాకుందురుగాక!

నాకు నీయందు భక్తి నిలిచింది. నీవునాకు అత్యంతమూ ప్రేమపాత్రుడవు. అయితే నేను నీకు ప్రేమపాత్రుడను కావలెను కదా? అదెప్పుడు సంభవించును? ఇప్పుడు నా భక్తివలన నేను మీకు కట్టుబడియున్నాను. కాని మీరు నాకు కట్టుబడి లేరు. అందుచేత మాటిమాటికి నాకు దృశ్యాదృశ్యంగా ఉండి ఊరిస్తూ దోబూచు లాడుతూన్నారు. ఇదంతా ప్రేయసీప్రియుల మధ్య సాధారణమైన ప్రణయక్రీడయే. కాని ఈ క్రీడ శాశ్వతం కారాదు కదా స్వామీ! కనుక నన్నునుగ్రహించి నా ప్రేమకు మిమ్ము కట్టివేయగల శక్తిని ప్రసాదించండి. మీ అనుగ్రహమే తప్ప నాకు వేరుగా యోగ్యత యెక్కడిది?! మీ అనుగ్రహం కలిగితే మీరింక నా దర్శనం నుండి తప్పించికొనలేరు. సర్వదా నేనిప్పుడు మీ సమక్షంలో ఉన్నట్లే మీరూ నా సమక్షంలోనే ఉంటారు. అంతకన్న ఆనందం ఈ భక్తునకేముంటుంది?

**శ్లో॥ తత్త్వతోఽ శేషజంతూనాం భవత్పూజామయాత్మనామ్ ।**
**దృష్ట్యానుమోదితరసాప్లావితః స్యాం కదా విభో! ॥ 8**

**ప్రతిపదార్థము :** విభో = ఓ సర్వవ్యాపీ!, కదా = ఎప్పుడు, అశేష = అన్ని, జన్తూనామ్ = ప్రాణులయొక్క, తత్త్వతః = సత్యరూపంలో, భవత్ = మీయొక్క, పూజామయ = పూజలో లగ్నమైయున్న, ఆత్మనామ్ = ఆత్మలయొక్క, దృష్ట్యా = దృష్టితో, అనుమోదితరస = ఆమోదింపబడిన ఆనందముతో, ఆప్లావితః = పొంగినవాడను, స్యామ్ = అగుదును?

**తాత్పర్యము :** ప్రాణులన్నింటిని సత్యరూపంలో మీ పూజలో మగ్నమై యున్నవానినిగా ఆత్మదృష్టితో ఆమోదించి ఆనందంతో ఎప్పుడు నేను పొంగిపోదునో కదా, స్వామీ!

లౌకిక దృష్టితో చూచినప్పుడు ప్రాణుల జీవనక్రియలన్నీ కేవలం లౌకికమైన భౌతికచర్యలుగానే కన్పించటం సహజం. **యతో దృష్టిస్తతో భావః** అన్న నాట్యశాస్త్రవాక్యం ఇక్కడ కూడా అన్వయిస్తుంది. సత్యస్వరూపస్వభావాలు తెలియటం దృష్టి, భావన మారటం వలన సాధ్యం. కనుక, లౌకిక దృష్టిలో ఏహ్యాభావంతో అసహనంతో చూచే ప్రాణిక్రియలు

తత్త్వమెఱిగి ప్రాణులన్నీ దేహాలు కాదు, ఆత్మలు అన్న స్థిరచిత్తంతో చూచినప్పుడు దృశ్యమూ భావమూ రెండూ మారిపోతాయి. అప్పుడు ఆ జీవకర్మలన్నీ ఆత్మ పరమాత్మను అర్చించే భిన్న పద్ధతులుగా గోచరిస్తాయి. అసహ్యమూ అసహనమూ తొలిగిపోయి, ఆ స్థానంలో ఆత్మీయత, ఆనందమూ వెల్లివిరుస్తాయి. ఎందుకంటే, ఆత్మకు పరమాత్మస్పర్శనం తప్ప లౌకికకర్మలేవీ ఉండవు కనుక. తానుకూడా భక్తుడొక ఆత్మమాత్రుడుగా గ్రహిస్తాడు కనుక. ఆ దృష్టిని ప్రసాదించుమని వేడుకుంటూన్నాడీ భక్తుడు.

**శ్లో॥ జ్ఞానస్య పరమా భూమిర్యోగస్య పరమా దశా ।**
**త్వద్భక్తిర్యా విభో కర్హి పూర్ణా మే స్యాత్తదర్థితా ॥ 9**

**ప్రతిపదార్థము :** విభో = ఓ సర్వవ్యాపీ!, యా = యే, త్వద్ = నీయొక్క, భక్తిః = భక్తి, జ్ఞానస్య = జ్ఞానముయొక్క, పరమా = సర్వోత్తమ, భూమిః = అవస్థయో, యోగస్య = యోగమునకు, పరమాదశా = సర్వోత్తమ స్థితియో, మే తదర్థితా = నాయొక్క ప్రార్థన దానికై, కర్హి = ఎప్పుడు, పూర్ణా = కృతార్థము, స్యాత్ = అగునో!

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! నీయందలి భక్తి జ్ఞానానికి సర్వోత్తమమైన స్థితి, యోగానికి పరాకాష్ఠ. నా ప్రార్థన అట్టి భక్తిని పొందవలెననియే. ఈ ప్రార్థన ఎప్పటికి ఫలించును స్వామీ!?

జ్ఞానానికైనా యోగానికైనా పరమార్థమొక్కటే : జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అనే త్రయీస్థితినుండి ఈ మూడూ ఏకమైన ఆనందం. లేక, సాధన, సాధ్యము, సాధకుడూ కలిసి ఒక్కటైన సమాధి, అంటే, ఆనందస్థితియే. ఈ స్థితిని సాధించినదే పరమభక్తి. భక్తి యేర్పడని జ్ఞానం విస్ఫోటన చెంది వినాశకం కాగలదు, భస్మాసురుని శక్తివలె, తనను తానే దగ్ధం చేసికొనగలదు. భక్తిలేని యోగం కొంత అలౌకికశక్తిని సాధించి, నేటి కుహనా ఆధ్యాత్మిక గురువులవలె, లోకాన్ని వంచించి, ఆత్మవంచనతో పతనమై తనను తానే భ్రష్టం చేసికొనగలదు. భక్తియన్నది జ్ఞానాన్నీ యోగాన్నీ కర్మనూ త్యాగాన్నీ సమస్తాన్నీ పవిత్రీకరించి కళ్యాణప్రదం చేయగల ప్రేమశక్తి. ఆ స్థాయికి తన భక్తిలో తానెన్నడు చేరుకోగలనో అని ఈ భక్తకవి తపన.

**శ్లో॥ సహసైవాసాద్య కదా గాఢమవష్టభ్య హర్షవివశోఽహమ్ ।**
**త్వచ్చరణవరనిధానం సర్వస్య ప్రకటయిష్యామి ॥ 10**

**ప్రతిపదార్థము :** త్వత్ = తమయొక్క, చరణవర = శ్రేష్ఠమైన పాదములయొక్క, నిధానమ్ = కోశమును, సంపదను, సహసా ఏవ = ఒకేసారి, వెంటనే, ఆసాద్య = సంపాదించి,

గాఢమ్ = గాఢముగా, మహాప్రేమతో, అవష్టభ్య = స్వంతముజేసికొని, హర్షవివశః = ఆనందముతో మైమరచి, అహమ్ = నేను, కదా = ఎప్పుడు, సర్వస్య = అందఱకు, ప్రకటయిష్యామి = ప్రకటింపగలను?

**తాత్పర్యము :** స్వామీ! తమ పాదములే నా సంపద. వాని స్పర్శానుగ్రహాన్ని సంపాదించి, గాఢానురాగంతో స్వంతం చేసికొని, ఆ ఆనందంలో మైమరచి నేనందఱకూ తమ అనుగ్రహాన్ని ఎప్పుడు ప్రకటించగలను?

భక్తునకు భగవంతుడే సంపద. ఆ సంపద అనుగ్రహరూపమైనది. ఆ అనుగ్రహాన్ని నేనెప్పుడు సంపాదించగలను? సంపాదించిన అనుగ్రహాన్ని నష్టపోకుండా నా గాఢభక్తితో ఎట్లా నిలుపుకోగలను? నిలుపుకున్న ఆ నిధిని సాటివారికెట్లా పంచగలను? – ఇవి ఈ భక్తుని తపనకు కారణం. భగవంతుని గుర్తించిన మానవుడు భక్తుడవుతాడు. భక్తుని గుర్తించిన భగవంతుడు వరదుడవుతాడు. భగవదనుగ్రహం లభించటం మెఱుపు మెఱిసినట్లుంటుంది. మెఱుపును పట్టి నిలపటం కంటె కష్టసాధ్యం భగవదనుగ్రహాన్ని నిలపటం, అందుకు భక్తునిలో పరప్రతిభ వికసించాలి. దానిని ప్రయత్నపూర్వకంగా హృదయానికి హత్తుకొని నిలుపుకోవాలి. ఆ స్పర్శతో శరీరం, మనస్సూ వివశమవుతాయి. ఆ ఆనందం తానొక్కడిదే కాదు. కనుక అందఱకు పంచాలి. ఆ ఆనందం అంతరంగంలో నిండి ఉండేది, దానిని ఉపదేశరూపంలో అందఱకు చేర్చవలె. ఆ ఆనందస్వభావం ఎటువంటిదంటే, ఎందఱకెంతపంచినా తఱగనిది. భక్తివలన అద్వైతసిద్ధిని పొందిన వ్యక్తిలో విశ్వప్రేమ పెల్లుబికి అందఱనూ ఆనందపర్చగలదు.

**శ్లో॥ పరితః ప్రసరచ్ఛుద్ధత్వదాలోకమయః కదా ।**
**స్యాం యథేశ! న కించిన్మే మాయాచ్ఛాయాబిలం భవేత్ ॥ 11**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, పరితః = నాలుగు దిక్కుల, ప్రసరత్ = వ్యాపించియున్న, శుద్ధ = నిర్మలమైన, త్వద్ = నీయొక్క, ఆలోకమయః = చూపుతో నిండియున్న, చిత్ప్రకాశముతో నిండినవాడనుగా, కదా = ఎప్పుడు, స్యామ్ = అగుదును?, యథా = ఏవిధముగా, మే = నాకు, కించిత్ = కొంచెమైన, మాయా = భేదరూపమైన, ఛాయా = నీడ, ఆబిలమ్ = మాలిన్యము, న భవేత్ = కలుగదో.

**తాత్పర్యము :** లోకంలో నలుదిక్కులా నిర్మలమైన నీ చూపు, ప్రసరించియున్నది. ఆ చూపు నామీద ఎప్పుడు సోకుతుంది? ఆ చూపు జ్ఞానప్రకాశము. అది సోకితే ఇక నాలో ద్వయరూపమైన చీకటి మాలిన్యం ఉండదు.

అనేక రూపనామాలతో ఈ ప్రపంచం వ్యవహరిస్తున్నట్లు ఇంద్రియాలు మనకు జ్ఞానాన్నిస్తున్నవి. ఈ భిన్నత్వంలోనూ ఏకత్వాన్ని మనం గుర్తిస్తూనే ఉన్నాము. వేరు, కాండము, కొమ్మ, రెమ్మ, ఆకు, పువ్వు, కాయ, పండు అంటూ ఇన్నిపేర్లూ ఒక్క చెట్టువే కదా. ఇవన్నీ రాలిపోతే మిగిలేది చెట్టేకదా. భిన్నత్వం ఏకత్వానికి అంగాంగరూపమే అని తెలియనిదెవరు? ఐనా, ఈ ఏకత్వాన్ని మరచి బహుళత్వమే సత్యమని, తాటికాయ, తాటిపండు అంటూ తగవులాడుకుంటూన్నారు. ఇదే మాయాచ్ఛాయ. ఇదే ఆబిలం. ఏకత్వసత్యాన్ని గుర్తిస్తే ఈ మాలిన్యం తొలిగి, ఈ మాయాచ్ఛాయ కరిగిపోయి, చుట్టూ వ్యాపించియున్న స్వచ్ఛప్రశాంతకాంతి దర్శనమిస్తుంది. ఆ సుదినం తనకెన్నడు సుప్రభాతమవుతుందని కవి వేదన.

**శ్లో॥ ఆత్మసాత్కృతనిఃశేషమండలో నిర్వ్యపేక్షకః ।**
**కదా భవేయం భగవంస్త్వద్భక్తగణనాయకః ॥ 12**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ దేవా!, ఆత్మసాత్ కృత = ఆత్మకు అభిన్నమైన, నిఃశేష = సమస్తమైన, మండలః = భువనములుగలవాడను, నిర్వ్యపేక్షకః = అద్వితీయుడను అగుచు, కదా = ఎప్పుడు, త్వద్ = నీయొక్క, భక్తగణ = భక్తుల సమూహమునకు, నాయకః = నాయకుడను, భవేయమ్ = అగుదునో!

**తాత్పర్యము :** ఓ దేవా! భువనములన్నీ నాలోని చిత్ప్రకాశమునకు అభిన్నములని తెలిసి, అద్వితీయుడనై, నీ భక్తజనులకు నాయకుడను నేనెప్పుడు కాగలనో!

**ఆత్మసాత్** అంటే, నాతో సమానమైనవి, నాకంటె వేరు కానివి, అని అర్థం. ఇది భౌతికార్థంలో సమర్థనీయం కాదుకాని జ్ఞానస్థాయిలో అర్థవంతమే. ఆ స్థాయిలో **ఆత్మ** శబ్దానికి శరీరమూ ఇంద్రియాలూ కాక, ఆత్మ అనియే అర్థం. తన ఆత్మస్వరూపాన్ని గ్రహించినవానికి భౌతికభేదాల మాటున ప్రకాశించే జ్ఞానస్వరూపమైన చైతన్యం దాగి ఉన్నదని, అది అసమానతలు, భేదాలూ లేనిదనీ అర్థమవుతుంది. అన్ని భువనాలూ నిండి వెలిగేది ఆ చైతన్యమే అయినప్పుడు, అది అద్వితీయము, అది తానే అయినందు వలన తాను అద్వితీయుడు. ఈ నేను అనబడు ఆత్మ మరియొకదానితో పోలికవలన సాపేక్షంగా ఉనికి గలది కాదు. కనుక **నిర్వ్యపేక్షకః**. ఈ స్థితి జ్ఞానం స్థిరమైన వ్యక్తి భక్తశ్రేష్ఠుడు, నాయకుడు, మార్గదర్శి. తనకా పరమమైన స్థితి భక్తిలో ఎప్పుడు కలుగునా! అని ఈ కవి ఆత్రత.

**శ్లో॥ నాథ! లోకాభిమానానామపూర్వం త్వం నిబంధనమ్ ।**
**మహాభిమానః కర్హి స్యాం త్వద్భక్తిరసపూరితః ॥ 13**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, లోక + అభిమానానామ్ = లౌకికమైన అభిమానములకు, అపూర్వమ్ = విశేషమైన, నిబంధనమ్ = కారణము, త్వమ్ = నీవు, త్వద్ = నీయొక్క, భక్తిరసపూరితః = భక్తిరూపమైన ఆనందముతో నిండించబడిన వాడను, కర్హి = ఎప్పుడు, స్యామ్ = అగుదును?

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవు లౌకికాభిమానాలకు విశేషమైన కారణం. నేను నీ భక్తి అనే ఆనందాన్ని పూర్ణంగా ఎప్పుడాస్వాదించగలను?

శైవసాంప్రదాయంలో, లోకాభిమానాలు, లోకాభిమానులు రెండు విధాలు : 1. రుద్రప్రమాతా, 2. క్షేత్రజ్ఞప్రమాతా. ప్రమాత అంటే జ్ఞానాన్ని పొందేవాడు, తెలిసికొనువాడు. బ్రహ్మాదిగా గల జగత్తుయొక్క ముఖ్యకారణాలను రుద్రప్రమాత లంటారు. జగత్తును సమృద్ధముచేసే పండిత, శూరాదులను క్షేత్రప్రమాతలంటారు. వీరు లోకాభిమానులు. వీరి లోకాభిమానానికి మూలం శివుడే, అని శైవనిర్ణయం. ఇదంతా శివేచ్ఛవలన కలిగినట్లే, నాలోనూ పరిణతి శివేచ్ఛవలన కలుగవలసినదే, నేను కోరే పరిణతి నేను పశువునన్న ప్రమాతృస్థాయినుండి నేను విశ్వాత్మను, చిదానందఘనుడను, శివుడనే, అన్న ప్రమాతృస్థాయికి పరిణామం చెందవలెనన్నది. ఇది భక్తి ద్వారానే సాధ్యం. ఈ శివత్వజ్ఞానమే **మహాభిమానం.** దీనికై భక్తుని తపన. **ప్రమ** అంటే జ్ఞానం, నిస్సంశయంగా తెలిసిన విషయం.

**శ్లో॥ అశేషవిషయాశూన్యశ్రీసమాశ్లేషసుస్థితః ।**
**శయీయమివ శీతాంఘ్రికుశేశయయుగే కదా ॥** **14**

**ప్రతిపదార్థము :** అశేష = సమస్తమైన, విషయ = ఇంద్రియానందకరవస్తుజాలముచే, అశూన్య = నిండియున్న, శ్రీ = లక్ష్మియొక్క (భక్తియొక్క), సమాశ్లేష = కౌగిలిచే, సుస్థితః = సుఖముగలవాడనై, శీత = చల్లని, అంఘ్రి = పాదములనబడు, కుశేశయ = పద్మముల, యుగే = జంటపై, కదా = ఎప్పుడు, శయీయం ఇవ = విశ్రాంతునివలె ఉండగలను?

**తాత్పర్యము :** భక్తియన్నది సమస్తఇంద్రియసుఖాలకూ పూర్ణత్వము నిచ్చునది. అట్టి భక్తి నన్నావహించగా, చల్లని పద్మములబోలిన నీ పాదములపై ఎప్పుడు విశ్రాంతిగా శయనింతునో కదా!

భక్తి అనగానే సమస్త సుఖాలనూ త్యాగం చేసి భగవజ్జీవనాన్ని అలవరచు కోవటం అన్నది అత్యధికుల భావన. ఈ భక్తకవి అంటూన్నాడు కదా, అది సరికాదు,

భక్తిలో ఇంద్రియసుఖాలన్నిటికీ ఒక దివ్యమైన పరిపూర్ణత చేకూరుతుంది, అని. అట్లాగే అనుభవవైభవం నీరసించటం కాదు, భక్తిలో లక్ష్మీప్రసన్నతతో ఇంద్రియానుభవాలు సైతం విరాజమానమవుతాయని. అటువంటి భక్తిసుఖస్పర్శ సమావిష్టమే అయితే, ఇక భక్తుడు విశ్రాంతుడు కాక అశాంతుడెట్లా కాగలడు? భగవంతుని చరణాలు సర్వతాపాలను హరించేవి కనుక వాని నాశ్రయించి తాపరహితుడైన భక్తుడు శరణాగతిలో విశ్రాంతుడవుతాడు, శాంతుడవుతాడు. ఆ పరమసుఖం, శాశ్వతానందం, తనకెప్పుడు కలుగునో అని ఈ భక్తకవి ఉత్కంఠ.

**శ్లో॥ భక్త్యాసవసమృద్ధాయాస్త్వత్పూజాభోగసంపదః ।**
**కదా పారం గమిష్యామి భవిష్యామి కదా కృతీ ॥ 15**

**ప్రతిపదార్థము :** భక్తి = భక్తిరూపమైన, ఆసవ = మదిరతో, సమృద్ధాయాః = నిండియున్న, త్వత్ = నీయొక్క, పూజా = పూజకు, భోగ = ఉపయోగించు, సంపదః = సంపత్తియొక్క, పారమ్ = ఆవలియొడ్డును, కదా = ఎప్పుడు, గమిష్యామి = పొందుదును?, కదా = ఎప్పుడు, కృతీ = కృతార్థుడను, భవిష్యామి? = అగుదును?

**తాత్పర్యము :** భక్తిమధువుతో నిండియున్న నీ పూజాసామగ్రికైన సంపదల చరమస్థితి నెప్పుడు చేరగలను? ఎప్పుడు కృతార్థుడను కాగలనో!

భక్తివలన కలిగే పారవశ్యాన్ని మధుసేవనానందంతో పోల్చటం పరిపాటి. మధుసేవ తన్మయత్వాన్ని కలిగిస్తుందన్నది జగమెఱిగిన సత్యం. భక్తికి కూడా మైమరపించే లక్షణం ఉన్నది. గోరా కుంభార్ వంటి భక్తుల చరితలు ఈ విషయాన్ని ధృవీకరిస్తాయి. భగవత్పూజకు ఉపకరణాలుగా మాత్రమే సర్వసంపదలు రాణిస్తాయి. కానప్పుడు వానికి చరితార్థత లేదు. ఆ స్థితిని సాధించి నేనెప్పటికి కృతార్థుడను కాగలనో కదా అన్నదే భక్తకవి ఉత్పలదేవాచార్యుల నిట్టూర్పు.

**శ్లో॥ ఆనందబాష్పపూరస్ఖలితపరిభ్రాన్తగద్గదాక్రందః ।**
**హాసోల్లసితవదనస్త్వత్స్పర్శరసం కదాప్స్యామి ॥ 16**

**ప్రతిపదార్థము :** ఆనంద = ఆనందమువలన కలిగిన, బాష్ప = కన్నీటి, పూర = ధారచే, స్ఖలిత = జారిన, పరిభ్రాన్త = విస్మయముజెందిన, గద్గద = అస్పష్టమైన, ఆక్రందః = పిలుపుతోగూడి, హాస = బిగ్గరగానున్న నవ్వుతో, ఉల్లసిత = వికసించిన, వదనః = ముఖముగలవాడనై, త్వత్ = నీయొక్క, స్పర్శరసమ్ = స్పర్శామృతమును, కదా = ఎప్పుడు, ఆప్స్యామి = పొందుదును?

**తాత్పర్యము :** ఆనందబాష్పాలు జాలువారగా, ఆశ్చర్యచకితమై, అస్పష్టమైన పిలుపుతో, అట్టహాసంతో ముఖము వికసించగా, నీ స్పర్శామృతంతో ఎప్పుడు పులకింతునో!

ఈశ్వరుని అంతర్దర్శనం కలిగినప్పటి భక్తుని స్థితి ఇది. దైవదర్శనానందం లౌకికమైన ఆనందాలవంటిది కాదు. లౌకికానందాలకు మాత్రమే అలవాటుపడిన భక్తునకొక్కసారిగా అంతరంగంలో ఆ ఈశ్వరదర్శనం లభిస్తే, ఈ శరీరం ఇంద్రియాలూ తట్టుకోగలవా? లౌకిక ధనసంపత్తి కొంచెం అధికంగా లభిస్తేనే మతిదప్పటం, స్పృహ కోల్పడి మూర్ఛిల్లటం, ప్రాణాలుసైతం కోల్పోవటం లోకచరిత్ర. మరి సర్వమూ తానైన పరమేశ్వరుని దర్శనంతో భక్తుడు సమతౌల్యాన్ని నిల్పుకోగలడా? ఆనందంతో ఉక్కిరిబిక్కిరై ఏడ్చేస్తాడు. కన్నులు విప్పారి ఆశ్చర్యానందాలతో పిచ్చివానివలె బిగ్గరగా నవ్వటం, ఏడ్వటం, కంఠం బొంగురై, పూడుకుపోయి ఈశ్వరా! ఈశ్వరా! ఈశ్వరా! అంటూ ఎన్నేళ్ళకో తల్లిని చూసిన బిడ్డవలె పిలిచిందే పిలుపుగా తన ప్రేమను, సంతృప్తిని, సంతోషాన్ని ఎట్లా ప్రకటించవలెనో తెలియని స్థితిలో పడిపోతాడు. అంతటి మహదానందం తనకెన్నడు కలుగునా? అని ఈ భక్తుని నిరీక్షణ.

**శ్లో॥ పశుజనసమానవృత్తామవధూయ దశామిమాం కదా శంభో! ।**
**ఆస్వాదయేయ తావకభక్తోచితమాత్మనో రూపమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** శంభో = ఓ మహాదేవా!, పశుజన = జంతువులవలె జీవించేవారితో, సమాన = సమానమైన, వృత్తామ్ = నడవడి గల, ఇమాం దశమ్ = ఈ దశను, అవధూయ = విదిలించికొని, తావక = నీయొక్క, భక్త = భక్తులకు, ఉచితమ్ = యోగ్యమైన, ఆత్మనః = నాయొక్క, రూపమ్ = స్వరూపమును, కదా = ఎప్పుడు, ఆస్వాదయేయ = ఆస్వాదింపగలను?

**తాత్పర్యము :** ఓ మహాదేవ! శంభో! పశువులతో సమానంగా జీవించే ఈ అజ్ఞానదశను వదిలించుకొని, భక్తోచితమైన స్వస్వరూప, అనగా, ఆత్మరూపసాక్షాత్కారంతో ఆనందించే సుదినమెన్నడో కదా!

ప్రాణులంతా పశువులే. పశువులవలె ఇంద్రియావేశాలకు బానిసలై ఆలోచనారహితంగా తమ నిజస్వరూపాన్ని తెలియక మెలిగేవారే. వీరు పాశబద్ధులు. కామక్రోధాదులకు ఆశకు కట్టుబడి వ్యవహరించేరు. ఈ దశ బాల్యం వంటిది. బాల్యం నుండి యౌవనంలోనికి, అటనుండి వార్ధక్యంలోనికి ప్రకృతిసిద్ధంగా పరిణమిస్తూన్న మానవుడు, ఈ ఆధ్యాత్మికబాల్యం నుండి అడుగైనా ముందుకు సాగక మరణించి

జన్మిస్తూ, జన్మించి మరణిస్తూంటాడు. ఈ స్థితిని దాటి పూర్ణత్వాన్ని సాధించవలెనన్నది ఈ భక్తకవి ఆకాంక్ష. స్వస్వరూపసాక్షాత్కారం పొంది ఈ లౌకిక మోహాబ్ధిని తరించవలెనని, ఆత్మానందాన్ని ఆస్వాదించవలెనని ప్రార్థన.

**శ్లో॥ లబ్ధాణిమాదిసిద్ధిర్విగలితసకలోపతాపసంత్రాసః ।**
**త్వద్భక్తిరసాయనపానక్రీడానిష్ఠః కదాసీయ? ॥ 18**

**ప్రతిపదార్థము :** లబ్ధ = పొందబడిన, అణిమా + ఆది = అణిమా మొదలైన, సిద్ధిః = సిద్ధిగలవాడను, విగలిత = నష్టమైన, సకల = అన్ని, ఉపతాప = దుఃఖముల, సంత్రాసః = భయముగలవాడను, అయియుండి, త్వద్ = తమయొక్క, భక్తిరసాయన = భక్తిరూపముగల రసాయనమును, పాన = త్రాగుటయను, క్రీడా = ఆటలో, నిష్ఠః = లీనమైనవాడనుగా, కదా = ఎప్పుడు, ఆసీయ = కాగలను?!

**తాత్పర్యము :** నీ భక్తిలో అణిమాది సిద్ధులు పొంది, లౌకిక దుఃఖముల భయములేనివాడనై, తమ భక్తియందే క్రీడాలోలుడైన బాలునివలె నేనెప్పుడు కాగలనో!

కొందరు యోగసిద్ధులు అణిమాదులు సాధించు కోరికతో భక్తినీ యోగాన్నీ ఆశ్రయిస్తారు. వీరు సిద్ధులు లభించగానే వానితో లబ్ధిపొందవలెనని లౌకికులైపోతారు. కొందరు సాంసారిక దుఃఖాలనుండి భయపడి భక్తినాశ్రయిస్తారు. ఇంతకు మించి వీరికి భగవంతుని అవసరం లేదు. కాని ఈ భక్తకవి మాత్రం ఈ స్థాయిలను అధిగమించి జీవిత ప్రయోజనం ఉందని తెలిసినవాడు. ఈతని భక్తి అలౌకికానందాన్ని, అవ్యాజానురాగాన్ని ఆస్వాదించటం ధ్యేయంగా సాగేది. ఆనందం ఆనందంకోసమే తప్ప దానికొక తార్కికకారణం ఉండదు. ఇది భక్తిసాధ్యం. ఆటలలో ఆనందంలో మునిగిన బాలునకు మరేమీ రుచించనట్లే ఆత్మానందం రుచి చూచినవానికి మరేమీ అక్కరలేదు.

**శ్లో॥ నాథ! కదా స తథావిధ ఆక్రందో మే సముచ్చరేద్వాచి ।**
**యత్సమనన్తరమేవ స్ఫురతి పురస్తావకీమూర్తిః ॥ 19**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, సః = ఆ, తథావిధః = అటువంటి, ఆక్రందః = పిలుపు, మే = నాయొక్క, వాచి = వాక్కులలో, కదా = ఎప్పుడు, సముచ్చరేత్ = వెడలును?, యత్ = ఏది (దేని), సమనన్తరం ఏవ = తోడనే, తావకీ = తమయొక్క, మూర్తిః = స్వరూపము, పురః = ఎదుట, స్ఫురతి = ప్రకటమగునో!

**తాత్పర్యము :** ఓ స్వామీ! అట్టిది – ఇట్టిది అని చెప్ప వీలుగాని ఆ పిలుపు (శ్లో. 16 చూడవలెను), ఆ యేడ్పుతోగూడిన పిలుపు వెలువడినంతనే, దానితోకూడ నా

అంతర్దృష్టిలో నా ఎదురుగా నీ స్వరూపము విరాజమానమగునో, ఆ పిలుపు, ఆ అరుపు నా వాక్కున ఎప్పుడు వెలువడునో!

స్వామి సేవలో తన్మయమై శంభో!, జగన్నాథ! అని అరచిన అరుపు భక్తుని పిలుపుపై ఈశ్వరుడు భక్తుని మనోనేత్రానికి ప్రకటమవుతాడు. అదెప్పుడాయని ఈ భక్తుని నిరీక్షణ.

**శ్లో॥ గాఢగాఢభవదంఘ్రిసరోజాలింగనవ్యసనతత్పరచేతాః ।**
**వస్త్వవస్త్విదమయత్నత ఏవ త్వాం కదా సమవలోకయితాస్మి॥20**

**ప్రతిపదార్థము :** గాఢగాఢ = అత్యంతదృఢత్వముతో, భవత్ అంఘ్రి = నీ పాదములు అనబడు, సరోజ = పద్మములయొక్క, ఆలింగన = కౌగిలియందలి, వ్యసన = వ్యసనములో, తత్పర = లగ్నమైన, చేతాః = హృదయముగలవాడనై, వస్తు = సత్పదార్థము, అవస్తు చ = అసత్పదార్థముతో కూడిన, ఇదమ్ = ఈ విశ్వమున, త్వామ్ = నిన్ను, అయత్నతః ఏవ = అప్రయత్నముగనే, కదా = ఎప్పుడు, సమ్ = చక్కగా, అవలోకయితాస్మి = చూచినవాడనగుదునో!

**తాత్పర్యము :** నీ పాదపద్మములను గట్టిగా కౌగిలించి, అందే లగ్నమైన హృదయముతో సదసత్తుల సమ్మేళనమైన విశ్వంలో నిన్నెన్నడు దర్శించగలనో కదా!

భక్తుని భక్తి గాఢమైన కొలది అది వాని వ్యసనమైపోవును. వాని మనస్సు మరెందులోగాని ప్రసరించదు, ప్రవర్తించదు. మంచిచెడ్డల విచక్షణ సైతం కలుగదు. ఈ లక్షణం లౌకికవ్యసనపరులను సర్వనాశనం చేస్తుంది, కాని ఆధ్యాత్మికాన్వేషణలో నిమగ్నమైన భక్తులను ఈశ్వరదర్శనానికి దగ్గరచేస్తుంది. అంతటి భక్తి తాత్పర్యాలతో విశ్వాన్ని చూచినపుడు, పేకాటరాయనికి భగవద్గీతలోనూ పేకముక్కలే దర్శనమిచ్చినట్లు, ఈ భక్తునికి విశ్వంలోని సత్ – అసత్ రెంటిలోనూ ఈశ్వరుడే దర్శనమిస్తాడు. ద్వయ ప్రకృతి అద్వయమై భాసిస్తుంది. ఈ దృష్టి సమదృష్టి. ఇది తనకెన్నటికి కలుగునో అని ఈ భక్తుని హృదయం తపిస్తూన్నది.



శ్రీః

# 10. అవిచ్ఛేదభంగ స్తోత్రమ్

శ్లో॥ న సోఢవ్యమవశ్యం తే జగదేకప్రభోరిదమ్ ।
మాహేశ్వరాశ్చ లోకానామితరేషాం సమాశ్చ యత్ ॥ 1

**ప్రతిపదార్థము :** జగదేకప్రభోః = జగత్తునకు అద్వితీయమైన ప్రభువువైన, తే = నీకు, అవశ్యమ్ = తప్పక, ఇదమ్ = ఇది, న సోఢవ్యమ్ = సహించదగినది కాదు, యత్ = ఏది, మాహేశ్వరాః = మహేశ్వరుని భక్తులు, చ = మరియు, ఇతరేషామ్ = ఇతరులైన, లోకానామ్ = జనులకు, సమాః చ = సమానులు కూడా.

**తాత్పర్యము :** ఓ జగత్ప్రభూ! నీ భక్తులు, ఇతరులైన లౌకికులు కూడా దేనిని సహిస్తూన్నారో దానిని జగత్తునకు ప్రభువైన నీవు సహించవలసిన పరిస్థితులు లేవు.

విశ్వంలో ఎన్నో లోకాలు, ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క ఈశ్వరుడు. వీరంతా మహేశ్వరభక్తులు, మాహేశ్వరులు. వీరంతా బ్రహ్మాది దేవతలకు సమానులు. అయినప్పటికి, వీరంతా ప్రకృతిలోని వారే. వీరికి ప్రాకృతికమైన కట్టుబాట్లు తప్పవు. ఇవన్నీ జగత్తునంతనూ ఏకచ్ఛత్రంగా పాలించే ప్రభువుకు అవశ్యం పాటించదగినవి కావు, పాటించుమని ఆదేశించగల పై అధికారి ఎవ్వరూ లేరు. ఇది నిజమే, కాని ఈ అద్వయప్రభువు ఈ ద్వయప్రపంచానికి గూడ ప్రభువే. ఆ కారణంగా తనకై తానే ఈ విశ్వముల, విశ్వేశ్వరుల యోగక్షేమాలను సంపాదిస్తూంటాడు.

శ్లో॥ యే సదైవానురాగేణ భవత్పాదానుగామినః ।
యత్ర తత్ర గతా భోగాంస్తే కాంశ్చిదుపభుంజతే ॥ 2

**ప్రతిపదార్థము :** యే = ఎవరు, అనురాగేణ = ప్రేమతో, సదా ఏవ = ఎల్లప్పుడును, భవత్ = తమయొక్క, పాద = పాదములను, అనుగామినః = అనుసరించువారు కలరో, తే = వారు, యత్ర తత్ర = యేవిధమైన అవస్థలో, గతాః = ఉన్నవారు (గాని), భోగాన్ = భోగములను, ఉపభుంజతే = అనుభవింతురు.

**తాత్పర్యము :** ప్రేమతో ఎల్లవేళల నీ పాదములను ఆశ్రయించువారు తాము యే స్థితిలో ఉన్నప్పటికి, భోగాలను అనుభవించగలరు.

ఇక్కడ భోగాలుగా చెప్పబడినవి లౌకికభోగాలు కావు. ఆనందానుభూతులు. ఈ ఆనందానుభూతులు ఎక్కడికక్కడే భక్తుల భక్తిప్రకటన రీతిలో, పూజావిధుల నొనరించటంలో సర్వత్ర ప్రకటమవుతాయి. ఈ ప్రకటన ఆనందరూపమే.

**శ్లో॥ భర్తా కాలాన్తకో యత్ర భవాంస్తత్ర కుతో రుజః ।**
**తత్ర చేతరభోగాశా కా లక్ష్మీర్యత్ర తావకీ ॥ 3**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, కాలాన్తకః = కాలమును అంతము చేయు, భవాన్ = తమరు, భర్తా = రక్షకుడో, తత్ర = అక్కడ, రుజః = రోగము, కుతః = ఎందువలన? ఎక్కడనుండి?, చ = మరియు, యత్ర = ఎక్కడ, తావకీ = తమయొక్క, లక్ష్మీః = భక్తిరూపలక్ష్మి, తత్ర = అక్కడ, ఇతరభోగ = ఇతర భోగములగూర్చి, ఆశా = ఆశ, అభిలాష, కా = యేది?

**తాత్పర్యము :** స్వామీ! తమరు కాలాన్నే అంతంచేయగల సమర్థులు. తమ రక్షణలో ఉన్నవారికి కాలానుగతమైన రోగబాధ ఎట్లా ప్రాప్తించగలదు? అదిగాక, తమకై భక్తి ఎక్కడ ప్రకాశిస్తుందో అక్కడ ఇతరమైన భోగాలమీద ఆశ ఎందుకుంటుంది?

భక్తి రక్షణ కల్పిస్తుంది, ఆనందాన్నీ తృప్తినీ కలిగిస్తుంది. కాలం అన్నింటినీ హరిస్తుంది, నిజమే. కాని ఆ కాలాన్నే అచేతనం చేయగల రుద్రుడు రక్షకుడైనప్పుడు భక్షించే వ్యాధి నశిస్తుంది. ఆనందం, కలిమిలేములకు అందని తృప్తి భక్తిలో లభిస్తుంది.

**శ్లో॥ క్షణమాత్రసుఖేనాపి విభుర్యేనాసి లభ్యసే ।**
**తదైవ సర్వః కాలోఽస్య త్వదానందేన పూర్యతే ॥ 4**

**ప్రతిపదార్థము :** యేన = ఎవనిచేత, క్షణమాత్రసుఖేన అపి = ఒక్క క్షణము మాత్రమే సుఖముచేతనైనను, విభుః = సర్వవ్యాపియైన ప్రభువు, అసి = నీవు, లభ్యసే = లభింతువో, తదా ఏవ = అప్పుడే, అస్య = వానికి, సర్వః కాలః = కాలము సర్వము, త్వద్ = నీయొక్క, ఆనందేన = ఆనందముతో, పూర్యతే = పూరింపబడుచున్నది.

**తాత్పర్యము :** స్వామీ! ఎవనికైనగాని ఒక్కక్షణమైనగాని నీ దర్శనసుఖము కలిగినట్లయిన, వానికి అప్పటికప్పుడే కాలమంతయు నీ ఆనందంతో నిండిపోతుంది.

ఈ ఆనందం అలౌకికం కనుక కాలపరిమితి దీనికి వర్తించదు, లౌకికానందాలకు మాత్రం కాలం వర్తిస్తుంది. శివానందసుఖం పరిపూర్ణసుఖం కనుక అది కాలాతీతం. **పూర్యతే** అన్న పదప్రయోగం వలన కాలం సర్వనాశకం కనుక కాలస్పర్శవలన నష్టమైన ఈ శివానందం ఎప్పటికప్పుడు (తదైవ) పూరింపబడుతుంది. ఒక్కసారి లభిస్తే ఆ ఆనందం శాశ్వతమై నిల్చిపోతుంది. అది సదా వర్తమానానందమే.

**శ్లో॥ ఆనందరసబిందుస్తే చంద్రమా గలితో భువి ।**
**సూర్యస్తథా తే ప్రసృతః సంహారీ తేజసః కణః ॥ 5**

**శ్లో॥ బలిం యామస్తృతీయాయ నేత్రాయాస్మై తవ ప్రభో ।**
**అలౌకికస్య కస్యాపి మాహాత్మ్యస్యైకలక్ష్మణే ॥ 6**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ స్వామీ!, చంద్రమాః = చంద్రుడు, తే = నీయొక్క ఆనందరసబిందుః = ఆనందరసమునందలి ఒక చుక్క, భువి = లోకంలో, గలితః = జారినదియైనవాడు, తథా = అట్లే, సూర్యః = సూర్యుడు,తే = నీయొక్క, తేజసః = తేజస్సుయొక్క, సంహారీ = సంహరించు, కణః = కణముగా, ప్రసృతః = ప్రసరింపజేయ బడినవాడు, కస్యాపి = ఎవరో ఒకరైన, అలౌకికస్య = అలౌకికునియొక్క, ఏక = ఒకేఒక, మాహాత్మ్యస్య = మాహాత్మ్యముయొక్క, లక్ష్మణే = చిహ్నరూపమైనవానియందు, తవ = నీయొక్క, అస్మై = ఈ, తృతీయాయ నేత్రాయ = మూడవకంటికొరకు, బలిమ్ = బలిని, యామః = పొందుదుము.

**తాత్పర్యము :** ఓ స్వామీ!, తమ ఆనందబిందువొకటి జారి చంద్రుడై లోకంలో వెలుగుతూన్నాడు. అట్లే, తమ సర్వసంహారకతేజః కణమొకటి ప్రసరించి సూర్యుడై లోకంలో ప్రకాశిస్తూన్నాడు. అలౌకికుడైన ఎవరో ఒకరి మాహాత్మ్యతకు చిహ్నంగా మీ మూడవ కంటికి మేము బలియైపోతాము. – ఇది సామాన్య తాత్పర్యం.

శివుని అష్టమూర్తిగా దర్శించిన ప్రాచీనులు పృథివి, నీరు, నిప్పు, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, పురుషుడు అను నివి శివస్వరూపములుగా భావించినారు. సూర్యచంద్రాగ్నులు వాని రెండు కన్నులని, జ్ఞానమే మూడవకన్ను అని, చెప్పటమూ కద్దు. సూర్యచంద్రులు లోకాన్ని ప్రవర్తింపజేస్తూన్నారు, మూడవ కన్ను లోకాన్ని (లౌకికాన్ని) భస్మీపటలం చేస్తుంది. లోకాన్ని ప్రవర్తింపజేసేవి ఆనందమూ, చైతన్యమూ, వీనికి శత్రువులై లోకాన్ని తమస్సులో అచేతనంగా పడవేసేది చీకటి, నిద్ర. ఈ శత్రువులను సూర్యతేజం నశింపజేస్తుంది, చైతన్యం పరిఢవిల్లుతుంది. అట్లే జ్ఞానప్రతీకయైన మూడవకన్ను లౌకికాన్ని నష్టపరచి, అలౌకికానందానికి తావిస్తుంది.

శైవశాక్తేయాగమానుసారం, **భువి** (భూమియందు) అంటే, అగ్నీషోమాత్మకమైన శక్తి మార్గమధ్యంలో, అని అర్థం అవుతుంది. ఆ స్థితిలో యే ఆనందం రసాత్మకంగా అనుభవానికి వస్తుందో ఆ ఆనందబిందువునే చంద్రుడని వ్యవహరిస్తారు. దీని స్వభావం ద్రుతం, అంటే తటాలున జారిపోయే లక్షణం కలది. కనుక కవి దీనిని **గలితః** అనటం. చంద్రుడు మనస్సునకు కర్త, కనుక చంద్రుడు గలితుడు అంటే, మనః ప్రమేయం గలితమైనదని, అంటే అక్కడే విలీనమైనదని భావం. అట్లే భేదాన్ని, ద్వయభావాన్ని

నశింపజేసే తేజః కణం **సంహారి** అనబడింది. ఆ తేజఃకణం తమస్సును (ద్వయభావమనే అజ్ఞానాన్ని) నశింపజేసేది కనుక సూర్యుడనబడింది. ఈ సూర్యుడు కూడ ప్రాణంలో లీనమవుతాడు కనుక **ప్రసృతః.** ఆగమం ఇట్లా అంటుంది :

**'జ్ఞానశక్తిః ప్రభోరేషా తపత్యాదిత్యవిగ్రహా'**, ప్రభుని యీ జ్ఞానశక్తియే సూర్యుని రూపంలో, **'తపతే చంద్రరూపేణ క్రియాశక్తిః పరస్య సా'**, పరునియొక్క ఆ క్రియాశక్తి చంద్రునిరూపంలో వెలుగుతూంటాయి. ఇక శివుని మూడవకన్ను మహావహ్నియే. దానిలో మాయీయదేహాదిప్రమాతృతను సమర్పిస్తాము, అంటాడు కవి. ఎవరికి? అద్వయచిహ్నితుడైన శివునకు, శివుని కొరకు.

**శ్లో॥ తేనైవ దృష్టోఽసి భవద్దర్శనాద్యోఽతిహృష్యతి ।**
**కథంచిద్యస్య వా హర్షః కోఽపి తేన త్వమీక్షితః ॥ 7**

**ప్రతిపదార్థము :** యః = ఎవడు, భవత్ = తమయొక్క, దర్శనాత్ = దర్శనము వలన, అతిహృష్యతి = అత్యంతము ఆనందము గలవాడగునో, తేన ఏవ = వానిచేతనే, దృష్టః అసి = చూడబడినవాడవగుచున్నావు, వా = మరియు, కథంచిత్ = ఎట్లయిన, యస్య = ఎవనికి, కః అపి = ఏదైనను, హర్షః = ఆనందప్రాప్తియో, తేన = వానిచేత, త్వమ్ = నీవు, ఈక్షితః = దర్శింపబడినవాడవు.

**తాత్పర్యము :** స్వామీ! తమ దర్శనముతో ఎవడు ఆనందించునో వాడు మాత్రమే తమను దర్శించినవాడు. ఎవనికి ఏవిధముగానైన అలౌకికమైన ఆనందము లభించునో వాడే నిన్ను దర్శించినవాడు.

శివుడు ఆనందాభిన్నస్వరూపి కనుక శివదర్శనమువలన ఆనందప్రాప్తి సహజోక్తి. శివదర్శనానంతరము ఆనందము కలుగనివారున్నారా? ఉన్నారు. ఈ ఆనందములో సమస్తమైన ఆకాంక్షలు లీనమైపోవలె. లౌకికమైన ద్వయభావము నశించి అద్వయస్థితిని అనుభవించుటలోని ఆనందమిది. కనుక అన్యాపేక్ష కలుగదు. కాని దుస్సాధ్యమైన తపస్సు చేసి శివుని దర్శించికూడ ఆ అద్వయానందాన్ని పొందలేక లౌకికతామూఢులైన రక్కసులున్నారుకదా. పురాణగాథలన్నీ వారివే. కనుక వారు శివుని దర్శించనివారే. శివుని స్థానంలో వారు ఆరాధించినది, దర్శించినది ఆ లౌకికమైన కామ్యాల సాఫల్యాన్ని మాత్రమే. శివభక్తుని స్థితి వేరు.

ఇంద్రియవిషయానందం కాక మరే రూపంలోగాని ఒక అలౌకికానందాన్ని ఎవరైన పొందినట్లయితే ఆతడు శివుని దర్శించినట్లే, శివుడానందమయుడు కనుక,

అట్లా అలౌకికానందాన్ని పొందిన భక్తుడు లౌకికతనుండి విముఖుడై తాను పొందిన ఆ అలౌకికానందం యొక్క సమగ్రస్వరూపాన్ని దర్శించవలెనని తపిస్తాడు. ఆ కారణంగా మరింత శివానందానికి చేరువవుతాడు. ఆతడు శివుని దర్శించినవాడే.

**శ్లో॥ యేషాం ప్రసన్నోఽసి విభో! యైర్లబ్ధం హృదయం తవ ।**
**ఆకృష్య త్వత్పురాత్తైస్తు బాహ్యమాభ్యన్తరీకృతమ్ ॥ 8**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ స్వామీ!, యేషామ్ = ఎవరియందు, ప్రసన్నః అసి = ప్రసన్నుడవగుచున్నావో, యైః = ఎవనిచేత, తవ = నీయొక్క, హృదయమ్ = హృదయము, లబ్ధమ్ = పొందబడినదో, తైః = వారిచేత, తు = అయితే, త్వత్ = నీయొక్క, పురాత్ = స్థానమునుండి, బాహ్యమ్ = బైటకు, ఆకృష్య = లాగి, ఆభ్యన్తరీకృతమ్ = లోపలకు చేర్చబడినది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవెవరికి ప్రసన్నుడవో, ఎవరు నీ హృదయాన్ని పొందినారో, వారు మాత్రము నీ స్థానమునుండి బైటకులాగి లోపలనుంచబడిరి.

స్వామి హృదయం పొందబడటం (లబ్ధం హృదయం) అంటే, స్వామిదైన ప్రకాశవిమర్శాత్మకరూపం ఆత్మయందు ప్రతిష్ఠింపబడటం అని అర్థం. స్వామి పురమునుండి (త్వత్ పురాత్) అంటే, స్వామియొక్క పూరకచిద్రూపమునుండి ప్రకటము చేసి, అనగా, దేహేంద్రియాపేక్షవలన బాహ్యగోచరమైన ఈ విశ్వం మరల సంపుటీకరించ బడినదని శ్రీ త్రింశకోక్త తత్త్వముననుసరించి, వారికిది చిన్మయమే అని భావం.

**శ్లో॥ త్వదృతే నిఖిలం విశ్వం సమదృగ్యాతమీక్ష్యతామ్ ।**
**ఈశ్వరః పునరేతస్య త్వమేకో విషమేక్షణః ॥ 9**

**ప్రతిపదార్థము :** త్వద్ + ఋతే = నీవుగాక, నిన్నువిడచి, నిఖిలమ్ = సమస్తమైన, విశ్వమ్ = విశ్వము, సమదృక్ = రెండు కన్నులు గలవియై, ఈక్ష్యతామ్ = చూపులను, యాతమ్ = పొందినవి, పునః = కాని, ఏతస్య = దీనియొక్క, ఏకః = అద్వితీయుడైన, ఈశ్వరః = స్వామియైన, త్వమ్ = నీవు, విషమ + ఈక్షణః = బేసికన్నులవాడవు, ముక్కంటివి.

**తాత్పర్యము :** నిన్ను విడిచిన సమస్త విశ్వము రెండు కన్నుల చూపు గలిగినదైనది. కాని ఈ విశ్వమునకు ఏకైక నాథుడవైన నీవు మాత్రం మూడు కన్నుల చూపుగలవాడవు.

ఈశ్వరుని ప్రక్కకు నెట్టినచో, ఈ విశ్వము సత్పదార్థము, అసత్ పదార్థము

అను ద్వంద్వప్రకృతిగా మారిపోవును. రెండు కన్నులకు కన్పించు జగత్తు స్వరూపమిది. ఈ భేదబుద్ధివలన సంఘర్షణలతో మాయామయజగత్తు నడుస్తూంటుంది. కాని ఈశ్వరునకున్న మూడవకంటిచూపు కలిగినచో, ఇది అద్వయరూపమై కన్పించును. ఈశ్వరుని మూడవకన్ను జ్ఞానానికి ప్రతీక. ఇది అగ్నినేత్రం, అంటే ఆ మూడవదైన జ్ఞాననేత్రంతో తప్ప మరేవిధంగానూ ఈశ్వరదర్శనం కాదు. ఈశ్వరుడే జ్ఞానదాత. కాబట్టి వాని భక్తిలో తాదాత్మ్యం పొంది మహాజ్ఞాని, ఈశ్వరసముడై, విశ్వంలోని వివిధత్వం అసత్యమనీ, దాని పూర్ణత్వం సత్యమనీ గ్రహించగలడు.

**శ్లో॥ ఆస్తాం భవత్ప్రభావేణ వినా సత్తైవ నాస్తి యత్ ।**
**త్వద్దూషణకథా యేషాం త్వదృతే నోపపద్యతే ॥ 10**

**ప్రతిపదార్థము :** యేషామ్ = ఎవరికి, త్వద్ = మీయొక్క, దూషణకథా = నిందాత్మకమైన చరిత్రమో, త్వద్ ఋతే = మీరులేక, న ఉపపద్యతే = (దానికి) ఉనికియే లేదు, భవత్ = తమయొక్క, ప్రభావేణ వినా = ప్రభావము లేక, తేషామ్ = వారికి, సత్తా ఏవ = ఉనికియే, న అస్తి = లేదు, యత్ = అనునదేది కలదో అది, ఆస్తామ్ = అట్లే ఉండుగాక!

**తాత్పర్యము :** నిన్ను నిందించేవారిని అటుండనిమ్ము స్వామీ! వారి ఉనికియే నీ ప్రభావము వలన సాధింపబడినది. నీవు లేవని చెప్పుటకైన ఆధారము నీ ఉనికియే కదా!

నిరీశ్వరవాదములైన దర్శనములు కొన్ని ఉన్నవి : బౌద్ధము, సాంఖ్యము ఇత్యాదులు. ఇవి సర్వకర్త, సర్వభర్త, సర్వహర్త అనునొకడు లేడని, కొన్ని తత్త్వములు మాత్రమే ఈ సృష్టి స్థితి లయలను ప్రవర్తింపజేయునని ప్రకటించే శాస్త్రాలు. ఈ దర్శనాలలో నిక్షిప్తమైన జ్ఞానము సైతము జ్ఞానదాత ఈశ్వర ప్రసాదితమే. ఆ దర్శనములను ప్రతిపాదించినవారైనను వ్యక్తులుగా ఆ స్వామి ప్రాకృతికాభివ్యక్తులే. ఈ నమ్మిక గల భక్తునకు వారితోనేమి పని? అదిగాక, తర్కప్రమాణితమైన సత్యమేమన, ఈశ్వరుడు లేడనటం ఈశ్వరుడు ఉన్నాడని అంగీకరించటమే అవుతుంది : లేనిదాని గురించి అంగీకారముగాని తిరస్కారముగాని అసాధ్యము కదా! కనుక 'లేడు' అన్నమాటకు ఒక నిర్దిష్టకాలంలో ఒక నిర్దిష్ట దేశంలో మన ఇంద్రియజ్ఞానానికి అందటం లేదు, అని మాత్రమే తార్కికార్థం.

**శ్లో॥ బాహ్యాన్తరాన్తరాయాలీ కేవలే చేతసి స్థితిః ।**
**త్వయి చేత్స్యాన్మమ విభో! కిమన్యదుపయుజ్యతే ॥ 11**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ ఈశ్వరా!, బాహ్య = వెలుపలి, ఆన్తర = లోపలి, అన్తరాయాలీ = విఘ్నముల సమూహమునుండి, కేవలే = శుద్ధమైన, మమ = నాయొక్క, చేతసి = హృదయంలో, త్వయి = నీయందు, స్థితిః = ఉనికి, స్యాత్ చేత్ = ఉన్నట్లయిన, అన్యత్ = వేరొకటి, ఉపయుజ్యతే కిమ్ = ఉపయోగించునా యేమి? (లేక), కిమ్ అన్యత్ = ఇతరమైనదేది, ఉపయుజ్యతే = ఉపయోగించును?.

**తాత్పర్యము :** ఈశ్వరా! నా హృదయం వెలుపల, హృదయం లోపల కూడా ఉన్న విఘ్నకారకమైనవన్నీ తొలిగిపోయి, నా మనస్సు నీయందు స్థిరమయితే, వేరేమి కావలెను?, అంతకంటె ఇంక కావలసినదేమున్నది?

మనస్సుకు వెలుపలనున్న విఘ్నాలు, అంటే ఈశ్వరనియందు మనస్సును నిలువనీయక దూరముగా ఆకర్షించునవి శరీరసుఖాన్ని కలిగించే అన్ని వస్తువులున్నూ. ఇవి ఉన్నప్పుడు ఈ లాలస ఈశ్వరునుండి మనస్సును విముఖం చేస్తుంది. ఇవి లేనప్పుడు, వదలిపోయినప్పుడు, దుఃఖం ఆవహించి మనస్సును ఈశ్వరవిముఖం చేస్తుంది. అట్లే, మనస్సులో జనించే అభిమానము, కోరిక, సంకల్పవికల్పములు ఇవి కూడా ఇంద్రియ విషయాలతో సంగతములై ఈశ్వరునిపై దృఢంగా మనసును నిలువనివ్వవు. ఈ అన్తరాయాలు తొలగిపోతే, ఇంక మరేమి ఉపకరణాలతోనూ పనిలేదు, మనస్సు తనంత తానే ఈశ్వరాయత్తమవుతుంది.

**శ్లో॥ అన్యే భ్రమన్తి భగవన్నాత్మన్యేవాతిదుఃస్థితాః ।**
**అన్యే భ్రమన్తి భగవన్నాత్మన్యేవాతిసుస్థితాః ॥ 12**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ భగవంతుడా!, అన్యే = కొందరు, ఆత్మని ఏవ = తమయందే, అతి = ఎక్కువగా, దుఃస్థితాః = దుఃఖము గలవారై, భ్రమన్తి = తిరుగుచున్నారు, భగవన్ = ఈశ్వరా!, అన్యే = మరికొందరు, ఆత్మని ఏవ = తమయందే, అతి = ఎక్కువగా, సుస్థితాః = సుఖముగలవారై, భ్రమన్తి = తిరుగుచున్నారు.

**తాత్పర్యము :** కొందరు తమ జీవితంలోని దుఃఖాలననుభవించటంతోనే సదమదమవుతూ సుఖాన్ని వెదుక్కుంటూ తిరుగుతూన్నారు. మరికొందరు తమకు దక్కిన సుఖాలతో మురిసిపోతూ మరేదీ మనసుకు రానివ్వక, ఆ సుఖాలనే మరీ మరీ వెదుక్కుంటూ తిరుగుతూన్నారు. ఈ రెండు తెగలవారున్నూ ఈశ్వరుని మాత్రం విస్మరిస్తూన్నారు, అని భావం.

ఈశ్వరుని చేరటానికి సుఖదుఃఖాలు రెండూ ప్రతిబంధకాలే. ఇది ఈ జన్మలో

ఎంత సత్యమో జన్మజన్మలకూ అంతే సత్యం. ఈ సుఖదుఃఖాల వలయంలో బడి, దుఃఖం లేకుండటమే సుఖం సుమా అనుకుంటూ కొందరు, ఈ సుఖం లేకుంటే అంతా దుఃఖమేకదా అనుకుంటూ మరికొందరూ జననమరణవలయంలో చిక్కి పరిభ్రమిస్తూ ఉంటారు.

దీనికి మరియొక విధంగా అర్థాన్వయం చేయవచ్చు. కొందరు సంసారులు ఆత్మయనే చైతన్యం వేరేమీ లేదని భావిస్తూ, తమ జడమైన శరీరమే సమస్తమన్న భ్రాంతిలో ఇహపరములు రెంటికి చెడి జననమరణాల పునఃపునరావృత్తిలో చిక్కుబడతారు. మరికొందరు శరీరంకంటె వేరైన సత్యచేతన ఆత్మగా ఉన్నదని, ఆ ఆత్మయే తానుగాని శరీరేంద్రియాలు కావనీ, నమ్మి అద్వయానందంలో మునిగి, ఆత్మజ్ఞానంతో సంసార రహితులై ద్రిమ్మరులవుతారు.

**శ్లో॥ అపీత్వాపి భవద్భక్తిసుధామనవలోక్య చ ।**
**త్వామీశ! త్వత్సమాచారమాత్రాత్సిద్ధ్యన్తి జన్తవః ॥ 13**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, భవత్ = మీయొక్క, భక్తిసుధామ్ = భక్తియను అమృతమును, అపీత్వా అపి = త్రాగకపోయినప్పటికిని, త్వామ్ = నిన్ను, అనవలోక్య చ = చూడకపోయినప్పటికి గూడ, త్వత్ = నీయొక్క, సమాచారమాత్రాత్ = పూజాదిక బాహ్యచర్యలమాత్రముతో, జన్తవః = జనులు, సిద్ధ్యన్తి = సిద్ధిపొందుచున్నారు.

**తాత్పర్యము :** ఓ ఈశ్వరా! నీయందు గాఢమైన భక్తిపారవశ్యము లేకపోయినను, మనోనేత్రంతో నిన్ను దర్శించకపోయినను, కేవలము ధ్యాన ఆవాహనాది బాహ్యపూజా నిర్వహణంతోనే జనులు సిద్ధిపొందుతూన్నారు.

భగవంతుని పొందవలెనంటే గాఢమైన భక్తి ఉండవలె, ఆ భక్తితో మనస్సును భగవంతునిపై నిల్పి మనస్సులో దర్శింపవలె. అప్పుడానందంతో పరవశించి, సమస్తాన్ని మర్చిపోవలె. ఇది ఈశ్వరసిద్ధిని పొందేమార్గం, అని పెద్దలంటారు. కాని, ఇవేమీ లేకపోయినాగాని, కేవలం బాహ్యాచారాలతోనే సిద్ధిపొందవచ్చు నంటాడీ కవి. పెద్దలు చెప్పినారనో, పదిమందిలో గౌరవంగా ఉంటుందనో, గాఢవిశ్వాసంలేనివారుకూడా ఫలపుష్పాదులతో అర్చించవచ్చు, పాలతో నీటితో అభిషేకించవచ్చు. ఇది మిథ్యాచారం కదా, అనవచ్చు. అయినప్పటికి, ఈ జపధ్యానపూజాదికాన్ని క్రమం తప్పక ఒక లాంఛనంగానైనా సరే, నిర్వహించినట్లయితే, దాని మూలంగా సర్వం సమకూరవచ్చు. సిద్ధీ సంభవమే.

**జన్తవః** అంటే పశువులు. శైవశాక్తేయసంప్రదాయంలో జన్తు, పశు శబ్దాలు ప్రాణులందరికీ అన్వయిస్తాయి.

**శ్లో॥ భృత్యా వయం తవ విభో! తేన త్రిజగతాం యథా ।**
**బిభర్ష్యాత్మానమేవం తే భర్తవ్యా వయమప్యలమ్ ॥ 14**

**ప్రతిపదార్థము :** విభో! = సర్వవ్యాపివైన స్వామీ!, వయమ్ = మేము, తవ = నీయొక్క, భృత్యాః = సేవకులము, తేన = ఇందువలన, యథా = యేవిధముగా, త్రిజగతామ్ = మూడు లోకములయొక్క, ఆత్మానమ్ = ఆత్మను, బిభర్షి = ధారణపోషణలు చేయుచున్నావో, ఏవమ్ = ఇదేరీతిగా, వయం అపి = మేముగూడ, తే = నీయొక్క, అలమ్ = చాలినంత, పూర్తిగా, భర్తవ్యాః = ధారణపోషణలను పొందుటకు తగినవారము.

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపివైన ఈశ్వరా! మేము నీకు సేవకులము. ఆ కారణంగా, మూడు లోకాలవారి ఆత్మను ధరించి మీరెట్లా పోషిస్తూన్నారో, అట్లాగే మమ్ముగూడ ధరించి పోషించవలసిన కర్తవ్యం పూర్తిగా మీయందే ఉన్నది.

విశ్వం అంతా నిజానికి శివరూపమే అయినప్పటికిన్నీ, దేహాది ఉపాధిభేదం చేత మేము శివేతరులుగా గోచరిస్తూన్నాము. విశ్వంలోని ముల్లోకాలున్నూ శివేతర రూపాలుగా భ్రమ కలిగిస్తూన్నప్పటికి వాటిని అభేదంగా భావించి శివుడు ధరించి పోషిస్తూన్నట్లే, ఆ లోకంలోని పశువులలో నొకరమైన మానవులమందరమున్నూ, అదే అభేదభావంతో చేకొనదగినవారమే. స్వామి కాక దాసులకింకెవరు రక్ష!

**శ్లో॥ పరానందామృతమయే దృష్టేఽపి జగదాత్మని ।**
**త్వయి స్పర్శరసేఽత్యన్తతరముత్కంఠితోఽస్మి తే ॥ 15**

**ప్రతిపదార్థము :** పర + ఆనంద = పరమానందరూపమగు, అమృతమయే = అమృతముతో నిండిన, జగదాత్మని త్వయి = విశ్వాత్మయగు తమయందు, దృష్టే అపి = దృష్టినిల్పినవాడనైనప్పటికి, తే = నీయొక్క, స్పర్శరసే = స్పర్శయను ఆనందములో, అత్యన్తతరమ్ = ఇంతింతయనరాని, ఉత్కంఠితః = అభిలాషగలవాడను, అస్మి = అగుచున్నాను.

**తాత్పర్యము :** విశ్వమంతా నిండియున్న మిమ్ము మీ పరమానందరూపంలో నిత్యమూ క్షణక్షణమూ చూస్తూనే ఉన్నప్పటికిన్ని, ఈశ్వరా! నీ స్పర్శకలిగినప్పుడు మరెంత ఆనందం పొందగలనో అన్న ఉత్సుకతతో ఉన్నాను.

విశ్వంలో విశ్వేశ్వరుని దర్శన స్పర్శన శ్రవణానందం నిత్యం లభిస్తూనే ఉన్నది. నీలి నీలి మబ్బుల్లో, వినీలాకాశంలో, మహాపర్వతాలలో, జీవనదులలో, సాగరాలలో నీ దర్శనం నిత్యసత్యం కదా. చల్లని, వెచ్చని గాలులలో నీ స్పర్శనమూ నిత్యమే కదా. సమస్త పశుపక్ష్యాది జీవజాలం చేసే కలకలారావాలలో నీ శ్రవణం నిత్యసుఖదమే కదా. అయినప్పటికీ, ఓ స్వామీ! నా భేదబుద్ధి నన్ను ఆక్రమించి ఇదంతా ప్రకృతిమాత్రమే, పురుషుడు కాడు సుమా! అంటుంది. దానికి వశుడనై నీ స్పర్శ వేరుగా ఉన్నదనీ, అది కూడా నాకు లభిస్తుందనే భావంతో నేను బ్రతికేస్తూ ఉన్నాను స్వామీ!

**శ్లో॥ దేవ! దుఃఖాన్యశేషాణి యాని సంసారిణామపి ।**
**ధృత్యాఖ్యభవదీయాత్మయుతాన్యాయాన్తి సహ్యతామ్ ॥ 16**

**ప్రతిపదార్థము :** దేవ = ఓ దేవా!, యాని = ఏవి, అశేషాణి = సమస్తమైన, దుఃఖాని = దుఃఖములో, ధృతి + ఆఖ్య = ధృతి అనబడు, భవదీయ = తమవైన, ఆత్మయుతాని = స్వరూపముతో, తత్త్వముతో కూడినవి, సంసారిణామ్ = లౌకికులకు, అపి = కూడ, సహ్యతామ్ = సహింపదగినవి, ఆయాన్తి = కలుగుచున్నవి.

**తాత్పర్యము :** ఓ దేవా! దుఃఖముల రూపంలో అనుభవింపబడుతూన్న సమస్త విషయములున్ను తమ తత్త్వముతో గూడియున్నవే. ఆ తత్త్వమునకే ధృతి యని పేరు. ఇవి వేదాంతస్పర్శలేని కేవల లౌకికులు గూడ సహింపదగినవైయున్నవి.

దుఃఖం అన్నది సర్వజీవులకూ అనుభవింపక తీరనిదే. అనుభవరూపంలో దుఃఖమంతా ఒక్కటే, కాని తీవ్రతలోనూ, హేతువులలోనూ బహుళత్వమున్నది. **సంసారిణాం,** లౌకికులకు, అనటంలో సమస్తజీవజాలపు దుఃఖచ్ఛాయలున్నూ చెప్పబడుతూన్నవి. ఈ దుఃఖాలన్నీ సహ్యములుగనే జీవులకు అనుభూతమగుచున్నవి. కారణం? దుఃఖానికి గూడ రసస్థాయి ఉన్నది, అంటే ఆనందాభేదస్థాయి. నిన్నటి దుఃఖం స్మృతి స్థాయిలో నేటి సుఖంగా పరిణమిస్తూన్నది. అట్లే నిన్నటి సుఖం నేటి దుఃఖంగానూ పరిణమిస్తూన్నది. అందువలన సుఖదుఃఖాలన్నవి అభేదరూపాలు, అంటే తాత్త్వికరూపాలు అనవచ్చు. దేనికి అభేదరూపాలు? ధృతికి. ఈ ధృతి ఈశ్వరతత్త్వం.

**శ్లో॥ సర్వజ్ఞే సర్వశక్తౌ చ త్వయ్యేవ సతి చిన్మయే ।**
**సర్వథాప్యసతో నాథ! యుక్తస్య జగతః ప్రథా ॥ 17**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, త్వయి = నీవు, చిన్మయే = జ్ఞానమయుడైన, సర్వజ్ఞే = సర్వమెఱిగినవాడవు, చ = మరియు, సర్వశక్తౌ = సర్వశక్తిమంతుడవు, సతి

ఏవ = అయియుండు సమయముననే, సర్వథా = అన్నివిధములుగా, అపి = కూడ, అసతః = అసత్తయిన, అస్య = ఈ, జగతః = లోకమునకు, ప్రథా = ప్రకాశము, అస్తిత్వము, యుక్తా = సిద్ధమైనది, తగినది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవు జ్ఞానమయుడవు, సర్వమెఱిగినవాడవు, సర్వశక్తిమంతుడవు. నీవుండగా, అసత్తయిన ఈ విశ్వం ఇంత సంపూర్ణంగా ప్రకాశిస్తూన్నది కదా, ఇదేమి చిత్రము!?

**యుక్తా** అన్నదానికి 'తగినది' అన్న అర్థంలో అన్వయిస్తే, ఈ విశ్వం అస్తిత్వాన్ని కలిగి ఉండటంలో ఆశ్చర్యం లేదు, అని అర్థం. ఈశ్వరుడు జ్ఞానరూపి కనుక జ్ఞానము సత్యము, సత్పదార్థము. విశ్వము అవిద్యాజ్ఞానమయము కనుక అసత్పదార్థము. జ్ఞానమున్నచోట అజ్ఞానముండటం ఆశ్చర్యకరం. కాని ఈ అజ్ఞానగర్భంలోనే జ్ఞానమున్నది కనుక విశ్వంలో రెండున్నూ ఒకేచోట ఏకకాలంలో ఉన్నట్లే అయినది. ఉన్నదేది? లేనిదేది? అంటే, ఉన్నదానికే గదా లేకపోవటం సాధ్యం! కనుక లేనితనం ఉండటంలోనూ, ఉన్నతనం లేనిదానిలోనూ బౌద్ధికసత్యాలుగా భాసించేవే. అసలు 'ఉన్నది' అని గ్రహించటం జ్ఞానం అన్నట్లే 'లేదు' అని గ్రహించటం కూడ జ్ఞానమే. ప్రజ్ఞానం బ్రహ్మ, అజ్ఞానం బ్రహ్మ, అనటం అందుకే. ఇట్లే, సృష్టి స్రష్టలకభేదం చెప్పబడింది. సృష్టి ఈశ్వరయుక్తమే. ఈశ్వరుడు విశ్వయుక్తుడే. వైరుధ్యం లేదు.

**శ్లో॥ త్వత్ప్రాణితాః స్ఫురన్తీమే గుణా లోష్టోపమా అపి ।**
**నృత్యన్తి పవనోద్ధూతాః కార్పాసపిచవో యథా ॥ 18**

**శ్లో॥ యది నాథ! గుణేష్వాత్మాభిమానో న భవేత్తతః ।**
**కేన హీయేత జగతస్త్వదేకాత్మతయా ప్రథా ॥ 19**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, యథా = ఏ ప్రకారముగా, కార్పాసపిచవః = దూది పింజలు, పవన = గాలిచే, ఉద్ధూతాః = ఎగురగొట్టబడినవై, నృత్యన్తి = నాట్యము చేయుచున్నవో, లోష్ట = మట్టితో, ఉపమాః అపి = పోల్చదగినవి అయినను, ఇమే = ఈ, గుణాః = గుణములు, త్వత్ = నీచేత, ప్రాణితాః = ప్రాణము పూరింపబడినవై, స్ఫురన్తి = ప్రకాశించుచున్నవి. గుణేషు = గుణములలో, ఆత్మ + అభిమానః = తనయందు తనకభిమానము, యది న భవేత్ = కలుగనట్లైన, తతః = దానివలన, జగతః = విశ్వమునకు, త్వద్ = నీయొక్క, ఏక + ఆత్మతయా = అభేదత్వమువలన, ప్రథా = ఉనికి, కేన = ఎవనిచే, దేనిచే, హీయేత = వదలబడుట కలుగును?

**తాత్పర్యము :** ఓ స్వామీ! ప్రాణులలో అభివ్యక్తమయ్యే ఈ గుణాలు, వాని ఇంద్రియ ప్రవృత్తులు, అన్నీ నీ శక్తితోనే నడుస్తూ ఉన్నవి. అయినప్పటికి, దేనికదే తన ఉనికిని చాటుకుంటూన్నవి. ఇవి నిజానికి దూదిపింజలవంటివి. గాలికెగురుతూ గాలి విసురును బట్టి కదులుతూ దూదిపింజలు తామే నాట్యం చేస్తూన్నామని భావించటం వంటిదే ఇది. ఈ గుణాభిమానమే భేదబుద్ధికి కారణమైతే, ఈ భేదబుద్ధిని విడవటానికి కారణం ఆత్మాభిమానమే కదా. కాక మరేది? విశ్వాత్మవు నీవేకాగా, విశ్వమును నడిపించు ఆత్మాభిమానము నీదే కదా? కనుక అభేదత్వజ్ఞానానికి గూడ ఆధారం ఈ ఆత్మాభిమానమే. ఆత్మస్వరూపం తెలియనంతవరకు ఇది ఇంద్రియ గుణాభిమానం, తెలిసిన తరువాత అదే ఆత్మయైన శివాభిమానం అవుతుంది.

**శ్లో॥ వంద్యాస్తేఽపి మహీయాంసః ప్రలయోపగతా అపి ।**
**త్వత్కోపపావకస్పర్శపూతా యే పరమేశ్వర! ॥ 20**

**ప్రతిపదార్థము :** పరమేశ్వర! = ఓ పరమేశ్వరా!, తే అపి = వారు కూడ, మహీయాంసః = మహిమాన్వితులే, వంద్యాః = పూజనీయులే, యే = ఎవరు, ప్రలయ = నాశమును, ఉపగతాః అపి = పొందినవారైనను, త్వత్ = నీయొక్క, కోప = కోపము అను, పావక = అగ్నియొక్క, స్పర్శ = స్పర్శచే, పూతాః = పవిత్రులైనవారో.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా నీ కోపాగ్నిలో ఆహుతియైనవారు కూడా, నశించినవారే ఐనను, పూజనీయులే, గొప్పవారే. ఏలన, వారిలోని శివేతరభావములన్నియు శివునిచే దహింపబడినవి కాగా, వారు పునీతులైనారు.

శివుని కోపాగ్నిలో భస్మమైనవారు దేవదానవులలో ఉన్నారు. అట్టివారిలో మహాకాలుడు, త్రిపురాసురుడు, అంధకాసురుడు మొదలైన దానవులేకాదు, మన్మథుని వంటి దేవతలూ ఉన్నారు. వీరిలోని శివప్రతీపభావాలూ చేష్టలూ వీరిని లోకకంటకులుగా చేసినవి. వీరిని శివుడు సంహరించినాడు, అంటే, వీరి దానవత్వాన్ని హరించినాడు, శివత్వాన్ని ప్రతిష్ఠించినాడు. **పావక** శబ్దప్రయోగం సాభిప్రాయం. దాని అర్థం, పవిత్రీకరించునది, అని. శివజ్ఞానాగ్నికి పవిత్రీకరణం సహజోక్తి. కాగా శివుడు భక్తులను మాత్రమే అనుగ్రహించి తదన్యులనుపేక్షించువాడు కాడని, దైవద్వేషులను కూడ అనుగ్రహించునని కవి హృదయం. ఆ భావంతోనే **తే అపి,** వారు కూడ, అనటం.

**శ్లో॥ మహాప్రకాశవపుషి విస్పష్టే భవతి స్థితే ।**
**సర్వతోఽపీశ తత్కస్మాత్తమసి ప్రసరామ్యహమ్ ॥ 21**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ ఈశ్వరా!, భవతి = తమదైన, మహాప్రకాశవపుషి = గొప్ప ప్రకాశముగల శరీరమునందు, సర్వతః = పూర్తిగా, విస్పష్టే = వ్యక్తమైన, స్థితే అపి = స్థితిలో కూడ, అహమ్ = నేను, తత్ కస్మాత్ = అదెందుచేత, తమసి = చీకటిలో, ప్రసరామి = ద్రిమ్మరుచుందును?

**తాత్పర్యము :** ఓ ఈశ్వరా! తమ శరీరము తేజోవంతము. దీనిలో పూర్తిగా వ్యక్తమైన విశ్వంలో మాత్రం నేను చీకటిలో ఎందుకు తిరుగుతాను!?

ఈ విశ్వం ఈశ్వరుని వ్యక్తశరీరం. ఇది కూడ తేజోమయమే. కనుక చీకటిలో సంచరించనక్కఱలేదు. ఇది భౌతికమైన చీకటి కాదు. తమోగుణజనితమైన జడత్వం, అవిద్య.

**శ్లో॥ అవిభాగో భవానేవ స్వరూపమమృతం మమ ।**
**తథాపి మర్త్యధర్మాణామహమేవైకమాస్పదమ్ ॥ 22**

**ప్రతిపదార్థము :** భవాన్ = తమరు, అవిభాగః ఏవ = విభజింపబడకుండగనే, అద్వైతరూపుడుగనే, మమ = నాయొక్క, అమృతం స్వరూపమ్ = అమృతమయ స్వరూపము, తథాపి = అయినప్పటికిన్ని, అహమ్ = నేను, మర్త్య = మానవులైన, ధర్మాణాం ఏవ = లక్షణములకే, ఏకమ్ = పూర్తిగా, ఆస్పదమ్ = స్థానము, నెలవు.

**తాత్పర్యము :** స్వామీ! తమరు ద్వయరూపమును ధరించకుండగనే, నాదైన అమృతమయమైన స్వస్వరూపమైయున్నారు. అయినను, నేను మర్త్యధర్మాలను పూర్తిగా పుణికిపుచ్చుకున్నాను.

**మర్త్యధర్మాలు** జనన–మరణాదులు, సుఖదుఃఖాది ద్వంద్వానుభవం ఇదంతా నాలోని అహంకారసంబంధమైన ధర్మాలు. కాని నా అసలు స్వరూపం శివస్వరూపం, అది అవిభక్తం, పూర్ణం, మృత్యుంజయం, మానుషాతీతం, అద్వైతానందఘనం. **అహం** అన్నది దీనికి భిన్నము. ఇది ప్రాకృతికం, పాశవం. దీనికే మర్త్యధర్మాలు తప్ప జీవుని స్వస్వరూపానికి కాదు.

**శ్లో॥ మహేశ్వరేతి యస్యాస్తి నామకం వాగ్విభూషణమ్ ।**
**ప్రణామాంకశ్చ శిరసి స ఏవైకః ప్రభావితః ॥ 23**

**ప్రతిపదార్థము :** మహేశ్వర = మహేశ్వర, ఇతి = అను, నామకమ్ = పేరు, యస్య = ఎవనియొక్క, వాక్ = వాక్కునకు, విభూషణమ్ = అలంకారము, అస్తి = అగుచున్నదో,

చ = మరియు, శిరసి = శిరస్సునందు, ప్రణామ = నమస్సుయొక్క, అంకః = గుర్తు, చిహ్నమో, సః = ఆతడు, ఏకః ఏవ = ఒక్కడు మాత్రమే, ప్రభావితః = ప్రభావము గలవాడు.

**తాత్పర్యము :** ఎవడు 'మహేశ్వర' అను నామాన్ని పలుకుతూంటాడో, ఎవడు శిరసున చేతులుంచి నమస్కరించుతూంటాడో, ఆతడు మాత్రమే ప్రభావితుడు, మహిమగలవాడు, స్వామియొక్క తేజఃస్పర్శను పొందినవాడు.

**మహేశ్వర** అన్నది బ్రహ్మాదిదేవతలకు, విశ్వానికీ ఈశ్వరుడన్న భావం. **ప్రభావితః** అనుదానికి, ప్రభౌ = ప్రభువునందు, ఇతః = సంబద్ధమైనవాడు, అని అర్థం చేయవచ్చు. అంటే ప్రభువునందు ఆనందమగ్నుడని భావం. లేక **ప్రభావః** శబ్దరూపంగానూ భావించవచ్చు. అప్పుడు ఆ ప్రభువుయొక్క ప్రభ = తేజస్సును పొందినవాడని అర్థం.

**శ్లో॥ సదసచ్చ భవానేవ యేన తేనాప్రయాసతః ।**
**స్వరసేనైవ భగవంస్తథా సిద్ధిః కథం న మే ॥ 24**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ భగవాన్!, యేన = ఎందుచేత, సత్ = సత్యమైనది, అసత్ చ = అసత్యమైనదిగూడ, భవాన్ ఏవ = తమరే అయియున్నారో, తేన = అందుచేత, తథా = అట్లు, సిద్ధిః = సిద్ధి, మే = నాకు, అప్రయాసతః = అనాయాసముగా, స్వరసేన ఏవ = తనంత తానుగనే, కథమ్ = ఎందుకు, న = కాదు.

**తాత్పర్యము :** సత్పదార్థము, అసత్పదార్థము, ఉండుట, లేకుండుట అను ఈ విశ్వము నీవే అయిన కారణం చేత, నాకు యే శ్రమగాని ప్రయత్నంగాని లేకుండగనే తనంత తానే సిద్ధి లభించవలెగదా? అట్లా ఎందుకు లభించదు?

విశ్వమూ విశ్వనాథుడూ ఒక్కరే. విశ్వనాథుని అభివ్యక్తియే సృష్టి. సత్ యొక్క అభివ్యక్తియే అసత్. ఈ రెండున్నూ ఒకటే కనుక విశ్వంలో భాగమైన నాకు విశ్వేశ్వర సాక్షాత్కారం సహజసిద్ధం కావలె గదా, ఎందుకు కాదు? అన్నది ప్రశ్న. **సత్** = ఉనికి, యథార్థము. ఈ స్వభావం కలిగినదే సత్యం. **అసత్** దీనికి విరుద్ధమైన లక్షణం గలది. అంటే, ఉండి లేకపోయేది, లేకున్నా ఉన్నట్లుండేది. తాత్త్వికార్థంలో నేమో సత్ అనదగినది పరమాత్మ, విశ్వం **అసత్.** అనుభవార్థంలో చెట్లూ కొండలూ మబ్బులూ, పూలూ, అన్నీ సత్పదార్థములే. అసత్పదార్థం అన్నది ఆకాశపుష్పం వలె లేకున్నా ఉన్నట్లు భావింపబడే పదార్థాలు. ఇక్కడ **ప్రయాస** శబ్దం పూజాజపధ్యానాది సాధనలన్న అర్థంలో ప్రయోగింప బడింది. వీటన్నిటికి లక్ష్యం ఈశ్వరసాక్షాత్కారం. అదే **సిద్ధి.**

శ్లో॥ శివదాసః శివైకాత్మా కిం యన్నాసాదయేత్సుఖమ్ ।
తర్ప్యోఽస్మి దేవముఖ్యానామపి యేనామృతాసవైః ॥ 25

**ప్రతిపదార్థము :** శివ + ఏక + ఆత్మా = శివుని మాత్రమే ఆత్మయందు ప్రతిష్ఠించికొన్న, శివదాసః = శివభక్తుడు, న ఆసాదయేత్ = పొందలేని, సుఖమ్ = సుఖము, యత్ = ఏదియో, (తత్ = అది), కిమ్ = ఏది?, ఎట్టిది?, యేన = దేనిచేత, దేవముఖ్యానాం అపి = దేవతలలో ముఖ్యులకుగూడ, అమృత + ఆసవైః = అమృతపానీయములతో, తర్ప్యః = తృప్తిపరుపదగినవాడను, అస్మి = అగుచున్నాను.

**తాత్పర్యము :** శివభక్తుడు తన ఆత్మయందు శివుని మాత్రమే దర్శించువాడు కదా, ఆతడు పొందలేని సుఖమేమున్నది? ఆ శివభక్తి కారణంగానే కదా, దేవతలలో ముఖ్యులు గూడ వాని అమృతపానార్హతను గుర్తించి గౌరవిస్తున్నారు.

శివదర్శనం సాక్షాత్ పరమానందానుభవమే, శివుడు సుఖస్వరూపి కనుక, ఆ సుఖంతో పోల్చిచూస్తే, మిగత సుఖాలు, అమరసుఖాలు సైతం తక్కువే. అందుచేతే దేవతలు గూడ శివభక్తుని గౌరవిస్తారు. దేవతలు స్వయంగా అన్యులచేత తర్పణీయులు, తృప్తిపరచదగినవారు. వారికి గూడ శివభక్తుడు తర్పణీయుడవుతూన్నాడు కాబట్టి వారు ఆతనికి అమృతపానానికి అర్హత నిచ్చి గౌరవిస్తున్నారు. ఇదిగాక, మానవదేహంలోని ఇంద్రియాలకు అధిష్ఠాతలుగా ఉన్న దేవతలుగూడ, శివభక్తుని ఆత్మలో ప్రతిష్ఠితుడైన శివుని దర్శనంలో పరమానందాన్ని అనుభవిస్తూ, అంతటి భాగ్యాన్ని తమకు కలిగించిన ఆ శివదాసుడు పశుభావంలో తమను సేవించేవాడు కాడనీ, పశుపతిభావంలో తాము సేవించదగినవాడని తెలిసి తమ పాశభావాన్ని వీడి అమృతత్వాన్ని పొందుతాయి సుమా!

శ్లో॥ హృన్నాభ్యోరన్తరాలస్థః ప్రాణినాం పిత్తవిగ్రహః ।
గ్రససే త్వం మహావహ్నిః సర్వం స్థావరజంగమమ్ ॥ 26

**ప్రతిపదార్థము :** ప్రాణినామ్ = ప్రాణులయొక్క, హృత్ నాభ్యోః = హృదయము నాభి, ఈ రెండిటియొక్క, అన్తరాలస్థః = మధ్యగలవాడవగు, పిత్తవిగ్రహః = జఠరాగ్ని స్వరూపుడవు, మహావహ్నిః = మహాగ్నివి, త్వమ్ = నీవు, సర్వమ్ = సమస్తమైన, స్థావరజంగమమ్ = జడచేతనమయజగత్తును, గ్రససే = భక్షింతువు.

**తాత్పర్యము :** నీవు ప్రాణుల హృదయ నాభిస్థానముల మధ్య గర్భస్థానంలో జఠరాగ్ని రూపంలో ఉన్న మహాగ్నిస్వరూపుడవు. ఈ మహాగ్నిరూపంలో ఈ చరాచరజగత్తును నీవు భక్షింతువు.

ఇక్కడ హరుని భక్షణ రక్షణ శక్తిగా, ఏకమూర్తియైన అగ్నిగా కవి దర్శించినాడు. రక్షకశక్తిగా, ప్రాణుల దేహంలో గర్భస్థుడై, **అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః** అన్న గీతావాక్యాన్ననుసరించి ప్రాణులకు శక్తినిచ్చే అన్నాన్ని జీర్ణం చేసి, శక్తిగా మార్చి, దైనందిన వ్యవహారంలో ప్రాణులు నష్టపోయిన శక్తిని సమకూర్చే విధిని నిర్వహిస్తూంటాడు. ఈ హరణశక్తితోనే ప్రలయాగ్నిగా విజృంభించి విశ్వాన్ని నామరూపాలు హరించి తనలో కలుపుకుంటాడు. అగ్నిరూపం శివుని అష్టమూర్తులలో ఒకటి.



**శ్రీః**

# 11. ఔత్సుక్య విశ్వసితం స్తోత్రమ్

**శ్లో ॥ జగదిదమథవా సుహృదో - బంధుజనో వా న భవతి మమ ।**
**కామపి త్వం పునరేతత్సర్వం - యదా తదా కోఽపరో మేఽస్తు ॥ 1**

**ప్రతిపదార్థము :** ఇదం జగత్ = ఈ జగత్తు, అథవా = కాదేని, సుహృదః = మిత్రులు, వా = లేక, బంధుజనః = బంధువులు, మమ = నాకు, కామపి = ఏమియు, న భవతి = కానివారు. యదా = ఎప్పుడు, పునః = మరల, త్వమ్ = నీవు, మే = నాకు, ఏతత్ సర్వమ్ = ఇదంతయు, తదా = అప్పుడు, అపరః = పరాయివాడు, కః = ఎవడు ?

**తాత్పర్యము :** ఈ ప్రపంచము, స్నేహితులు, బంధువులు నాకేమీ కారు. కాని నీ వెప్పుడు నాకు ఈ సర్వస్వం అవుతావో అప్పుడు నా కింక పరాయివారు అనే వారెవరూ ఉండరు.

బహునామరూపాంకితమైన ప్రపంచంలో నిజానికి వ్యక్తికి తాను తప్ప తనవారెవరూ ఉండరు, తనకు తనతో సమానంగా భాసించే వారుండరు. తాను మాత్రమే తనవాడు, మిగతవారందఱూ యేదో నిమిత్తంగా దగ్గరైనవారే. జన్మనిమిత్తంగా తల్లి, తండ్రి, అక్క, చెల్లి, అన్న, తమ్ముడు, మామ, అత్త; వివాహనిమిత్తంగా భార్య, అత్త, మామ, వదినె, మఱది, మఱదలు, కూతురు, కొడుకు, మనుమలు; విద్య నిమిత్తంగా గురువు, సహాధ్యాయి; ఉద్యోగం నిమిత్తంగా పై అధికారి, సహోద్యోగులు;... ఇదే, ఇలాంటివే బంధాలు. ఇన్ని బంధాలు అనగానే తాను వేరు, వీరు తనకున్న బంధాలు,

పోనీ బంధువులు, అన్నట్లయింది. వీరి నిమిత్తంగా నాకొక సంతోషం కలిగితే, దాని వెంటనే ఒక దుఃఖం సిద్ధం. అట్లా కానిది ఈశ్వరుడొక్కడే. యే నిమిత్తం లేకుండానే వ్యక్తిలోని వ్యక్తి తానై భాసించేవాడు ఆతడొక్కడే. ఆతడు తనకు లభిస్తే, ఈ నిమిత్తబంధువులంతా తనకున్నట్లే. సత్యం శివుడే. ఉన్నవాడొక్కడే. వీరంతా వాని ఛాయలే.

**శ్లో ॥ స్వామిన్మహేశ్వరస్త్వం సాక్షాత్సర్వం జగత్త్వమేవేతి ।**
**వస్త్వేవ సిద్ధిమేత్వితి యాచ్ఞా తత్రాపి యాచ్ఞైవ ॥ 2**

**ప్రతిపదార్థము :** స్వామిన్ = ఓ స్వామీ!, త్వమ్ = నీవు, మహేశ్వరః = మహేశ్వరుడవు, సర్వం జగత్ = జగత్తంతయు, సాక్షాత్ = ప్రత్యక్షరూపమున, త్వం + ఏవ = నీవే, ఇతి = అని, వస్తు ఏవ = వస్తువే, సిద్ధిం ఏతు = సిద్ధిని పొందగల్గును, ఇతి = అని, యాచ్ఞా = ప్రార్థన, యాచన, తత్ర అపి = ఆ దశలోనైనను, యాచ్ఞా ఏవ = యాచనయే.

**తాత్పర్యము :** స్వామీ! తమరు సిద్ధుల నన్నింటిని ప్రసాదించగలవారు. లోకంలో మీ సాన్నిధ్యం ఉండనే ఉన్నది. కనుక సహజంగానే నాకు లౌకికవస్తుజాలాన్ని గురించి మిమ్ము యాచింపబనిలేదు. అన్నీ వాటంతట అవే అమరుతవి.

**సాక్షాత్, అక్షిణోః సమం,** అంటే కన్నుల కెదురుగా ఉన్న ఈ జగత్తు అంతా వ్యక్తమైన శివస్వరూపం. శివుడు మహేశ్వరుడు, అనగా మహత్తుకు ఈశ్వరుడు, అధికారి. ఈ విధంగా యాచనకు తావులేదు. ఇక శివభక్తుడుగా అద్వయదృష్టితో చూచినప్పటికి, భక్తుడు శివునే సర్వత్ర దర్శిస్తూన్నాడు కనుక, ఇక యాచనకు అవకాశమే లేదు. ప్రకృతిరూపంలో ప్రాకృతిక వస్తుబాహుళ్యంలో యేది కోరినా, ప్రత్యేకం యాచన అక్కరలేకుండగనే సమస్తవస్తుసిద్ధి ఉన్నది. పురుషరూపంలో భక్తునకు సర్వత్ర శివుడే సత్యస్వరూపంతో గోచరిస్తూన్నాడు కనుక ఇక యాచించవలసినది లేదు. ఉభయత్ర యాచన నిరర్థకమైనదే.

**శ్లో ॥ త్రిభువనాధిపతిత్వమపీహ యత్ - తృణమివ ప్రతిభాతి భవజ్జుషః ।**
**కిమివ తస్య ఫలం శుభకర్మణో - భవతి నాథ! భవత్ స్మరణాదృతే ॥ 3**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, ఇహ = ఈ లోకంలో, యత్ = ఏ, త్రిభువన = మూడులోకముల, అధిపతిత్వం + అపి = అధికారమైనను, భవత్ = తమ యొక్క, జుషః = భక్తులకు, తృణం ఇవ = గడ్డిపరక వలె, ప్రతిభాతి = తోచునో, తస్య = వానియొక్క, శుభకర్మణః = శుభకర్మకు, భవత్ = మీ యొక్క, స్మరణాత్ ఋతే = స్మరణ లేనిచో, ఫలమ్ = ఫలము, కిం + ఇవ = ఎట్లు, ఏ విధముగా, భవతి = కలుగును ?

**తాత్పర్యము :** ఓ స్వామీ!, మీ భక్తులలో ఎవరికి త్రిలోకాధిపత్యమైనను తృణప్రాయమో, వారు చేయు శుభకర్మలు మీ స్మరణ లేనిదే ఫలవంతము కావు. అనగా, నిరంతరం మీ స్మరణలో పరవశించే వారికి అంతకు మించిన శుభఫలాన్నివ్వగల కర్మలేమున్నవి? పొందదగినవాడవు నీవు. నిన్ను పొందిన వారికింక పొందవలసిన శుభములేమున్నవి?

భూలోక, భువర్లోక, స్వర్లోకాలు త్రిభువనాలు. ఇవన్నీ భోగలోకాలే. ఇవి ఆనందానికి కాణాచియైనవి. కాని యీ ఆనందాలు శివభక్తి పారవశ్యంతో సమానం కావు. కనుక వానికోసం శివభక్తి లక్షితం కాదు. శివమనస్కతను మించిన శుభకర్మ మరొకటి లేదు. శివమనస్కత లేనివాని కర్మలు శుభకర్మలు కావు. కనుక సదా శివమనస్కులైన భక్తులు ఆచరించదగిన శుభ కర్మలంటూ యేవీ లేవు.

**శ్లో ॥ యేన నైవ భవతోఽస్తి విభిన్నం – కించనాపి జగతాం ప్రభవశ్చ ।**
**త్వద్విజృంభితమతోఽద్భుతకర్మ – స్వప్యుదేతి న తవ స్తుతిబంధః ॥ 4**

**ప్రతిపదార్థము :** యేన = దేనిచేత, భవతః = తమకంటె, విభిన్నమ్= వేరైనది, కించన అపి = యేదియైనను, న అస్తి = లేదు, చ = మరియు, జగతామ్ = జగత్తులకు, ప్రభవః = జన్మ స్థానము, త్వద్ = నీయొక్క, విజృంభితం ఏవ = విస్తరణమే, అతః = అందువలన, తవ = నీయొక్క, అద్భుతకర్మసు = అద్భుతమైన కర్మలయందు, అపి = కూడ, స్తుతిబంధః = స్తుతించుటయను బంధము, న ఉదేతి = కలుగదు.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! తమకంటె భిన్నమైనది, తమరు కానిది, వేరేదియూ లేదు. అట్లే విశ్వము తమ విస్తారమే, తమ నుండి జన్మించినదే. కనుక సృష్టి స్థితిలయాది అద్భుతకర్మలు కూడ తమవే. ఐనను భిన్నత్వము కలుగదు.

సృష్టి – స్రష్ట – భర్త – హర్త ఇది లోకానుభవసత్యం. సృష్టిలో బహుళత్వమే అంతటా కనిపిస్తుంది. కాని యీ సృష్టి దానిని సాకారం చేసిన బ్రహ్మయొక్క ఉపబృంహణం అంటాము. అంటే బ్రహ్మయొక్క వ్యాప్తి. దీనిని విష్ణువు కాపాడి వృద్ధి పొందిస్తాడంటాము. ఆపై రుద్రుడు దీనిని హరిస్తాడంటాము. త్రిమూర్తులనిట్లా నామరూప భేదాలతో స్తుతించటం పరిపాటి. కాని ఇదంతా నిజానికి అద్వయమే. సృష్టి – స్రష్ట రెండులేవు. స్రష్టయే సృష్టి. కనుక స్తోత్రము, స్తుత్యము, స్తుతిక్రియ అంటూ వేరుగా లేదు. అట్లే, స్తోత, స్తోత్రము, స్తుత్యము అంటూ మూడు లేవు. సమస్తం ఈశ్వరుడే.

**శ్లో ॥ త్వన్మయోఽస్మి భవదర్చననిష్ఠః – సర్వదాహమితి చాప్యవిరామమ్ ।**
**భావయన్నపి విభో! స్వరసేన – స్వప్నగోఽపి న తథా కిమివ స్యామ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** విభో! = ఈశ్వరా!, అహమ్ = నేను, సర్వదా = ఎల్లవేళల, భవత్ = మీ యొక్క, అర్చన = పూజచేయుటలో, నిష్ఠః = నిమగ్నుడనైయుండువాడను, చ = మరియు, త్వద్ + మయః = మిమ్మేనాలో నింపికొనియున్నవాడనై, అస్మి = ఉన్నాను, ఇతి = అని, అవిరామం అపి = ఎల్లప్పుడు, ఎడలేక, భావయన్ అపి = భావించుచుండికూడ, స్వప్నగః అపి = స్వప్నావస్థలోనికి ప్రవేశించి గూడ, స్వరసేన = నాయంత నేనుగా, తథా = ఆరీతి, కిం ఇవ = ఎందువలన, న స్యామ్ = కాకపోవుదును?

**తాత్పర్యము :** ఈశ్వరా! ఎప్పుడూ మీ అర్చనలోనే లీనమై ఉన్నాను, పైగా, నాలో మిమ్మే నింపికొని ఉన్నాను, అని ఈ విధంగా నిరంతరం భావిస్తూఉన్నాను. కాని స్వప్నావస్థలో కూడా అందుకు తగినట్లు ఉండటం లేదు. ఇందుకు కారణమేమిటి?

శరీర వ్యాపారం మనస్సునూ మనః స్థితి శరీరాన్నీ ప్రభావితం చేస్తాయి, అంటారు కదా, మరి నా విషయంలో భిన్నంగా ఎందుకున్నది!? నా శరీరం ఎప్పుడూ శివార్చనలోనే ప్రవర్తిస్తూన్నది. నా మనస్సు నిండా శివుని నామరూపాలే ఉన్నాయి. అలా కాని సమయం అసలు లేనే లేదు. ఈ కారణం వలన, జాగ్రదావస్థలో నామనస్సంతా దేనితో నిండిపోయిందో అదే నాకు స్వప్నానుభవం కూడా కావాలి కదా సహజంగా, అప్రయత్నంగా, మరి, ఆ భ్రమరకీటన్యాయం నా యెడ ఎందుకు వర్తించటం లేదు? అప్రయత్నంగా నా మనస్సు శివునిలో లగ్నం కాదెందుచేత?! కలలో కూడా (స్వప్నగోఽపి) అనటం వలన, శరీరం శివపూజలో ఉన్నా, మనస్సు శివపరంగా ఉన్నా, శివానుభవం కలగక పోవటానికి కారణం, అట్లా ఉన్నానన్నది కేవలం తన భావనేనా? నిజం కాదా? నిజమైతే, ఇతి అవిరామ మపి భావయన్ అన్నదాని కన్వయమెక్కడ?

**శ్లో ॥ యే మనాగపి భవచ్చరణాబ్జో - ద్భూతసౌరభలవేన విమృష్టాః ।**
**తేషు విస్రమివ భాతి సమస్తం - భోగజాతమమరైరపి మృగ్యమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** యే = ఎవరు, భవత్ = నీయొక్క, చరణ = పాదములు అను, అబ్జ = పద్మముల నుండి, ఉద్భూత = వెలువడిన, సౌరభ = సుగంధము యొక్క, లవేన = అల్పము చేతనే, మనాక్ = కొంచెము, అపి = అయినను, విమృష్టాః = విశేషమగు ఆనందమునొందినవారో, తేషు = వారియందు, అమరైః అపి = దేవతల చేతనైనను, మృగ్యమ్ = వెదుకబడదగిన, కోరదగిన, సమస్తం భోగజాతమ్ = భోగములుఅన్నియు, విస్రం ఇవ = దుర్గంధము వలె, భాతి = తోచును.

**తాత్పర్యము :** నీ పాదపద్మ సుగంధము యే భక్తునకు కొంచెమైన విశేషానందమునిచ్చునో వారికి అమరలోకభోగాలన్నీ దుర్గంధముగా తోస్తాయి.

భక్తులు శివపాద పూజ నిరంతరం చేయవచ్చును, కాని యే కొందరికో మాత్రమే శివ పాదాశ్రయంలోని విశేషానందం, అలౌకికానుభవంగా లభిస్తుంది. ఈ పరమానందం ఒకసారి యే కొద్దికాలమో లభించినప్పటికీ, అదే చాలు. స్వర్గభోగాలు దుర్గంధంగా తోస్తాయి.

స్వర్గం భోగభూమి. దాని రాజు ఇంద్రుడు. ఆతడు ఇంద్రియాలకధిష్ఠాన దేవత, కనుక స్వర్గభోగాలు కేవలం ఇంద్రియ సుఖాలు మాత్రమే. వీని లక్షణం, వానిని అనుభవించినంతకాలం అంతకంటె ఆనందమేమి? అనిపించటం, అంతలోనే జారిపోయి దుఃఖాన్ని మిగల్చటం. కాని శివదర్శన స్పర్శనానందం ఆత్మానందం. ఇంద్రియాశ్రయం కాదు. కనుక ఒక్కసారి క్షణకాలం లభించినాచాలు. నిజానికి దేవతలు కూడా ఇంద్రియ సుఖాలలో ఈ శివ చైతన్యానందాన్నే వెదుక్కుంటూ ఉంటారు.

**శ్లో ॥ హృది తే న తు విద్యతేఽన్యదన్య - ద్వచనే కర్మణి చాన్యదేవ శంభో! ।**
**పరమార్థసతోఽప్యనుగ్రహో వా - యది వా నిగ్రహ ఏక ఏవ కార్యః ॥ 7**

**ప్రతిపదార్థము :** శంభో! = ఓ మహాదేవ!, తే = నీ యొక్క, హృది = మనస్సులో, అన్యత్ = ఒక్కటి, వచనే = వాక్కునందు, అన్యత్ చ = మరియొకటి, కర్మణి = చేష్టలయందు, అన్యత్ ఏవ = వేరొకటియు, విద్యతే = అయియున్నావు, తు = కాని, న అస్తి = అయియుండటంలేదు, పరమార్థసతః అపి = పరమార్థమందాసక్తి గల సత్పురుషుల పై గూడ, అనుగ్రహః వా = దయగాని, యది వా = లేక, నిగ్రహః = కోపము, ఏకః ఏవ = ఒక్కటే, కార్యః = చేయదగినది.

**తాత్పర్యము :** ఓ దేవా! నీవు మనోవాక్కర్మలను మూడిటిలోనూ మూడుగ ఉన్నావు, కాని ఆ రీతిగా లేవు. పరమార్థాసక్తి గల భక్తులయందు అనుగ్రహమో లేక నిగ్రహమో ఉండదగిన వైఖరి ఒక్కటే కదా.

శివుడు సృష్టిలోని సమస్త వస్తువులలో గుప్తాత్మగా ప్రవర్తించే సమయంలో మనోవాక్కర్మలలో భిన్నంగా మూటికి మూడుగా కన్పిస్తాడు. కాని అద్వయజ్ఞానవ్యాపిగా మాత్రం హృదయంనుండి హక్కు కర్మలందు గూడ వ్యాపించియుంటాడు. నిగ్రహానుగ్రహ ద్వంద్వం ప్రకృతి సంబంధి. ఎవరియందైన నిగ్రమో అనుగ్రహమో ఒక్కటే ఉండటం సహజం. కాని చిదద్వయరూపంలో నిగ్రహానుగ్రహాలు రెండుగా ఉండవు.

**శ్లో ॥ మూఢోఽస్మి దుఃఖకలితోఽస్మి జరాదిదోష -**
**భీతోఽస్మి శక్తిరహితోఽస్మి తవాశ్రితోఽస్మి ।**
**శంభో! తథా కలయ శీఘ్రముపైమి యేన**
**సర్వోత్తమాం ధురమపోజ్ఝితదుఃఖమార్గః ॥ 8**

**ప్రతిపదార్థము :** శంభో! = ఓ మహేశ్వరా! మూఢః = మూర్ఖుడను, అస్మి = అయియున్నాను, దుఃఖ = దుఃఖమున, కలితః = చిక్కినవాడను, అస్మి = అయియున్నాను, జరా = ముసలితనము, ఆది = మొదలైన, దోష = దోషములకు, భీతః = భయపడినవాడను, అస్మి = అయియున్నాను, శక్తిరహితః = శక్తి, సామర్థ్యము లేనివాడను, అస్మి = అయియున్నాను, తవ = నీకు, ఆశ్రితః = ఆశ్రయించినవాడను, అస్మి = అయియున్నాను, తథా = ఆ విధముగా, కలయ = చేయుము, యేన = దేనిచే, అప + ఉజ్ఝిత = వదలిపెట్టబడిన, దుఃఖమార్గః = దుఃఖము కలిగించు మార్గము గలవాడనై, సర్వోత్తమామ్ = అన్నిటికంటె అధికమైన, ధురమ్ = స్థానమును, శీఘ్రమ్ = వెంటనే, ఉప + ఏమి = పొందగలుగుదునో.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నేను మూఢుడను, దుఃఖితుడను, వార్ధక్యాది దోషభీతుడను, అసమర్థుడను, నీ ఆశ్రితుడను, కనుక నేను దుఃఖమార్గమును వదలి, ఉత్తమస్థానమును వెంటనే పొందుటెట్లో అందుకు తగిన ఉపాయము చేయుము.

వివేకించకుండా తనకు తోచిన మార్గాన గాని ఒరులు చూపిన మార్గానగాని పోయేవాడు మూఢుడు. మానవులందఱూ ఇట్టివారే. కారణం, జీవితంలో యేదీ సుఖంగా లభించదు. కష్టించి పొందక తప్పదు, లేదా ఆత్మలేనట్లు వంచనతో పొందవలసిందే. ఎట్లాగైనా జీవన మార్గం కష్టసాధ్యమే, దుఃఖాకరమే. దీనికి తోడు వార్ధకం, రోగం, మరణం ఇవి భయపెడుతూంటాయి. ముందూ వెనుకా కానరాదు. గంతలుగట్టిన గుఱ్ఱం వలె సాగాలి. ఇంక సామర్థ్యం ఎక్కడా?! అందుకే శరణాగతి. నీ కృపతో మాత్రమే నాకు ఉత్తమస్థానం లభించవలె. మార్గాంతరం లేదు. అందుకే ప్రార్థన.

**శ్లో ॥ త్వత్కర్ణదేశమధిశయ్య మహార్ఘభావ -**
**మాక్రందితాని మమ తుచ్ఛతరాణి యాన్తి ।**
**వంశాన్తరాలపతితాని జలైకదేశ -**
**ఖండాని మౌక్తికమణిత్వమివోద్వహన్తి ॥ 9**

**ప్రతిపదార్థము :** మమ = నాయొక్క, తుచ్ఛతరాణి = అతి నీచములైన, ఆక్రందితాని =

జాలిగొలిపే పిలుపులు, త్వత్ = నీయొక్క, కర్ణదేశమ్ = చెవులను, అధిశయ్య = చేరినంతనే, మహా + అర్ఘభావమ్ = గొప్ప గౌరవమును, యాన్తి = పొందుచున్నది, ఇవ = వలె, జల = నీటియొక్క, ఏకదేశఖండాని = చిన్న చిన్న బిందువై, వంశ = వెదురు యొక్క, అన్తరాల = మధ్య భాగమున, పతితాని = పడినవై, మౌక్తికమణిత్వం = ముత్యముల వలె మణుల రూపమును, ఉద్వహన్తి = ధరించుచున్నవి.

**తాత్పర్యము :** అతినీచములైన నా పిలుపులు నీ చెవిని చేరగనే గొప్ప గౌరవమును పొందినట్లు, చిన్న చిన్న నీటి బిందువులై వెదురు మధ్యభాగమున పడి ముత్తెపు మణులుగా మారుతూన్నవి.

భక్తుడు భగవంతునికై వేదనతో పిలిచే పిలుపులు తుచ్ఛములు కావు. కవి ఉద్ధతుడు కాదు కనుక అట్లా అంటూన్నాడు. భక్తుని పిలుపు వినబడగానే స్వామి కృప లభిస్తుందని తాత్పర్యం. దీని ప్రభావం వర్షబిందువులలో స్వాతినక్షత్రప్రభావంవలె ఉంటుంది. ఆ నక్షత్రంలో పడిన వాన చినుకులు ముత్తెపు చిప్పలో పడినవి ముత్యములు గానూ, వెదురు కణుపుల వద్దకు జారి నిల్చినవి వంశలోచనమణులుగనూ, పాము నోట బడినవి విషముగా మారిపోతాయన్నది కవిసమయం. అట్లే శివుని చెవులలో బడిన భక్తుని ప్రార్థనలు వంశాన్తరాళంలో ఫలిస్తాయి, అనగా, ఆ భక్తుని కుటుంబంలో ఒకడు వంశలోచనుడు (కుటుంబానికి కన్నులాంటివాడు) అనదగినవాడు జన్మిస్తాడని భావం. ఆ కుటుంబంలోని వారందరికి భగవద్దర్శనం చేయించగల మహాత్ముడు జన్మిస్తాడని.

**శ్లో ॥ కిమివ చ లభ్యతే బత! న తైరపి నాథ! జనైః**
**క్షణమపి కైతవాదపి చ యే తవ నామ్ని రతాః ।**
**శిశిరమయూఖశేఖర! తథా కురు యేన మమ**
**క్షతమరణోఽణిమాదికముపైమి యథా విభవమ్ ॥ 10**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, క్షణం అపి = ఒక్కక్షణమైనను, చ = మరియు, కైతవాత్ అపి = మోసమువలననైన = యే = ఎవరు, తవ = నీ యొక్క, నామ్ని = నామమునందు, రతాః = ఆసక్తులో, తైః జనైః అపి = ఆ జనుల చేతనైనను, కిం ఇవ చ = ఏది, బత = ఔరా! న లభ్యతే = లభించదు, శిశిరమయూఖశేఖర! = ఓ చంద్రశేఖర! మమ= నాకు, తథా = ఆ విధముగా, కురు = చేయుము, యేన = దేనిచే, క్షతమరణః = కొట్టబడిన మృత్యువుగలవాడనై, యథావిభవమ్ = వైభవముతో, అణిమా + ఆదికమ్ = అణిమా మొదలగునవానిని, ఉపైమి = పొందగలనో.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎవరైన, ఒక్క క్షణమైన, వంచనబుద్ధితోనైన, నీ నామాన్ని పలికినట్లయితే, వారికి కోరినదంతా లభిస్తుంది. ఓ చంద్రశేఖరా! మృత్యువును జయించి, అణిమాది అష్టైశ్వర్యాలను నేను పొందునట్లు అనుగ్రహించుము.

శివుని తాత్త్విక స్వరూపాన్ని కాక నామరూపాంకితమైన లౌకికరూపాన్ని ధ్యానించినా, అందుకు కారణమేదైనా, ఆతడెట్లాంటివాడైనా అనటంలో వ్యాజభక్తులైన లౌకికులు, తిన్ననివంటి మూఢ భక్తులు వీరందరి గాథలు స్ఫురిస్తూన్నాయి. వారిని వలె నన్నూ కరుణించు, అని భావం. పెద్ద కోరిక ముందుగా కోరినాడితడు, మృత్యుంజయత్వం. తరువాత అష్టసిద్ధులు అంటే, తాను శివాభేదభావాన్ని, అద్వయ భావాన్ని పొందాలని, అట్లా అనుగ్రహించుమని వీని కోరిక. అజ్ఞాని భక్తులకూ, వ్యాజభక్తులకూ, కుహనాభక్తులకూ కూడా లభించే శివానుగ్రహం తనకు లభించటం న్యాయం కదా, తన దేమీ గొంతెమ్మ కోరికకాదు. భక్తికి పరాకాష్ఠయైన స్థితి, భక్తగమ్యము.

**శ్లో ॥ శమ్భో! శర్వ! శశాంకశేఖర! శివ! త్ర్యక్షాక్షమాలాధర!**
**శ్రీమన్నుగ్రకపాలలాంఛన! లసద్భీమత్రిశూలాయుధ! ।**
**కారుణ్యాంబునిధే! త్రిలోకరచనాశీలోగ్రశక్త్యాత్మక!**
**శ్రీకంఠాశు వినాశయాశుభభరానాధత్స్వ సిద్ధిం పరామ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** శంభో = ఓ కల్యాణకారక! శర్వ = ఓ సంతాపదాయీ!, శశాంకశేఖర = ఓ చంద్రశేఖర!, శివ = ఓ సుఖస్వరూప!, త్ర్యక్ష = ఓ త్రిణేత్రా!, అక్షమాలాధర = ఓ రుద్రాక్ష జపమాలాధరా!, శ్రీమన్ = ఓ లక్ష్మీనాథా, ఉగ్ర = ఓ భయంకరా!, కపాలలాంఛన = ఓ కపాల సంకేతా!, లసత్ = ప్రకాశించు, భీమ = భయంకరమైన, త్రిశూల = త్రిశూలము అను, ఆయుధ = ఆయుధముగలవాడా!, కారుణ్య + అంబునిధే = ఓ దయాసాగరా!, త్రిలోక = మూడు లోకముల, రచనాశీల! = నిర్మించువాడా!, ఉగ్రశక్తి + ఆత్మకా = భయంకరమైన శక్తి కేంద్రమా!, శ్రీకంఠ! = ఓ గరళకంఠ!, అశుభ = పాపముల, భరాన్ = మూటలను, ఆశు = వెంటనే, వినాశయ = నశింపజేయుము, పరా = ఉత్తమమైన, సిద్ధిమ్ = సిద్ధిని, ఆధత్స్వ = అనుగ్రహించుము.

**తాత్పర్యము :** స్వామీ! కరుణాసముద్రా! ఎన్నో విధముల నీ గుణగానముజేతుము. అశుభములను నశింపజేసి, ఉత్తమ సిద్ధిని అనుగ్రహించుము.

ఈ స్తోత్రంలో శివనామములెన్నో ఉపయోగింపబడినవి. ఇవన్నీ శివుని రూప గుణవిలాసాలను వర్ణించే పదాలే. ఆయా నామాల వ్యుత్పత్తి అర్థాలను పరిశీలించటం ద్వారా స్వామిని దర్శించుకుందాం.

**1. శంభుః** – సుఖమును పొందినవాడు, పరమానందరూపి, సుఖమును కలిగించువాడు, అని ఈ శబ్దార్థాలు.

**2. శర్వః** – ప్రలయకాలంలో భూతాలను చంపేవాడు.

**3. శశాంకశేఖరః** – కుందేలు గుర్తుగా గల చంద్రుని శిరస్సుపై ధరించేవాడు.

**4. శివః** – నిర్వికారుడు; ఆనందరూపుడు; సజ్జనుల మనస్సులు వీనియందుండును కనుక శివుడు; సజ్జనుల మనస్సులలో తానుండును కనుక శివుడు; శుభములతో కూడిన వాడు, శుభములిచ్చువాడు.

**5. త్రి + అక్షః** (త్ర్యక్షః) – మూడు కన్నులు గలవాడు.

**6. అక్షమాలాధరః** – రుద్రాక్షమాలను ధరించినవాడు.

**7. శ్రీమన్** – లక్ష్మి గలవాడు.

**8. ఉగ్రః** – భయంకరుడు.

**9. కపాలలాంఛనః** – తలపుఱ్ఱె గుర్తుగాగలవాడు.

**10. త్రిశూలాయుధః** – శూలము ఆయుధముగా గలవాడు.

**11. త్రిలోకరచనాశీలః** – ముల్లోకములను సృష్టించు లక్షణముగలవాడు.

**12. శ్రీకంఠః** – విషమును కంఠమున ధరించినవాడు, కంఠమున శోభగలవాడు.

ఈ నామాలలో అర్థాన్ని బట్టి 3, 5, 6, 8, 9, 10, 12, ఇవి రూపవర్ణనకు సంబంధించినవి, కాగా, 1, 2, 4, 7, 11, ఇవి గుణ వర్ణన. రూపం అసాధారణంగా, విపరీతంగా కన్పిస్తూండగా, గుణాలు మంగళకరంగా కన్పిస్తున్నవి. ఇది వాని నిఃస్పృహత్వాన్నీ గాంభీర్యాన్నీ సూచించే అంశం. ఒక వంక త్రిలోక సృష్టి, దయాపరత, శుభంకరత్వం మూర్తీభవించినవాడు ఆతడని అంటూనే వాని భయంకర సంహార చర్యలను గూడ వర్ణించే నామాలు! ఇంతకీ ఆతనినుండి యేమి కోరవలె? అంటే, వినాశయాశుభభరాన్ = అశుభాలను అంతం చేయుము; ఆధత్స్వ సిద్ధిం పరామ్ = అత్యుత్తమమైన సిద్ధిని ప్రసాదించుమని ఈ భక్తుడు ప్రార్థిస్తూన్నాడు. శుభాశుభాలకు రెండిటికీ సమర్థుడే కదా!

**శ్లో ॥ తత్కిం నాథ! భవేన్న యత్ర భగవాన్నిర్మాతృతామశ్నుతే**
**భావః స్యాత్కిము తస్య చేతనవతో నాశాస్తి యం శంకరః ।**

**ఇత్థం తే పరమేశ్వరాక్షతమహాశక్తేః సదా సంశ్రితః**
**సంసారేఽత్ర నిరన్తరాధివిధురః క్లిష్యామ్యహం కేవలమ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, పరమేశ్వర = ఓ మహేశ్వరా!, యత్ర = ఎక్కడ, భగవాన్ = భగవంతుడైన తమరు, నిర్మాతృతామ్ = నిర్మాతరూపంలో, కర్త రూపంలో, న అశ్నుతే = వ్యాపించియుండరో, తస్య = దానియొక్క, వానియొక్క, చేతనవతః = చైతన్యముగలవానియొక్క, కిము భావః = యే పదార్థము, యే ఉనికి, స్యాత్ = కలుగునో, యమ్ = ఎవనిని, దేనిని, శంకరః = మహాదేవుడు, న ఆశాస్తి = పరిపాలించడో, తత్ = అది, కిమ్ = ఏమి, భవేత్ = కాగలదు, ఇత్థమ్ = ఈ ప్రకారము, అక్షత = పరిపూర్ణమైన, మహాశక్తేః = మహా శక్తి గల, తే = నీ యొక్క, సంశ్రితః = ఆశ్రితుడనై, శరణుపొందినవాడనై, అహమ్ = నేను, అత్ర సంసారే = ఈ లోకమున, సదా = ఎల్లప్పుడు, నిరంతర = అంతరాయము లేని, ఆధి = మానసికమైన బాధల వలన, విధురః = వ్యాకులతజెందినవాడనై, కేవలం క్లిష్యామి = దుఃఖమును మాత్రమే అనుభవించుచున్నాను.

**తాత్పర్యము :** స్వామీ పరమేశ్వరా! సర్వ జగత్కర్త నీవు, సర్వ వ్యాపి చైతన్యము నీవు, ఉనికి నీవు, మనికి నీవు, సర్వ శక్తిమంతుడవైన నీకు నేను శరణాగతుడను. ఐనను మనోవ్యధను ఎడలేక అనుభవిస్తున్నాను.

భక్తునికి గూడ మోహం తప్పదు. ఒక వంక తాను శరణాగతుడనని అంటూనే మనోవ్యధ నిరంతరాయం అనటంలో ఈ మోహలక్షణం కనబడుతుంది. తన స్వామి సర్వకర్త అంటే లౌకిక జీవితంలో కూడా దేనికి గాని తాను కర్తకాదని అర్థం కదా. తన స్వామి సర్వభర్త, అంటే, సమస్తానికీ నిర్వాహకుడు, భరించేవాడు ఆతడనే కదా అర్థం, తాను కాదు కదా. వానిని శరణన్న తరువాత తన మనోవ్యధకు కారణం లేదు కదా. మరి ఈ క్లేశానికి మూలమేమిటి? తాను దేహినన్న పశుభావం అతనిలో సమూలంగా నశించలేదన్నమాట. ఈ పశుభావం ఉన్నంతవరకు పాశం పట్టు వదలదు. పాశమున్నంతవరకు క్లేశముండక తీరదు. కనుక ఈ దేహభావం జారిపోతే, పశు భావమూ, పాశమూ, క్లేశమూ కూడ వదలిపోగలవు. అన్నది కవి హృదయం.

శ్లో ॥ **యద్యప్యత్ర వరప్రదోద్ధతతమాః పీడాజరామృత్యవః**
**ఏతే వా క్షణమాసతాం బహుమతః శబ్దాదిరేవాస్థిరః ।**
**తత్రాపి స్పృహయామి సన్తతసుఖాకాంక్షీ చిరం స్థాస్నవే**
**భోగాస్వాదయుతత్వదంఘ్రికమలధ్యానాగ్ర్యజీవాతవే ॥ 13**

**ప్రతిపదార్థము :** వరప్రద = ఓ వరదాయక! అత్ర = ఇక్కడ, లోకంలో, పీడా = దుఃఖము, జరా = ముసలితనము, మృత్యవః = మృత్యువు అనునివి, ఉద్ధతతమాః = అత్యంత బాధాకరమైనవి, యద్యపి = అయినప్పటికి, ఏతే = ఇవి, క్షణమ్ = క్షణకాలము, ఆసతామ్ = ఉండనివ్వండి, వా = కాని, బహుమతః = చాల గౌరవము గల, శబ్ద ఆదిః = శబ్దము మొదలగు ఇంద్రియ విషయము, ఏవ = మాత్రము, అస్థిరః = అశాశ్వతము, తత్రాపి = ఐనప్పటికి, సంతత = ఎల్లవేళల, సుఖ = సుఖమును, ఆకాంక్షీ = కోరునట్టి వాడనై, చిరం స్థాస్నవే = చిరస్థాయి గల, భోగ = భోగముల యొక్క, ఆస్వాదయుత = అనుభవముతో కూడిన, త్వద్ = నీయొక్క, అంఘ్రికమల = పాద పద్మముయొక్క, ధ్యాన = ధ్యానముతో కూడిన, అగ్ర్యజీవాతవే = శ్రేష్ఠజీవనము కొరకు, స్పృహయామి = కోరుచున్నాను.

**తాత్పర్యము :** ఓ వరదాయకా! అత్యంత బాధాకరమైన దుఃఖము, ముసలితనము, మృత్యువు అనునివి ఈ లోకంలో ఉన్నవి. వీటి అనుభవం క్షణికం. అట్లే ఇంద్రియ సుఖాలైన శబ్దదృశ్యఘ్రాణరసనస్పర్శ విషయాలున్నూ అశాశ్వతములే. కాని, నేను ఎల్లవేళల సుఖమునే కోరేవాడను. కనుక శాశ్వత సుఖానుభవమును ప్రసాదించే నీ పాదపద్మాల ధ్యానంతో గూడిన శ్రేష్ఠమైన జీవనాన్ని కోరుకుంటున్నాను.

జీవితం బాధామయం. సుఖం క్షణికం. అయినప్పట్టికీ నా స్వభావం శాశ్వతసుఖాన్నే ఆకాంక్షిస్తుంది. అదెట్లాంటిదంటే, నీ పాదస్పర్శ వలన లభించేది. స్పర్శ అన్నది ఇంద్రియసుఖమే కదా! అది క్షణికం అన్నావు కదా, మళ్ళీ అదే కావాలంటావేం! అనకు స్వామీ! నేను కోరేది ధ్యానస్పర్శ. ఇది ఇంద్రియసుఖం కాదు, ఆత్మసుఖం, అందుకే అది శాశ్వతం కాగలదు. ఆ శాశ్వతసుఖమైన ధ్యానాన్ని నాకు ప్రసాదించు, అంటున్నాడు ఈ భక్తకవి.

**శ్లో ॥ హే నాథ! ప్రణతార్తినాశనపటో శ్రేయోనిధే! ధూర్జటే!**
**దుఃఖైకాయతనస్య జన్మమరణత్రస్తస్య మే సాంప్రతమ్ ।**
**తచ్చేష్టస్వ యథా మనోజ్ఞవిషయాస్వాదప్రదా ఉత్తమాః**
**జీవన్నేవ సమశ్నువేఽహమచలాః సిద్ధీస్త్వదర్చాపరః ॥ 14**

**ప్రతిపదార్థము :** హే నాథ! = ఓ స్వామీ!, ప్రణత = శరణన్నవారి, ఆర్తి = దుఃఖాన్ని, నాశన = నశింపజేయటంలో, పటో = నిపుణతగలవాడా! శ్రేయః నిధే! = ఓ కల్యాణసాగర!, ధూర్జటే = ఓ ధూర్జటీ!, దుఃఖ+ఏక = దుఃఖములను మాత్రమే, ఆయతనస్య = ఇల్లయిన వాడి యొక్క, జన్మమరణ = జననము మృత్యువు, వీటి

నుండి, త్రస్తస్య = భయపడిన, మే = నాకొరకు, సాంప్రతమ్ = వెంటనే, తత్ = అట్లు, చేష్టస్వ = చేయుము, యథా = ఎట్లు, అహమ్ = నేను, త్వద్ = నీయొక్క, అర్చా = పూజలో, పరః = తత్పరుడనై, మనోజ్ఞ = మనోహరమైన, విషయ = విషయముల యొక్క, ఆస్వాదప్రదాః = అనుభవమునిచ్చునట్టి, ఉత్తమాః = శ్రేష్ఠము, అచలాః = చిరస్థాయిగల, సిద్ధీః = సిద్ధులను, జీవన్నేవ = బ్రతికియుండగనే, సమశ్నువే = పొందగలుగుదునో.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవు శరణన్న వారి దుఃఖాన్ని పోగొట్టి, శుభముల నిచ్చువాడవు. ఓ ధూర్జటీ! నేను దుఃఖములనే ఇల్లుగా చేసికొన్నవాడను, జననమరణాలకు భయపడినవాడను. నేను నీ పూజలో స్థిరము, చిరము అయిన శ్రేష్ఠానందమును బ్రతికి యుండగనే అనుభవించునట్లు, అందుకుపకరణములైన సిద్ధులను వెంటనే అనుగ్రహించుము.

స్వామిని సేవకుడు యాచించే సందర్భంలో గుర్తించదగిన విషయమేమంటే, తన స్వామి స్వభావానికి విరుద్ధమయినదానిని సేవకుడు ప్రార్థించటం వలన కార్యసిద్ధి కలుగదు అన్నది. ఈ భక్తకవి ఆ లోకనియమాన్ని గౌరవించి, తన స్వామి స్వభావసిద్ధంగా బాధలు తీర్చేవాడని, శ్రేయస్సునిచ్చేవాడని తెలిసి యాచిస్తున్నాడు. అప్పుడైనా గాని సేవాధర్మాన్ని తప్పని కోరికనే కోరుతూన్నాడు, స్వామి సేవలో పరవశించే తత్పరతలోని ఆనందాన్ని ప్రసాదించుమని.

**శ్లో ॥ నమో మోహమహాధ్వాన్తధ్వంసనానన్యకర్మణే ।**
**సర్వప్రకాశాతిశయప్రకాశాయేన్దులక్ష్మణే ॥ 15**

**ప్రతిపదార్థము :** మోహ = మోహము అను, మహా = గొప్ప, చిక్కని, ధ్వాన్త = చీకటిని, ధ్వంసన = నశింపజేయుటలో, అనన్యకర్మణే = ఏకాయత్తమైన చేష్టలు గలవానికై, సర్వ = సమస్త, ప్రకాశ = వెలుగును, అతిశయ = మించి, ప్రకాశాయ = వెలుగువానికై, ఇందులక్ష్మణే = చంద్రుడు లాంఛనముగా గలవానికై, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** మోహమనే చీకటిని తొలగగొట్టుట మొక్కటే లక్ష్యముగా గల స్వామికి, ప్రకాశవంతమైన వస్తువులన్నిటికంటె అధికమైన తేజస్సుతో వెలుగువానికి, చంద్రుని లాంఛనముగా గల శివునకు నమస్కారము.

శివుడు చంద్రలాంఛనుడు; చంద్రుడు రేరాజు, అంటే రాత్రి చీకటిలో వెలిగేవాడు, ప్రసన్నుడు, సర్వరంజకుడు. చీకటిని తొలిగించే శివుడు చంద్రలాంఛను

దనటం సహజోక్తికాగా, శివుడు అగ్నిరూపుడు, తేజస్సులకు తేజమిచ్చువాడు. ఈతని తేజస్సు తామసులకు భేదకము, సత్త్వులకు ప్రసన్నము. కనుకే అజ్ఞాననాశకము, జ్ఞానోద్దీపకము. భక్తుడు నమస్కరించి పొందగోరినదీ జ్ఞానానందమునే, అద్వయానందమునే.



శ్రీః

## 12. రహస్య నిర్దేశం స్తోత్రమ్

**శ్లో ॥ సహకారి న కించిదిష్యతే – భవతో న ప్రతిబంధకం దృశి ।**
**భవతైవ హి సర్వమాప్లుతం – కథమద్యాపి తథాపి నేక్షసే ॥ 1**

**ప్రతిపదార్థము :** భవతః = మీ యొక్క, దృశి = దర్శనము చేయుటలో, కించిత్ = కొంచెము, సహకారి = సహకరించునవి, న ఇష్యతే = కోరబడుటలేదు, ప్రతిబంధకమ్ = ఆటంకము, న = లేదు, హి = యెందుకనగా, సర్వమ్ = అంతయు, భవతా ఏవ = మీనుండియే, ఆప్లుతమ్ = వ్యాపించినది, తథా అపి = అయినను, కథమ్ = ఎట్లు, అద్య + అపి = నేడుకూడా, న ఈక్షసే = సాక్షాత్కరింపవు ?

**తాత్పర్యము :** నీ సాక్షాత్కారం పొందటంలో నాకు ఉపకరణము లక్కఱలేదు. ఈ విషయంలో నాకేమీ ఆటంకాలు లేవు. ఎందుకంటే, జగత్తంతా మీనుండి వ్యాపించినదే. అయినప్పటికిన్ని, నీ సాక్షాత్కారం నాకు ఎప్పుడూ ఎందుకుండదు ?

నీ సాక్షాత్కారం నాకు ధ్యానవేళల్లో కలుగుతూన్నది. దానికి కావలసిన అంతఃకరణశుద్ధి నాకున్నది. ఇక సహాయక సాధనలు కూడా ఉన్నవి. అక్కడ నీ దర్శనానికి అడ్డంకి యేమీ లేదు కాని, ధ్యానసమయం కాక, నేను లోకవ్యవహారాలలో ఉన్నప్పుడు నాకు దర్శనం కాదేమి? సర్వజగత్తు నీ నుండి ప్రకటమైనదే కనుక జగత్తునిండా నీవున్నావు. ఆ కారణంగా లోకవ్యవహారంలో నా మనస్సు లగ్నమైనప్పుడు కూడా నీ దర్శనం నాకు కావాలసినదే కదా. ఆ నిరంతర సత్య దర్శనాన్ని నాకు ప్రసాదించు, అని భక్తహృదయం.

**శ్లో ॥ అపి భావగణాదపీన్ద్రియ – ప్రచయాదప్యవబోధమధ్యతః ।**
**ప్రభవన్తమపి స్వతః సదా – పరిపశ్యేయమపోఢవిశ్వకమ్ ॥ 2**

**ప్రతిపదార్థము :** భావగణాత్ అపి = వస్తువులు, భావములు, వీటి సమూహము నుండి గూడ, ఇంద్రియ = ఇంద్రియముల, ప్రచయాత్ అపి = సమూహము నుండి, అవబోధ మధ్యతః = జ్ఞానమధ్యమునుండి గూడ, స్వతః = తనయంతతానుగా, ప్రభవన్తమ్ = ప్రకటమగునట్టి నిన్ను, సదా = ఎల్లప్పుడు, అపోఢవిశ్వకమ్ = విశ్వము నుండి తొలగి, పరిపశ్యేయమ్ = చూచుచుందును.

**తాత్పర్యము :** నాయంతట నేను, ఐచ్ఛికముగా, భిన్న వస్తువులకు, భావములకు, ఇంద్రియములకు, జ్ఞానమునకు స్వయముగా జనించే విశ్వానికి దూరంగా తొలగి పర్యవేక్షింతును.

శిశువు జన్మించినది మొదలు వస్తువులతో బంధము, వానిని బట్టి భావములతో బంధము, ఇంద్రియములతో బంధము, జ్ఞానముతో బంధము. ఇంద్రియాల సహాయంతో కలిగిన వస్తుజ్ఞానం, వ్యక్తి జ్ఞానం భావ బంధాన్ని పెంచుతుంది. దానికి కట్టుబడకుండ, వాని అన్నింటి ద్వారా స్వయంగా నేను గ్రహించిన ఈ విశ్వం నుండి దూరంగా తొలిగి చూస్తే, ఈ విశ్వరూపం వేరుగా కన్పడుతుంది. సాంగత్యం వలన మనం చూడలేకపోయిన సత్యం ఇప్పుడు దర్శనమిస్తుంది. అదే శివదర్శనం. అదే ఈ భక్తుడు కోరేది.

**శ్లో ॥ కథం తే జాయేరన్ కథమపి చ తే దర్శనపథం**
**వ్రజేయుః కేనాపి ప్రకృతిమహతాంకేన ఖచితాః ।**
**తథోత్థాయోత్థాయ స్థలజలతృణాదేరఖిలతః**
**పదార్థాద్యాన్ సృష్టిస్రవదమృతపూరైర్వికిరసి ॥ 3**

**ప్రతిపదార్థము :** స్థల = భూమి, జల = నీరు, తృణ = గడ్డి, ఆదేః = మొదలగు, అఖిలతః = అన్నివిధముల, పదార్థాత్ = పదార్థముల నుండి, యాన్ = దేనిని, తథా = అదే రీతి, ఉత్థాయ ఉత్థాయ = ఉద్ధరించి, ఉద్ధరించి, సృష్టి = సృష్టినుండి, స్రవత్ = ప్రవహించుచున్న, అమృతపూరైః = అమృతధారలతో, వికిరసి = వెదజల్లుచున్నావో, తే = వారు, కేన అపి = దేనిచేనైన, ప్రకృతిమహతా = స్వభావముచే గొప్పనైన (అసాధారణ), అంకేన = గుర్తుతో, ఖచితాః = పొదుగబడినవారు, కథమ్ = ఎట్లు, జాయేరన్ = జన్మింపగలరు?, చ = మరియు, కథం అపి = ఎట్లైన, తే = వారు, దర్శనపథమ్ = దర్శనమార్గమును, న వ్రజేయుః = చేరకుందురు?

**తాత్పర్యము :** ప్రకృతినుండి నీవు యే భక్తులను అడుగడుగునను ఉద్ధరించి ఆ ప్రకృతి నుండి ప్రవహించు అలౌకికమైన అమృతధారలతో తడుపుచున్నావో, వారు స్వభావసిద్ధమైన

యేదేని యొక గుర్తుతో, లక్షణముగలవారు. అట్టివారు మరల మరల జన్మించుట అసాధ్యం. వారు యే రీతిగనైన నిన్ను దర్శించుమార్గమును చేరుకొనగలరు, అనగా జీవన్ముక్తులు కాగలరు.

భగవంతుని కృపాదృష్టి కలిగితే, వారు ప్రకృతిలోని విపరీతములనుండి ఉద్ధరింపబడటం తథ్యం. వారు అసాధారణ వ్యక్తులుగనే కన్పిస్తారు. ఏదో ప్రత్యేకత వారిలో తోస్తుంది. ఆ మహాత్ములు జననమరణచక్రంనుండి ముక్తులు. ఆటంకాలు ఎన్నికలిగినప్పటికీ వారు దైవమార్గాన్ని విడువరు. ఇది భక్తితత్త్వం, ఇది భక్తమార్గం.

**శ్లో ॥ సాక్షాత్కృతభవద్రూపప్రసృతామృతతర్పితాః ।**
**ఉన్మూలితతృషో మత్తా విచరన్తి యథారుచి ॥ 4**

**ప్రతిపదార్థము :** సాక్షాత్కృత = సాక్షాత్కారము పొందిన, భవత్ = తమయొక్క, రూప = రూపమునుండి, ప్రసృత = ప్రవహించిన, అమృత = అమృతముచే, తర్పితాః = తృప్తి చెందినవారు, ఉన్మూలిత = పెకలించివేయబడిన, తృషః = తృష్ణగల, మత్తాః = మత్తులైన వారు, యథారుచి = ఇష్టానుసారము, విచరన్తి = విహరించుచున్నారు.

**తాత్పర్యము :** ఈశ్వరా! మీరు సాక్షాత్కరించినప్పుడు మీ రూపము నుండి అమృతం ప్రవహిస్తుంది. దానితో పరమసంతుష్టులైన భక్తులు, కూకటి వ్రేళ్ళతో కోరికను పెకలించివేసి, మత్తులై యథేచ్ఛగా సంచరిస్తూన్నారు.

ఈశ్వరుడు ఆద్యంతరహితుడైన ఆనందస్వరూపుడు కనుక వాని దర్శనము అమృతత్వదర్శనము, పరమానందదర్శనము కావటం సహజం. కామ్యములన్నిటికి ఏకైక ప్రయోజనం కామ్యపూర్తి వలన లభించే ఆనందమే. ఆ ఆనందం సమృద్ధిగా తృప్తిగా లభించినప్పుడు మరి కోరికలకు తావులేదు కనుక ఆ భక్తులు **ఉన్మీలితతృషః.** అత్యంతానందం మైమరపిస్తుంది. అది దైవదర్శనం వలన లభించినదైతే ఆ పారవశ్యం వర్ణనాతీతం. వారు స్వయంగా ఆనందరూపులై సర్వతంత్ర స్వతంత్రులవుతారు. వారికి యెట్టి విధినిషేధాలూ, ఆంక్షలూ, ఆటంకాలూ ఉండవు. ఈ పరమానందంతో మత్తుడై దిగంబరుడై సంచరిస్తూన్న శ్రీ సదాశివబ్రహ్మేంద్రుని దండించబోయి పశ్చాత్తప్తుడైన ఒక సుల్తాన్ ఉదంతం ఉన్నది. కుండలు చేసేందుకు తాను కలియదొక్కుతూన్న మట్టిలో కన్న బిడ్డను కలిపేసిన భక్తుడు గోరా కుంభార్ కథయున్నది.

**శ్లో ॥ న తదా న సదా న చైకదేత్యపి సా యత్ర న కాలధీర్భవేత్ ।**
**తదిదం భవదీయదర్శనం న చ నిత్యం న చ కథ్యతేఽన్యథా ॥ 5**

**ప్రతిపదార్థము :** తదా = అప్పుడు, న = కాదు, సదా = ఎల్లప్పుడు, న = కాదు, చ = మరియు, ఏకదా = ఎప్పుడో ఒకప్పుడు, న = కాదు, ఇతి = అని, సా = ఆ, కాలధీః = కాలమును లెక్కించు బుద్ధి, అపి = కూడా, యత్ర = ఎక్కడ, న భవేత్ = అసంభవమో, తత్ = అట్టి, ఇదమ్ = ఈ, భవదీయ = తమయొక్క, దర్శనమ్ = దర్శనము, న చ నిత్యమ్ = నిత్యమైనదియు కాదు, న చ అన్యథా = మరియొక విధముగ గూడ, కథ్యతే = చెప్పబడదు.

**తాత్పర్యము :** స్వామీ! నీ దర్శనము ఒక నిర్ణీత సమయంలో అవుతుందా? లేక ఎల్లప్పుడూ అవుతుందా? ఎప్పుడో ఒకప్పుడు అవుతుందా? అది నిత్యమా? అనిత్యమా? కాలాన్ని గుణించే ఈ బుద్ధి యేమీ తేల్చిచెప్పలేకున్నది.

మానవుని బుద్ధి పరిమతులకు లోబడి పనిచేసే సామర్థ్యం కలది. దేశకాలాలను ఒక చట్రంలో బిగించి కొలిచి నిర్ణయాలు చేస్తుంది. దాని లెక్కలకు సూర్యోదయం, అస్తమయం, ఋతువులు, చారిత్రక సంఘటనలు ఇత్యాది కొలబద్దలు కావాలి. కాని ఈ పరిమితులకు అతీతమైన విషయాలు దాని పరిధిలోవి కావు కనుక వాటిని గురించి బుద్ధికి అవగాహన లేదు. అందుకే అటువంటి విషయాలలో అది నిర్ణయాత్మకంగా వ్యవహరించలేదు. నీ దర్శనం విషయంలోనూ దానికి మౌనమే శరణ్యం. ఎందుకంటే, నీవు లోకవ్యవహారం లోపలా, బైటా కూడా ఉన్నావు. నీవు అంతటా ఉన్నావు. కనుక నీదర్శనం ఇక్కడ, అక్కడ అనటం అసంబద్ధం. నీవు కాలాతీతుడవు కనుక కాలపరిమితిని నిర్ణయించి ఇప్పుడు, అప్పుడు అని చెప్పటం అసంబద్ధం. నీవు నిత్యుడవు, అనిత్యుడవు, అని చెప్పాలని చూచినా, అదీ కుదరదు. ఈ రెండున్నూ ఒకదాన్ని బట్టి రెండవది గ్రాహ్యం. దేవుడున్నాడు, లేడు అన్నదీ తేలని సమస్య అయింది ఇందుకే కదా.

**శ్లో ॥ త్వద్విలోకనసముత్కచేతసో – యోగసిద్ధిరియతీ సదాస్తు మే ।**
**యద్విశేయమభిసంధిమాత్రత – స్త్వత్సుధాసదనమర్చనాయ తే ॥ 6**

**ప్రతిపదార్థము :** త్వద్ = నీ యొక్క, విలోకన = దర్శనమునందు, సముత్క = కుతూహలముగల, చేతసః = మనస్సుగల, మే = నాకు, ఇయతీ = ఇంతమాత్రము, (వతుప్) యోగసిద్ధిః = యోగ సిద్ధి, సదా = ఎల్లప్పుడూ, అస్తు = అగుగాక!, అభిసంధి మాత్రతః = కోరికగలిగినంత మాత్రమున, తే = నీ యొక్క, అర్చనాయ = పూజ చేయుట కొరకు, త్వత్ = నీ యొక్క, సుధాసదనమ్ = జ్ఞానానందధామమును, విశేయమ్ = ప్రవేశింతును.

**తాత్పర్యము :** నాకు మీ దర్శనము చేయుటయందే ఉత్కంఠ. అందుకై నా మనస్సు ఉరకలు వేయును. అటువంటి నాకు నీ దర్శనానందము నిచ్చు యోగసిద్ధి ఎల్లవేళల కలుగుగాక! నాకు నీ పూజచేయవలెనని కోరిక కలిగిన వెంటనే నీ ధ్యానమున ఆనందమును పొందుదును.

**శ్లో ॥ నిర్వికల్పభవదీయదర్శనప్రాప్తిఫుల్లమనసాం మహాత్మనామ్।**
**ఉల్లసన్తి విమలాని హేలయా చేష్టితాని చ వచాంసి చ స్ఫుటమ్॥ 7**

**ప్రతిపదార్థము :** నిర్వికల్ప = మార్పులేనిదైన, భవదీయ = తమదైన, దర్శనప్రాప్తి = దర్శనము కలుగుటచే, ఫుల్ల = వికసించిన, మనసామ్ = మనస్సులు గల, మహాత్మనామ్ = మహాత్ముల యొక్క, విమలాని = మలినము లేని, చేష్టితాని = కార్యములు, చ = మరియు, వచాంసి = మాటలు, హేలయా = సహజముగా, స్ఫుటం చ = స్పష్టరూపముగనే, ఉల్లసన్తి = ప్రకాశిస్తాయి.

**తాత్పర్యము :** స్వామీ! తమ దర్శనం స్థిరంగా కలిగినప్పుడు మనస్సులు వికసించి మహాత్ములు మాట్లాడే మాటలు, చేసే పనులు కూడ సహజంగాను, స్పష్టంగాను ఉంటాయి. కారణం, అవి విమలములు, అంటే వానిలో స్వార్థం గాని కుత్సితంగాని యేమీ ఉండదు.

**నిర్వికల్పం** అంటే, అంతరాయంగాని మార్పుగాని లేనిది. ఇది సమాధిస్థితిలో చివరి మెట్టు. అటువంటి భగవద్దర్శనం లభిస్తే మనస్సులలోని మాలిన్యం, సంశయాలు, సంకుచితత్వం అన్నీ సహజంగా తమంత తామే తొలిగిపోతాయి. ఆ స్థితిలో వారు మాట్లాడే మాటలు మార్గదర్శకమైన సత్యాలుగాను, వారు చేసే పనులు లోకోద్ధారకాలు గానూ ఉంటాయి.

**శ్లో ॥ భగవన్! భవదీయపాదయోర్నివసన్నన్తర ఏవ నిర్భయః।**
**భవభూమిషు తాసు తాస్వహం ప్రభుమర్చేయమనర్గలక్రియః॥ 8**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ భగవానుడా!, భవదీయ = తమవైన, పాదయోః = పాదముల యొక్క, అన్తరే = మధ్య, ఏవ = మాత్రమే, నివసన్ = నివసించుచు, అహమ్ = నేను, తాసు తాసు = ఆ యా, భవ = లౌకికమైన, భూమిషు = అవస్థలలో, నిర్భయః = భయములేనివాడను, అనర్గలక్రియః = అదుపు లేని, స్వతంత్ర కర్మలు చేయువాడను, సన్ = అగుచు, ప్రభుమ్ = ప్రభువును, అర్చేయమ్ = పూజ చేతును.

**తాత్పర్యము :** ఓ దేవా! మీ పాదముల మధ్య నివసిస్తూ, ఆ యా లౌకికావస్థలలో నేను

భయములేక, స్వతంత్రముగా ప్రభువైన నిన్ను పూజింతును.

శివపాదాలు జ్ఞాన క్రియారూపాలు. లౌకికులు వాటి మధ్యనే జీవిస్తారు. భక్తులు కూడ సాధారణంగా లౌకికులే. కనుక వారి లౌకికావస్థలో అందరివంటి వారే, కాని శివధ్యానతత్పరత వలన నిర్భయులు, స్వతంత్రులు.

**శ్లో ॥ భవదంఘ్రిసరోరుహోదరే పరిలీనో గలితాపరైషణః।**
**అతిమాత్రమధూపయోగతః పరితృప్తో విచరేయమిచ్ఛయా॥ 9**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, అంఘ్రిసరోరుహ = పాదపద్మముల, ఉదరే = మధ్య, పరిలీనః = లీనమైనవాడనై, గలిత = జారిన, శాంతించిన, అపర = అన్యమైన, ఏషణః = కోరికలుగలవాడనై, అతిమాత్ర = అధికముగ, మధు + ఉపయోగతః = మధువునుపయోగించినందువలన, అమితానందము కారణంగా, పరితృప్తః = పూర్తిగా తృప్తి చెందినవాడనై, ఇచ్ఛయా = ఇష్టానుసారము, విచరేయమ్ = విహరింతును.

**తాత్పర్యము :** స్వామీ! నీ పాదపద్మాల మధ్య లీనమై, మిగత కోరికలు శాంతించగా, అమితానందము వలన యథేచ్ఛగా విహరింతును.

స్వామి పాదాలు జ్ఞాన క్రియారూపాలు. ఈ రెండిటి మధ్య మనస్సునుంచి నప్పుడు లౌకికమైన కట్టు బాట్లను పరిమితులను అధిగమించి భక్తుడు సంచరిస్తాడు.

**శ్లో ॥ యస్య దంభాదివ భవత్పూజాసంకల్ప ఉత్థితః ।**
**తస్యాప్యవశ్యముదితం సన్నిధానం తవోచితమ్ ॥ 10**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవరికి, దంభాత్ + ఇవ = వంచన వలన, అన్నట్లు, భవత్ = మీ యొక్క, పూజాసంకల్పః = పూజ చేయవలెనను ఆలోచన, ఉత్థితః = కలిగినదో, తస్య = వానికి, అపి = కూడా, తవ = నీయొక్క, ఉచితమ్ = తగిన, సన్నిధానమ్ = సాన్నిధ్యము, అవశ్యమ్ = తప్పక, ఉదితమ్ = కలుగును.

**తాత్పర్యము :** స్వామీ! తమను పూజింపవలెనను ఊహ భక్తుడు కానివానికి కుహనా భక్తిరూపంలో కలిగినప్పటికి, వానికి గూడ తగిన విధంగా తమ దర్శనం తప్పక కలుగుతుంది.

**ఉదితం** అన్నదానికి, ఉదయించటం, చెప్పబడటం అనే రెండు అర్థాలు చెప్పవచ్చు. వీనిలో యే అర్థమైన అన్వయమవుతుంది. **దంభము** అంటే, ఈ సందర్భంలో, మత ధర్మ నిర్వహణలో వంచన, ప్రదర్శన కోసం తప్ప మనసా చేసినది కాదు, అన్న

అర్థం గ్రాహ్యం. అటువంటి వారికి గూడ వారి పూజా ప్రదర్శన మాత్రానికి రావలసిన సత్ఫలితం వస్తుంది. అని భావం. శ్రద్ధలేని క్రియకూడా పూర్తిగా వ్యర్థం కాదు. కర్మ ఉన్నది కనుక ఫలం ఉంటుంది, ఫలానుభవమూ ఉంటుంది. అది సత్కర్మ అయితే సత్ఫలం, దుష్కర్మ అయితే దుష్ఫలం అనుభవానికి వస్తుందన్నది సూత్రం. ఈశ్వరసన్నిధానం దొంగ భక్తునికిగూడ లభిస్తుందనటంలో ఉద్దేశం, మహా భక్తులతో సమానమైన సందర్శనానందం కలుగుతుందని కాదు, అపనమ్మకంతో ఆతడు చేసిన పూజాఫలంగా, అతనిలో విశ్వాసబీజం అంకురిస్తుందని భావం.

**శ్లో ॥ భగవన్నితరానపేక్షిణా నితరామేకరసేన చేతసా ।**
**సులభం సకలోపశాయినం ప్రభుమాతృప్తి పిబేయమస్మి కిమ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ దేవా!, ఇతర = మరియొకదానిని, అనపేక్షిణా = కోరనిదైన, నితరామ్ = కేవలము, ఏకరసేన = ఒకే ఆనందముగల, చేతసా = మనస్సుతో, సకల + ఉపశాయినమ్ = అంతటను వ్యాపించియున్న, సులభమ్ = సులభుడైన, ప్రభుమ్ = స్వామిని, (త్వామ్ = నిన్ను), ఆతృప్తి = సమగ్రమైన, సంపూర్ణమైన తృప్తితో, పిబేయం అస్మి కిమ్ = ఆస్వాదించగలవాడను అగుదునాయేమి ?

**తాత్పర్యము :** ఓ దేవా! నీవు విశ్వవ్యాపివి. కనుక సులభసాధ్యుడవు. అట్టి నిన్ను మరి వేరు కోరిక లేకుండ, ఒకే ఆనందాప్తికై మనసా పూర్ణతృప్తితో సేవించగలుగుదునా ?

**శ్లో ॥ త్వయా నిరాకృతం సర్వం హేయమేతత్తదేవ తు ।**
**త్వన్మయం సముపాదేయమిత్యయం సారసంగ్రహః ॥ 12**

**ప్రతిపదార్థము :** ఏతత్ సర్వమ్ = ఇది యంతయు (వేద్య వర్గము), త్వయా = నీచే (చిదాత్మచే), నిరాకృతమ్ = నిరాకరించబడినది (దూరమున ఉంచబడినది), హేయమ్ = విడువదగినది, తు = కాని, తత్ ఏవ = అదియే (ఆ వేద్య వర్గమే), త్వత్‌మయమ్ = నీతో నిండినదై, సముపాదేయమ్ = అన్ని విధముల గ్రాహ్యమైనది, ఇతి అయమ్ = అనునిది, సారసంగ్రహః = సారాంశము.

**తాత్పర్యము :** నీకు దూరమై యేది విడువదగినదిగా భావింపబడినదో అదియే నీ ఉనికి వలన స్వీకార్యమైనది. ఇది సిద్ధాంత, సంప్రదాయముల సారభూతమైన విషయము.

పరమాత్మతో గూడి గ్రాహ్యము కానిది త్యాజ్యము. ఈ శరీరము ప్రాణమున్నంత వరకు గ్రాహ్యమై, ప్రాణము తొలగిపోగా త్యాజ్యమైనది కదా. అట్లే, జీవించియున్న మానవుడు కూడ శివంభావియైనప్పుడు పూజ్యుడు, కానప్పుడు త్యాజ్యుడు.

**శ్లో ॥ భవతోఽన్తరచారిభావజాతం ప్రభువన్ముఖ్యతయైవ పూజితం తత్ ।**
**భవతో బహిరప్యభావమాత్రా కథమీశాన! భవేత్ సమర్చ్యతే వా ॥ 13**

**ప్రతిపదార్థము :** ఈశాన = ఓ ఈశ్వరా!, భవతః మీకంటె, అంతరచారి = వేరుకాని, భావజాతమ్ = భావవర్గము, తత్ ముఖ్యతయా = దాని ప్రాధాన్యము చేత, ప్రభువత్ ఏవ = ప్రభువు వలెనే, పూజితమ్ = పూజింపబడినది, భవతః = మీ నుండి, బహిః = బయట, వేరుగా, అభావమాత్రా అపి = అసద్రూపమైనదైనను, కథం భవేత్ = ఎట్లా సాధ్యము, వా = మరియు, సమర్చ్యతే = పూజింపబడుచున్నది ?

**తాత్పర్యము :** మీలో ఉండి, మీ కంటె వేరుకాని భావవర్గము దాని ప్రాధాన్యముననుసరించి పూజింపబడటం సహజమే. ఎందుకంటే అది నీకు అభిన్నము, సమానము. కాని, నీకంటే వేరుగా, నీనుండి దూరంగా ఉన్నది, నీకు భిన్నమైనది కూడా పూజింపబడటం ఎట్లా సాధ్యం? పూజింపబడుతూన్నది కదా! కనుక ఈ ప్రపంచం, సృష్టి, మీకు అభిన్నమైనదని అర్థం.

**భావజాతం** అంటే ఊహలు, ఆలోచనలు కాదు. సృష్టిలోని వస్తుసమూహం, ప్రాణి సమూహం. అభావోఽపి బుధ్యమానో బోధాత్మైవ అన్న శాస్త్రోక్తిని బట్టి లేనిది కూడా తెలిసికొనబడినదైనప్పుడు ఉన్నదానితో సమానమే అవుతుంది. ఉదాహరణకు, స్వప్నంలో భయంకరమైన జంతువునో వేరొక దృశ్యాన్నో చూచినప్పుడు ఆ కలగన్నవానికది స్వప్నావస్థలో ఉన్నంతసేపు సత్యమే. ఆతడనుభవించే భయం సత్యం, దుఃఖం సత్యం, రంభాసంభోగం సత్యం. 'ఆకాశకుసుమం' అన్న పదబంధం ఒక అర్థాన్ని బోధిస్తూన్నది. కనుక, అది బోధాత్మయే అవుతుంది.

**శ్లో ॥ నిఃశబ్దం నిర్వికల్పం చ నిర్వ్యాక్షేపమథానిశమ్ ।**
**క్షోభేఽప్యధ్యక్షమీక్షేయం త్ర్యక్ష! త్వామేవ సర్వతః ॥ 14**

**ప్రతిపదార్థము :** త్ర్యక్ష = ఓ త్రిలోచనా!, క్షోభే + అపి = వ్యాకులతలో గూడ, నిఃశబ్దమ్ = శబ్దబ్రహ్మకంటె వేరైన వానిని, నిర్వికల్పమ్ = వికల్పములేని వానిని, చ = మరియు, అధ్యక్షమ్ = కన్నుల ఎదుటగలవానిని, త్వాం ఏవ = నిన్నే, సర్వతః = పూర్ణరూపమున, అథ = మరియు, అనిశమ్ = ఎల్లప్పుడు, నిర్వ్యాక్షేపమ్ = నిర్విఘ్నముగా, ఈక్షేయమ్ = చూచుచుందును.

**తాత్పర్యము :** ఓ త్రిలోచనా! నీవు వికల్పము లేనివాడవు, శబ్ద బ్రహ్మకంటె వేరైనవాడవు, ప్రత్యక్షమగువాడవు. నేను వ్యాకులతలో గూడ అంతటా ఎల్లప్పుడూ నిర్విఘ్నముగా పూర్ణరూపమున చూచుచుందును గాక!

**క్షోభము** అంటే సాంప్రదాయికార్థం గ్రాహ్యగ్రాహకావస్థ, గ్రహించదగినది-గ్రహించువాడు అన్న ద్వయావస్థ. **నిఃశబ్దము** అన్నది శబ్దం కంటె వేరైనది, శబ్దబ్రహ్మ, నాదబ్రహ్మ అని గుర్తింపబడే దానికి భిన్నమైనది. **అధ్యక్షం** అంటే కంటి ఎదుట, ఇంద్రియముల నధిష్ఠించినది, ఇంద్రియాతీతమైనది అని అర్థం చేయవచ్చు.

**శ్లో ॥ ప్రకటయ నిజధామ దేవ! యస్మిన్ - త్వమసి సదా పరమేశ్వరీసమేతః ।**
**ప్రభుచరణరజఃసమానకక్ష్యాః - కిమవిశ్వాసపదం భవన్తి భృత్యాః ॥ 15**

**ప్రతిపదార్థము :** దేవ = ఓ దేవా!, నిజధామ = నీ నివాసస్థానమును, ప్రకటయ = ప్రకటించుము, యస్మిన్ = దేనియందు, త్వమ్ = నీవు, పరమేశ్వరీసమేతః = పరాశక్తితోగూడి, సదా = ఎల్లప్పుడు, అసి = ఉన్నావో, ప్రభు = స్వామియొక్క, చరణరజఃసమాన = పాదధూళితో సరియైన, కక్ష్యాః = పదవులు గల, భృత్యాః = సేవకులు, అవిశ్వాసపదమ్ = విశ్వాస పాత్రులు కానివారు, భవన్తికిమ్ = అగుచున్నారా యేమి ?

**తాత్పర్యము :** ఓ దేవ!, నీ నివాసమును తెల్పుము. అందు పరాశక్తితో నీవు ఎప్పుడునూ ఉందువు కదా. మేము నీ దాసులము, ఎప్పుడూ నీ సేవయందే లగ్నమై ఉండేవారము. మాకు నీ నివాసమును తెలుపకపోవుటకేమి కారణము? మేము విశ్వాసపాత్రులము కామా? అంతటా వ్యాపించియున్న దేవుడు యెక్కడనూ కనబడకున్నాడు కదా యని ఈ ప్రశ్న.

**శ్లో ॥ దర్శనపథముపయాతోఽప్యప - సరసి కుతో మమేశ! భృత్యస్య ।**
**క్షణమాత్రకమిహ న భవసి - కస్య న జంతోర్దృశోర్విషయః ॥ 16**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ ఈశ్వరా! భృత్యస్య = భృత్యుడనైన, మమ = నాయొక్క, దర్శన పథమ్ = దృష్టి మార్గమున, ఉపయాతః అపి = గోచరించువాడవైనను, కుతః = ఏ కారణమువలన, అపసరసి = తొలగిపోదువు ? క్షణమాత్రకమ్ = క్షణము మాత్రము, ఇహమ్ = లోకంలో, కస్య = ఎట్టి, జంతోః = ప్రాణియొక్క, దృశోః = చూపులకు, విషయః = కన్పించువాడవై, న భవసి = కాకున్నావు.

**తాత్పర్యము :** ఈశ్వరా! నీవు నాకు కన్పించినట్లే ఉండి అంతలో కనుమరుగై పోతూన్నావు. ఎందుకు? ఈ సృష్టిలో యే ప్రాణికి గాని కంటికి కనపడవేమి? ఏమి కారణం?

మనస్సు అంతరాంతరాలలో ఎక్కడో నీవు సర్వాంతర్యామివై భావనామాత్రంగా తోచినప్పటికీ ప్రాకృతిక సత్యంగా నీవు తోచవు. ఇంద్రియజ్ఞానబద్ధమైన ఈ ప్రాణులకు

ఇంద్రియవిషయంగా జ్ఞానపథంలోకి రావేమి? ఈ మీమాంస చాల పురాతనం, చాల అధునాతనం. సృష్టిలో ఉన్న దేవుడు సృష్టిలో కనరాడేమి? చూపులకు చెట్టు తప్ప, గట్టు తప్ప, పురుగు తప్ప, పశువు తప్ప, మనిషి తప్ప, పక్షి తప్ప, వీనిలో అంతర్యామిగా చెప్పబడే వాడు కనబడడేమి?!

**శ్లో ॥ ఐక్యసంవిదమృతాచ్ఛధారయా - సంతతప్రస్రుతయా కదా విభో! ।**
**ప్లావనాత్ పరమభేదమానయన్ - త్వాం నిజం చ వపురాప్నుయాం ముదమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, సన్తత = ఎల్లప్పుడు, ప్రస్రుతయా = ప్రవహించుచుండు, ఐక్య సంవిత్ = అభేదజ్ఞానరూపమైన, అమృత = అమృతము యొక్క, ఆనందము యొక్క, అచ్ఛ = నిర్మలమైన, ధారయా = ధార చేత, ప్లావనాత్ = తడిసియుండుటవలన, త్వామ్ = నిన్ను, చ = మరియు, నిజం వపుః = నా శరీరమును, రూపమును, పరమ = మిక్కిలి, అభేదమ్ = భేదము లేనిదానిగా, ఆనయన్ = చేయుచు, కదా = ఎప్పుడు, ముదమ్ = ఆనందమును, ఆప్నుయామ్ = పొందగలను ?

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! నిరంతరప్రవాహమైన అభేదజ్ఞానామృతములో మునిగి యుండుటవలన, నిన్ను, నారూపమును, ఏమాత్రము భేదములేనివిగా చూచుచు నేనెప్పుడు పరమానందమును పొందగలను?

సృష్టి - స్రష్ట వేరు వేరు విషయములన్న భావముతో వానిని వేరువేరుగా చూచి తెలిసికొనవలెనని ప్రయత్నించినంతకాలము దర్శనము అసంపూర్ణముగనే ఉంటుంది కనుక కలిగే ఆనందమూ అసంపూర్ణంగానే ఉంటుంది. కారణం, సృష్టి జ్ఞానాన్ని స్రష్టజ్ఞానంతో అనుసంధానం చెయ్యటం తెలియకపోవటం. ఈ లోపం వలన భక్తుని ఆనందానుభవం వెలితిగానే ఉండిపోతుంది. దీనిని సంపూర్ణం చేసికోవలెనంటే ఈ సృష్టిస్రష్టల ఐక్యజ్ఞానం తప్పక పొందవలె. ఈ జ్ఞానం శుష్కసిద్ధాంతమాత్రం కాకుండా పూర్ణ, సజీవానుభూతిగా మారవలసి ఉంటుంది. భక్తుడు పరమహంసగా మారవలసి ఉంటుంది. ఆ శుభసమయం కోసం పరిణత భక్తి గలవాడు ఈ కవి వలె ఎప్పుడెప్పుడని తపిస్తూంటాడు.

**శ్లో ॥ అహమిత్యముతోఽవరుద్ధలోకాత్ - భవదీయాత్ ప్రతిపత్తిసారతో మే ।**
**అణుమాత్రకమేవ విశ్వనిష్ఠం - ఘటతాం యేన భవేయమర్చితా తే ॥18**

**ప్రతిపదార్థము :** అముతః = ఈ, అహమ్ = నేను, ఇతి = అను, అవరుద్ధలోకాత్ = లోకవర్తియైన భేదభావరహితమైన, భవదీయాత్ = తమదైన; ప్రతిపత్తిసారతః =

స్వరూపజ్ఞానసంబంధియైన సారమునుండి, విశ్వనిష్ఠమ్ = విశ్వమున ప్రకాశించే, అణుమాత్రకం ఏవ = అణువంత చిన్నదైనదే, మే = నాకు, ఘటతామ్ = లభించుగాక!, యేన = దేనిచే, తే = తమయొక్క, అర్చితా = పూజరిని, భవేయమ్ = అగుదునుగాక!

**తాత్పర్యము :** లోకం భేదభావంతో వ్యాప్తమైనది. కాని ఈ భేదభావశూన్యమై, స్వస్వరూపజ్ఞాన సంబంధియై, ఈ విశ్వంలో ప్రకాశిస్తూన్నది అణుమాత్రమైన 'నేను' అన్న భావం. దాని స్వరూపదర్శనం నాకు లభించి, దాని ద్వారా నేను నీ పూజరిని కావాలని నా ప్రార్థన.

ప్రకృతిలో భిన్నత్వం సిద్ధాంతం. ఏకత్వం ఊహ. ఒకటిగా కనిపించే జంతు శరీరంలోను, వృక్షశరీరంలోను, కీటశరీరంలోను అవయవరూపభిన్నత్వం, కార్యభిన్నత్వం కంటికి కనిపించే నిత్యానుభవజ్ఞానం. ప్రకృతి జ్ఞానార్జన సైతం భిన్న భిన్న జ్ఞానేంద్రియాల చర్యలద్వారా సంపాదించినదే. కాని ఆ పరిమితులన్నింటిని, భిన్నత్వాన్ని అధిష్ఠించి 'నేను' అన్నదొకటి ప్రకాశిస్తూన్నది. ఇది అన్నింటిలో సమంగా వర్తించే వ్యక్తి నిర్వ్యక్తినామం, సర్వనామం. ఈ సర్వనామం భేదరహితమైన శివ స్వరూపజ్ఞానాన్ని ప్రబోధించేపదం. ఆ స్వరూపదర్శనం అణుమాత్రం లభించినాగాని నేను నిజమైన సంపూర్ణమైన శివార్చకుడను కాగలను, అందుకు శివానుగ్రహాన్ని అర్థిస్తూన్నాను, అంటూన్నాడు ఈ భక్త కవి.

**శ్లో ॥ అపరిమితరూపమహం – తం తం భావం ప్రతిక్షణం పశ్యన్ ।**
**త్వామేవ విశ్వరూపం – నిజనాథం సాధు పశ్యేయమ్ ॥ 19**

**ప్రతిపదార్థము :** తం తమ్ = ఆ యా, భావమ్ = వస్తుజాలమును, పశ్యన్ = చూచుచు, అహమ్ = నేను, ప్రతిక్షణమ్ = ప్రతి నిమిషము, అపరిమిత = పరిమితులు లేని, అనంతమైన, రూపమ్ = రూపముగల, విశ్వరూపమ్ = విశ్వమే రూపముగా గల, నిజ = నా యొక్క, నాథమ్ = స్వామిని, త్వామ్ = నిన్ను, ఏవ = మాత్రమే, సాధు = చక్కగా, పశ్యేయమ్ = దర్శింతును.

**తాత్పర్యము :** లోకంలో గల సమస్త వస్తువులను చూస్తూ ప్రతిక్షణం వాని అన్నింటిలో అనంతుడవైన నిన్నే చక్కగా దర్శింతును.

**శ్లో ॥ భవదంగగతం తమేవ కస్మాత్ – న మనః పర్యటతీష్టమర్థమర్థమ్।**
**ప్రకృతిక్షతిరస్తి నో తథాస్య – మమ చేచ్ఛా పరిపూర్యతే పరైవ ॥ 20**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, అంగగతమ్ = అంగములైన, తం ఏవ ఇష్టమ్

= ఆ ఇష్టమైన, అర్థం అర్థమ్ = విషయములను, మనః = మనస్సు, కస్మాత్ = యే కారణమువలన, న పర్యటతి = తిరుగకుండును ?, తథా = అట్లే, అస్య = నా మనస్సుయొక్క, ప్రకృతి = స్వభావము, క్షతిః = నష్టము, నో అస్తి = కాకున్నది ?, చ = మరియు, మమ = నా యొక్క, పరా ఇచ్ఛా = మహాలాలస, పరిపూర్యతే ఏవ = పూర్తియగును కదా.

**తాత్పర్యము :** స్వామీ! సృష్టి అంతా తమశరీరం కనుక అందులోని ప్రతి వస్తువున్నూ తమ శరీరాంగమే, ఒక అవయవమే. వీనియందు తిరుగుటవలన నా మనస్సు యొక్క స్వభావం నష్టం కాదు. నా కోరిక కూడా తీరుతుంది కదా.

మనస్సు స్వభావం చేత నిలుకడలేనిది. ప్రకృతిలోని పదార్థాలపై తిరుగుతూ ఉంటుంది. దానిని నిలువరించాలని వ్యర్థప్రయత్నం ఎందుకు ? దానిని అట్లాగే తిరుగనిస్తే దాని సహజ ప్రవర్తన దానికే ఉంటుంది. ఉండనివ్వండి. నా సాధనను దానికనుగుణంగా మల్చుకుంటే సరిపోతుంది. ఎట్లాగంటే, నా మనస్సు లగ్నమయ్యే లౌకిక వస్తువులన్నిటా ఉన్నది ఆ పరమేశ్వరుడే కనుక, దానిని ఉత్తుత్తి సిద్ధాంతంగా తీసి పారవేయకుండ, ఆచరణలో ఆ సత్యాన్ని గ్రహించి, పాటిస్తూ, నా మనస్సు ధనం మీద లగ్నమైతే ధనాన్ని, స్త్రీ మీద లగ్నమైతే స్త్రీని, ఇట్లాగే సర్వపదార్థాలను శివ భావనతో దర్శిస్తే, అంటే, ఆయా పదార్థాలలో సూక్ష్మాతి సూక్ష్మ స్థితిలో ఆత్మ మాత్రుడుగా వెలిగే శివుని చూడగలిగితే, అంతే చాలు కదా. మనస్సును శివునిపై నిలువు, నిలువుమని బ్రతిమాలటం, భంగపడటం, నిర్బంధించటం, ఈ గొడవెందుకు ? శాంతియుతంగా సమస్య పరిష్కారమై పోతుంది. అట్లా జరిగేట్లు అనుగ్రహించు స్వామీ!, అంటూన్నాడు కవి.

**శ్లో ॥ శతశః కిల తే తవానుభావాత్ – భగవన్ కేఽప్యమునైవ చక్షుషా యే ।**
**అపి హాలికచేష్టయా చరన్తః – పరిపశ్యన్తి భవద్వపుః సదాగ్రే ॥ 21**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ భగవంతుడా!, కిల = నిస్సందేహముగ, తే = వారు, కే అపి = ఎవరైనను, శతశః = వందలకొలది, యే = ఎవరు, హాలికచేష్టయా = అజ్ఞానులవలె, గ్రామీణులవలె, చరన్తః = తిరుగుచు, అపి = కూడా, తవ = నీ యొక్క, అనుభావాత్ = ప్రభావము వలన, భవత్ = నీ యొక్క, వపుః = శరీరము, సదా = ఎల్లప్పుడు, అగ్రే = ప్రత్యక్షముగా, అమునా ఏవ చక్షుషా = ఈ కనులతోనే, పరిపశ్యన్తి = దర్శింతురు.

**తాత్పర్యము :** ఓ భగవాన్! నీ ప్రభావము వలన వందల కొలది అలౌకిక భక్తులు

నిస్సందేహంగా అనాగరికులవలె, అజ్ఞానుల వలె తిరుగుతూగూడ, నీ చిద్రూపమును కనులార చూచుచునే ఉందురు.

ఇది అవధూతలైన భక్తుల విషయము. వారికి ధ్యానంలో ఉన్నప్పుడే కాక ఉత్థానంలో కూడ వారికి దైవం ప్రత్యక్షమే. దీనిని open trance అంటారు. వారు ఈ కన్నులతోనే ప్రాకృతికమైన చెట్టు, పుట్ట, మనిషి, పశువు, పక్షి ఆది చరాచరవస్తుజాలాన్నీ చూస్తూంటారు. ఈ రూపాలన్నిటినీ అధిష్ఠించియున్న జ్ఞానరూపచైతన్యాన్ని చూస్తూంటారు. దేవుని మీరు చూచినారా? అని వివేకానందుడు రామకృష్ణుని ప్రశ్నించినప్పుడు, నిన్ను చూస్తూన్నంత స్పష్టంగానూ దేవుని కూడా చూస్తూన్నాను, అని చెప్పిన సమాధానాన్ని స్మరించుకోవలె. **హాలికుడంటే** రైతు. హాలికచేష్ట అంటే అజ్ఞాని, అవిద్యావంతునిచేష్ట, అనాగరికచేష్ట అని జాతీయం యేర్పడింది.

**శ్లో ॥ న సా మతిరుదేతి యా న భవతి త్వదిచ్ఛా మయీ**
**సదా శుభమథేతరద్భగవతైవమాచర్యతే ।**
**అతోఽస్మి భవదాత్మకో భువి యథా తథా సంచరన్**
**స్థితోఽనిశమబాధితత్వదమలాంఘ్రిపూజోత్సవః ॥ 22**

**ప్రతిపదార్థము :** సా = (ఆమె) ఆ, మతిః = బుద్ధి, న ఉదేతి = ప్రకాశింపదు, యా = ఏది, త్వద్ = నీ యొక్క, ఇచ్ఛామయీ = ఇచ్ఛననుసరించనిది, న భవతి = కాదో, ఏవమ్ = ఇట్లు, శుభమ్ = మంచిది, అథ = మరి, ఇతరత్ = చెడ్డది, సదా = ఎల్లప్పుడు, భగవతా = తమచేత, ఆచర్యతే = ఆచరింపబడుతుంది. అతః = అందువలన, భువి = లోకంలో, యథా తథా = ఎట్లో అట్లే, సంచరన్ = వ్యవహరించుచూ, భవత్ = తమయొక్క, ఆత్మకః = రూపముగలవాడను, అస్మి = అయియున్నాను, అనిశమ్ = నిరంతరము, అబాధిత = నిర్బంధములేని, త్వద్ = నీ యొక్క, అమల = మలినములేని, అంఘ్రి = పాదముల, పూజా + ఉత్సవః = పూజయందుత్సాహము గలవాడనై, స్థితః = ఉన్నాను.

**తాత్పర్యము :** స్వామీ! నా బుద్ధి మీ ఇచ్ఛననుసరించి మాత్రమే పని చేస్తుంది. కనుక అది చేసిన మంచిగాని, చెడ్డగాని, దానిది కాదు, దానిని నడిపించిన తమదే. అందువలన లోకవ్యవహారాన్ని అనుసరించి నేను నడుస్తూన్నాను. కాని నా ధ్యానం మీయందే. నిరంతరము ఐచ్ఛికముగా నేను తమ అమలినపాదపూజా ఉత్సాహంలో ఉండటం, ఆనందాన్ని పొందటం, అంతా నీ ఇచ్ఛానుసారమే జరుగుతూన్నది.

**శివునాజ్ఞలేనిదే చీమైన కుట్టదన్న సామెత సత్యమే.** భక్తులకు లోకవ్యవహారంలోని మంచిచెడ్డల ద్వంద్వంతో పనిలేదు. నిరంతరం శివ భావనలో ఆనందాన్ని పొందటమే వారిపని. అదే శివేచ్ఛ, దాని ప్రకారమే నేనున్నానని ఈ కవి భావన.

**శ్లో ॥ భవదీయగభీరభాషితేషు – ప్రతిభా సమ్యగుదేతు మే పురోఽతః ।**
**తదనుష్ఠితశక్తిరప్యతస్తద్ – భవదర్చా వ్యసనం చ నిర్విరామమ్॥ 23**

**ప్రతిపదార్థము :** (నాథ! = ఓ స్వామీ!), పురః = ముందు, మే = నా యొక్క ప్రతిభా = బుద్ధి, భవదీయ = మీ యొక్క, గభీర = గంభీరమైన, భాషితేషు = మాటలలో, ఉదేత్ = ప్రకాశించునుగాక!, తతః అపి = ఆ తరువాత, తత్ = దాని, అనుష్ఠిత = ఆచరించిన, శక్తిః = శక్తి, అతః చ = ఆ తరువాత, భవత్ = తమయొక్క, అర్చా తత్ వ్యసనమ్ = పూజయందలి ఆ గాఢమైన భావన, నిర్విరామమ్ = ఎడలేని విధముగా.

**తాత్పర్యము :** ఓ స్వామీ! మొదట నా బుద్ధి లేక నా ప్రతిభ తమను గురించి పెద్దలు చెప్పిన మాటలపై ప్రసరించి, ఆపై ఆ మాటల సారమైన కార్యాచరణ శక్తిని పొంది, అటు తరువాత మీ పూజా భావన నాలో నిరంతరాయంగా కలుగుగాక!

లౌకికాలౌకిక విషయాలలో బాలబాలికలకు ఆసక్తి, కార్యదీక్ష, కార్యదక్షత కలిగే విధానం వర్ణించబడింది ఈ శ్లోకంలో. భక్తి విషయమూ వేరు కానిదే. శ్రద్ధాసక్తులు కలగడానికి కారణం, తమకంటె పెద్దవారు తమ కన్నుల ఎదుట ఏమేమిచేస్తారో దాని వలన పొందిన ప్రేరణ. **యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః** అన్న గీతా వాక్యం అనుస్మరణీయం. ఈ ప్రేరణ నుండి కొంత అవగాహన కలిగి, దాని నుండి కార్యాచరణపై శ్రద్ధ, కార్య దీక్ష కలుగుతాయి. ఈ విధానం భక్తి భావన లోనూ పూజా విధిలో నిరంతర శ్రద్ధగాను పరిణమించాలని, ఈ కవి ఆకాంక్ష. అందుకు దైవానుగ్రహాన్ని కోరుతూ ప్రార్థన.

**శ్లో ॥ వ్యవహారపదేఽపి సర్వదా – ప్రతిభాత్వర్థకలాప ఏష మామ్ ।**
**భవతోఽవయవో యథా న తు – స్వత ఏవాదరణీయతాం గతః ॥ 24**

**ప్రతిపదార్థము :** ఏషః = ఈ, అర్థకలాపః = పదార్థములు, ఇంద్రియార్థములన్నియు, యథా = ఏ విధముగా, భవతః = మీ యొక్క, అవయవః = అంగమో, వ్యవహారపదే అపి = వ్యవహారంలో కూడా, మామ్ = నన్ను, సర్వదా = ఎల్లప్పుడు, ప్రతిభాతు = ప్రకాశించుగాక, తు = కాని, స్వః ఏవ = తనంత తానే ఆదరణీయతాం గతః = ఆదరింపదగినదై, న = కాదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఇంద్రియానందము నిచ్చు ఈ లౌకిక వస్తుజాలమంతా మీ అవయవమే. ఈ భావంతోనే నిత్య లౌకిక వ్యవహారంలో కూడా నేను ఆ యా పదార్థాలను గౌరవించేట్లు అనుగ్రహించు. అంతే తప్ప వాని వలన నాకు ఇంద్రియ సుఖం కలుగుతూన్నదని మాత్రం ప్రత్యయం కలుగనీయకు.

భౌతిక పదార్థాలన్నీ మానవునకు సుఖాన్నిచ్చేవే, ఆ సుఖం ఇంద్రియాల ద్వారా అందుతుంది. సుఖానికి, అంటే, ఆనందానికి నిధి, ప్రదాత శివుడు. కనుక ఈ భౌతిక ప్రపంచం శివుని శరీరంగా చెప్పబడింది. ఈ సత్యాన్ని సిద్ధాంతంగా తెలిసి, కొంత అనుభవంలో అన్వయించికొన్నాను. ఆ సత్యమే నా లౌకిక జీవన యాత్రలో సర్వత్ర భాసించవలెనని కోరిక, ప్రార్థన. భౌతికపదార్థమేదిగాని తనంత తానుగా ఆదరణీయం కాదు. అంటే, భౌతికప్రకృతికీ శివునకూ అభేదభావంతో వ్యవహరించే ప్రజ్ఞను ప్రసాదించుమని ప్రార్థన.

**శ్లో ॥ మనసి స్వరసేన యత్ర తత్ర – ప్రచరత్యప్యహమస్య గోచరేషు ।**
**ప్రసృతోఽప్యవిలోల ఏవ యుష్మత్ – పరిచర్యాచతురః సదా భవేయమ్ ॥ 25**

**ప్రతిపదార్థము :** మనసి = మనసున, స్వరసేన = నా ఆనందముతో, యత్ర తత్ర = ఎక్కడో అక్కడ, ప్రచరతి అపి = తిరుగుచూకూడ, అస్య = దీని యొక్క, గోచరేషు = విషయావగాహనలో, ప్రసృతః అపి = లగ్నమైనప్పటికి, అహమ్ = నేను, అవిలోలః ఏవ = చంచలుడను కాను, సదా = ఎల్లప్పుడు, యుష్మద్ = నీ యొక్క, పరిచర్యా = ఉపాసనలో, చతురః = నిపుణుడను, భవేయమ్ = అగుదను.

**తాత్పర్యము :** మనసులో ఆనందం నింపుకొని ఎక్కడ తిరుగుతూ ఉన్నప్పటికి, విషయావగాహనలో లగ్నమైనప్పటికీ, నేను చంచలుడను కాను, నీ ఉపాసనలో నిపుణుడనై యుందును గాక!

మనస్సుకు ఇంద్రియ తృప్తిలో ఆనందం. కనుక అది ఎప్పుడూ ఆ ఆనందాన్ని వెదుక్కుంటూ భౌతిక విషయాలలో తిరుగుతూ వానియందే మునిగి ఉంటుంది. అది తుమ్మెదవలె చంచలం. ఏ ఒక్క దాని మీద నిలువదు. అది దాని స్వభావం. ఉండనివ్వు. నా ఆత్మ మాత్రం నీయందే లగ్నమై ఉంటుంది. అది నిశ్చలం. కనుక ఆత్మనా నేను నీ పూజలోనే ఎప్పుడూ ఉంటాను. ఈ ఆనందాన్ని నా కనుగ్రహించు, స్వామీ! అన్నదే యీ భక్తకవి ప్రార్థన.

**శ్లో ॥ భగవన్! భవదిచ్ఛయైవ దాస – స్తవ జాతోఽస్మి పరస్య నాత్ర శక్తిః ।**
**కథమేష తథాపి వక్త్రబింబం – తవ పశ్యామి న జాతు చిత్రమేతత్ ॥ 26**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ స్వామీ!, భవత్ = తమ యొక్క, ఇచ్ఛయా ఏవ = ఇష్టానుసారమే, తవ = నీ యొక్క, దాసః = భక్తుడను, జాతః అస్మి = అయియున్నాను, అత్ర = ఈ విషయములో, పరస్య = ఇతరములకు, ఇతరునకు, శక్తిః = సామర్థ్యము, న = లేదు, తథా + అపి = ఐనను, కథమ్ = ఎట్లు, ఏషః = ఈ, తవ = నీదైన, వక్త్రబింబమ్ = ముఖ స్వరూపము, న జాతు = ఒకప్పుడైన, పశ్యామి = చూడనైతిని, ఏతత్ = ఇది, చిత్రమ్ = ఆశ్చర్యకరము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నేను నీ భక్తుడనగుటలో నీ ఇచ్ఛ తప్ప మరొక శక్తి యేదీ లేదు. ఐనగాని నాకు నీ దర్శనం ఎందుకు కలగటం లేదు ? ఇది ఆశ్చర్యం.

శివేచ్ఛలేనిదే శివ భక్తి కలుగదు, శివ దర్శనం కలుగదు అంటారు పెద్దలు. నాకు నీ భక్తి కలిగింది గాని, పరమేశ్వరా!, నీ దర్శనం ఇప్పటికీ కాలేదు. నాలో నీ యందు భక్తిని కలిగించిన నీ శక్తి, నాకు నీ దర్శనాన్ని కలిగించలేకపోయిందేమిటి!? ఇదేమి చిత్రం! ఘటనా ఘటన సమర్థమైన నీ సంకల్పం నా విషయంలో అసంపూర్ణఫలదం ఎట్లా అయింది! ఈ భక్తుని ఆరాటం, సమాధి స్థితిలో శివ దర్శనం లభించినప్పటికి వ్యుత్థాన దశలో, అంటే, వ్యవహార దశలో శివాంగంగా చెప్పబడే ప్రకృతిలో శివదర్శనం కాలేదేమని.

**శ్లో ॥ సముత్సుకాస్త్వాం ప్రతి యే భవన్తం - ప్రత్యర్థరూపాదవలోకయన్తి ।**
**తేషామహో కిం తదుపస్థితం స్యాత్ - కిం సాధనం వా ఫలితం భవేత్తత్ ॥ 27**

**ప్రతిపదార్థము :** త్వాం ప్రతి = నిన్ను గూర్చి, నీకై, సముత్సుకాః = ఉత్కంఠ అధికముగా గలవారు, యే = ఎవరు, భవన్తమ్ = తమరిని, ప్రత్యర్థరూపాత్ = ప్రతి వస్తువు రూపంలోను, అవలోకయన్తి = చూచుచున్నారో, తేషామ్ = వారికి, అహో = ఔరా!, తత్ కిమ్ = అదేమి, సాధనమ్ = సాధనము, ఉపస్థితమ్ = లభించినది, స్యాత్ = అయియుండును?, వా = లేక, తత్ కిమ్ = అదేమి, ఫలితమ్ = ఫలము, భవేత్ = అగును, లభించును ?

**తాత్పర్యము :** స్వామీ! నీయందు అమిత భక్తితో, నీ దర్శనం కోసం ఉత్కంఠితులైన వారు కొందరు లోకంలోని ప్రతి వస్తువులోను దర్శిస్తూన్నారు కదా, అంత సాఫల్యాన్ని వారికి అందించిన సాధనలేమి ? సాధనములేమి ?

భక్తియన్నది విశ్వ దర్శనమూ విశ్వ ప్రేమ అని నారదుడు నిర్వచించినాడు. భావం నిండా దేన్ని నింపుకొంటామో దానిని భౌతికంగానూ దర్శించగలమని

పెద్దలంటారు. దైవదర్శనం విషయంలో ఈ విషయాన్ని అనుభవంలోనికి తెచ్చికొన్నవారు కొందరున్నారు. వారేమి ప్రత్యేక సాధనలు చేసి యీ ఫలాన్ని సాధించినారని, ఈ కవి ఆశ్చర్యంగా ప్రశ్నిస్తూన్నాడు.

**శ్లో ॥ భావా భావతయా సన్తు భవద్భావేన మే భవ! ।**
**తథా న కించిదప్యస్తు న కించిద్భవతోఽన్యథా ॥ 28**

**ప్రతిపదార్థము :** భవ! = ఓ మహేశ్వరా!, భవత్ = మీ యొక్క, భావేన = సత్తాచేత, భావాః = వస్తుజాలము, మే = నాకు, భావతయా = స్వరూపసత్తాగా, సన్తు = అగుగాక!, కన్పించుగాక!, తథా = అట్లు, భవతః = మీ కంటె, అన్యథా = వేరుగా, కించిత్ = కొంచెముగూడ, న = కాదు, కించిదపి = కొంచెమైనను, న అస్తు = కాకుండు గాక!

**తాత్పర్యము :** ఓ భవా! వస్తువులు వేర్వేరుగా యేవి కన్పడుచున్నవో అవి అన్నీ తమ సత్తావలన ఉనికిని పొందినవి. నాకు ఆ విధముగానే గోచరించునుగాక! వేరు విధముగా గోచరించకుండు గాక!

శివునకు భవుడన్న పేరు ఉన్నది. దాని అర్థం, వాని వలన సమస్తమూ కలుగుతూన్నదని. సర్వమస్మాద్భవతీతి భవః. మరియొక విధముగా, భవతి భవతే వా సర్వమతి భవః, అంటే, అంతయు తానే యైనవాడు, అని ఈ విధంగా భవుని నుండి ఉద్భవించినవి కనుకే విశ్వవస్తువులన్నిటికి భావములని పేరు. కనుక విశ్వం శివరూపంగా కన్పించవలెనన్నది సహజసిద్ధమైన కోరిక, ఉన్నది ఉన్నట్లు కన్నించవలెనన్న ఆకాంక్ష, ఆ సత్తా స్వరూపం తప్ప మరేమీ కన్పించరాదని ఈ శివభక్తుని కోరిక.

**శ్లో ॥ యన్న కించిదపి తన్న కించిద – ప్యస్తు కించిదపి కించిదేవ మే ।**
**సర్వథా భవతు తావతా భవాన్ – సర్వతో భవతి లబ్ధపూజితః ॥ 29**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది, న కించిత్ అపి = ఏదీ కాదో, తత్ = అది, మే = నాకు, కించిత్ అపి = కొంచెమైన, న అస్తు = కాకుండు గాక!, కించిత్ అపి = కొంచెమైనదేది కలదో, (అది), సర్వథా = అన్ని విధముల, కించిత్ ఏవ = కొంచెమే, భవతు = అగుగాక!, తావతా = ఇంతమాత్రము చేత, భవాన్ = తమరు, సర్వతః = అన్ని తావుల, అన్ని దశలలో, లబ్ధపూజితః = లభించి పూజింపబడినవారు, భవతి = అగుచున్నారు.

**తాత్పర్యము :** కొంచెం కూడా కానిది కొంచెమైనా నాకు వద్దు. కొంచెమైనదెప్పుడూ కొంచెం గానే ఉండుగాక! ఇట్లా నీవు అన్ని విధముల, అన్ని తావుల, నా దశలన్నిటా పూజితుడవగుదువు.

వ్యక్తరూపంలో విశ్వరూపుడైన శివుడు భిన్ననామరూప గుణ క్రియామూర్తి. ఈ శివరూపం కొంచెమైన శివం అన్నట్లు కన్పించదు, అన్పించదు. ఈ ప్రకృతి నధిష్ఠించి పురుష రూపంలో ఉన్న శివుడు అసలే కన్నించనంత సూక్ష్మరూపుడు. ఈతడు ప్రకృతి వస్తుజాలంలో అంతటా నిండినవాడు. ఆ సూక్ష్మరూపుని దర్శనం సూక్ష్మంగానే కానివ్వు స్వామీ! నీవు అసలు కానేకానట్లు కన్నించే స్థూల నానాత్వరూపం అట్లే ఉండనివ్వు. నీ సూక్ష్మచిద్రూపం మాత్రం నాకు అన్ని దశలలోను దర్శనమిచ్చి నాచేత పూజింపబడుగాక! స్వానుభవైక దర్శనం మాత్రమే కల్గుగాక! పరోక్ష సైద్ధాంతిక దర్శనం కాదు.



శ్రీః

## 13. సంగ్రహ స్తోత్రమ్

**శ్లో ॥ సంగ్రహేణ సుఖదుఃఖలక్షణం - మాం ప్రతి స్థితమిదం శృణు ప్రభో ।**
**సౌఖ్యమేష భవతా సమాగమః - స్వామినా విరహ ఏవ దుఃఖితా ॥ 1**

**ప్రతిపదార్థము :** ప్రభో = ప్రభూ!, శృణు = విను, సంగ్రహేణ = క్లుప్తముగ, మాం ప్రతి = నాకు సంబంధించి, స్థితమ్ = ఉన్నటువంటి, సుఖ = సుఖము, దుఃఖ = దుఃఖము, లక్షణమ్ = వీని లక్షణమును, ఇదమ్ = ఈ, భవతా = తమతో, ఏషః = ఈ, సమాగమః = కలయిక, సౌఖ్యమ్ = సుఖము, స్వామినా = స్వామితో, విరహః = కలవకుండుట, ఏవ = మాత్రమే, దుఃఖితా = దుఃఖము.

**తాత్పర్యము :** నాకు సంబంధించినంతవరక సుఖదుఃఖాల లక్షణమిది అని నిర్వచిస్తాను ప్రభూ! విను. ఒక్క ముక్కలో, సుఖం అంటే నాకు నీతో కలిసి ఉండటం అని అర్థం. అట్లే, నీతో కలసి ఉండని విరహం నాకు దుఃఖం.

**శ్లో ॥ అన్తరప్యతితరామణీయసీ - యా త్వదప్రథనకాలికాస్తి మే ।**
**తామపీశ! పరిమృజ్య సర్వతః - స్వం స్వరూపమమలం ప్రకాశయ ॥ 2**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, త్వద్ = నీ యొక్క, అప్రథన = ప్రకటముగాకుండినట్టి, కాలికా = మాలిన్యము, అతితరామ్ = అత్యంతము, అణీయసీ అపి = సూక్ష్మమైనదే అయినను, యా = ఏది, మే = నా యొక్క, అంతర్ = లోన, అస్తి = కలదో, తామ్ = దానిని, అపి = కూడ, సర్వతః = పూర్తిగా, పరిమృజ్య = దూరము చేసి, స్వమ్ = నీదైన, అమలం స్వరూపమ్ = నిర్మలమైన రూపమును, ప్రకాశయ = ప్రకటించుము.

**తాత్పర్యము :** ఈశ్వరా! నాలో ప్రకటము కాకుండ నున్న మాలిన్యము, అది ఎంత అల్పమైనదైనను, దానిని దూరము చేసి, నాకు నీ నిర్మల స్వరూపమును చూపుము.

భక్తుని ప్రకృతిలో మాలిన్యమున్నట్లయిన, అది ఎంత సూక్ష్మమైనదైన, దానిని తొలిగించే బాధ్యత భగవంతునిదే. నిజానికి భక్తుని మాలిన్యం భగవంతునిదే. తనువు, మనసు, ఆత్మ, సమస్తం ఈశ్వరునిదే అయినప్పుడు భక్తుడు వేరుగా ఎక్కడున్నాడు? భక్తునికి తనదైన మాలిన్యమెక్కడిది?! కనుక తాను వేరు తన స్వామి వేరు అన్న ద్వయభావనను తొలగించి చూస్తే, మాలిన్యం మాయమవుతుంది. ఆ భావనను సంస్కరించి, భక్తుడు నిర్మలమైన, అద్వయ రూపాన్ని దర్శించవలెనని తపిస్తాడు.

**శ్లో ॥ తావకే వపుషి విశ్వనిర్భరే – చిత్సుధారసమయే నిరత్యయే ।**
**తిష్ఠతః సతతమర్చతః ప్రభుం – జీవితం మృతమథాన్యదస్తు మే॥ 3**

**ప్రతిపదార్థము :** తావకే = నీదైన, నిరత్యయే = అవినాశియైన, విశ్వనిర్భరే = జగద్రూపమున పూర్ణమైన, చిత్ + సుధారసమయే = జ్ఞానానందరూపమైన, అమృతముతోనిండిన, వపుషి = శరీరమున, తిష్ఠతః = లీనమై, సతతమ్ = ఎల్లప్పుడు, ప్రభుమ్ = స్వామిని, అర్చతః = అర్చించుటలో లగ్నమైన, మే = నాకు, జీవితమ్ = జీవితము, మృతమ్ = మరణము, అథ = లేకున్న, అన్యత్ అస్తు = మరియొకటి అగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! ఈ జగత్తు నీ శరీరము. దానియందు నీ అవినాశి జ్ఞానానంద రూపమును దర్శించి నిరంతరం ఆ అమృతత్వంతో జీవిస్తూ నిన్ను అర్చించటమో, మరణించటమో, మోక్షాన్ని పొందటమో, యేదైన ఒకటే. ఆ జీవితాన్ని నాకు ప్రసాదించు.

**శ్లో ॥ ఈశ్వరోఽహమహమేవ రూపవాన్**
**పండితోఽస్మి సుభగోఽస్మి కోఽపరః।**
**మత్సమోఽస్తి జగతీతి శోభతే**
**మానితా త్వదనురాగిణః పరమ్ ॥ 4**

**ప్రతిపదార్థము :** అహమ్ = నేను, ఈశ్వరః = ఈశ్వరుడను, అహం ఏవ = నేనే, రూపవాన్ = రూపవంతుడను, పండితః = పండితుడను, అస్మి = అయియున్నాను, సుభగః = భాగ్యవంతుడను, అస్మి = అయియున్నాను, జగతి = లోకంలో, మత్ సమః = నాతో సముడు, అపరః = రెండవవాడు, కః = ఎవడు, అస్తి = ఉన్నాడు, ఇతి = అను, మానితా = స్వాభిమానము, త్వద్ = తమ యొక్క, అనురాగిణః = భక్తులకు, పరమ్ = మిక్కిలి, శోభతే = శోభించును.

**తాత్పర్యము :** నేను ఈశ్వరుడను, రూపవంతుడను, పండితుడను, భాగ్యవంతుడను, అన్నీ నేను. లోకంలో నాతో సమానమైనవాడు వేరెవరున్నారు? అను ఈ స్వాభిమాన భావన ఒక్క శివభక్తులకు రాణించును, మిగతవారికి కాదు.

ఈశ్వరుడు పూర్తిగా స్వతంత్రుడు. ఇంద్రియజాలానికి కట్టుబడని ఈశ్వర యుక్తుడైన భక్తుడే ఈశ్వరుడు, స్వతంత్రుడు మరొకడు లేడు. **రూపవాన్** అంటే రూపముగలవాడు అని అర్థం. లోకంలో నా శరీరమే నా రూపం అనుకొనేవారు నిజంగా రూపవంతులు కారు. కారణం, వారి శరీరం అనుక్షణం మార్పులకు లోనవుతూ ఉండేది కనుక దానికి నిజానికొక రూపమంటూ లేదు. కాని భక్తుడు ఈ సత్యాన్నెఱిగి, మార్పులకు లోబడక ఎప్పుడూ ఒకే విధంగా నిలిచే జ్ఞానానందమే తన రూపమని దర్శించినవాడు కనుక అతడే రూపవంతుడు.

పండా గలవాడు **పండితుడు**. పండా అంటే సమ్యక్తత్త్వదర్శినీ ప్రజ్ఞా, అనగా, తాత్త్వికసత్యాన్ని చక్కగా దర్శించగల ప్రజ్ఞ. ఇది కలిగిన భక్తునకు గ్రంథపఠనం, విద్యాలయ విద్యార్హతలక్కరలేదు. మహాభక్తులై ఈ పండా కలిగిన భక్తులు భక్తురాండ్రు లౌకిక విద్యావంతులుకారు. కాని వారే పండితులనదగినవారు. వ్యాకరణాది శాస్త్రాలు అప్పజెప్పగలవారు కారు.

**సుభగుడు** అంటే పూర్తిగా భగముగలవాడు, భగవంతుడు. భగము అంటే, లోకం పుట్టక – నాశము, సృష్టిలోని ప్రతియొక్కదాని పుట్టుక – చావు, విద్య – అవిద్య అన్న లక్షణాలు గల ప్రకృతి. ఈ ప్రకృతిని శాసించువాడు సుభగుడు. ఈశ్వరయుక్తుడైన భక్తుడు గూడ ఈ జ్ఞానము, శక్తి కలిగినవాడు కనుక ఆతడే సుభగుడు.

**శ్లో ॥ దేవదేవ! భవదద్వయామృతా – ఖ్యాతిసంహరణలబ్ధజన్మనా ।**
**తద్యథాస్థితపదార్థసంవిదా – మాం కురుష్వ చరణార్చనోచితమ్॥ 5**

**ప్రతిపదార్థము :** దేవ దేవ = దేవతల దేవుడవైన ఓ దేవా!, తద్ = అందువలన, భవత్ = తమయొక్క, అద్వయ + అమృత + అఖ్యాతి = రెండు కాదు అను భావామృతము యొక్క అజ్ఞానము యొక్క, సంహరణ = నష్టమువలన, లబ్ధ = పొందబడిన, జన్మనా = జన్మచేత, యథాస్థిత = స్వాభావికమైయున్న, పదార్థ = పదార్థములయొక్క, సంవిదా = జ్ఞానము నుండి, మామ్ = నన్ను, చరణ = పాదముల యొక్క, అర్చన = పూజ చేయుటకు, ఉచితమ్ = తగినవానినిగా, కురుష్వ = చేయుము.

**తాత్పర్యము :** ఓ దేవ దేవా! అద్వయ భావనను కోల్పోయి ఈ జన్మనుపొంది, పదార్థ జ్ఞానంతో స్వాభావికంగా జీవిస్తూన్న నన్ను, అందువలన, నీ పాదార్చనకు తగునట్లు మలుచుకో, స్వామీ!

శివపూజకు యోగ్యత ప్రధానంగా, అమృతాద్వయభావనను తిరిగిపొందటం. ఆ భావన నష్టమైనందు వలననే పదార్థ విజ్ఞానం ఆధారంగా జీవించే పశువుగా మారి పాశబద్ధుడవుతూన్నాడు మానవుడు. కాని ప్రగాఢ భక్తి వలన తిరిగి నష్టపోయిన అద్వయ భావనను పొందవచ్చు. ఆ భక్తిని తీవ్రతరంగా ఆస్వాదిస్తూ శివమయుడయ్యే యోగ్యతను సాధించుకోవలసినది భక్తుడే అయినప్పటికి అది భగవదనుగ్రహం వలన మాత్రమే సాధ్యం అన్న భావనతో ఈ భక్త కవి ప్రార్థిస్తూన్నాడు.

**శ్లో ॥ ధ్యాయతే తదను దృశ్యతే తతః - స్పృశ్యతే చ పరమేశ్వరః స్వయమ్।**
**యత్ర పూజనమహోత్సవః స మే - సర్వదాస్తు భవతోఽనుభావతః॥ 6**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, పరమేశ్వరః = పరమేశ్వరుడు, స్వయమ్ = తనంత తాను, ధ్యాయతే = ధ్యానింపబడునో, తదను = దానిననుసరించి, దృశ్యతే = దర్శింపబడునో, తతః చ = ఆపై, స్పృశ్యతే = స్పర్శానుభవము కలుగునో, సః = అట్టి, పూజన = పూజ యొక్క, మహా = గొప్ప, ఉత్సవః = ఉత్సవము, భవతః = మీ యొక్క, అనుభావతః = ప్రభావముచే, మే = నాకు, సర్వదా = ఎల్లవేళల, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** ఎక్కడ సహజముగ పరమేశ్వరుని ధ్యానం అవ్యాజంగా కలుగుతుందో, ఆ ధ్యానం వలన దర్శనం లభిస్తుందో, ఆ దర్శనం స్పర్శనంగా పరిణమిస్తుందో, అక్కడ అది పూజామహోత్సవం అనదగినది. ఇట్టి మహోత్సవం నాకు మీ అనుగ్రహం వలన ఎల్లప్పుడు కలుగుగాక!

పూజ స్వభావ సిద్ధంగా కలిగే ధ్యానంతో మొదలవుతుంది. ఏదో కారణంగానూ, కోరికతోనూ చేసే పూజకు ధ్యానం ప్రాతిపదికగా ఉండదు. అది యొక లాంఛన మాత్రంగా ఉంటుంది. ఫలమూ అంతే. అట్లాకాక, అవ్యాజ శివ ధ్యానం కలిగితే దాని పరిణామం వేరుగా ఉంటుంది. అటువంటి ధ్యానం కేవలం దైవ ప్రేమ వలన కలుగుతుంది. అది భక్తికి పరాకాష్ఠ. ఆ ధ్యాన ఫలంగా ఈశ్వర దర్శనం కలుగుతుంది. దర్శనం వలన ప్రేమ ముప్పిరిగొనగా శివ స్పర్శనం సైతం కలుగుతుంది. శివ స్పర్శనం కలిగిన భక్తుడు శివయుక్తుడై శివుడే కాగలడు. ఈ జన్మ కది మహోత్సవం కాక మరేమవుతుంది? ఆ స్థితి తనకూ కలగాలని ఈ భక్తుని ప్రార్థన.

శ్లో ॥ యద్యథాస్థితపదార్థదర్శనం - యుష్మదర్చనమహోత్సవశ్చ యః ।
యుగ్మమేతదితరేతరాశ్రయం - భక్తిశాలిషు సదా విజృంభతే ॥ 7

**ప్రతిపదార్థము :** యత్ = ఏది, యథాస్థిత = స్వాభావిక స్వరూపంలో ఉన్న, పదార్థ = వస్తువుల యొక్క, దర్శనమ్ = జ్ఞానమో, యః చ = మరియునేది, యుష్మద్ = నీ యొక్క, అర్చన = పూజారూపమైన, మహా = గొప్ప, ఉత్సవః = ఉత్సవమో, ఏతత్ = ఈ, యుగ్మమ్ = రెండున్ను, ఇతర + ఇతర = ఒకదానికొకటి, ఆశ్రయమ్ = ఆధారమైనది, భక్తిశాలిషు = భక్తి గలవారియందు, సదా = ఎల్లప్పుడు, విజృంభతే = వికసించును.

**తాత్పర్యము :** ప్రాకృతిక వస్తువులను వాని వాని స్వాభావిక రూపాలలో అర్థం చేసికొనటం ఒకటి, నీ అర్చన రూపమైన మహోత్సవమొకటి, ఈ రెండున్ను, పరస్పరాశ్రయ విషయాలు. ఇవి సద్భక్తులలో వికసించి ఉంటాయి.

లౌకిక పదార్థ విజ్ఞానమున్ను ఆధ్యాత్మిక భక్తి తత్పరతయు లౌకికుల దృష్టిలో పరస్పర విరోధులు. ఎందుకంటే, లౌకిక విజ్ఞానం ఇంద్రియగ్రాహ్యమైన అనేకత్వం, వైవిధ్యం, ఈ వైవిధ్యంలోని పరస్పరవైరుద్ధ్యం ఇదే పరమ, చరమ సత్యం అంటుంది. ఆధ్యాత్మిక భక్తితత్త్వం, ఇందుకు భిన్నంగా, ఈ అనేకత్వం కేవల ఇంద్రియజ్ఞానమే తప్ప పరమమూ చరమమూ కాదు అంటుంది. ఈ అనేకత్వంలో ఒక ఏకత్వం గూడా లీలామాత్రంగానే అయినా గ్రాహ్యరూపంలోనే నిత్యమూ అనుభవంలో ఉండనే ఉన్నది, అంటుంది. కన్పించేది ప్రకృతిలో బాహ్యమైన వైవిధ్యమే తప్ప వైరుద్ధ్యం కాదు, అంటుంది. కాని, భక్తుడు ఈ రెండు సత్యాలనూ ఏకకాలంలో అనుభవించినవాడు కనుక ఈ రెండున్నూ శరీరమూ, జీవమూ వలె పరస్పర పూరక సత్యాలే తప్ప విరోధమేమీ లేదు, అంటాడు. ఇట్లా లౌకిక-పారలౌకిక జ్ఞానాన్ని భక్తుడు అభేదంగా గ్రహించగలడు.

శ్లో ॥ తత్తదింద్రియముఖేన సన్తతం - యుష్మదర్చనరసాయనాసవమ్ ।
సర్వభావచషకేషు పూరితే - ష్వాపిబన్నపి భవేయమున్మదః ॥ 8

**ప్రతిపదార్థము :** పూరితేషు = పూరింపబడిన, సర్వభావ = సమస్త పదార్థరూపమైన, చషకేషు = పాత్రలలో, తత్ తత్ = ఆ యా, ఇంద్రియముఖేన = ఇంద్రియముల ద్వారా, యుష్మద్ = నీ యొక్క, అర్చన = పూజయను, రసాయన ఆసవమ్ = ఆనందరూపమైన మదిరను, సన్తతమ్ = ఎల్లప్పుడు, ఆపిబన్ = త్రాగుచు, అపి = కూడా, ఉన్మదః = మత్తిల్లినవాడను, భవేయమ్ = అగుదును.

**తాత్పర్యము :** ప్రాకృతిక పదార్థములన్నీ పానపాత్రలు కాగా, నీ పూజలోని ఆనందాసవాన్ని ఇంద్రియాల ద్వారా మదిరను వలె త్రాగుతూ మత్తిల్లిపోతాను.

మత్తుపానీయం **మదిర**. దానిని త్రాగే వానికొక పానపాత్ర కావాలి. త్రాగటంతో అవయవాలు, మనస్సు అంతా మత్తులో మునిగిపోతుంది. ఈ భక్తుడు కూడ త్రాగి మత్తిల్లాలని కోరుకుంటున్నాడు. ఇతడు త్రాగాలనుకునే మదిర శివపూజలో కలిగే ఆనందం. ఆ మదిరను త్రాగటానికి ఉపయోగపడే పానపాత్ర సృష్టిలోని సమస్త పదార్థాలున్ను. ఆ పదార్థాలు పానపాత్రలుగా తాను తన జ్ఞాన కర్మేంద్రియాలన్నిటి తోనూ త్రాగవలెనని భావం. అంటే, శివ పూజలో తన జ్ఞాన కర్మేంద్రియాలన్నీ పూర్తిగా నిమగ్నం కావాలని, ఆ పూజానందంలో తమను తాము మర్చిపోయి, తమ పానపాత్రలైన ప్రాకృతిక వస్తుజాలంలో అంతటా ఆ శివునే దర్శిస్తూ పారవశ్యంలో తేలిపోవాలని ఈ భక్తకవి కోరిక. **ఆపిబన్** అంటే అడుగంట త్రాగుతూ అని, drinking to the lees, అన్నట్లు. అట్లే ఉన్మదః అన్నది కూడా ఆ మత్తు ఎంత గాఢమైనదో చెబుతుంది. అంత పారవశ్యంలో తప్ప ప్రకృతియొక్క శివ స్వరూపం దర్శనం కాదు.

**శ్లో ॥ అన్యవేద్యమణుమాత్రమస్తి న - స్వప్రకాశమఖిలం విజృంభతే ।**
**యత్ర నాథ! భవతః పురే స్థితిం - తత్ర మే కురు సదా తవార్చితుః ॥ 9**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, యత్ర = ఎక్కడ, అన్య = మరియొక, వేద్యమ్ = తెలియదగినది, అణుమాత్రమ్ = అత్యల్పమైనను, న అస్తి = లేదో, అఖిలమ్ = సర్వము, స్వప్రకాశమ్ = స్వయముగ ప్రకాశించునదియై, విజృంభతే = వికసించునో, తత్ర = అక్కడ, భవతః = మీ యొక్క, పురే = నగరమున, తవ = నీ యొక్క, అర్చితుః = పూజలో లగ్నమైన, మే = నాకు, సదా = ఎప్పుడును, స్థితిం కురు = ఉనికినిమ్ము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎక్కడ నీవు తప్ప తెలియదగినది ఎంతమాత్రము లేదో, అంతయు స్వప్రకాశమై వికసించునో, అక్కడ, మీ నగరమున, మీ పూజలో లగ్నమైన నాకు ఎప్పుడు నివసించే యోగ్యతను ప్రసాదించు.

ఈ లోకంలో ఉన్నప్పుడు ఇది నీ పురమన్న భావనతో, ఇక్కడ నిన్ను తప్ప తెలియదగినది లేదన్న భావనతో సమస్త పదార్థాలలో నిన్నే చూస్తూండాలి. ఎందుకంటే, ఈ విశ్వం నీ శరీరం కనుక. అట్లే, నా యీ పాంచభౌతిక శరీరంతో ఉన్నంతకాలం, ఈ శరీరం ప్రాకృతికం కనుక నీ శరీరమే. ఇందులో పురుషరూపాన కొలువున్నవాడవు నీవే. **పురి శేతే ఇతి పురుషః** అన్న వ్యుత్పత్తిని బట్టి ఈ శరీరం నీ పురము, ఇందున్న

పురుషుడవు నీవు, అన్న జ్ఞానంతో జీవించేట్లు అనుగ్రహించు. ఈ శరీరాన్ని లోకాన్ని విడచినప్పుడు ఆత్మరూపంలో పరమాత్మవైన నీవే గమ్యమన్న జ్ఞానంతో జీవించిన నాకు కైలాసవాసాన్ని ప్రసాదించు. నీవు కానిదేదీ నాకు వద్దు, అన్నది ఈ కవి ప్రార్థన.

**శ్లో ॥ దాసధామ్ని వినియోజితోఽప్యహం - స్వేచ్ఛయైవ పరమేశ్వర! త్వయా ।**
**దర్శనేన న కిమస్మి పాత్రితః - పాదసంవహనకర్మణాపి వా ॥ 10**

**ప్రతిపదార్థము :** పరమేశ్వర! = ఓ పరమేశ్వరా!, త్వయా = నీ చేత, స్వేచ్ఛయా ఏవ = నీ కోరిక మేరకే, అహమ్ = నేను, దాసధామ్ని = దాసుని పదవిలో, వినియోజితః అపి = నియోగింపబడినప్పటికిని, దర్శనేన = దర్శనముతో, వా = మరియు / లేక, పాదసంవహనకర్మణా = పాదములొత్తు పనితో, అపి = కూడ, పాత్రితః = పాత్రుడనుగా, న అస్మి = చేయబడలేదు, కిమ్ = ఏమి?

**తాత్పర్యము :** పరమేశ్వరా! నన్ను నీ దాసునిగా నీవే అంగీకరించి నియమించినావు కదా, ఐనప్పటికిన్ని నా కింతవరకు నీ దర్శనము లభింపలేదు, నీ పాదములొత్తు భాగ్యమైన కలుగలేదు. ఇదేమి? నేనందులకపాత్రుడనా?

**దర్శనం** అంటే ఆత్మనా శాంభవసమావేశమనిన్నీ, పాదసంవహనం అంటే రుద్రశక్తి సమావేశానందమనిన్నీ శైవసాంప్రదాయికార్థం. సాధారణార్థంలో నీ సేవా పారవశ్యమని చెప్పవచ్చు. దైవేచ్ఛ లేనిదే భక్తుడు కాలేడు. శివేచ్ఛ లేనిదే శివ భక్తుడు కాడన్నది సూత్రం. దానిని బట్టి నీ ఇచ్ఛ ప్రకారమే నేను నీ భక్తుడనైనాను కదా, అంటూన్నాడీ భక్తకవి. నన్ను సేవకునిగా ఎంచుకున్నందుకు కలిగిన సంతోషం నిరాశగా మారేట్లు నాకు నీ దర్శనమూ లేదు పాదసేవావకాశమూ లేదు. ఎందుకు?

**శ్లో ॥ శక్తిపాతసమయే విచారణం - ప్రాప్తమీశ! న కరోషి కర్హిచిత్ ।**
**అద్య మాం ప్రతి కిమాగతం యతః - స్వప్రకాశనవిధౌ విలంబసే॥ 11**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ ఈశ్వరా!, శక్తిపాతసమయే = శక్తి పాతము జేయు సమయమున, విచారణమ్ = విచారించుట, ప్రాప్తమ్ = కర్తవ్యం, కర్హిచిత్ = ఎప్పుడును, న కరోషి = నీవు చేయవు, అద్య = నేడు, మాం ప్రతి = నన్ను గూర్చి, కిమ్ = ఏమి, ఆగతమ్ = వచ్చిపడినది?, యతః = ఎందువలన, స్వప్రకాశనవిధౌ = స్వయం ప్రకాశమానుడవు అగుటలో, విలంబసే = ఆలస్యముచేయుచున్నావు.

**తాత్పర్యము :** ఈశ్వరా! నేను మీ అనుగ్రహమునకు తగుదునా తగనా అని శక్తిపాత సమయముననే విచారించుకొనుట సముచితము. కాని, ఆ పని నీవెన్నడు చెయ్యవు.

నేడు నా విషయంలో ఏమి వచ్చి పడినది? ఎందుచేత నీవు నాకు ప్రకాశమానుడవగుట లేదు? దేని గురించి ఈ ఆలస్యము?

**నిషేధవ్యాపారరూపా శక్తిః**, ఇంద్రియ విషయాల ద్వారా పొందే జ్ఞానాన్ని నిషేధించేది, విమర్శరూపమైనది శక్తి. ఇది తాత్త్విక నిర్వచనం. దీనిని బట్టి ఇంద్రియ విషయజ్ఞానం తప్ప అన్యమెఱుగని లౌకికులు శక్తి హీనులు, అనగా, విమర్శించే సామర్థ్యం లేనివారు, వారికున్న శక్తి లౌకిక దృష్ట్యా, ఒక కార్యం జరిగినపుడు దానినాధారంగా, ఆ కార్యనిర్వాహక సామర్థ్యాన్ని ఊహించటం. **శక్తిపాతం** అన్నది పరమేశ్వరానుగ్రహమే. ఇది విమర్శరూపశక్తి. దీన్ని పొందటం శక్తిపాతం, ఈశ్వర ప్రసాదం. ఆత్మజ్ఞానవివేచనను ప్రసాదించిన తర్వాత భగవత్సాక్షాత్కారం కలుగవలసియుండగా, అదెందుకు ఆలస్యమవుతూన్నదని ఈ భక్తుని వేదన.

**శ్లో ॥ తత్ర తత్ర విషయే బహిర్విభా – త్యన్తరే చ పరమేశ్వరీయుతమ్ ।**
**త్వాం జగత్త్రితయనిర్భరం సదా – లోకయేయ నిజపాణిపూజితమ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** బహిః = వెలుపల, అన్తరే చ = లోపలయున్ను, విభాతి = ప్రకాశించుచున్నాడు, తత్ర తత్ర = అక్కడక్కడ అంతటా, విషయే = విషయమున, పరమేశ్వరీయుతమ్ = పరాశక్తితోగూడిన, జగత్–త్రితయ నిర్భరమ్ = మూడు లోకములలో నిండియున్న, త్వామ్ = నిన్ను, నిజ = నా యొక్క, పాణి = చేతులతో, పూజితమ్ = పూజింపబడువానిగా, సదా = ఎల్లప్పుడు, లోకయేయ = చూచుచుందును.

**తాత్పర్యము :** లోపల, వెలుపల, అంతటనూ మూడు లోకాలలో పరాశక్తిని గూడి ప్రకాశిస్తూన్న నిన్ను నా చేతితో ఎల్లవేళల పూజిస్తూ చూచుచుందును.

బహిః, వెలుపల, అంటే ప్రకృతిలో, జగత్తులో.

అన్తర్, లోపల, అంటే చిత్తంలో, మనస్సులో.

సదా, ఎల్లప్పుడు, అంటే, ధ్యాన సమాధిలోనూ, వ్యుత్థాన సమయంలోనూ అని భావం.

**శ్లో॥ స్వామిసౌధమభిసంధిమాత్రతో – నిర్విబంధమధిరుహ్య సర్వదా ।**
**స్యాం ప్రసాదపరమామృతాసవా – పానకేలిపరిలబ్ధనిర్వృతిః ॥ 13**

**ప్రతిపదార్థము :** అభిసంధిమాత్రతః = ఇష్టపూర్వకముగ, స్వామిసౌధమ్ = స్వామియొక్క సౌధమును, నిర్విబంధమ్ = నిర్బంధములేకుండగ, అధిరుహ్య = పై కెక్కి, సర్వదా =

ఎల్లప్పుడు, ప్రసాద = అనుగ్రహమను, పరమ = అత్యుత్తమ, అమృత + ఆసవ = అమృతప్రాయమైన మదిరను, ఆపానకేలి = పానముచేయు క్రీడవలన, పరిలబ్ధ = లభించిన, నిర్వృతిః = నిర్వృత్తిగలవాడను, స్యామ్ = అగుదును.

**తాత్పర్యము :** ఇష్టపూర్వకముగ స్వామి సౌధమును ఆరోహించి, ఎల్లప్పుడు అనుగ్రహమును ఆసవముగా పానము చేయుచు, పరమానందభరితుడనగుదును.

**సౌధమనగా,** శాక్తపదమని శైవసాంప్రదాయికార్థము. అధిరుహ్య, పైకెక్కి, అనుటవలన ఉద్దిష్టమైనది అత్యున్నతమైన శాక్తపదమని గ్రాహ్యము. ఈ పదమును యే ఆటంకములులేకనే ఇష్టమాత్రమున, అనగా, ఎటువంటి లాంఛనములు లేకుండ, పొంది, ఆ అనుగ్రహము నాస్వాదించుచు పరవశించి నిర్వృత్తి, అనగా మోక్షము నందుదునని ఈ భక్తుని ఆకాంక్ష.

నిర్వృత్తి అనగా వృత్తిలేనిది. వృత్తులు : 1. సంకల్పము, 2. విషయగ్రహణం అనే ఇంద్రియవృత్తి, 3. శబ్దశక్తి (అభిద, లక్షణ, వ్యంజన), 4. వ్యాఖ్య, టిప్పణి, వివరణ అనునవి. ఈ వృత్తుల ఆవశ్యకత లేని స్థితి, మోక్షము, పరమానందము.

**శ్లో॥ యత్సమస్తసుభగార్థవస్తుషు - స్పర్శమాత్రవిధినా చమత్కృతిమ్ ।**
**తాం సమర్పయతి తేన తే వపుః - పూజయన్త్యచలభక్తిశాలినః ॥ 14**

**ప్రతిపదార్థము :** యత్ = ఏది, సమస్త సుభగ+అర్థవస్తుషు = అందమైన ప్రయోజన కారియైన వస్తువులన్నిటియందు, స్పర్శమాత్రవిధినా = కేవలము స్పర్శమాత్రం చేతనే, తాం చమత్కృతిమ్ = ఆ చమత్కారమును, సమర్పయతి = సమర్పించునో, తేన = దానిచేత, అచలభక్తిశాలినః = దృఢమైన భక్తిగలవారు, తే = నీయొక్క, వపుః = శరీరమును, పూజయన్తి = పూజించుచున్నారు.

**తాత్పర్యము :** ఈ వస్తుప్రపంచం అందమైనది, ప్రయోజనకారియైనది. కాని దానికి మూలమైన ప్రకాశము నీవు. ఈ రహస్యాన్ని తెలిసి నీయందు దృఢభక్తిగలవారు అభేద బుద్ధితో ఈ వస్తుప్రపంచాన్ని పూజిస్తూంటారు.

విగ్రహారాధనలోని రహస్యం ఇక్కడ సుబోధమవుతున్నది. వస్తుప్రపంచంలోని జీవనిర్జీవపదార్థాలన్నిటిలోగల చైతన్యం శివశక్త్యాత్మకమనీ, ఆ అభివ్యక్తియే సృష్టియని తత్త్వవేత్తలంటారు. కనుక పదార్థస్వరూపాన్ని ఆశ్రయించి, from the concrete to the abstract, సరూపసత్యంనుండి అరూపసత్యానికి ప్రయాణం విగ్రహారాధన పరిణామఫలం. సృష్టి అరూపంనుండి సరూపానికి పరిణామమైతే భక్తి దానికి విలోమం.

అరూపదైవారాధనలో సైతం ప్రార్థన సరూపభగవంతునికే, సగుణపరమాత్మకే. నిర్గుణ పరబ్రహ్మానికి అర్చన, ప్రార్థన నిష్ఫలం, నిరర్థకం, నిర్గుణానికి ప్రతిస్పందన, ప్రసాదనం ఉండనే ఉండవు కదా. విగ్రహంతో మొదలై సమస్తప్రకృతి శివచైతన్య దర్శనంగా భాసించటం లక్ష్యం.

**శ్లో॥ స్ఫారయస్యఖిలమాత్మనా స్ఫురన్ – విశ్వమామృశసి రూపమామృశన్ ।**
**యత్ స్వయం నిజరసేన ఘూర్ణసే – తత్ సముల్లసతి భావమండలమ్ ॥ 15**

**ప్రతిపదార్థము :** ఆత్మనా = ఆత్మచే, స్ఫురన్ = ప్రకాశించుచు, అఖిలం విశ్వమ్ = ప్రపంచమంతా, స్ఫారయసి = వికసింపజేతువు, రూపమ్ = రూపమును, ఆమృశన్ = ప్రకాశింపజేయుచు, ఆమృశసి = ఆస్వాదింతువు, యద్ = ఏది, స్వయమ్ = స్వయముగ, నిజరసేన = తనదైన చిదానందముతో, ఘూర్ణసే = తిరుగుచుందువు, తద్ = అది, భావమండలమ్ = పదార్థసమూహము, సముల్లసతి = ఆనందనాట్యము చేయుచున్నది.

**తాత్పర్యము :** ఆత్మగా ప్రకాశస్తూ విశ్వాన్ని వికసింపజేసి, దానిని నీవే ఆస్వాదించి, చిదానందంతో తిరుగుతూంటావు. నీతో ఈ విశ్వంలోని సమస్తపదార్థాలూ చేరి ఆనందంతో నాట్యం చేస్తూంటాయి.

అరూపమైన చిత్ప్రకాశంగా భాసించే ఆత్మ సరూపప్రకృతిగా వెలిసింది. ఈ సృష్టి ఆ ఆత్మయొక్క అమృతత్వబృంహణమే, విస్తారమే. ఆత్మ స్పర్శ ఉన్నది కనుకే సర్వపదార్థాలకు వాని వాని లక్షణప్రకాశం కలగుతూన్నది. అయితే ఆ పదార్థరూపాలన్నీ కాలక్రమంలో మాసిపోవలసినవే. వాటిని కనుమరుగు చేస్తూన్నదెవరు? అంటే వాటికి రూపవిలసనం కల్పించిన ఆత్మచైతన్యశక్తియే. అనగా, చెట్టు పూవులను పూచి, వానిని కాయలుగా మార్చి, పండ్లుగా తీర్చి, ఆ పండ్లలోని గుజ్జును హరించి విత్తనాలను మిగిల్చినట్లు, రూపాలనుకల్పించి, వికసింపజేసి, తానే వాటిని ఆస్వాదించి, ఆనందరసైకస్థితిని మళ్ళీ పొందిస్తుంది ఆత్మ లేక పరమాత్మ. ఎందుకంటే సృష్టి ఆత్మపరిణామం అయినట్లే ఆనందాత్మ సృష్టిపరిణామం. రసో వై సః, అంతా ఆనందమే. ఈ ఆవృతి మరల మరల సాగుతూనే ఉంటుంది. అదే శివుని నటరాజత్వం. సృష్టి శివము, వికసనము శివము, లయము శివము, సర్వం ఆనందనాట్యం. ఈ ఆవృతి నటరాజత్వం.

**శ్లో॥ యోఽవికల్పమిదమర్థమండలం – పశ్యతీశ! నిఖిలం భవద్వపుః ।**
**స్వాత్మపక్షపరిపూరితే జగ – త్యస్య నిత్యసుఖినః కుతో భయమ్ ॥ 16**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ ఈశ్వరా!, యః = ఎవడు, ఇదమ్ = ఈ, నిఖిలమ్ = సమస్తమైన, అర్థమండలమ్ = ఇంద్రియార్థములైన వస్తుమండలము, అవికల్పమ్ = వికల్పములేక, భవత్ = నీయొక్క, వపుః = శరీరము, రూపముగా, పశ్యతి = చూచుచున్నాడో, స్వాత్మపక్ష = తనదైన ఆత్మరూపముతో, పరిపూరితే = నింపబడి, పరిపూర్ణమై, జగతి = లోకమున, అస్య = ఆ, నిత్యసుఖినః = ఎల్లప్పుడు ఆనందముతో నిండినవానికి, భయమ్ = భయము, కుతః = ఎందుకు?

**తాత్పర్యము :** ఓ ఈశ్వరా!, ఈ జగత్తు ఇంద్రియార్థములైన పదార్థముల సమూహము. అయితే, ఇంద్రియభోగములాశించక, ఆ ఇంద్రియార్థములను శివస్వరూపముగా నిర్వికల్పముగా, తనయొక్క ఆత్మస్వరూపముగా దర్శించగల మహాభక్తునకు సదా ఆనందమే తప్ప భయమునకు కారణములేదు.

పరిణతిగల భక్తుడు లోకాన్ని ఇంద్రియాల కానందాన్నిచ్చే వస్తువుల సమూహంగా పరిగణించడు. కారణం, తన కన్నులకు ముందున్న జగత్తు వానికి శివ శరీరాంగములుగ, శివశరీరముగా కన్పించుతూ ఇంద్రియాలను, ఇంద్రియతృప్తిని మరిపిస్తూంటుంది. ఆ వస్తుజాలంలో కన్పించే చైతన్య తేజస్సు సాక్షాత్ తన ఆత్మతేజస్సుగా కనబడుతుంది. అందచేత, శివశరీరంగా తోచే ఈ జగత్తుకు తానే ఆత్మ కనుక, తానే శివాభిన్నుడు. అనగా ఇంత వైవిధ్యభరితలోకం అంతా నిండియున్నది తానొక్కడే అన్న జ్ఞానం అవిచ్ఛిన్నంగా ఆ భక్తునకున్నది. అంటే లోకంలో ఉన్నది తానే, తానే ఆనందరూపి, కాగా ఇక భయానికి కారణంలేదు కదా! రెండవ వ్యక్తిగాని, వస్తువుగాని లేనే లేనప్పుడు, ఉన్నదంతా తానే అయినప్పుడు ఇంక భయం దేని గురించి? దేని వలన?

**శ్లో॥ కంఠకోణవినివిష్టమీశ! తే – కాలకూటమపి మే మహామృతమ్ ।**
**అప్యుపాత్తమమృతం భవద్వపు – ర్భేదవృత్తి యది రోచతే న మే ॥ 17**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, తే = నీయొక్క, కంఠ = గొంతుయొక్క, కోణ = ప్రదేశమున, వినివిష్టమ్ = నెలవైన, కాలకూటం అపి = విషముకూడ, మే = నాకు, మహా + అమృతమ్ = గొప్ప అమృతసమానము, ఉపాత్తమ్ = పొందబడిన, అమృతం అపి = అమృతమైనను, భవత్ = నీయొక్క, వపుః = శరీరముకంటే, భేదవృత్తిః = వేరైనది, యది = ఐనచో, మే = నాకు, న రోచతే = రుచించదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ!, నీ స్పర్శ కలిగినది యేదైన, అది నీ కంఠసీమను తాకిన గరళమైన సరే, నాకు అమృతప్రాయమే. కాని నీ స్పర్శ లేకుండ లభించిన అమృతమైనా నాకు రుచించదు.

కాలకూటవిషము ప్రాణహాని కలిగించేది. అమృతం మృత్యువును హరించేది. కాని అమృతం స్వర్గవాసులైన దేవతల సొత్తు. శతక్రతువులు చేసినవారు ఇంద్రపదవిని పొంది అమృతంపై అధికారాన్ని సాధిస్తారు. జీవితంలో పుణ్యకర్మలు చేసినవారు ఆ పుణ్యఫలంగా కొంతకాలం ఆ కర్మఫలాభోగం తీరిపోయేవరకు స్వర్గవాసులై అమృతపానం చేస్తారు. మరెవ్వరికి అమృతం లభించదు. ఒకవేళ అమృతం అనాయాసంగా తనకు లభించినా, రుచికరం కాదని ఈ శివభక్తుని మాట. అట్లే, విషమైనా సరే శివ స్పర్శకలిగింది తనకు అమృతప్రాయమంటాడితడు. ఎందుకంటే, స్వర్గంలో లభించే అమృతం కర్మఫల ప్రాప్తమే, శాశ్వతం కాదు. కాని శివుని స్పర్శకలిగిన విషం అసలైన అమృతమవుతుంది. శివుడు మృత్యుంజయుడు కదా కనుక అతని స్పర్శసోకిన విషం మృత్యుంజయశక్తి అవుతుంది. శాశ్వతమైన ఆత్మానందాన్ని ప్రసాదిస్తుంది.

**శ్లో॥ త్వత్ప్రలాపమయరక్తగీతికా – నిత్యయుక్తవదనోపశోభితః ।**
**స్యామథాపి భవదర్చనక్రియా – ప్రేయసీపరిగతాశయః సదా ॥ 18**

**ప్రతిపదార్థము :** త్వత్ = నీయొక్క, ప్రలాపమయ = భాషణములతో, కథతో నిండిన, రక్త = అనురాగభరితమైన, గీతికా = గీతములతో, నిత్యయుక్త = ఎల్లవేళల కూడియుండు, వదన = ముఖముతో, ఉపశోభితః = శోభించువాడనై, అథా + అపి = మరియును, భవత్ = తమయొక్క, అర్చనక్రియా = పూజావిధిరూపముగల, ప్రేయసీ = ప్రియురాలి నుండి, పరిగత = స్వీకరింపబడిన, ఆశయః = హృదయముగలవాడనై, సదా = ఎల్లప్పుడు, స్యామ్ = ఉందును.

**తాత్పర్యము :** నేను ఎల్లవేళల నీ కథలను కీర్తించే అనురాగభరితమైన గీతములను పాడుకుంటూ, నీ అర్చన విధులను ప్రేమతో మనసార నిర్వహిస్తూ, నీతో కూడియున్న ఆనందం ముఖమున శోభించగా జీవిస్తాను.

అందరూ కోరేది, ప్రయత్నించేది, లక్షించేది ఆనందమే. అది ఒక్కొక్కరికి ఒక్కొకవేళ ఒక్కొకరూపంలో సాక్షాత్కరిస్తుంది. భుక్తి, రక్తి, ఉక్తి, యుక్తి, శక్తి, విరక్తి, ముక్తి, భక్తి, అన్నీ ఆనంద సాధనలే. భక్తుడు తన శరీరమూ మనస్సూ కూడ ఆత్మయందు లగ్నమై, ఆత్మ పరమాత్మతో అనుసంధానం కాగా అవ్యాజమైన అలౌకికానందాన్ని శాశ్వతంగా పొందాలన్న లక్ష్యంతో తాను జీవిస్తాడు. ఈ భక్త కవి కూడ అదే లక్ష్యాన్ని తన జీవితానికి నిర్దేశించికొన్నానని ప్రకటిస్తున్నాడు.

**శ్లో॥ ఈహితం న బత! పారమేశ్వరం – శక్యతే గణయితుం తథా చ మే ।**
**దత్తమప్యమృతనిర్భరం వపుః – స్వం న పాతుమనుమన్యతే తథా ॥ 19**

**ప్రతిపదార్థము :** బత! = ఔరా!, పారమేశ్వరమ్ = పరమేశ్వరుని, ఈహితమ్ = చేష్టలు, గణయితుమ్ = అర్థము చేసికొనుటకు, న శక్యతే = సాధ్యముకాదు, తథా చ = సత్యమే, మే = నాకు, అమృతనిర్భరమ్ = ఆనందముతో నిండిన, స్వం వపుః = తనదైన శరీరము, రూపము, పాతుమ్ = త్రాగుటకు, దత్తం అపి = ఇవ్వబడినదైనను, తథా = ఆ విధముగా, న అనుమన్యతే = అనుమతించబడుటలేదు.

**తాత్పర్యము :** ఔరా! పరమేశ్వరుని లీలలు అర్థం కావు. ఇది నిజమే. తన ఆనందమయమైన రూపాన్ని ఆస్వాదించుమని ఇచ్చినప్పటికి, దాని నాస్వాదించుటకు మాత్రం అనుమతించుట లేదు. ఎంత ఆశ్చర్యం!

పరమేశ్వరుని రూపం ఆనందమయమని భక్తుడెప్పుడనగలడు? తాను స్వయంగా దర్శించినప్పుడు, ఆ ఆనందాన్ని ఆస్వాదించినప్పుడే కదా. ఈ భక్తకవికి ఆ భాగ్యం లభించిందని చెబుతూన్నాడు కూడ. మరి మళ్ళీ ఆస్వాదించటానికి పరమేశ్వరుని అనుమతి లేదంటాడు, ఇదేమిటి? దత్తం ఇవ్వబడినదని స్పష్టంగా చెబుతూ ఈశ్వరాజ్ఞలేదని అనటంలో భావమేమిటి? ఇవ్వబడిన మాట నిజం. కాని అది తన ధ్యానసమాధిలో విషయం. ఐతే, ఆ ఆస్వాదనావకాశం ఎప్పుడూ నిలిచి ఉండదు, తాను కోరినప్పుడు మళ్ళీ మళ్ళీ కలుగదు. సమాధి నుండి వ్యుత్థానం కలిగి, ఆస్వాదానానందం సన్నగిల్లి విరహవేదన అధికమవుతూన్నది. అసలు రుచి తెలియకుంటే బాధేలేదు. రుచి చూపించిన స్వామి తనివిదీర ఆస్వాదించనివ్వటం లేదన్నది వీని బాధ. అందుకే, ఔరా! ఎంత అల్లరివాడితడు! అనుకోవటం.

**శ్లో॥ త్వామగాధమవికల్పమద్వయం - స్వం స్వరూపమఖిలార్థఘస్మరమ్ ।**
**ఆవిశన్నహముమేశ! సర్వదా - పూజయేయమభిసంస్తువీయ చ ॥ 20**

**ప్రతిపదార్థము :** ఉమేశ! = ఉమానాథ!, అగాధమ్ = లోతుతెలియని, అవికల్పమ్ = సంశయమునకు తావులేని, అద్వయమ్ = భేదమెఱుగని, స్వమ్ = తనదైన, స్వరూపమ్ =ఆత్మరూపమును, అఖిల = సమస్తమైన, అర్థ = పదార్థములను, ఘస్మరమ్ = మ్రింగివేయు, త్వామ్ = నిన్ను, ఆవిశన్ = దర్శించి, అహమ్ = నేను, సర్వదా = ఎల్లప్పుడు, పూజయేయమ్ = పూజింతును, చ = మరియు, అభిసంస్తువీయ = సంస్తుతింతును.

**తాత్పర్యము :** ఓ ఉమాపతీ! నీ ఆత్మరూపము అంతుచిక్కనిది, సంశయరహిత జ్ఞానదీప్తమైనది, అద్వితీయము, అఖండము, సమస్తప్రాకృతిక పదార్థజాలమును తనలో

లయము జేసికొనునది. అట్టి దర్శనముతో పునీతుడనై ఎల్లవేళల నిన్ను పూజించి, స్తోత్రము చేయుదును.

వ్యక్తినామము, రూపము మానుషబుద్ధికి అందునవి. వ్యక్తిత్వము మరింత దుర్గ్రాహ్యము, అవగాహన అసంపూర్ణము. దీనిని మించి ఆత్మస్వరూపము ఊహకుగాని మానుషానుభవమునకుగాని అందనిది. అగాధము, అవికల్పము, అద్వయము, అని ఇట్లా అదీకాదు ఇదీకాదు అనటం తప్ప, ఆత్మస్వరూపం ఇట్లా ఉంటుంది, అని స్పష్టంగా నకారాత్మకం కాని భాషలో చెప్పనలవికాదు. యత్ర వాచో నివర్తన్తే అని మాత్రమే ఉపనిషదుక్తి. ఆత్మను దర్శించిన వారందరూ అనిర్వాచ్యమని చెప్పినవారే. ఎందుకంటే అది ప్రకృతికతీతము. ప్రాకృతికమైనదంతా ఆత్మలో నామరూపగుణవ్యక్తిని కోల్పోయి ఐక్యమైపోతుంది. పూజ, స్తోత్రము, అన్నీ ఆ ఆత్మకే, అంటూన్నాడు ఉత్పలదేవాచార్యుడు.



శ్రీః

# 14. జయస్తోత్రమ్

శ్లో॥ **జయలక్ష్మీనిధానస్య నిజస్య స్వామినః పురః ।**
**జయోద్ఘోషణపీయూషరసమాస్వాదయే క్షణమ్ ॥** 1

**ప్రతిపదార్థము :** జయలక్ష్మీనిధానస్య = జయలక్ష్మికి నివాసమైన, నిజస్య = నాయొక్క, స్వామినః = స్వామియొక్క, పురః = ఎదుట, సమక్షములో, జయ = జయమును, ఉద్ఘోషణ = ఎలుగెత్తి చాటించుటయను, పీయూషరసమ్ = అమృతరసమును, క్షణమ్ = క్షణకాలము, అనుక్షణము, ఆస్వాదయే = ఆస్వాదింతును.

**తాత్పర్యము :** నా స్వామి జయలక్ష్మికి నివాసస్థానము. వాని సమక్షంలో జయజయధ్వానాలు చేస్తూ క్షణక్షణం ఆ ఆనందామృతాన్ని ఆస్వాదించాలని ఆకాంక్ష.

లక్ష్మీదేవి విష్ణుహృదయంలో నివసించే దేవతకదా, మరి ఉత్పలదేవాచార్యులు శివస్తోత్రం చేస్తూ జయలక్ష్మీ నిధానమనట మేమిటి? ఈ ప్రశ్నకు సమాధానంగా, 1. ఈ స్తోత్రానికి జయస్తోత్రం అని పేరు. జయం వలన కలిగే సంతోషసంపత్కాంతిని కూడా లక్ష్మి అనవచ్చు. లక్ష్మీశబ్దం కాంత్యభిమాని దేవతను చెబుతుంది. 2. జయా అన్న స్త్రీలింగశబ్దానికి దుర్గాదేవి పేరుగా వాడుక ఉన్నది. ఈ శ్లోకం వరకు అన్వయంలో

తాను శివభక్తుడనని, శివపరమైనశబ్దం వాడలేదు కవి. అందుచేత శివకేశవాభేదంగా భక్తులీ శ్లోకాన్ని అన్వయించుకోవచ్చు.

**శ్లో॥ జయైకరుద్రైకశివ! మహాదేవ! మహేశ్వర! ।**
**పార్వతీప్రణయిన్! శర్వ! సర్వగీర్వాణపూర్వజ! ॥ 2**

**ప్రతిపదార్థము :** ఏకరుద్ర = ఓ అద్వితీయుడవైన రుద్రుడా!, ఏక శివ = ఓ అద్వితయుడవైన శివుడా!, మహాదేవ = ఓ మహాదేవ!, మహేశ్వర = ఓ సర్వైశ్వర్యప్రభో!, పార్వతీ = పార్వతియొక్క, ప్రణయిన్ = ప్రియుడైనవాడా!, శర్వ = శర్వుడా!, సర్వ = సమస్తమైన, గీర్వాణ = దేవతలకు, పూర్వజ = ఆద్యుడైనవాడ!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** ఓ అద్వితీయ రుద్రా! శివా! మహాదేవ! మహేశ్వర! పార్వతీప్రియా! శర్వా! సర్వదేవతలకు ఆద్యుడా! నీకు జయము జయము!

**శ్లో॥ జయ త్రైలోక్యనాథైకలాంఛనాలికలోచన! ।**
**జయ పీతార్తలోకార్తికాలకూటాంకకంధర! ॥ 3**

**ప్రతిపదార్థము :** త్రైలోక్యనాథ = మూడులోకముల ప్రభుతకు, ఏక = ఒక, లాంఛన = గుర్తయిన, అలికలోచన = నుదుట కన్నుగలవాడా!, జయ = జయమగుగా!, పీత = త్రాగబడిన, ఆర్తలోక = దుఃఖితలోకములయొక్క, ఆర్తి = దుఃఖముగలవాడ!, కాలకూట+ అంక = కాలకూటవిషముయొక్కగుర్తుగల, కంధర = కంఠముగలవాడ!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** మూడు లోకాల ప్రభుత్వానికి నీ మూడు కన్నులు ఒక గుర్తు. దుఃఖితులైన లోకముల దుఃఖాన్ని మ్రింగివేసేవాడు అనటానికి గుర్తు ఆ మ్రింగిన కాలకూటవిషము వలన నల్లగానైన నీ కంఠముగుర్తు. స్వామీ! అట్టి నీకు జయము జయము!

మహాపురుషుల రూపం వారి గుణాలకూ చర్యలకూ ప్రతిబింబభావాన్ని వహిస్తుందని కవి భావం. దేవతల్లో మరెవ్వరికీ లేని బేసి కన్నులు, కమిలిన కంఠం శివునకెందుకున్నట్లు? ఆయన త్రిలోకాధిపత్యం, దాని నిర్వహణలో ఆయన ప్రదర్శించిన ప్రభుధర్మం కారణాలు. తెల్లని శరీరంలో ఆ కంఠం నల్లనైనదేమని ప్రశ్నిస్తే, తెలిసే సత్యం లోకసంజీవకమైన వాని చర్యవలన. అందరు దేవతలున్నప్పటికీ ఆ కర్తవ్యం తనదని భావించి పాలించటం వాని సహజప్రభుశీలం.

**శ్లో॥ జయ మూర్తత్రిశక్త్యాత్మశితశూలోల్లసత్కర! ।**
**జయేచ్ఛామాత్రసిద్ధార్థపూజార్హచరణాంబుజ ॥ 4**

**ప్రతిపదార్థము :** మూర్త = మూర్తిమంతమైన, రూపుదాల్చిన, త్రి = మూడు, శక్తి+ఆత్మ = శక్తురూపమైన, శిత = పదునైన, శూల = శూలముతో, ఉల్లసత్ = శోభించుచుండు, కర = చేయిగలవాడా!, జయ = నీకు జయము, ఇచ్ఛామాత్ర = కోరినంతనే, సిద్ధ = సిద్ధించు, అర్థ = కోరికగల, పూజార్హ = పూజకు యోగ్యమైన, చరణ+అంబుజ = పాదపద్మములు గలవాడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నీవు చేత దాల్చిన త్రిశూలము మూడు శక్తుల రూపమైనది. నీ పాదపద్మపూజ కోరినంత మాత్రమున కోరికలను సిద్ధింపజేయగలదు. ఇట్టి నీకు జయము జయము!

మూడు శక్తులు (త్రిశక్తి) : 1. ఇచ్ఛాశక్తి, 2. జ్ఞానశక్తి, 3. క్రియాశక్తి. మూడు మొనలుగల శూలము ఈ మూడు శక్తుల రూపమైనది. ఈ మూడు శక్తుల నొక్కటిగ జేసినప్పుడు లోకమాయను దాటి సత్యశివస్వరూపమును దర్శింపగలుగును.

**శ్లో॥ జయ శోభాశతస్యన్దిలోకోత్తరవపుర్ధర ।**
**జయైకజటికాక్షీణగంగాకృత్యాత్తభస్మక ॥ 5**

**ప్రతిపదార్థము :** శోభాశతస్యన్ది = శోభలీనునట్టి, లోకోత్తర = అలౌకికమైన, వపుః = శరీరము, రూపమును, ధర = ధరించినవాడా!, జయ = జయమగుగాక!, ఏక = ఒక, జటికా = చిన్ని జడపాయనుండి, క్షీణ = సన్నని, గంగా = గంగయొక్క, ఆకృతి = రూపమున, ఆత్త = పొందబడిన, భస్మక = భస్మభూషితాంగ!, జయ = నీకు జయము.

**తాత్పర్యము :** శోభలీను రూపమును ధరించినవాడా! నీ సిగలోని సన్నని పాయగా జాలువారు గంగను ధరించినవాడా! భస్మభూషితాంగా! నీకు జయమగుగాక!

తేజస్సుతో, ఓజస్సుతో గూడి ఆనందమును కలిగించు గుణమునకు శోభయని పేరు. చేతన, దృఢత, ఆరోగ్యము కలిసిన దేహ లక్షణము ఓజస్సు.

**శ్లో॥ జయ క్షీరోదపర్యస్తజ్యోత్స్నాచ్ఛాయానులేపన! ।**
**జయేశ్వరాంగసంగోత్థరత్నకాంతాహిమండన! ॥ 6**

**ప్రతిపదార్థము :** క్షీరోద = పాలసముద్రముపై, పర్యస్త = వెదజల్లబడిన, జ్యోత్స్నా = వెన్నెలయొక్క, ఛాయా = ప్రతిబింబము, అనులేపన = పై పూతగాగలవాడా!, జయ =

నీకు జయము!, ఈశ్వర = ఈశ్వరునియొక్క, అంగ = అంగముల, సంగ = సంపర్కమువలన, ఉత్థ = లభించిన, రత్న = రత్నములతో, కాన్త = సుందరమైన, అహి = సర్పమును, మండన = అలంకారముగాగలవాడా!, జయ = నీకు జయము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! పాల సముద్రముపై పరచుకొనిన వెన్నెల ప్రతిబింబము నీకు మైపూత. నీ శరీరావయవములతో చేరిన కారణంగా లభించిన రత్నాల వెలుగుతో సుందరమైన సర్పాలను అలంకారంగా ధరించినవాడవు నీవు. నీకు జయము జయము.

శివుని తెల్లని మేని కాంతి స్వచ్ఛత పాలసముద్రంపై వెన్నెల కాంతివలె ఉన్నదని భావము. శివునకు సర్పాలు ఆభరణాలు. ఇవి వాసుకి వంటి మహాసర్పాలు. వాని శిరస్సులపై రత్నాలు వెలుగు లీనుతూంటాయి. శివుని శరీరస్పర్శవలన ఆ రత్నాలు వానికి లభించినవని భావం.

**శ్లో॥ జయాక్షయైకశీతాంశుకలాసదృశసంశ్రయ! ।**
**జయ గంగాసదారబ్ధవిశ్వైశ్వర్యాభిషేచన! ॥ 7**

**ప్రతిపదార్థము :** అక్షయ = క్షీణించని, ఏక = ఒక, శీతాంశు = చంద్రునిదైన, కలా = కళకు, సదృశ = తగినట్టి, సంశ్రయ = ఆశ్రయమైనవాడా!, జయ = నీకు జయమగుగాక!, గంగా = గంగవలన, సదా = ఎల్లప్పుడు, ఆరబ్ధ = ప్రారంభింపబడిన, విశ్వ = జగత్తుయొక్క, ఐశ్వర్య = ఐశ్వర్యమును, అభిషేచన = వర్షించువాడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నీవు ఎప్పటికీ క్షీణంచని చంద్రకళకు ఆశ్రయ మిచ్చినవాడవు, గంగను జగత్తునకు ప్రసాదించి దానితో జగత్తును ఐశ్వర్యవంతము జేసినవాడవు! నీకు జయము, జయము!

ఈశ్వరుని తలపై నెలకొన్న చంద్రకళకు క్షీణతలేదు. చంద్రుని కళలలో 15 కళలకు ప్రతినెలలోనూ క్షీణంచటము తప్పదు. ఇది చంద్రుని మామయైన దక్షప్రజాపతి శాపము కారణముగా కలిగినది. కాని చంద్రుని 16వ కళ ఈశ్వరుని సిగపూవైనది కనుక దానికి క్షీణతలేదు. ఆ కళపేరు అమా. అమావాస్యకు పేరు ఆ కళనుండియే కలిగినది. కాగా క్షీణించిన 15 కళలు మరల అక్షయమైన ఈ 16వ కళనుండియే పునర్నవం అవుతూంటాయి. ఈ కళకు ఈశ్వరుని ఆశ్రయం లభించినందువలన ఇది క్షీణంచనిదైనది.

భగీరథుని కారణంగా ఆకాశగంగ భూమికి దిగినప్పుడు ఆ భగీరథుని ప్రార్థన

మేరకు శివుడు గంగను తన జటాజూటంలో ధరించి ఒక సన్నని పాయను మాత్రం లోకంకోసం వదిలినాడని పురాణకథ. అట్లా భూమికి దిగుతూ ఎప్పటి కప్పుడు గంగ జగత్తును ఐశ్వర్యవంతం చేస్తూన్నది.

ఈ రెండు విధాలుగానూ శివుడు లోకోపకారియైనాడు.

**శ్లో॥ జయాధరాంగసంస్పర్శపావనీకృతగోకుల! ।**
**జయ భక్తిమదాబద్ధగోష్ఠీనియతసన్నిధే! ॥ 8**

**ప్రతిపదార్థము :** అధర+అంగ = క్రింది అవయవమైన పాదములయొక్క, సంస్పర్శ = స్పర్శతో, పావనీకృత = పావనముచేయబడిన, గోకుల! = గోవులజాతి గలవాడా!, జయ = నీకు జయము!, భక్తిమత్ = భక్తిగలవారితో, ఆబద్ధ = బాగుగ కట్టబడిన, గోష్ఠీ = మండలిలో, నియత = నియమముగల, సన్నిధే = సాన్నిధ్యముగలవాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** స్వామీ! నీ శరీరంలో అన్నిటికంటె క్రిందనుండు నీ పాదస్పర్శతో గోకులాన్ని పావనం చేసినావు. భక్తుల గోష్ఠిలో నియమంగా నీవు వేంచేసి ఉంటావు. నీకు జయము జయము!

శివుడు వృషభవాహనుడు కదా. ఆ వృషభాన్నెక్కేవేళ శివుని పాదం వృషభానికి (నందికి) తగులుతూంటుంది. ఆ స్పర్శతో వృషభజాతి అంతా పవిత్రమయింది. భక్తుల గోష్ఠిలో శివసాన్నిధ్యం తప్పక ఉంటుందంటారు. ఈ రెండు విధాల శివుడు తాను చేకొన్న వారినెప్పుడు విడువడనుట సిద్ధసత్యము.

**శ్లో॥ జయ స్వేచ్ఛాతపోవేశవిప్రలంభితబాలిశ! ।**
**జయ గౌరీపరిష్వంగయోగ్యసౌభాగ్యభాజన! ॥ 9**

**ప్రతిపదార్థము :** స్వ + ఇచ్ఛా = నీ ఇష్టానుసారముగ, తపః వేశ = తాపసివేషముతో, విప్రలంభిత = మోసపోయిన, బాలిశ = అజ్ఞానులుగలవాడా!, జయ = నీకు జయము!, గౌరీ = గౌరీదేవియొక్క, పరిష్వంగ = కౌగిలికి, యోగ్య = అర్హతగల, సౌభాగ్యభాజన! = సౌభాగ్యమునకు పాత్రుడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** నీవు నీ ఇచ్ఛననుసరించి తాపసివేషాన్ని ధరించినావు, కాని అజ్ఞానులా వేషమునకు వివిధకారణము లాపాదించుచున్నారు. గౌరీదేవిని కౌగిలిలో పొదవికొనుటకు యోగ్యతగలవాడా! నీకు జయము జయము!

శివుని జటాధారిగా తాపసివేషంలో భావించినవారు అందుకు కారణాల నన్వేషిస్తూ అనేక కథలు చెబుతూంటారు. కొందరంటారు కదా, శివుడు బ్రహ్మకుగల ఐదవ శిరస్సును ఖండించినందుకు ప్రాయశ్చిత్తంగా తాపసి వేషంలో తపస్సు చేసినాడని; మరికొందరు, సిద్ధిని సాధించేనిమిత్తం శివుడీ వేషం కట్టినాడని; కొందరేమో, అసలు శివుని మహాదేవరూపం ఇదేనంటారు. కాని ఇవన్నీ అజ్ఞానుల మాటలు. నిజానికి తాపసివేషం శివుని లీల. అందుకే వానికి బహురూపి అనిపేరు. ఇదే తాపసివేషంతో శివుడు తనకోసం తపస్సు చేసే పార్వతికి దర్శనమిచ్చి, ఆమెను కూడా కొద్దిసేపు భ్రమింపజేసినాడు. అంతలో తన స్వస్వరూపాన్ని ప్రకటించి ఆమెను చేపట్టినాడు. కనుకే శివుడు జటిలుడు అంటారు. అంటే, జడలు ధరించినవాడు అనినీ, అర్థం చేసికొనటానికి చిక్కుముడివలె కష్టమైనవాడు అనినీ. కథ ప్రకారం, శివుని అనుగ్రహం కోసం పార్వతి తపించింది. కాని పార్వతిని చేపట్టటంకోసం శివుడున్నూ విరహాన్ననుభవించి తపస్వియైనవాడే. అందుకే, శివుడు, శక్తిని, శక్తి శివుని తపస్సుతోనే సాధించినారు. అది వారి కలయికలోని యోగ్యత.

**శ్లో॥ జయ భక్తిరసార్ద్రార్ద్రభావోపాయనలంపట! ।**
**జయ భక్తిమదోద్దామభక్తవాక్నృత్తతోషిత! ॥ 10**

**ప్రతిపదార్థము :** భక్తిరస = భక్తిరసముతో, ఆర్ద్ర+ఆర్ద్ర = అమితముగ ఆర్ద్రమైన, భావ = భావములను, ఉపాయన = బహుమానముగాగైకొనుటలో, లంపట = లాలసగల వాడా!, జయ = నీకు జయము!, భక్తిమద = భక్తిపారవశ్యముతో, ఉద్దామ = మత్తిల్లిన, భక్త = భక్తులయొక్క, వాక్ = మాటలు, నృత్త = నృత్యములచే, తోషిత = ప్రసన్నత వహించినవాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** భక్తుల భావాలు భక్తివలన కలిగిన ఆనందంతో ఆర్ద్రమై ఉంటాయి. వాటిని బహుమతిగా స్వీకరించటం నీకు ఎంతో ఇష్టం. భక్తిభావనలో పరవశించి లోకాన్ని మరచి పాడుతూ నృత్యం చేస్తూండే భక్తులపట్ల నీవు ప్రసన్నుడవు. నీకు జయము జయము!

త్రికరణశుద్ధిగల భక్తిని తప్ప భగవంతునకు భక్తుడు యేమివ్వగలడు? ఆ భక్తిని ప్రకటించే మాటలు, పాటలు, పరవశించి చేసే నృత్యమూ శివుని ప్రసన్నుని చేస్తాయి. ఈ త్రికరణశుద్ధియైన భక్తివలన భక్తుడు భగవంతునకు చేరువకాగలడు, అని కవి భావం.

శ్లో॥ జయ బ్రహ్మాదిదేవేశప్రభవప్రభవవ్యయ! ।
జయ లోకేశ్వరశ్రేణీశిరోవిధృతశాసన! ॥ 11

**ప్రతిపదార్థము :** బ్రహ్మ = బ్రహ్మ, ఆది = మొదలగు, దేవ = దేవతల, ఈశ = ప్రభువులగువారి, ప్రభావ = ప్రభావములకు, ప్రభవ = పుట్టుక, వ్యయ = నాశములైన వాడా!, జయ = నీకు జయము!, లోక = లోకముల, ఈశ్వర = పాలకుల యొక్క, శ్రేణీ = పంక్తుల, వరుసల, శిరః = శిరస్సుపై, విధృత = ధరింపబడిన, శాసన = ఆజ్ఞలుగలవాడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** బ్రహ్మాది దేవతల పుట్టుకలకు నిర్యాణములకు కారణమైనవాడవు నీవు. లోకపాలకులు నీ ఆజ్ఞలను శిరసా వహింతురు. నీవు దేవాధిదేవుడవు, పరమేశ్వరుడవు. నీకు జయము జయము!

వ్యక్త జగత్తు లేక సృష్టికి శాసకులు అనేక స్థాయిలలో అనేకులున్నారు. ఆద్యులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. వీరు సృష్టికి కర్త, భర్త, హర్త అనబడువారు. వీరి పాలనలోని దేవతల రాజు ఇంద్రుడున్నాడు. ఇంద్రుని పాలనలో జగత్తును శాసించే దిక్పాలకు లున్నారు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, మరుత్తు లేక వాయు, కుబేరుడు, ఈశుడు, అను ఎనమండుగురు. వీరు కాక భూమండలాన్ని శాసించే రాజులనేకులు. వీరందరి పుట్టుకలు, శాసనాలు, మరణాలు శివేచ్ఛననుసరించి జరిగేవి. వీరందరూ పరమేశ్వరుని ఆజ్ఞమేరకు ప్రవర్తించవలసినవారే.

శ్లో॥ జయ సర్వజగన్న్యస్తస్వముద్రావ్యక్తవైభవ! ।
జయాత్మదానపర్యన్తవిశ్వేశ్వర! మహేశ్వర! ॥ 12

**ప్రతిపదార్థము :** సర్వజగత్ = సమస్త ప్రపంచమున, న్యస్త = ఉంచబడిన, స్వముద్రా = నీదైన అధికారముద్రచే, వ్యక్త = ప్రకటమైన, వైభవ = వైభవముగలవాడా!, జయ = నీకు జయము!, ఆత్మ = ఆత్మను, దాన = దానముచేయు, పర్యన్త = అంతవరకు, విశ్వ = విశ్వమునకు, ఈశ్వర = ప్రభువైనవాడా!, మహేశ్వర! = గొప్ప ఐశ్వర్యముతో గూడినవాడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** దేవదేవా! నీ అధికారము, వైభవము ప్రపంచమంతటా గోచరమవుతూన్నది. నీవు విశ్వానికి ప్రభువువైనందుకు విశ్వానికి నీవు దానంచేయనిదేమీలేదు, ఆత్మనుసైతం దానచేసినావుకదా! నీకు జయము! నీ ప్రభుతకు జయము!

అంతటా గోచరించే ఆ స్వామి ముద్ర జ్ఞానక్రియానందములు. దీని

వ్యాప్తరూపములు భగలింగములు, అని ఆగమము:-

న చక్రాంకా న వజ్రాంకా దృశ్యన్తే జన్తవః క్వచిత్ ।
భగలింగాంకితం విశ్వం తేన మాహేశ్వరం జగత్ ॥

భగము షడ్గుణయుక్తమైనది. షడ్గుణములు ఒక సంప్రదాయంలో, 1. ఐశ్వర్యం, 2. వీర్యం, 3. యశస్సు, 4. శ్రీ, 5. జ్ఞానం, 6. వైరాగ్యం. మరియొక సంప్రదాయంలో, 1. దయ, 2. దానం, 3. వైరాగ్యం, 4. సమభావం, 5. నిర్భయత, 6. ముముక్ష.

లింగము తత్త్వాలలో మొదటిదైన ప్రకృతి. ఇది కార్యకారణశృంఖలను నిర్వహించేది. కారణమునుండి కార్యముత్పన్నమై, ఆ కార్యము కారణరూపముదాల్చి వేరొక కార్యమునకు మూలమగుచు నిరంతరము అనంతంగా సాగిపోవటం కార్యకారణ శృంఖల.

ఈ రెండున్నూ అంతటా గోచరించేవి. ఇవి శివముద్ర. ప్రకృతిలో ఇవి స్త్రీ పురుష జననాంగాల రూపంలో ప్రకటమవుతూ, శివుడు లింగపానవటముల రూపాన అర్చింపబడుతుంటాడు. ఇది స్థూలదృష్టికి కేవలం sex symbols ను పూజిస్తూనట్టే తోస్తుంది, జననాంగ పూజయే శివపూజ అనిపిస్తుంది. వానిని తాత్త్వికసంకేతాలుగా చూడగలిగితే ఆగమార్థం బోధపడుతుంది. అక్షరాలు, శబ్దాలు, నామాలు, సమస్తం సంకేతితార్థాన్ని గ్రహించినప్పుడే అర్థవంతాలవుతాయి లేకుంటే అనర్థదాయకాలే.

ఆత్మదానపర్యన్తవిశ్వేశ్వర అన్నదానిని ఈ సందర్భంలో అన్వయించుకోవలె. ఆత్మన్ శబ్దానికి ఆత్మ అనిన్నీ తాను అనిన్నీ అర్థాలు. శివుడు సృష్టిని చేసే సందర్భంలో, ప్రకృతినుండి శరీరాన్నియేర్పఱచి, తాను ఆ శరీరంలో ప్రవేశించి చైతన్యవంతంచేస్తాడు. శివుడు స్వయంగా ఆత్మరూపి కనుక ఈ సందర్భంలో **ఆత్మన్** శబ్దానికి గల రెండు అర్థాలూ ఒకటే అవుతాయి. కాగా లోకంలో సదా జరుగుతూండే సృష్టి ప్రక్రియకు కూడా తల్లిక్షేత్రము, తండ్రి బీజము కాగా ఇద్దరి లక్షణాల మేలుకలయికగా శిశువు జన్మిస్తుంది. జ్ఞానం బీజంగా, శక్తి క్షేత్రంగా వెలసినదే జగత్తు.

**శ్లో॥ జయ త్రైలోక్యసర్గేచ్ఛావసరాసద్ద్వితీయక! ।**
**జయైశ్వర్యభరోద్వాహదేవీమాత్రసహాయక! ॥ 13**

**ప్రతిపదార్థము :** త్రైలోక్య = మూడులోకములను, సర్గ = సృష్టిచేయు, ఇచ్ఛా = కోరకగలిగిన, అవసర = సందర్భములో, అసత్ = అసత్పదార్థమును, ద్వితీయక! = రెండవదానిగా గలవాడా!, జయ = నీకు జయమగుగాక!, ఐశ్వర్య = ఐశ్వర్యముయొక్క

భర = భారమును, ఉద్వాహ = వహించుటలో, దేవీమాత్ర = దుర్గాదేవి యొక్కతెయే, సహాయక! = సహాయమైనవాడా!, జయ = నీకు జయమగుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! త్రిలోకములను సృష్టించు సందర్భంలో అసత్పదార్థమను రెండవదాని రూపైనవాడవు నీవు. సృష్టి తరువాత ఈశ్వరత్వమును నిర్వహించుటలో పరాశక్తిని సహాయగా స్వీకరించినవాడవు నీవు. నీకు జయము జయము!

**ప్రాక్ సృష్టేః కేవలాత్మనే**, సృష్టికి పూర్వము ఒక్కడవేయైన ఆత్మరూపా!, అంటాడు మహాకవి కాళిదాసుడు. కేవలుడైన పరమాత్ముడు ఆత్మ, సత్పదార్థము. సృష్టిచేయవలెనను స్పందన కలుగగానే అందుండి అసత్, నామరూపాది గుణభిన్నత్వము గలది యేర్పడినది. ఈ ప్రక్రియ బృంహణము, అనగా వ్యాప్తి. దీనిని నిర్వహించినాడు గనుక కేవలాత్మకీ నామరూప జగత్తులో బ్రహ్మయని పేరు కలిగినది. దీని లక్షణము రజస్సు, రజోగుణము. ఈ భిన్నత్వాన్ని సూత్రంవలె అన్నిటిలోనుండి నిర్వహించునది ఆత్మసత్త. దీని లక్షణము వ్యాపనము. ఇది విష్ణువైనది. ఈ నామరూపములను ఉపసంహరించే క్రియ లయ దీని నిర్వహణలో తమో గుణాశ్రయంతో రుద్రుడైనది ఈ కేవలాత్మ. ఇట్లా త్రిగుణ క్రియాత్మక విశ్వం సాగుతున్నది. ఈ సృష్టిక్రమాన్ని నిర్వహించటంలో క్రియా శక్తిగా తోడ్పడేది పరాశక్తి దుర్గ. ఈ శక్తియే సృష్టి, స్థితి, లయలు మూడిట, మూడు మూర్తులై సరస్వతి, లక్ష్మి, పార్వతిగా పిలువబడుతూ విశ్వసంసారాన్ని తాను నిర్వహిస్తూ ఆత్మకు ప్రతిబింబరూపమైనది. **ఉద్వాహ** శబ్దానికి, ఉత్+వాహ = నిర్వహించు, అనియొకటి, వివాహమని యొకటి రెండు అర్థాలు, నిజానికి వివాహము, అంటే కూడా విశేషముగ నిర్వహించునది అనే అర్థం. లోకాచారంగా, సంసారనిర్వహణం భార్యచేస్తున్నది కనుక దుర్గ పరాత్పరుని భార్యయని, సరస్వతి బ్రహ్మభార్యయని, లక్ష్మి విష్ణు భార్యయని, పార్వతి శివుని భార్యయని, క్రియాశక్తికి పేర్లు కలిగినవి. ఇక్కడ ఉద్వాహ శబ్దప్రయోగం రెండు అన్వయాలలోనూ సార్థకమే.

**శ్లో॥ జయాక్రమసమాక్రాన్తసమస్తభువనత్రయ! ।**
**జయావిగీతమాబాలగీయమానేశ్వరధ్వనే! ॥ 14**

**ప్రతిపదార్థము :** అక్రమ = క్రమములేకుండ, సమాక్రాన్త = పూర్తిగా వ్యాప్తమైన, సమస్తభువనత్రయ! = మూడులోకములన్నియు కలవాడా!, జయ = నీకు జయము!, అవిగీతమ్ = నిర్వివాదముగ, ఆబాల = అజ్ఞానులచేతసైతము, గీయమాన = పాడబడుచున్న, ఈశ్వరధ్వనే! = ఈశ్వరనామముగలవాడా!, జయ = జయమగుగాక!

**తాత్పర్యము :** ఓ ప్రభూ! ఒకేసారి మూడు లోకాలను ఆక్రమించినవాడవు నీవు. ఏమి ఎఱుగని బాలబాలికలు సైతము నిన్ను ఈశ్వరుడని కీర్తింతురు. నీకు జయము జయము!

ఇక్కడి అక్రమ శబ్దం వ్యాప్తిక్రమాన్నిగూర్చినదే, కాని సృష్ట్యాది బృంహణానికి (వ్యాప్తికి) సంబంధించినదికాదు. అవతారమూర్తి వామనుడు బలినుండి మూడడుగులు దానం పొంది ఆ మూడడుగులు ఆక్రమించినక్రమాన్ని గుర్తుచేస్తూ, ఈశ్వరుడట్లా కాక మూడు లోకాలనూ ఒకేసారి ఆక్రమించినాడని చెప్పటానికి వ్యతిరేకధ్వనితో ప్రయోగింపబడిన దీ శబ్దం, స్వర్గ, మర్త్య, పాతాళాలను, భూలోక, భువర్లోక, స్వర్లోకాలను, ఒక్కొక్క అడుగు చొప్పున మూడడుగులలో ఆక్రమించినవాడు త్రివిక్రముడు, వామనుడు. కాని ఈశ్వరుడు భవ, అభవ, అతిభవ అను మూడు లోకాలను ఒకేసారి వ్యాపించిన జ్ఞానానందరూపి. అందుకే జ్ఞానులే కాక అజ్ఞానులు సైతం సార్థకంగా వానిని ఈశ్వరుడని కీర్తిస్తారు, సర్వాత్మ అంటారు.

**శ్లో॥ జయానుకంపాదిగుణానపేక్షసహజోన్నతే! ।**
**జయ భీష్మమహామృత్యుఘటనాపూర్వభైరవ! ॥ 15**

**ప్రతిపదార్థము :** అనుకంపా = దయ, ఆది = మొదలుగాగల, గుణ = గుణములపై, అనపేక్ష = ఆధారపడని, సహజ = స్వభావసిద్ధమైన, ఉన్నతే! = ఔన్నత్యముగలవాడా! జయ = నీకు జయము!, భీష్మ = భయంకరమైన, మహామృత్యు = ప్రళయమును, ఘటన = సంభవము చేయుటలో, అపూర్వ = అలౌకికమైన, భైరవ! = భయము కలిగించువాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** స్వామీ! దయ మొదలైన గుణాలవలన కాక స్వభావసిద్ధముగనే నీవు సర్వోన్నతుడవు. భయంకరమైన ప్రళయాన్ని కలిగించే సమర్థుడవు నీవు. నీకు జయము!

ఒక మానవుడికి దయాగుణం ఉంటే, దాని కారణంగా ఆతడు ఉన్నతుడవుతాడు. కాని సర్వగుణాలకు కాణాచియైన సర్వేశరుని ఉన్నతి ఈ లౌకికప్రమాణాలతో కొలువదిగినదికాదు. కనుకే ఆతని ఉన్నతి గుణాపేక్షలేనిది. వ్యక్తవిశ్వంలో సమస్తాన్నీ భేదభావంలేకుండా నశింపజేసేది మృత్యువు. అందుచేతనే అది మహామృత్యువు. ప్రతి జీవిని భయపెట్టే ప్రళయమే అది. అటువంటి మృత్యువునుసైతం భయపెట్టగలవాడవు, మృత్యుంజయుడవు నీవు. ఇది కూడ నీ ఉన్నతియే. **భైరవ** అన్నది శివుని నామాలలో ఒకటి, శివుని రూపాలలో ఒకటి. ప్రళయకాలంలో, మృత్యురూపంలో వానినుండి వెలువడు ధ్వని భై అనునది. భై అనురవము చేయువాడు కనుక వానికి భైరవుడని పేరు.

**శ్లో॥ జయ విశ్వక్షయోచ్చండక్రియానిష్ప్రతిపంథిక! ।
జయ శ్రేయఃశతగుణానుగనామానుకీర్తన! ॥ 16**

**ప్రతిపదార్థము :** విశ్వ = జగత్తుయొక్క, క్షయ = నాశము అను, ఉత్+చండ = చాల భయంకరమైన, క్రియా = కార్యముచేయుటలో, నిష్ప్రతిపంథిక! = ఎదురొడ్డువారులేని వాడా!, జయ = నీకు జయము!, శ్రేయః = కళ్యాణకరమైన, శతగుణ = లెక్కలేనన్ని గుణములను, అనుగ = అనుసరించు, నామ = పేర్లతో, అనుకీర్తన! = నుతింపబడువాడా! జయ = నీకు జయము!

**తాత్పర్యము :** జగత్తును నాశనం చేయనుద్యమించిన నీకు ఎదురు నిల్చి అడ్డుపడగల వారెవ్వరును లేరు. నీ అనేకానేక నామములన్నియు నీ శుభగుణములను వర్ణించునవే. అట్టి నీకు జయము జయము!

స్వామి లయకారకుడు, హర్త. ఈ కర్తవ్యనిర్వహణను ఆటంకపరచువారులేరు. సృష్టిచేసిన బ్రహ్మగాని, పోషించిన విష్ణువుగాని సంహారక్రియను అడ్డగించరు. ఇక అన్యులమాట చెప్పవలసినదేమున్నది? అంతమాత్రమున శివుడు విధ్వంసి మాత్రమే అనుట కుదరదు. శివుని పేర్లను పరిశీలిస్తే, శివనామం మొదలు శంకర, శంభు, మృడ, ఇత్యాది నామాలు వాని శుభదాయక గుణవర్ణనలే.

**శ్లో॥ జయ హేలావితీర్ణైతదమృతాకరసాగర! ।
జయ విశ్వక్షయాక్షేపిక్షణకోపాశుశుక్షణే ॥ 17**

**ప్రతిపదార్థము :** హేలా = సులభముగా, వితీర్ణ = ఇవ్వబడిన, ఏతద్ = ఈ, అమృత = అమృతమునకు, ఆకర = నెలవైన, సాగర = సముద్రుడా!, జయ = నీకు జయము!, విశ్వ = సృష్టియొక్క, క్షయ = నాశమును, ఆక్షేపి = కలిగించునట్టి, క్షణకోప = క్షణకాలము, కోపముగల, ఆశుశుక్షణే = అగ్నిరూపైనవాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** అమృతమునకు నెలవైన సాగరమును సులభముగా ఇచ్చినవాడా! సృష్టిని నశింపజేయు సమయమున అగ్నిరూపమున ప్రజ్వరిల్లువాడా! నీకు జయము జయము!

**ఉపమన్యు** అను భక్తునికి క్షీరసముద్రాన్ని వరదానంగా ఇచ్చినాడు శివుడని శివపురాణోక్తి. భక్తవత్సలతకిది తార్కాణ. ప్రళయకాలంలో విశ్వాన్ని దగ్ధపటలం చేసే సందర్భంలో శివుడు అగ్నిరూపుడవుతాడు, ప్రకోపిస్తాడు, కాని అది పగ, కసి కాదు. లయ కూడ దయయే.

శ్లో॥ జయ మోహాంధకారాంధజీవలోకైకదీపక! ।
జయ ప్రసుప్తజగతీజాగరూకాధిపూరుష! ॥ 18

**ప్రతిపదార్థము :** మోహ = మోహము అను, అంధకార = చీకటివలన, అంధ = గ్రుడ్డివారైన, జీవలోక = ప్రాణిలోకమునకు, ఏక = ఒకే ఒక, దీపక! = దీపమైనవాడా!, జయ = నీకు జయము!, ప్రసుప్త = గాఢముగ నిద్రించిన, జగతీ = లోకమున, జాగరూక = మేల్కొనియున్న, అధిపూరుష! = అధిష్ఠాతవైన పురుషరూపా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** మోహమను చీకటివలన గ్రుడ్డివైన ప్రాణులకు నీవు మార్గదర్శకమైన దీపమువంటివాడవు, గాఢనిద్రలోనున్న జగత్తులో మేల్కొనియున్న అధికారి పురుషుడవు నీవు. నీకు జయము జయము!

**మోహలక్షణం** యథార్థాన్ని కప్పిపుచ్చటం. కనుక అది చీకటిని పోలినది. ఈ చీకటిని చీల్చగలిగినది కాంతిమాత్రమే. ఆ కాంతి జ్ఞానకాంతి. దాని నివ్వగలవాడు శివుడొక్కడే. జ్ఞానస్వరూపి కనుక. అందుకే దీపమైనాడు లోకానికి. జగత్తు రాత్రింబవళ్ళ గతిలో మేల్కొంటూ నిద్రిస్తూన్నమాట నిజమే. కాని ఇది భౌతిక జీవితసత్యం. నిజానికి ఆధ్యాత్మికంగా జగత్తు గాఢనిద్రలోనే ఉన్నది. జీవుడు పాశబద్ధుడైన పశువుగనే ఉన్నాడు. తాను పాశబద్ధుడనను తెలివి గూడ వానికిలేదు. కనుక వాని జీవనము స్వప్నతుల్యమై గడిచిపోతూన్నది. ఐనప్పటికి వానిలోని ఈశ్వరాంశ ఈ శరీరాన్ని, ఇంద్రియాలను అధిష్ఠించి ఉన్నాడు. అతడు అసలు యజమాని, అధికారి, పురుషుడు, కర్త. ఆతడు మాత్రము మేల్కొని యున్నాడు. జీవునకు దిశానిర్దేశము చేస్తూన్నాడు. **పురుషశబ్దం** ఇక్కడ స్త్రీపురుష భేదాన్ని చెప్పేది కాదు. 'నేను' అను కర్తృవాచకమైన దైవాహంకారము.

శ్లో॥ జయ దేహాద్రికుంజాన్తర్నికూజజ్జీవజీవక! ।
జయ సన్మానసవ్యోమవిలాసివరసారస! ॥ 19

**ప్రతిపదార్థము :** దేహ = శరీరరూపమైన, అద్రి = కొండయొక్క, కుంజ = గుహయొక్క, అంతర్ = మధ్యన, నికూజత్ = కూయుచున్న, జీవ = జీవులయొక్క, జీవక = జీవనదాతా!, జయ = నీకు జయము!, సత్ = సత్పురుషులయొక్క, సన్తులయొక్క, మానసవ్యోమ = మనస్సను ఆకాశమున, చిదాకాశమున, విలాసి = విహరించునట్టి, వర = శ్రేష్ఠమైన, సారస = రాజహంసా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** దేవా! శరీరమను కొండ గుహమధ్యలో కూయుచున్న జీవులకు జీవనదాతవు నీవు. సత్పురుషుల మనస్సులను ఆకాశంలో విహరించే రాజహంసవు నీవు. నీకు జయము జయము!

**జీవజీవః** అనుదానికి, 1. జీవులకు జీవమిచ్చు జీవాత్మయని, 2. చకోరపక్షియని, రెండు అర్థాలున్నవి. జీవుల శరీరాలలోనుండి నేను, నేను అని పలుకుతూండే జీవాత్మ పరంగానూ, రూపకంగా చకోరార్థంలోనూ కూడా ఈ అర్థాలు అన్వయమవుతాయి. సత్పురుషుల మానసాకాశంలో విహరించే రాజహంస అన్నది పరమాత్మకన్వయము. హంస శబ్దానికి ఆత్మ అని కూడా అర్థం. జీవాత్మకు శరీరము, అంటే ఇంద్రియాలతో ఉన్న సంబంధాన్ని, పరమాత్మకు మనస్సుతోగల సంబంధాన్నీ చెప్పటం ఈ శ్లోకలక్ష్యం. జీవాత్మకు దేహేంద్రియబంధం సడలిపోతే, అది పరమాత్మలోలీనమై ఒక పరమహంస ఉదయిస్తాడు. అంటే దేహంలో సాక్షాత్ పరమాత్మమాత్రవే ఉన్నవాడు అవుతాడు. అంటే, పశువు పాశముక్తుడై పశుపతి యవుతాడు.

**శ్లో॥ జయ జాంబూనదోదగ్రధాతూద్భవగిరీశ్వర! ।**
**జయ పాపిషు నిందోల్కాపాతనోత్పాతచంద్రమః! ॥ 20**

**ప్రతిపదార్థము :** జాంబూనద = బంగారమునకు, ఉదగ్రధాతు = ప్రసిద్ధధాతువులకు, ఉద్భవ = నెలవైన, గిరి = కొండకు, ఈశ్వర! = ప్రభువైనవాడా!, జయ = నీకు జయము!, పాపిషు = పాపులందు, నిందా = నిందారూపమైన, ఉల్కాపాతన = ఉల్కలు పడుటచేత, ఉత్పాత = అశుభసూచకమగు, చంద్రమః = చంద్రుడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** స్వామీ! నీవు సుమేరునామధేయుడవు. నీవు చంద్రుడవు. అయినను పాపులకు ఉల్కాపాతమువంటి అశుభమునిచ్చువాడవు. నీకు జయము జయము!

మేరుపర్వతం పురాణప్రసిద్ధమైన బంగారుకొండ. దీని పూర్తి పేరు సుమేరువు. ఈశ్వరునకుగూడ. సుమేరునామమున్నది. ఈశ్వరుడు సర్వఐశ్వర్యయుతుడు కనుక సుమేరువుతో పోలిక. శివుడు చంద్రశేఖరుడు. చంద్రుని వెన్నెలవలె తెల్లనివాడు, ఆనందదర్శనుడు. ఐనప్పటికి చంద్రునివలెనే పాపులపై నిందలు కురిపించే అశుభసూచకుడు. చంద్రుని భాద్రపద శుద్ధ చవితి (వినాయకచవితి)నాడు చూచినవారికి అపనిందలు కలుగుతాయన్న పురాణకథ తెలిసినదే. ఈ విషయంలోనూ శివుడు చంద్రశేఖరుడే అని భావం.

శ్లో॥ జయ కష్టతపఃక్లిష్టమునిదేవదురాసద! ।
జయ సర్వదశారూఢభక్తిమల్లోకలోకిత! ॥ 21

**ప్రతిపదార్థము :** కష్ట = కఠినమైన, తపః = తపస్సుతో, క్లిష్ట = దుఃఖితులైన, ముని = మునులకు, దేవ = దేవతలకు, దురాసద = లభించనివాడా!, జయ = నీకు జయము!, సర్వదశా = అన్నిదశలలో, ఆరూఢ = స్థిరతగల, భక్తిమత్ = భక్తిగల, లోక = జనులచే, లోకిత = చూడబడినవాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** దేవా! కఠినతపస్సులు చేసియు నిన్ను పొందలేక దుఃఖితులగుదురు మునులు దేవతలు. నీ భక్తియందు స్థిరులైన వారికి నీవు సాక్షాత్కరింతువు. నీకు జయము జయము!

తపస్సు చేస్తే యే కోర్కికైనా తీరుతుంది, కాని తపస్సు కఠినాతికఠినం అని నానుడి. అందుచేత క్లిష్ట అన్నమాట. భక్తిలోనూ దశాభేదాన్నాయి. భక్తియోగం కదా, తపస్సుకంటె సులభంకాదు. ఈ దశలు కాయిక, మానసిక, బౌద్ధిక, ఆత్మిక స్థాయిలో ఉంటాయి. సాఫల్యం చివరి దశలోనే. ఈలోగా భక్తుడు తనధైర్యాన్ని, నమ్మకాన్ని సడలించవచ్చు, పోగొట్టుకోనూవచ్చు. అందుకే ఆరూఢభక్తి తప్పని సరి. దీనిని సాధించినవారికి సాక్షాత్కారం. అయితే శివదర్శనం భక్తివలన సాధ్యమైనట్లు ఇతరోపాయాలవలన సాధ్యం కాదు, అన్నదే కవి హృదయం.

శ్లో॥ జయ స్వసంపత్ప్రసరపాత్రీకృతనిజాశ్రిత! ।
జయ ప్రపన్నజనతాలాలనైకప్రయోజన! ॥ 22

**ప్రతిపదార్థము :** స్వ = తనదైన, సంపత్ = సంపదను, ప్రసర = ప్రసరించుటలో, పాత్రీకృత = యోగ్యులుగాచేయబడిన, నిజ = తన, ఆశ్రిత! = ఆశ్రితులుగలవాడా!, జయ = నీకు జయము!, ప్రపన్న = శరణన్న, జనతా = జనులను, లాలన = లాలించుటయే, ఏక = ఒకే ఒక్క, ప్రయోజన! = ఉద్దేశముగలవాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** దేవా! నీవు నీ ఆశ్రితులను సర్వసంపదలు పొందుటకు యోగ్యులుగా చేతువు. నిన్ను శరణన్న వారిని లాలించుటే నీకు ఏకైక లక్ష్యము. నీకు జయము జయము!

భగవద్గీత 9వ అధ్యాయంలోని 13వ శ్లోకంలో చెప్పినట్లు, తేషాం నిత్యాభియుక్తనాం యోగక్షేమం వహామ్యహమ్, శరణన్న వారికి ఉండదగినదేదీ నష్టము

కాకుండ, రావలసినది లభించే విధంగా వారిని అనుగ్రహిస్తాడు స్వామి. లాలన అంటే అదే.

**శ్లో॥ జయ సర్గస్థితిధ్వంసకారణైకావదానక! ।**
**జయ భక్తిమదాలోలలీలోత్పలమహోత్సవ! ॥ 23**

**ప్రతిపదార్థము :** సర్గ = సృష్టి, స్థితి = స్థితి, ధ్వంస = లయ, వీనికి, కారణ = కారణమగుట, ఏక = ఒకే, అవదానక! = కార్యముగలవాడా!, జయ = నీకు జయము!, భక్తిమద = భక్తిపారవశ్యముతో, ఆలోల = కొంచెము వణకుచున్న, లీలా = వర్తనగల, ఉత్పల = ఉత్పలదేవునకు, మహోత్సవ! = మహానందమును కలిగించువాడా!, జయ = నీకు జయము!

**తాత్పర్యము :** స్వామీ! నీకు సృష్టి స్థితిలయాలు కాక వేరొక మహత్కార్యములేదు. నీవు నీ యందలి భక్తిపారవశ్యమున ఇంచుక వణకుచున్న ఉత్పలదేవాచార్యునకు మహదానందకారివి. నీకు జయము జయము!

**శ్లో॥ జయ జయభాజన! జయ జితజన్మ –**
**జరామరణ! జయ జగజ్జ్యేష్ఠ! ।**
**జయ జయ జయ జయ జయ జయ జయ**
**జయ జయ జయ జయ జయ జయ త్ర్యక్ష! ॥ 24**

**ప్రతిపదార్థము :** జయభాజన = జయజయధ్వనులకు తగువాడా!, జయ = నీకు జయము!, జిత = గెలువబడిన, జన్మ = పుట్టుకగలవాడా!, జరా = ముసలితనము, మరణ = మృత్యువు అనునవిగలవాడా!, జయ..... జయ..... = నీకు జయము జయము!, త్ర్యక్ష = ముక్కంటీ!.

**తాత్పర్యము :** లోకములన్నిటికి ఆద్యుడవునీవు. నీకు పుట్టుక, వార్ధక్యము, మరణము అనునవి లేని శాశ్వతుడవు నీవు. కనుక లోకములన్నీ నీకు జయజయధ్వానము చేయును. అందుకు నీవే తగుదువు.



శ్రీః

# 15. భక్తిస్తోత్రమ్

శ్లో॥ త్రిమలక్షాలినో గ్రంథాః సన్తి తత్పారగాస్తథా ।
యోగినః పండితాః స్వస్థాస్త్వద్భక్తా ఏవ తత్త్వతః ॥ 1

**ప్రతిపదార్థము :** త్రిమల = మూడు మలినములను, క్షాలినః = కడిగివేయునట్టి, గ్రంథాః = గ్రంథములు, తథా = అట్లు, తత్ = వానియొక్క, పారగాః = తీరమునెఱిగినవారు, యోగినః = యోగులు, పండితాః = పండితులు, సన్తి = ఉన్నారు, త్వద్ = నీయొక్క భక్తాః = భక్తులు, ఏవ = మాత్రము, తత్త్వతః = వాస్తవముగా, స్వస్థాః = సుఖులు.

**తాత్పర్యము :** మానవునకు సిద్ధమైన మూడు మలినములను కడిగివేసి పరిశుద్ధుని చేయగల శాస్త్రములున్నవి. వానిని పారజదివిన పండితులున్నారు, ఆచరించిన యోగులున్నారు. కాని నీ భక్తులు మాత్రము స్వాభావికముగ సుఖులు.

మానవుని సహజముగ అంటియుండే మాలిన్యము మూడు విధములని శాస్త్రోక్తి: **1. ఆణవమలము**. ఇది మానవునికి సహజమైన స్థూలశరీరాభిమానమువలన కలిగే మాలిన్యము. అనగా, స్థూలశరీరమే ఆత్మ, తాను; తన చైతన్యము ఆత్మకాదు, తాను కాదు, అను భావమున ప్రవర్తించటం వలన కలిగే దుష్ఫలితాలు. **2. మాయీయమలము**. ఇది మాయ సంబంధమైనది. మాయ అనగా, మీయతే అనయా ఇతి మాయా, ఈ ప్రక్రియ ద్వారా వస్తుభిన్నత్వాన్ని కొలిచి జగత్తులోని నానాత్వాన్ని విలువకడుతూంటాడు మానవుడు. ఇది ఆణవమలానికి దగ్గరి బంధువు, ద్వయబుద్ధికి కారణము. ఇది గుణమాలిన్యము కలిగినది, అవిద్య అనబడేది. **3. కర్మమాలిన్యము**. ఇది మానవుడు అనుక్షణము చేయు కర్మల మంచి చెడులనుబట్టి కలుగునది. ఇది కూడ మొదటి రెండిటితో సంబంధమున్నదే. ఈ మాలిన్యములను తొలగించే విధానం శాస్త్రాలలో చెప్పబడినది.

శాస్త్రవిషయజ్ఞానాన్ని ఆచరణకు సమన్వయం చెయ్యని పండితులున్నారు. వారు ప్రవచనాలు చెయ్యగలరు. కాని శాస్త్రాలను జీవితాని కన్వయించి ఆచరించేవారు కూడ ఉన్నారు. వీరికి సైతం సుఖదుఃఖద్వంద్వం అనుభవంలో ఉంటుంది. యోగులు పరమాత్మతో ఏకత్వాన్ని లక్షించి సాధించినవారు. వారు సుఖులే. కాని శాస్త్రజ్ఞానం సుసాధ్యం కాదు, యోగి కావటం సుసాధ్యం కాదు. వీరితో పోలిస్తే, భక్తిమార్గం సులభసాధ్యం. వారు స్వభావసిద్ధంగా శరీరాన్ని, మనస్సును, ఆత్మను, కర్మఫలాన్ని, జ్ఞానాజ్ఞాన వివక్షను, కార్యాకార్య వివక్షను సర్వం పరమాత్మపరం చేసి, తంౘ్రిౘ్రేలుపట్టి

నడిచే బాలురవలె జీవిస్తారు. వారు నిత్యయుక్తులు, పరమాత్మ సుఖస్వరూపంతో తాదాత్మ్యం చెందినవారు. వారికి ద్వయం లేదు. ఉన్నదంతా పరమాత్మయే. కనుక సుఖం తప్ప సుఖదుఃఖద్వయానుభవంలేదు. కనుకే తత్త్వతః స్వస్థులనటం. స్వస్థులు అంటే, తమయందే తాముండువారు, ఆత్మరతులు, ఆత్మయుతులు.

**శ్లో॥ మాయీయకాలనియతిరాగాద్యాహారతర్పితాః ।**
**చరన్తి సుఖినో నాథ! భక్తిమన్తో జగత్తటే ॥ 2**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, మాయీయ = మాయాసంబంధమైన, కాల = కాలముయొక్క, నియతి = నియమము, రాగ = ప్రేమ, అనురక్తి, ఆది = మొదలగు, ఆహార = ఆహారముతో, తర్పితాః = తృప్తిచెందినవారగు, భక్తిమన్తః = భక్తులు, జగత్ = జగత్తుయొక్క, తటే = ఒడ్డున, సుఖినః = సుఖులై, చరన్తి = విహరించుచున్నారు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! కాలము మాయకు చెందినది. దాని నియమములగు రాగాదుల అనుభవముతో తృప్తిచెందిన భక్తులు ఈ జగత్తను సముద్రపుటొడ్డున సుఖంగా విహరిస్తూంటారు.

కాలము పరిక్రమించేది ఐదు విధాలుగా. దీనిని కాలపంచకం అంటారు. ఇవి : ప్రాతఃకాలము, సంగమకాలము, మధ్యాహ్నము, అపరాహ్ణము, సాయంకాలము. ఈ కాలం సమస్తాన్నీ ఆహరిస్తుంది. కాని భక్తుడు కాలాన్నే ఆహరిస్తాడు, అంటే, కాలంలో తాను జీర్ణం కాకుండా, తనలో కాలాన్ని జీర్ణం చేసికొని, తుష్టినీ పుష్టినీ సాధించి, కాలాన్ని తరించి, ఆత్మసుఖంతో పరిపూర్ణుడై, సముద్రపుటొడ్డున నిలచి నడిసంద్రంలో కొట్టు మిట్టాడే వారిని చూస్తూండే వారివలె, భక్తుడు నిర్వికారంగా ఉంటాడు. అయితే, కాలాన్ని తాను ఆహరించటం ఎట్లా? పది విధములైన కట్టుబాట్లను తనకు తానే విధించికొని జీవించటం ద్వారా అదిసాధ్యం. ఆ పది: తపస్సు, సంతోషం, ఆస్తిక్యం, దానం, ఈశ్వరపూజనం, సిద్ధాంతశ్రవణం, లజ్జ, మతి, జపం, వ్రతం. **తపస్సు** అంటే లక్ష్యంపై మనస్సునేకాగ్రం చేసి ధ్యానించటం. **సంతోషం** అంటే ఉన్నదానితో తృప్తి పొందటం. **ఆస్తిక్యం** అంటే దైవవిశ్వాసం. **దానం** అంటే తనకున్నది లేనివారితో పంచుకోవటం, ఎదుటివారి పొరబాట్లను మన్నించటం. **ఈశ్వరపూజనం** అంటే తాను నమ్మిన దేవతారూపాన్ని ధ్యానిస్తూ సర్వేంద్రియాలనూ ఆ దైవసేవలో నియమించటం. **సిద్ధాంతశ్రవణం** అంటే తన మనసుకుదిరిన ద్వైతాద్వైతాది దర్శనాల జ్ఞానానిచ్చే విషయాలను వినటం. **లజ్జ** అంటే వినయం, గొప్పలు చెప్పికొనకుండటం. **మతి** అంటే వేదవిహిత కర్మాచరణలో శ్రద్ధ. **జపం** అంటే దేవతారూపమైన మంత్రాన్ని మననం

చేయటం. **వ్రతం** అంటే ఉపాసనాది కర్మాచరణనిష్ఠ.

**శ్లో॥ రుదన్తో వా హసన్తో వా త్వాముచ్చైః ప్రలపన్త్యమీ ।**
**భక్తాః స్తుతిపదోచ్చారోపచారాః పృథగేవ తే ॥ 3**

**ప్రతిపదార్థము :** అమీ భక్తాః = ఈ భక్తులు, రుదన్తః వా = ఏడ్చుచున్నవారైనను, హసన్తః వా = నవ్వుచున్నవారైనను, త్వామ్ = నిన్ను, ఉచ్చైః = బిగ్గరగా, ప్రలపన్తి = పలవరించుచుందురు, స్తుతిపద = స్తోత్రగీతములను, ఉచ్చార = పాడుచు, ఉపచారాః = పూజలుచేయువారై, తే = వారు, పృథక్ ఏవ = వేరుగనే ఉందురు.

**తాత్పర్యము :** ఈ భక్తులు ఏడ్చినా నవ్వినా నిన్నేతలచుకొనుచూ, స్తోత్రములు చేయుచు, పూజలు చేయుచూ ఉంటారు. వీరి ప్రవర్తన మిగతవారికంటే వేరుగానే ఉంటుంది.

భక్తిపారవశ్యంలో ఒక్కొక్కప్పుడు భక్తులు వెఱ్ఱిగా నవ్వటం, యేడ్వటం, కేకలు పెట్టుతూ స్వామిని పిలవటం, పాడటం, ఆడటం, లోకంతో తమకేమీ సంబంధంలేదన్నట్లే వ్యవహరిస్తారు. అందుకే ప్రలపన్తి అన్న పదప్రయోగం సార్థకం.

**శ్లో॥ న విరక్తో న చాపీశో మోక్షాకాంక్షీ త్వదర్చకః ।**
**భవేయమపి తూద్రిక్తభక్త్యాసవరసోన్మదః ॥ 4**

**ప్రతిపదార్థము :** న విరక్తః = విరక్తుడు కాను, న చ ఈశః = ఐశ్వర్యవంతుడనుకూడకాను, న + అపి మోక్ష + ఆకాంక్షీ = మోక్షాన్ని కోరేవాడున్నూ కాను, త్వద్ = నీయొక్క అర్చకః = పూజరి, భవేయమ్ = నేనగుదును, అపి తు = కాని, ఉద్రిక్తభక్తి + ఆసవరస + ఉన్మదః = ప్రగాఢమైన భక్తియను మదిరాపానమున కలుగు ఆనందముతో మత్తెక్కినవాడను(అగుదును)

**తాత్పర్యము :** నాకు విరక్తీవద్దు, ఐశ్వర్యమూ వద్దు, మోక్షమూ వద్దు. నీ పూజరినవుతాను. కాని ప్రగాఢమైన భక్తిపారవశ్యంతో సమస్తాన్నీ మర్చిపోతాను.

వైరాగ్యం వలనగాని ఐశ్వర్యం వలనగాని పరమానందం లభించదు. ముక్తివలన అసలేమి లభిస్తుందో కూడ తెలియదు. కాని నీ పూజ నిత్యానందాన్నిస్తుంది. భక్తి గాఢతరమైనకొలది ఆనందం అవధులు దాటిపోతుంది. ఇంక అంతకంటే కావలసిన దేమున్నది?

**శ్లో॥ బాహ్యం హృదయ ఏవాన్తరభిహృత్యైవ యోఽర్చతి ।**
**త్వామీశ! భక్తిపీయూషరసపూరైర్నమామి తమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, బాహ్యమ్ = బాహ్యప్రపంచమును, హృదయే అన్తర్ = హృదయములోలోపల, ఏవ = కూడ, అభిహృత్య = అన్నిదిక్కులనుండి స్వీకరించి, భక్తిపీయూషరసపూరైః = భక్తియను అమృతధారలతో, త్వాం ఏవ = నిన్నే, యః = ఎవడు, అర్చతి = అర్చించునో, తమ్ = వానిని, నమామి = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఓ స్వామీ! తనబైటగల ప్రపంచాన్ని, తన హృదయంలోలోపలకూడ, అన్ని దిశలలో భక్తిని నింపి ఆ అమృతధారలతో నిన్ను పూజించే వానికి నమస్కారం.

వ్యక్తికి బైట, లోపల ఉన్న ప్రపంచాలు వేర్వేరు. బైట వస్తుప్రపంచం. లోపల భావప్రపంచం. ఈ రెండింటికి అనేక కోణాలున్నాయి. వానినన్నిటిని సమగ్రంగా భక్తితో స్వీకరించటం అంటే అన్నిటా ఆ శివునే దర్శించటం. ఆ దర్శనంతో కలిగిన ఆనందం అమృతప్రాయం. ఆనందరూపియైన శివుని ఆనందమే పూజాద్రవ్యంగా ఎవడైనా అర్చించ గలిగితే, అంతకుమించిన పూజ వేరేముంటుంది? కనుక వాడు లోకవంద్యుడు.

శ్లో॥ ధర్మాధర్మాత్మనోరన్తః క్రియయోర్జ్ఞానయోస్తథా ।
సుఖదుఃఖాత్మనోర్భక్తాః కిమప్యాస్వాదయన్త్యహో! ॥ 6

**ప్రతిపదార్థము :** అహో = ఔరా!, భక్తాః = భక్తులు, ధర్మ = ధర్మము, అధర్మ = అధర్మము, ఆత్మనోః = కేంద్రముగాగల, క్రియయోః = కార్యములయొక్క, జ్ఞానయోః =జ్ఞానముయొక్క, తథా = అట్లే, సుఖ = సుఖము, దుఃఖ = దుఃఖము, ఆత్మనోః = కేంద్రముగాగల వాని, అన్తః = మధ్య, కిం+అపి = ఏదేని, ఆస్వాదయన్తి = అనుభవించుచున్నారు.

**తాత్పర్యము :** భక్తులు ధర్మాధర్మములకు, క్రియా జ్ఞానములకు, సుఖదుఃఖములకు మధ్య ఏదోఒక అలౌకికమైన ఆనందాన్ని అనుభవిస్తూన్నారు. ఏమాశ్చర్యము!

లోకంలో ప్రసిద్ధంగా ధర్మము – అధర్మము అనువాని నిర్ణయము ఫలితాన్నిబట్టి ఉంటుంది. అట్లే కార్యము – అకార్యము అనువాని నిర్ణయము కూడ. జ్ఞాన – అజ్ఞానముల నిర్ణయముగూడ ఇట్టిదే. Judging the right by the wrong,అనునది లోకరీతి. సుఖదుఃఖముల నిర్ణయమున్నూ ఇట్టిదే. తక్షణఫలాన్నిబట్టి నిర్ణయం. అయితే భక్తులకు ఈ నిర్ణయమునందాసక్తిలేదు. నిజానికి ధర్మాధర్మములందుగాని, కార్యాకార్యములందు గాని, జ్ఞానాజ్ఞానములందుగాని, సుఖదుఃఖాలలోగాని వారి ఆత్మ ప్రసరించదు. ఈ ద్వంద్వమునకు నడుమ అలౌకికానందము ననుభవించుటే వారి లక్ష్యము. వారి ఆత్మ ఆ ఆనందమునందే స్థిరము. అనగా, లోకముతో చేరి వారుగూడ ఈ ద్వయములో

నొకపక్షమును వహించుట కిష్టపడరు. వారికి ఈ రెండునూ అప్రధానములే. అసలు వారు లోకమున ద్వయము ననుభవించరు, అద్వయానందమునే అనుభవింతురు.

**శ్లో॥ చరాచరపితః! స్వామిన్! అప్యంధా అపి కుష్ఠినః ।**
**శోభన్తే పరముద్దామభవద్భక్తివిభూషణాః ॥ 7**

**ప్రతిపదార్థము :** చర + అచరపితః! = చరాచరాత్మక సృష్టికి తండ్రివైన, స్వామిన్! = ఓ స్వామీ!, అన్ధాః అపి = గ్రుడ్డివారైనను, కుష్ఠినః అపి = అత్యంతము నింద్యులైనను, ఉద్దామ = ఎల్లలులేని, భవత్+భక్తి = తమయందలి భక్తిని, విభూషణాః = విశేషాలంకారముగా గలవారు, పరమ్ = మిక్కిలి, శోభన్తే = శోభింతురు.

**తాత్పర్యము :** జగత్పితా! స్వామీ! తమ భక్తిగలవారు ఎంతైనా శోభిస్తారు. వారు శారీరకంగా గ్రుడ్డివారా లేక కుష్ఠవ్యాధిపీడితులా అన్నది అప్రస్తుతం. వారి భక్తి ఎంత ప్రగాఢమో అంతగా వారు శోభిస్తారు.

సాధారణ మానవులకు సర్వత్ర భౌతికప్రమాణాలే ఆరాధ్యాలుగా ఉంటాయి. గ్రుడ్డివాడంటే కలిగే జాలికంటె వాడే జన్మలోనో మహాపాపం చేసినవాడన్న భావమే అధికం. కుష్ఠవ్యాధిపీడితుడైతే పరమపాపిష్ఠుడనే స్థిరమైన భావం. దరిద్రులను గురించి కూడ ఇదే అభిప్రాయం. న్యాయనిర్ణేత దృష్టిని తప్పించి సమభావాన్ని కలగించగలిగినది గాఢభక్తి ఒక్కటే. ఒక్కసారి లోకం ఎవరినైన పరమభక్తునిగా గుర్తించినట్లయితే, ఇక ఆ వ్యక్తి రూపలావణ్యాలుగాని, అంగవైకల్యాలుగాని, అనారోగ్యపీడలు, ఏవీ కనరావు. నమ్మకం గట్టిపడితే, గుణావగుణాలున్నూ లెక్కకురావు. భక్తి ఒక నింద్యుని సైతం అలౌకికమహాత్మునిగా మార్చివేస్తుంది.

**శ్లో॥ శిలోంఛపిచ్ఛకశిపువిచ్ఛాయాంగా అపి ప్రభో! ।**
**భవద్భక్తిమహోష్మాణో రాజరాజమపీశతే ॥ 8**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ ప్రభూ!, శిల+ఊంఛ = అత్యన్తము దారిద్ర్యముతో, పిచ్ఛ = పిట్టతోకవలె, కశిపు = భోజనవస్త్రాలవలన, విచ్ఛాయ = పలుచనైన, అంగాః = శరీరముగలవారు, అపి = కూడ, భవత్ = తమయొక్క, భక్తి = భక్తియొక్క, మహా = గొప్ప, ఊష్మాణః = వెచ్చదనముగలవారగుచు, రాజరాజం అపి = కుబేరుని కూడ, ఈశతే = శాసింతురు.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! ఊంఛవృత్తిచే జీవించు నిరుపేద, పిట్టతోకలోని ఈకవలె బక్కచిక్కి అన్నవస్త్రాలు లేకున్నవారు కూడ నీ భక్తి కారణంగా గొప్ప తేజస్సుగలవారై కుబేరునిసైతం శాసింతురు.

**శిల్, ఉంఛ్,** ఈ రెండు ధాతువులకూ ఒకే అర్థం, పరిగెయేరటం, అంటే, పంట పొలంలో పంట నూర్పిడి చేసి ధాన్యాన్ని రైతు ఇంటికి తరలించిన తరువాత, ఆ క్రమంలో అక్కడక్కడ రాలిన గింజలను ఏరుకొని ఆహారంగా వాడుకొనే పద్ధతి. ఈ పద్ధతిలో జీవించేవారు నిరుపేదలో లేక నియమపాలనం చేసే ఋషులో అయియుంటారు. శ్రీత్యాగరాజస్వామి కూడా ఉంఛవృత్తి నియమంగా జీవించినవారని లోకోక్తి. ఇందువలన పిట్టతోకలోని ఈకవలె బక్కచిక్కి ఉంటారనటంలో అతిశయోక్తిలేదు. తోకలోని ఈక చాల పల్చనిదికదా. అదేపోలిక. శివభక్తులు ఆ రూపంలో ఉన్నప్పటికీ వారి వర్చస్సు బ్రహ్మవర్చస్సు కనుక దేవతల కాంతి శరీరాలతో పోటీపడగలరు. వీరు ధనికులు కాకున్నా, దేవతలలోకెల్ల ధనికుడన్న పేరున్న కుబేరుని మించిన ధనవంతునివలె, ధనదుడుసైతం వీరిముందు తలవంచవలసినదే. ఊష్మ శబ్దానికి వేడి అని అర్థం. కాని సందర్భాన్నిబట్టి తేజస్సు అర్థంగా చెప్పటం సముచితం.

**శ్లో॥ సుధార్ద్రాయాం భవద్భక్తౌ లుఠతాప్యారురుక్షుణా ।**
**చేతసైవ విభోఽర్చన్తి కేచిత్త్వామభితః స్థితాః ॥ 9**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, త్వామ్ = నిన్ను, అభితః = అన్ని దిక్కులనుండి, పూర్తిగా, స్థితాః = లీనమైనవారు, కేచిత్ = కొందరు, సుధా = అమృతముతో, ఆర్ద్రాయామ్ = తడిసిన, భవత్ = తమయొక్క, భక్తౌ = భక్తిలో, లుఠతా + అపి = పరవశించినవారై నప్పటికి, ఆరురుక్షుణా = ఆరూఢ ఆత్మయోగులు కావలెనను కోరికతో, చేతసా + ఏవ = మనస్సుతో మాత్రమే, అర్చన్తి = పూజించుచున్నారు.

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! సంపూర్ణముగా నీలో లీనమైనవారు కొందరు, అమృతార్ద్రమైన భక్తిలో పరవశించినవారైనప్పటికి, ఆత్మయోగంలో ఆరూఢులు కావలెనన్న కోరికతో మానసపూజలో నిమగ్నమవుతూన్నారు.

భక్తిలో పారవశ్యతను పొందికూడా తృప్తిచెందక, ఆత్మయోగంలో సదా శివయుక్తులు కావలెనన్న కోరికతో పూజ చేస్తూంటారు. అయితే భక్తితాదాత్మ్యస్థితిలో వారికి పూజలో నోరుగాని చేతులుగాని సహకరించే స్థితిలో ఉండవు కనుక పూజ యథావిధి చేయలేరు. కనుక మానసపూజనాశ్రయిస్తారు. కాయికపూజకంటె ఇది శ్రేష్ఠమే కనుక దోషం కాదు. వారి భక్తి సమున్నతమూ గాఢతరమూ అవుతూన్నసూచన.

**శ్లో॥ రక్షణీయం వర్ధనీయం బహుమాన్యమిదం ప్రభో! ।**
**సంసారదుర్గతిహరం భవద్భక్తిమహాధనమ్ ॥ 10**

**ప్రతిపదార్థము :** ప్రభో = ఓ స్వామీ!, భవద్+భక్తి = తమభక్తియను, మహాధనమ్ = గొప్పధనము, సంసారదుర్గతి = సంసారమను చెడునడవడికను, హరమ్ = నశింప జేయునది, ఇదమ్ = ఇది, రక్షణీయమ్ = సురక్షితముగ కాపాడుకోదగినది, వర్ధనీయమ్ = వృద్ధిచేసికోదగినది, బహుమాన్యమ్ = సమాదరింపదగినది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! శివభక్తి గొప్పధనము. సంసారమను దుర్గతినుండి సుగతికి చేర్చునది. కనుక దీనిని నష్టపోకూడదు, వృద్ధిచేసికోవలె, ఆదరించవలె.

సంసారము నడక దుఃఖంలో, దుఃఖం దిశగా సాగుతుంది. ఈ లౌకిక దుఃఖం తీరటానకి ఏకైక మార్గం ధనసంపాదన. ధనమున్నచో, కూడు, గూడు, మానం, ప్రాణం, అన్నీ ఒనగూడగలవు. వ్యక్తిలో జన్మతః ఉన్న సామర్థ్యం, సుగుణాలు, అన్నీ రాణిస్తాయి. అందుచేత లౌకికులు ధనార్జనపరులవుతారు. ఆర్జించిన ధనాన్ని కాపాడుకుంటారు. వృద్ధిచేసికొంటారు. తమ సంపదను గౌరవిస్తారు. ధనంతో లౌకికదుఃఖం తీరినట్లే భక్తితో ఆధ్యాత్మికదుఃఖం తీరుతుంది. ఈ దుఃఖం ధనంతో కాదు భక్తితోనే తీరుతుంది. లౌకిక జీవనానికి భక్తి ఆనందమార్గాన్ని నిర్దేశిస్తుంది, గమ్యానికి చేరుస్తుంది. కనుక భక్తి మహాధనం. దానివలన కలిగేది మహానందం. కనుక ధనార్జనకు చేసే కృషిని మించిన కృషి భక్తివృద్ధిని సాధించటానికి చెయ్యవలె.

**శ్లో॥ నాథ! తే భక్తజనతా యద్యపి త్వయి రాగిణీ ।**
**తథాపీర్ష్యాం విహాయాస్యాస్తుష్టాఽస్తు స్వామినీ సదా ॥ 11**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, తే భక్తజనతా = నీ భక్తజనులు, యది + అపి త్వయి రాగిణీ = నీయందు అనురాగముగలవారైనను, తథా + అపి = అట్లయినను, స్వామినీ = పరాశక్తియైన పార్వతి, ఈర్ష్యామ్ = ఈర్ష్యను, విహాయ = విడచి, అస్యాః = దీనికి, సదా = ఎల్లవేళలందు, తుష్టా = ప్రసన్నురాలు, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** భక్తులు నీయందనురాగములవారైనను నీ ప్రియురాలైన పార్వతి ఈర్ష్యజెందక సదా ప్రసన్నతవహించుగాక!

**భక్తజనతా** శబ్దం 'ఆ' కారాన్త స్త్రీలింగశబ్దం. కాగా, భగవంతుడు ఒక్కడే పురుషుడన్న ఆర్యవాక్యాన్నిబట్టి, ఈ భక్తులంతా స్త్రీలే. ఈ స్త్రీసమూహం సహజంగా తమ నాథుడైన శివునియందనురాగంతో ఉంటారు. నిత్యయుక్తులై ఉంటారు. ఇది శివకామినియైన పార్వతికి ఈర్ష్య కలిగించటం స్త్రీ సహజలక్షణం. కాని తన నాథుడు శివుడైతే, తానుగూడ శివా శబ్దవాచ్యురాలే కదా. కనుక భక్తుల శివప్రియత్వంలో తనకూ

భాగముంటుంది కదా. **శివశివా** అని నోరార పిల్చి పాడి మురిసే భక్తజనులు తనలాగే శివప్రియులు, శివునిలాగే తన ప్రియులు కూడా కదా. ఇంక ఈర్ష్యకు తావేది!? ఆమె కూడా శివభక్తులయందు సదా ప్రసన్నురాలే.

**శ్లో॥ భవద్భావః పురో భావీ ప్రాప్తే తద్భక్తిసంభవే ।**
**లబ్ధే దుగ్ధమహాకుంభే హతా దధిని గృధ్నుతా ॥ 12**

**ప్రతిపదార్థము :** త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియొక్క, సంభవే = పుట్టుక, ప్రాప్తే = కలుగగా, భవత్ = తమయొక్క, భావః = భావము, ఏకాత్మత, పురః భావీ = మున్ముందు కలుగబోవునది, దుగ్ధ = పాలయొక్క, మహా = పెద్ద, కుంభే = కుండ, లబ్ధే = లభించినది కాగా, దధిని = పెరుగునందు, గృధ్నుతా = కోరిక, హతా = తీరినది.

**తాత్పర్యము :** శివభక్తి ముందుగా కలిగితే, శివభావం (అంటే శివునితో ఏకాత్మత, పారమ్యం) కాలక్రమేణ కలిగి తీరుతుంది. పెద్ద పాలకుండ లభించినప్పుడు పెరుగునందు కోరిక, చింత తీరినట్లే కదా.

పెరుగు, మజ్జిగ, నెయ్యి, ఇవన్నిటికీ మూల పదార్థం పాలు. పాలు సిద్ధంగా ఉంటే వాటిని పెరుగుగానో మజ్జిగగానో మనం కోరినట్లు మార్చుకోవచ్చు. ఈ పరిణామ క్రమంలో కొంతకాలం గడవక తప్పదు. కాని ఫలం లభించటం తథ్యం. ఇట్లాగే భగవద్భావం సాకారం కావాలన్నా, ఆ భావంతో తాదాత్మ్యం చెందాలన్నా, కావలసిన మూలపదార్థం భక్తి. భక్తి విశ్వాసంతో ప్రారంభమై క్రమంగా సాక్షాత్కారంగా పరిణమిస్తుంది. భక్తిలో భావప్రాప్తి అన్నది క్రమపరిణామంగా లభించటం తథ్యం.

**శ్లో॥ కిమియం న సిద్ధిరతులా – కిం వా ముఖ్యం న సౌఖ్యమాస్రవతి ।**
**భక్తిరుపజీయమానా – యేయం శంభోః సదాతనీ భవతి ॥ 13**

**ప్రతిపదార్థము :** శంభోః = శంభుని, ఇయమ్ = ఈ, భక్తిః = భక్తి, యా = ఏది, ఉపజీయమానా = వృద్ధియగుచుండగా, సదాతనీ = శాశ్వతత్వము గలది, భవతి = అగుచున్నది, ఇయం అతులా సిద్ధిః = ఇది సాటిలేని సిద్ధి, న కిమ్ = కాదాయేమి? వా = మరియు, ముఖ్యమ్ = శ్రేష్ఠమైన, సౌఖ్యమ్ = ఆనందమును, న ఆస్రవతి కిమ్ = ప్రవహింపదాయేమి?

**తాత్పర్యము :** ఈ శివభక్తి వృద్ధియై క్రమంగా శాశ్వతమైపోదా? ఈ శాశ్వతభక్తి అనితరసాధ్యమైన సిద్ధి కాదా? ఈ సిద్ధివలన పరమానందం లభించదా?

ఒక భౌతికశాస్త్రజిజ్ఞాసువు తన పరిశోధనలను ఒక విశ్వాసం (hypothesis)

తో ప్రారంభిస్తాడు. దానికి ప్రాతిపదిక తానంతవరకు కని విని తెలిసికొన్న విషయాలు. అట్లే భక్తుడున్నూ తాను కన్నవిన్న తెలిసికొన్న విషయజ్ఞానంతో శివభక్తుడవుతాడు. తొలుత వాని భక్తి ఒక ప్రయోగసాధనం. తరువాత క్రమపరిణామంలో శాస్త్రజ్ఞుని విశ్వాసం గట్టిపడినట్లే భక్తుని భక్తికూడ. ఆపై భక్తి, ఎదురు దెబ్బలు తిన్నప్పటికిన్ని, వర్థిల్లి ఫలాగ్రమవుతుంది. అప్పుడు పరమానందం కలుగుతుంది. ఇదంతా శాస్త్రీయ క్రమపరిణామమే. నిజానికి భౌతిక శాస్త్రవేత్త, భగవద్భక్తుడు ఇద్దరున్నూ సత్యాన్వేషులే, సాఫల్యంలో ఇద్దరికీ కలిగేది ఆనందమే.

**శ్లో॥ మనసి మలినే మదీయే - మగ్నా త్వద్భక్తిమణిలతా కష్టమ్ ।**
**న నిజానపి తనుతే తాన్ - అపౌరుషేయాత్స్వసంపదుల్లాసాన్ ॥ 14**

**ప్రతిపదార్థము :** త్వద్ = నీయొక్క, భక్తి = భక్తియను, మణిలతా = మణిలత, మదీయే = నాదైన, మలినే మనసి = మలినమైన మనసులో, మగ్నా = మునిగినదై, నిజాన్ = తనవైన, తాన్ = ఆ, అపౌరుషేయాన్ = అలౌకికమైన, స్వ = తనయొక్క, సంపత్ = సంపదను, అపి = కూడ, న తనుతే = ప్రకటించుట లేదు, కష్టమ్ = అయ్యో!

**తాత్పర్యము :** నీ భక్తి ఒక మణిలత. కాని అది నా మనసుమాలిన్యమున మునిగి తన అలౌకిక సంపదను ప్రదర్శించుటలేదు.

**మణి**యన్నది స్వయంప్రకాశము. కాని దానికి మలినము పై పూతగా యేర్పడినచో దాని కాంతి వెలువడదు. భక్తియటువంటి ఒక మణి. కాని దానికి మనోమాలిన్యం అంటినది. మనస్సుకు సంబంధించిన మాలిన్యం ఇంద్రియలాలన. ఈ మాలిన్యంవలన భక్తి తన స్వయం ప్రకాశాన్ని వెలువరించలేపోతూన్నది. దీన్ని తొలిగిస్తే తన సహజప్రకాశాన్ని పొందగలదు. భక్తుడు ధ్యానమగ్నుడైయున్నప్పుడు ఈ మాలిన్యం తొలిగి ఆత్మప్రకాశాన్ని చూడగలుగుతూన్నాడు. కాని సమాధి ముగిసిన తరువాత భక్తి మరల ఇంద్రియ మాలిన్యంలో మునుగుతూన్నది. ఆత్మదర్శనం, శివసాక్షాత్కారం కలగటంలేదు. ఇది చాల విచారించదగిన విషయం. ఇది లౌకిక పురుషస్థితి.

**శ్లో॥ భక్తిర్భగవతి భవతి త్రిలోకనాథే ననూత్తమా సిద్ధిః ।**
**కిన్త్వణిమాదికవిరహాత్ సైవ న పూర్ణేతి చిన్తా మే ॥ 15**

**ప్రతిపదార్థము :** త్రిలోకనాథే = త్రిలోకపతియందు, భవతి = మీరు, భగవతి భక్తిః = భక్తిరూపదేవిని, నను = నిజముగ, ఉత్తమా = సర్వోన్నతమైన, సిద్ధిః = సిద్ధి, కిన్తు =

కాని, అణిమా = అణిమ, ఆదిక = మొదలగుసిద్ధుల, విరహాత్ = లేమిచే, సా + ఏవ = ఆమెయైన, న పూర్ణా = పూర్ణురాలు కారు, ఇతి = అని, మే = నాయొక్క, చిన్తా = విచారము.

**తాత్పర్యము :** శివునియందు రూపుదాల్చిన భక్తియే శివుని దేవేరి. అది సిద్ధులలోకెల్ల సర్వోత్తమమైనది. కాని భక్తిరూపిణియైన ఆమె కూడా అణిమాది సిద్ధులు లేనిదైతే అసంపూర్ణురాలే అని విచారం.

పార్వతి శివునిలో సగమైనది, అంటే, అదెట్లా సాధ్యమైనది? తపస్సుచేత. తపస్సుకు మూల కారణమైన ప్రేరణయేది? శివునియందనురాగము. ఆ ఆనురాగం ప్రగాఢమై శివుని నిరంతరసాన్నిధ్యమును కోరినందువలన ఆమె శివుని అర్ధాంగియైనది అక్షరాల. ఇంతకంటె శివభక్తికి పారమ్యం మరేమి ఉంటుంది!? అయినప్పటికి, ఒకవేళ ఆమెకు అణిమాదిశక్తులు లేకుంటే!? అప్పుడసలు ఆమె శివుని అర్ధాంగి ఎట్లా అవుతుంది?! కాదుకదా? అట్లాగే, శివభక్తికి ఫలంగా శివసాక్షాత్కారం మాత్రం చాలదు. ఆ భక్తి పరిపూర్ణం కావాలంటే శివత్వం సిద్ధించాలి. అణిమాది అష్టైశ్వర్యాలు లేకపోతే ఈశ్వరుడూకాడు, ఈశ్వరభక్తుడూకాడు, అసంపూర్ణుడే. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం, అనునివి అష్టసిద్ధులు, అష్టైశ్వర్యాలు.

**శ్లో॥ బాహ్యతోఽన్తరపి చోత్కటోన్మిషత్ - త్ర్యంబకస్తవకసౌరభాః శుభాః ।**
**వాసయన్త్యపి విరుద్ధవాసనాన్ - యోగినో నికటవాసినోఽఖిలాన్ ॥ 16**

**ప్రతిపదార్థము :** బాహ్యతః = బయటనుండి, అన్తః అపి చ = లోపలనుండికూడ, ఉత్కట = అత్యంతము, ఉన్మిషత్ = వికసించిన, త్ర్యంబక = ముక్కంటి, స్తవక = (స్తోత్రపుష్ప)గుచ్ఛములనుండి వెలవడిన, సౌరభాః = సువాసనలు, శుభాః = శుభదములు, యోగినః = యోగులు, విరుద్ధవాసనాన్ = దుర్వాసనలను, అఖిలాన్ = అన్నిటిని, నికట = చెంత, వాసినః = నివసించువారిని, అపి = కూడ, వాసయన్తి = సువాసనలుగా చేయుచున్నవి.

**తాత్పర్యము :** స్తోత్రములు శివుని రూపము తమ అంతరంగములలోను బైటిప్రపంచము లోను గూడ పూర్తిగా వికసించియుండవలెను. అప్పుడవి సుగంధమును గుబాళించుచు, పరిసరములలోగల దుర్వాసనలనుగూడ సువాసనలుగా మార్చివేయును. యోగులు అంతటివారు.

బహిరంతరములలో ముక్కంటినే దర్శించగల భక్తులు సాధారణభక్తులు కారు.

కనుక వారి భక్తి వికసించిన పుష్పగుచ్ఛమువలె శివతత్త్వమును ప్రకటించును. అప్పుడు చుట్టూ ఉన్న విరుద్ధభావాలుసైతం తమ విరోధాన్ని త్యజించి దైవీమయమవుతాయి. Oliver Goldsmith తన Deserted Village అను కవితలో ఒక ఆధ్యాత్మవాదిని గూర్చి, వాని ప్రసంగపటిమను గూర్చి ఇట్లా అంటాడు: E'en fools who came to scoff remained to pray. అంటే, అతని ఆధ్యాత్మికతను అవహేళన చేస్తూ అల్లరి చేయాలని వచ్చిన అల్లరిమూకకూడ వాని ప్రసంగం ఆసాంతం నిశ్శబ్దంగా విని, చివరలో ప్రార్థన కూడా చేసేవారు, అని. ఈ శివకవి కూడ అదే భావాన్ని ప్రకటిస్తున్నాడిక్కడ.

**శ్లో॥ జ్యోతిరస్తి కథయాపి న కించిద్ – విశ్వమప్యతిసుషుప్తమశేషమ్ ।**
**యత్ర నాథ! శివరాత్రిపదేఽస్మిన్ – నిత్యమర్చయతి భక్తజనస్త్వామ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, యత్ర = ఎక్కడ, జ్యోతిః = వెలుగు, కించిత్ = కొంచెము, కథయా + అపి = మాటవరుసకైనను, న అస్తి = లేదో, అశేషమ్ = సమస్తమైన, విశ్వమ్ = జగత్తు, అపి = కూడ, అతిసుషుప్తమ్ = గాఢనిద్రలో ఉండునో, అస్మిన్ = అట్టి, శివరాత్రిపదే = కల్యాణప్రదమైన రాత్రివేళలో, భక్తజనః = భక్తుడు, నిత్యమ్ = ప్రతిరోజు, త్వామ్ = నిన్ను, అర్చయతి = పూజించును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఎక్కడ పేరుకైన కొంచెమైన వెలుగు ఉండదో, జగత్తు సమస్తం గాఢనిద్రలో ఉంటుందో, అటువంటి శివరాత్రివేళలో భక్తుడు నిత్యమూ నిన్ను పూజిస్తాడు.

శివరాత్రి పర్వదినాన సాధారణప్రజకూడా శివుని అర్చించటం లోకాచారం. కనుక శివభక్తుడు శివార్చన చెయ్యకుండా ఉంటాడా? కాని అట్టి శివరాత్రి నిత్యమూ ఉండదుకదా, మరి ఈ భక్తుడెట్లా నిత్యమూ శివరాత్రిలో పూజిస్తాడు? శివరాత్రి చతుర్దశి, అమావాస్య తిథుల్లో కృష్ణపక్షంలో వచ్చే పర్వదినం కనుక కొంచెమైనా వెన్నెల ఉండదనవచ్చు. కాని అది నిత్యం ఎట్లా సంభవం? రాత్రివేళ నిద్రవేళయే కాని శివభక్తులు శివరాత్రి జాగరణ చేస్తారు కదా, విశ్వమంతా గాఢనిద్రలో ఎందుకుంటుంది? అయితే, ఈ భక్తకవి చెప్పే శివరాత్రిపదం, అంటే స్థానం సంవత్సరానికొక రోజు వచ్చే పర్వదినం కాదు. జ్యోతి అన్నదిక్కడ బాహ్యాన్తఃకరణజ్ఞానం, ఈ జ్ఞానంలేనిదే రాత్రి. ఇదిలేకపోవుట వలన **మాయీయ**, అంటే, అవిద్యారూపమైన ప్రపంచం అచేతనమైపోతుంది. అది సుఖస్వరూపియైన శివుడు తత్త్వప్రకాశుడైయుండే స్థానం, శివసమావేశభూమి. వస్తుప్రపంచజ్ఞానం ఉపసంహరింపబడినందున రాత్రివంటి స్థితిగల స్థానమది. శివసత్తానుభవం కలగిన భక్తుడు ఆ స్థితిలో శివుని అర్చిస్తాడని శివానందసమాధి స్థితిని శివరాత్రిగా భక్తుడు నిత్యం పొందుతాడని సాంప్రదాయికమైన అన్వయం.

శ్లో॥ సత్త్వం సత్యగుణే శివే భగవతి స్ఫారీభవత్వర్చనే
చూడాయాం విలసన్తు శంకరపదప్రోద్యద్రజఃసంచయః ।
రాగాదిస్మృతివాసనామపి సముచ్ఛేత్తుం తమో జృంభతాం
శంభో! మే భవతాత్త్వదాత్మవిలయే త్రైగుణ్యవర్గోఽథవా ॥ 18

**ప్రతిపదార్థము :** శంభో = పరమానందరూపా!, సత్యగుణే = శాశ్వతశుభగుణములుగల, భగవతి = భగవంతుడగు, శివే = శివునియొక్క, అర్చనే = పూజలో, సత్త్వమ్ = సత్త్వ గుణము, స్ఫారీభవతు = వికసించుగాక!, శంకర = శంకరుని, పద = పాదములనుండి, ప్రోద్యత్ = ఉద్భవించిన, రజః = ధూళియొక్క, సంచయః = సమూహములు, చూడాయామ్ = శిరస్సుపై, విలసన్తు = ప్రకాశించుగాక!, రాగ + ఆది = అనురాగము మొదలగు, స్మృతివాసనామ్ = స్మృతిసంబంధమగు వాసనను, అపి = కూడ, సముచ్ఛేత్తుమ్ = నశింపజేయుటకు, తమః = తమోగుణము, జృంభతామ్ = వికసించుగాక!, అథవా = ఇట్లే, మే = నాయొక్క, త్రైగుణ్యవర్గః = త్రిగుణములు, త్వద్+ఆత్మ = నీ ఆత్మలో, విలయే భవతాత్ = లయమందుగాక!

**తాత్పర్యము :** ఓ పరమానందరూపా! నీవు భగవంతుడు, శాశ్వతగుణుడవు, సుఖప్రదుడవు. నీ పూజలో నాయందు సత్త్వగుణము వికసించుగాక! శంకరుడవగు నీ పాదముల ధూళి నా శిరస్సుపై ప్రకాశించుగాక! నాలోని రాగద్వేషాది వాసనలు నశించుటకు నాలో తమోగుణము వర్ధిల్లుగాక! అట్లే నాలోని సహజసిద్ధములైన సత్త్వరజస్తమోగుణములు నీ ఆత్మలో లీనమగుగాక!

శంభుశబ్దానికి పరమానందస్వరూపుడని అర్థం. సత్త్వగుణములంటే, సర్వజ్ఞత, సర్వశక్తిమత్త, సర్వవ్యాపకత అనే శాశ్వతమైన నిర్ద్వంద్వగుణములు. భగవంతుడంటే భగము అనబడు ఐశ్వర్యలక్షణములున్నవాడు. శంకరుడంటే శాంతిని, సుఖాన్ని కలిగించేవాడు. రజశ్శబ్దానికి ధూళియని, రజోగుణమని అర్థాలు. స్మృతి అంటే జ్ఞాపకం. జన్మజన్మల జ్ఞాపకాలకు సంబంధించియే యే వ్యక్తిలోనైన రాగద్వేషాది భావాలు కలుగుతాయని శాస్త్రోక్తి. ఆత్మ శబ్దానికి వ్యక్తిపరమైన 'నేను' అన్న భావము, శరీరేంద్రియ మనోబుద్ధులకు భిన్నమైన సార్వత్రిక అధిష్ఠాతృకేంద్రము ఆత్మ, అని అర్థాలు.

**శివుడు తెల్లనివాడు.** ఈ రంగు సప్తవర్ణాలకు జన్మస్థానంగాను, లయస్థానం గాను నేటి పదార్థవిజ్ఞానశాస్త్రం (Physics) అంగీకరించిన ప్రయోగాత్మక సత్యం. ఈ రంగు స్వచ్ఛతకు, నిర్వికారితకు సంకేతం, విశుద్ధానందానికి గుర్తు. అందుకే శివశబ్దం సుఖస్వరూపానికి నిర్వచనం. ఈతని ఆరాధనలో గుణత్రయం ఏకీకృత పరమానందంగా

పరిణమించాలన్న ఆశ, లక్ష్యం ఆర్థరహితం కాదు, సమర్థనీయమే. అయితే సత్త్వగుణంతో రజోగుణంకూడ ప్రకాశించవలెననటమే ఆశ్చర్యం! సత్త్వంతో రజస్సుకూడినప్పుడు గుణప్రకృతిని సృష్టించి రాగద్వేషాది ద్వయభావాలను పుట్టించి లోకమాయ సంసారానికి తావిస్తుందని కదా పండితులంటారు?! మరి రజోగుణాన్ని తలకెక్కించుకోవాలన్న తపనయెందుకు? రజోగుణం సృజనాత్మకం. ఇది యోగశక్తిప్రదం. దీనితో కలవనంతవరకు సత్త్వం, తమస్సు స్పందన లేనివే. ఈ రెండిటికీ స్పందన కలిగించి వానిలో నిద్రాణంగా ఉన్న శక్తిని కదిలించేది రజోగుణం. ఇది శిరోధార్యం కాకుంటే భగవంతునికి, భక్తునికి, భక్తికి కూడా నామరూపాలులేవు. కనుక రజోగుణం త్యాజ్యంకాదు. అందుకే ఈ భక్తకవి అది శిరోధార్యం అనటం.

అయితే మూడు గుణాలున్నూ తమస్సులో లయం కావాలంటూన్నాడీ భక్తుడు. ఇంతకు ముందటి శ్లోకంలో నిత్యశివరాత్రిపదాన్ని గురించిన ప్రస్తావన ఉన్నది. దానిని స్మరించినట్లయితే, ఈ శ్లోకంలోని తమోగుణం అర్థమవుతుంది. ఇది రుద్రతత్త్వం. లోకంగా చెప్పబడే ద్వయప్రకృతిని తనలో కలిపివేసికొని అద్వయమై వెలిగే శుద్ధతమస్సు. దీనికిన్ని శుద్ధసత్త్వాకిన్ని భేదంలేదు. రజోరహితమైనదీ స్థితి. కాగా, రజోగుణమన్నది రసాయనశాస్త్రంలో ప్రస్తావించబడే catalyst వంటిది. సత్త్వతమస్సులను అనుసంధానం చేసి సృష్టిస్థితిలయాత్మకమైన ప్రకృతికి కారణమై మరల సత్త్వ తమస్సులు ఏకాత్మక శుద్ధసత్త్వంగా లీనమైనప్పుడు తాను ప్రక్కకు తప్పుకునే సృజనశక్తి. తానున్నూ శుద్ధసత్త్వంలో లీనమవుతుంది. కనుకే ఈ శక్తిని బృంహణశక్తిగా, బ్రహ్మగా భావించినారు ఋషులు. ఈ శక్తిలక్షణం ప్రసరించటం కనుక సరస్వతిగా సంకేతించబడినది. ఈ శక్తులు ఒక్కటేయైనది కేవలస్థితి, కైవల్యం. ఆ కైవల్యస్థితియే శివరాత్రిపదం. అక్కడ త్రిగుణప్రకృతి లేదు. ఉన్నది కేవలము ఉనికియొక్క జ్ఞానము, ఆనందము, సత్‌చిత్ ఆనందస్థితి. దానినందుకోవలెనన్నది ఈ భక్తకవి ఆశయము. దానికై దైవానుగ్రహము నర్థిస్తూ ఈ ప్రార్థన.

**శ్లో॥ సంసారాధ్వా సుదూరః ఖరతరవివిధవ్యాధిదగ్ధాంగయష్టిః**
**భోగా నైవోపభుక్తా యదపి సుఖమభూత్ జాతు తన్నో చిరాయ ।**
**ఇత్థం వ్యర్థోఽస్మి జాతః శశిధరచరణాక్రాన్తికాన్తోత్తమాంగ -**
**స్త్వద్భక్తశ్చేతి తన్మే కురు సపది మహాసంపదో దీర్ఘదీర్ఘాః ॥ 19**

**ప్రతిపదార్థము :** సంసార = జీవనయాత్రకు, అధ్వా = మార్గము, సుదూరః = చాల దూరము; ఖరతర = అమితబాధాకరమైన, వివిధ = నానావిధములైన, వ్యాధి =

రోగములచే, దగ్ధ = దహించబడుచున్న, అంగయష్టిః = దుర్బలమైన కట్టెవంటి శరీరముగలవాడను; భోగాః = భోగములు, న ఏవ ఉపభుక్తాః = అనుభవింపబడనేలేదు; యత్ + అపి = యేదైతే, సుఖం = సుఖము, జాతు = ఎప్పుడైన, అభూత్ = కలిగినదో, తత్ = అది, నో చిరాయ = చిరకాలములేదు; ఇత్థమ్ = ఇట్లు, వ్యర్థ జాతః = దండుగయైన పుట్టుక గలవాడను, అస్మి = అయియున్నాను; శశిధర = చంద్రశేఖరుని, చరణ = పాదములను, ఆక్రాన్తి = ఆశ్రయించుటచే, కాన్త = అందమైన, ఉత్తమాంగః = శిరస్సుగలవాడను, చ = మరియు, త్వద్ = నీయొక్క, భక్తః = భక్తుడను; ఇతి తద్ = ఈ కారణముగా, దీర్ఘదీర్ఘాః = ఎల్లకాలముండునట్టి, మహా = గొప్ప, శ్రేష్ఠమైన, సంపదః = సంపత్తి, మే = నాకు, సపది = వెంటనే, కురు = దయసేయుము.

**తాత్పర్యము :** జీవనయాత్ర సుదీర్ఘమైనది. జీవికి ఆధివ్యాధులు తప్పవు. వానివలన శరీరం దుర్బలమై కట్టెవలె అవుతుంది. భోగాలు అనుభవించే అవకాశం లేకపోతుంది. ఎప్పుడైన సుఖం లభించినప్పటికి, అది క్షణికమే. ఇట్లు జీవితం నిరర్థకంగా గడిచిపోతుంది. నేను శివుని ఆశ్రయించిన భక్తుడను కనుక నాకు మహాసంపదను తక్షణమే అనుగ్రహించుము.



శ్రీః

# 16. పాశానుద్భేదస్తోత్రమ్

**శ్లో॥ న కించిదేవ లోకానాం భవదావరణం ప్రతి ।**
**న కించిదేవ భక్తానాం భవదావరణం ప్రతి ॥ 1**

**ప్రతిపదార్థము :** లోకానామ్ = లౌకికులైన ప్రజలకు, భవత్ = మీదైన, ఆవరణం ప్రతి = ఆవరణాన్నిగురించి, కించిత్ ఏవ = కొంచెమైన, న = లేదు; భక్తానామ్ = భక్తులకు, భవత్ = తమదైన, ఆవరణం ప్రతి = ఆవరణాన్ని గురించి, కించిత్ ఏవ = కొంచెమైన, న = లేదు.

**తాత్పర్యము :** లౌకికులకు నీ ఆవరణాన్ని గురించి కొంచెమైన చింతలేదు. నీ భక్తులకున్నూ నీ ఆవరణాన్ని గురించి చింత కొంచెమైన లేదు.

**ఆవరణం** అంటే చుట్టు ఆవరించి ఉండేది, దాచి ఉంచేది. ఈ ఆవరణం దేన్ని దాచి ఉంచుతుంది? దేన్ని ఆవరించి ఉంటుంది? శివుని చుట్టిఉండి, దాచి

ఉంచుతుంది. లౌకికజీవులకు శివుని చిన్మయస్వరూపం గోచరించకుండ దాచి ఉంచుతుంది. ఏది? లోకమాయ. దీనికే పాశం అని పేరు. సాధారణ లౌకికులు ఇంద్రియ విషయపాశానికి చిక్కి, దాన్ని మించి మరేమీలేదు అనుకుంటారు కనుక వారికి కొంచెమైన సత్యస్వరూపాన్ని గురించి చింతలేదు. ఇక భక్తులు శివతత్త్వమును తెలిసినవారు. వారు పాశబద్ధులుకారు. కనుక, ఇంద్రియవిషయాలు శివుని చిత్స్వరూపాన్ని చుట్టి ఉన్నప్పటికి, దానిని భక్తులనుండి దాచలేవు. వారికెప్పుడూ శివజ్యోతి దర్శనం ప్రత్యక్షమే. ఆవరణం ఉన్నదన్న బాధవారికి లేనేలేదు. ఎందుకంటే, వారికి సత్యస్వరూపం కనుల ముందే ఉన్నది. ఆవరణానికి వారి అనుభవంలో గుర్తింపేలేదు. లౌకికులకు ఆవరణానికావలగల శివతత్త్వం అగోచరం, అనూహ్యం కనుక దానికి వారి అనుభవంలో గుర్తింపేలేదు.

**శ్లో॥ అప్యుపాయక్రమప్రాప్యః సంకులోఽపి విశేషణైః ।**
**భక్తిభాజాం భవానాత్మా సకృచ్ఛుద్ధోఽవభాసతే ॥ 2**

**ప్రతిపదార్థము :** ఆత్మా = చిద్రూపియైన, భవాన్ = తమరు, ఉపాయక్రమ = ఉపాయములక్రమాచరణచే, ప్రాప్యః అపి = పొందదగినవారు అయినప్పటికి, విశేషణైః = గుణవర్ణనలచే, సంకులః అపి = క్రిక్కిరిసినవారు అయినప్పటికి, భక్తిభాజామ్ = భక్తితత్పరులైనవారిని, సకృత్ = ఒకానొకప్పుడు, శుద్ధః = శుద్ధుడై, అవభాసతే = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :** తమరు చిద్రూపియైన ఆత్మస్వరూపులు. ఉపాయములనాశ్రయించి క్రమముగ తమను పొందవచ్చును. తమ వర్ణనలు తమ గుణవిశేషములతో నిండియున్నవి. అయినప్పటకి, ఒకప్పుడు తమరు శుద్ధప్రకాశులై దర్శనమిత్తురు.

**శివుడు ఆత్మస్వరూపి**, జ్ఞానమాత్రరూపముగలవాడు. వానిని పొందటానికి శాస్త్రోక్తములైన ఉపాయములున్నవి. వానిని క్రమంలో సాధన చేయవలసి ఉంటుంది. పూజావ్రతాదులీ ఉపాయములు. వాని గుణకీర్తనమూ క్లిష్టకార్యమే. ఎందుకంటే, వాని గుణములు, కార్యములు బహుధా వర్ణింపబడినవి. ఐనను ఒకప్పుడు వీని అవసరము లేకయే శివజ్యోతి ప్రకాశము గోచరము కావచ్చును. విశేషణము గుణములను వర్ణించే పదము. గుణములు శివునియందున్నప్పటికి, గుణవికారములు శివునియందులేవు. కనుక ఆతడెప్పుడును శుద్ధుడే. ఈ గుణవికారములద్వారా భక్తులు శివుని చిద్రూపమును దర్శింతురు. ఈ విషయమున ఉపాయక్రమానుసరణము కర్తవ్యము. కాని సుకృతులకు ఒకప్పుడీ దర్శనము నిరుపాయముగనే లభించవచ్చును.

**శ్లో॥ జయన్తోఽపి హసన్త్యేతే జితా అపి హసన్తి చ ।**
**భవద్భక్తిసుధాపానమత్తాః కేఽప్యేవ యే ప్రభో! ॥ 3**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ ప్రభూ!, యే = ఎవరు, భవత్ = తమయొక్క, భక్తిసుధా = భక్తియను అమృతమును, పాన = త్రాగుటచే, మత్తాః = మత్తిల్లినవారో, (తే = వారు), జయన్తః అపి = గెలిచినవారగుచును, హసన్తి = నవ్వుచుందురు, చ = మరియు, జితాః అపి = ఓడినవారగుచును, హసన్తి = నవ్వుచుందురు, ఏతే = అట్టివారు, కే అపి ఏవ = ఎవరో కొందరు మాత్రమే.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ భక్తులలో కొందరు అలౌకికమైన స్థాయికి చెందినవారు. వారికి అన్నిటా ఆనందమే తప్ప గెలుపు–ఓటమి అన్న ద్వయదృష్టిగాని లేక సంతోషము–దుఃఖము అన్న ద్వయానుభవంకాని ఉండదు. గెలిచినా ఆనందమే, ఓడినా ఆనందమే. ఆనందామృతపానంతో మత్తెక్కి నవ్వుతూనే ఉంటారు. కాని అట్టివారు కొందరు మాత్రమే.

భక్తి పారమ్యానికి చేరినప్పుడు, ఆ భక్తునకు సర్వం పరమాత్మానుభవమే, ఆనంద దర్శనమే. ద్వంద్వప్రకృతి నశించినవారు వీరు. అద్వయశివానందాన్నే అనుభవిస్తూంటారు.

**శ్లో॥ శుష్కకం మైవ సిద్ధేయ మైవ ముచ్యేయ వాపి తు ।**
**స్వాదిష్టపరకాష్ఠాప్తత్వద్భక్తిరసనిర్భరః ॥ 4**

**ప్రతిపదార్థము :** శుష్కకమ్ = నీరసరూపభోగమును, మా ఏవ సిద్ధేయ = సిద్ధింపజేసికొనను; వా = మరియు, మా + ఏవ ముచ్యేయ = ముక్తుడనుగూడ కాను; అపి తు = కాని, అయితే, స్వాదిష్ట = అతిమధురమైన, పరకాష్ఠా = పారమ్యమును, ఆప్త = చేరిన, త్వద్ = నీయొక్క, భక్తిరస = భక్తిరసముతో, నిర్భరః = పూరింపబడినవాడను.

**తాత్పర్యము :** రసరహితమైన భోగము నాకు వలదు. అట్టి ముక్తిని గూడ నే నొల్లను. అతిమధురమైన నీ భక్తిపారవశ్యమున కలుగు ఆనందముతో పొంగిపోదును.

లౌకికమైన భోగములన్నీ అనుభవములోనుండగనే రసము వట్టిపోయి శుష్కమైపోవునవే. అదిగాక అన్నీ అశాశ్వతములే. కనుక వానిని సాధించుకొనుటకై శ్రమించను, నీ పూజాదికములు చేయను. మోక్షసిద్ధికైనను నిన్నాశ్రయించను. నీ భక్తిలోని అలౌకికమాధుర్యము ననుభవించవలెననియే నా కోరిక, ప్రయత్నము, ఆ మాధుర్యము నెఱుగకున్నచో, అమృతత్వపు రుచి ముక్తిలో మాత్రము కలుగునా? రసనిర్భరమైన భక్తిపారవశ్యము ముక్తికి ముఖద్వారముకదా, అని ఈ భక్తకవి భావము.

**శ్లో॥ యథైవాజ్ఞాతపూర్వోఽయం భవద్భక్తిరసో మమ ।**
**ఘటితస్తద్వదీశాన స ఏవ పరిపుష్యతు ॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశాన! = ఓ ఈశ్వరా!, అజ్ఞాతపూర్వః = పూర్వమెఱుగనట్టి, అయమ్ = ఈ, భవత్ = తమయొక్క, భక్తిరసః = భక్తిరసము, యథా + ఏవ = ఏ విధముగానైతే, మమ = నాకు, ఘటితః = లభించినదో, తద్వత్ = అదేవిధముగా, సః ఏవ = అదియే, ఆ భక్తిరసమే, పరిపుష్యతు = వృద్ధియగుగాక!

**తాత్పర్యము :** ఓ ఈశ్వరా! నీ భక్తిరసానందమును నేను పూర్వమెఱుగను. కాని నాకది సిద్ధించినది. ఎట్లో నేనెఱుగను. ఐనను, ఆ భక్తిరసానందమే వర్ధిల్లుగాక! అదెట్లు సంభవించునో నేనెఱుగవలెనని కోరను.

పూర్వజన్మ సుకృతఫలముగనే ఎవరికైన ఒక దేవతయందు భక్తి కలుగుట, పారవశ్యము ననుభవించుట, అని పెద్దలంటారు. అదేమో మరి! ఈ జన్మలో కవి తానెటిగిన శివభక్తిమాధుర్యము మాత్రము అపూర్వానుభవము కనుక అదియట్లే వర్ధిష్ణువై తనకమృతత్వము నందించవలెనను కోరిక పుట్టినది.

**శ్లో॥ సత్యేన భగవన్నాన్యః ప్రార్థనాప్రసరోఽస్తి మే ।**
**కేవలం స తథా కోఽపి భక్త్యావేశోఽస్తు మే సదా ॥ 6**

**ప్రతిపదార్థము :** భగవన్! = ఓ భగవంతుడా!, సత్యేన = నిజముగా, మే = నాయొక్క, అన్యః = వేరొక, ప్రార్థనాప్రసరః = ప్రార్థనకవకాశము, న అస్తి = లేదు; కేవలమ్ = కేవలము, కః అపి = ఏదేని ఒక, భక్తి+ఆవేశః = భక్తిఆవేశము, మే = నాకు, సః = ఆవేశము, తథా = ఆ రీతిగనే, సదా = ఎల్లవేళల, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** ఓ భగవాన్! నిజముగ వేరొక ప్రార్థనకు నాకవకాశములేదు. నాది ఒకే ఒక్క ప్రార్థన : కేవలము, అది యిదియని చెప్పనలవిగాని ఒక అలౌకికమైన భక్తిపారవశ్యము నాకు ఎల్లవేళల కలుగుగాక!

వేరొక ప్రార్థనకు అవకాశములేదు, అనటంవలన మిగత ప్రార్థనలన్నీ లౌకిక లాభాన్ని అపేక్షించేవే అని సూచన వచ్చినది. ఇవేవీ వద్దనేటంతగా భక్తి ఆవేశంలోని ఆనందం ఈ కవి నాకర్షించినది.

**శ్లో॥ భక్తిక్షీవోఽపి కుప్యేయం భవాయానుశయీయ చ ।**
**తథా హసేయం రుద్యాఙ్చ రటేయం చ శివేత్యలమ్ ॥ 7**

**ప్రతిపదార్థము :** భక్తి = భక్తివలన, క్షీవః + అపి = పరవశించినప్పటికి, భవాయ = ప్రపంచము, సంసారముపట్ల, కుప్యేయమ్ = కోపింతును, చ = మరియు, అనుశయీయ = పశ్చాత్తాపముజెందుదును, తథా = అట్లే, హసేయమ్ = నవ్వుదును, చ = మరియు, రుద్యామ్ = యేడ్తును, చ = మరియు, అలమ్ = బిగ్గరగా, శివ ఇతి = శివ–శివ యని, రటేయమ్ = కేకలువేయుదును.

**తాత్పర్యము :** భక్తిపారవశ్యంలో ఉన్నప్పటికి, ఈ ప్రాపంచిక జీవితాన్ని తలచి నేను కోపగించుకుంటాను, పశ్చాత్తాపం చెందుతాను, నవ్వుతాను, యేడుస్తాను, ఎలుగెత్తి శివా! శివా! యని కేకలు వేస్తాను.

భౌతికప్రపంచానుభవం, ఇంద్రియానుభవం ఎంత బలమైనవంటే, భక్తి పారవశ్యంలో మైమరచినప్పుడుకూడ, వాని జ్ఞాపకాలు వదలిపోవు. ఒక త్రాగుబోతు తప్పత్రాగి శరీరస్పృహలేనప్పుడుకూడ తన శత్రువులను, తనకు గిట్టనివారిని, తనకు జరిగిన అన్యాయాలను తలచి తలచి ఎట్లా యేడుస్తూ, నవ్వుతూ, తిడుతూ, లాలిస్తూంటాడో, అదే విధంగా భక్తిలో పరవశించిన భక్తుడుకూడ తన జీవితాన్ని తలచి, తాను సత్యాన్ని మరచినందుకు తనపై తానే కోపగించికొంటాడు, పశ్చాత్తాపంచెంది తనపై తానే జాలిపడతాడు, తానెంత మూర్ఖంగా ప్రవర్తించినానాయని నవ్వుతాడు, అందుకు దుఃఖిస్తాడు, తన దోషాలను హరించుమని హరహరా! యని అరుస్తాడు, తనను కాపాడుమని, బాధలో పసివాడు అమ్మా, అమ్మా అని కేకలువేసినట్లు శివాశివాయని ఎలుగెత్తుతాడు. ఇందతా లౌకికానందంకంటె పారమార్థికమైన ఆత్మానందం గొప్పదన్న విలువ తెలిసికొన్నదానికి గుర్తు.

**భవ** అంటే, ఉనికి, పుట్టుక, ప్రాపంచికజీవితము, శ్రేయస్సు, శివుడు. కనుక భవాయ అన్నప్పుడు ప్రాపంచికజీవితము కోసము, శ్రేయస్సు కోసము; శివునికోసము అనిన్నీ, అర్థాలు చెప్పవచ్చు. నిజానికి, ఈ అర్థాలన్నీ ఈ శ్లోకభావానికి సరిపోయేవే. ప్రాపంచికజీవితం సత్యశివసౌందర్యాన్ని సరకుసేయక, ఇంద్రియలాలసతో జీవుని పాశబద్ధునిచేసి పశువుగా మార్చి, స్వస్వరూపదర్శనాన్ని ఆటంకపరచేది, జీవుడు శివుడుగా పరిణమించి పశుపతి కాకుండ అడ్డుపడేది. అందుకే భగవద్గీతకూడ దీన్ని నిరసించింది.

**శ్లో॥ విషమస్థోఽపి స్వస్థోఽపి రుదన్నపి హసన్నపి ।**
**గంభీరోఽపి విచిత్తోఽపి భవేయం భక్తితః ప్రభో! ॥ 8**

**ప్రతిపదార్థము :** ప్రభో = ఓ స్వామీ!, భక్తితః = భక్తివలన, విషమస్థః అపి = ఆపదలలో

చిక్కుకొనియున్నవాడనైనను, స్వస్థః అపి = శాంతుడనైయున్నను, రుదన్ అపి = యేడ్చుచున్నను, హసన్ అపి = నవ్వుచున్నను, గంభీరః అపి = గంభీరముగా ఉన్నను, విచిత్తః అపి = మనసులేనివాడనై మాత్రము, భవేయమ్ = ఉందును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! భక్తివలన నేను మనసులేనివాడనైయున్నాను. ఈ కారణంగా నేను యే ఒడుదుడుకులు లేకుండ శాంతంగా జీవిస్తూ ఉన్నప్పుడూ లేక ఆపదలపాలై నప్పుడు, యేడ్చినప్పుడుకూడ గంభీరంగా ఉండగలుగుతూన్నాను.

మరియొకవిధంగానూ తాత్పర్యం చెప్పవచ్చు:- ఓ స్వామీ! మీయందలి భక్తినన్నెంతగా ప్రభావితుని చేసిందంటే, ఏక కాలంలో నేను రెండు ప్రపంచాలలో జీవిస్తూన్నాను : ఒకటి, లౌకికప్రపంచంలో; రెండు, ఆధ్యాత్మిక ప్రపంచంలో. లౌకిక ప్రపంచంలో ఆపదలనెదుర్కొని నిస్సహాయతతో యేడుస్తూకూడా అదేమీ లేనట్లే, జీవితం ఆనందమయంగా ఉన్నట్లే, నవ్వుతూ బ్రతుకగలుగుతూన్నాను. లోకంచేత గంభీరుడనని, తొణకని నిండుకుండనని అనిపించుకుంటూన్నాను. సుఖదుఃఖాలకు సమన్వయం భక్తిలో నాకు లభించింది.

**విచిత్త శబ్దానికి** చిత్తరాహిత్యం, మనసులేనితనం, ఒక అర్థంగాను, విశేషచిత్తం, లౌకికజ్ఞానాన్నిమించిన ఆధ్యాత్మికజ్ఞానం, మరియొక అర్థంగానూ చెప్పవచ్చు. ప్రతిస్పందన లేని గాంభీర్యం ఈ రెండు సందర్భాలలోనూ కలుగుతుంది కదా.

**శ్లో॥ భక్తానాం నాస్తి సంవేద్యం త్వదన్తర్యది వా బహిః ।**
**చిద్ధర్మా యత్ర న భవాన్నిర్వికల్పః స్థితః స్వయమ్ ॥ 9**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, త్వద్ = నీయొక్క, అన్తర్ = లోపల, యది వా = లేకున్న, బహిః = వెలుపల, సంవేద్యమ్ = తెలియదగినది, ఆస్వాదింపదగినది, న అస్తి = లేదు, యత్ర = ఎక్కడ, నిర్వికల్పః = వికల్పములేని, చిత్‌ధర్మా = జ్ఞానధర్మము లేక జ్ఞానరూపముగల, భవాన్ = తమరు, స్వయమ్ = తమకు తామై, న స్థితః = లేరో.

**తాత్పర్యము :** స్వామీ! మీలోపలగాని మీబైటగాని మీరులేని చోట భక్తులకు తెలియదగినది, ఆస్వాదింపదగినదిలేదు. ఎందుకంటే మీరు జ్ఞానస్వరూపులు, మీరు వికల్పములేనివారు.

శివుడు జ్ఞానస్వరూపుడు కనుక ఆతడులేనిచోట జ్ఞానమునకు తావులేదు. జ్ఞానములేని తావున జ్ఞాతకు ఉనికిలేదు. జ్ఞేయవస్తువేలేదు. జ్ఞేయము, జ్ఞాత ఉన్నప్పుడు మాత్రమే జ్ఞానముదయించటం సాధ్యం. జ్ఞానముదయించని స్థితిలో జ్ఞేయవస్తువున్నప్పటికి

అది ప్రకాశించదు. దాని జ్ఞానప్రకాశము సోకనంతవరకు జ్ఞాతలేడు, జడుడు మాత్రమే ఉంటాడు. భక్తియన్నది జడత్వాన్ని తొలగద్రోసి జ్ఞానము ప్రకాశించుటకు భూమిక నేర్పరుస్తుంది.

వికల్పశబ్దానికి సంశయము, ప్రత్యామ్నాయము అని అర్థాలు. ప్రత్నామ్నాయ మన్నది ప్రత్యేకవ్యాకరణవిషయికం. అయినప్పటికి ఇక్కడ అన్వయమవుతుంది. శివుడు జ్ఞానధర్మముగలవాడు. జ్ఞానానికి ప్రత్యామ్నాయం కాగలిగినది వేరొకటిలేదు. కనుక నిర్వికల్పుడు శివుడు. సృష్టి జడంకాదు, శివం, అంటే జ్ఞానప్రకాశము కలిగినది. మనమెఱిగినంతలో జ్ఞేయవస్తువు కానిది సృష్టిలోలేదు. జ్ఞాతకాదగిన చేతనులు, ప్రాణులు సృష్టిలో ఉన్నవి. ఇవి కూడ పరస్పరం జ్ఞేయములే. అయితే శివతత్త్వం ఉదయించనంత వరకు జ్ఞానస్పర్శలేదు. శివస్పర్శతో సృష్టిలో జ్ఞానోదయమై జ్ఞానం ప్రకాశిస్తుంది. ఇదే శివుని నిర్వికల్పత, చిత్ ధర్మము.

**శ్లో॥ భక్తా నిందానుకారేఽపి తవామృతకణైరివ ।**
**హృష్యన్త్యేవాన్తరావిద్ధాస్తీక్ష్ణరోమాంచసూచిభిః ॥ 10**

**ప్రతిపదార్థము :** తవ = నీ, భక్తాః = భక్తులు, తవ = నీయొక్క, నిందా = నిందయందు, అనుకారే అపి = అనుకరణయందునుకూడ, అమృతకణైః ఇవ = అమృతబిందువులచేతనువలె, హృష్యన్తి + ఏవ = ఆనందమునే పొందుచున్నారు; అంతర్ = లోపల, తీక్ష్ణ = తీవ్రమైన, రోమాంచ = రోమాంచమను, సూచిభిః = సూదులచేత, ఆవిద్ధాః = పూర్తిగా గాయపడిన వారగుచున్నారు.

**తాత్పర్యము :** నిన్నెవరైన నిందించినప్పుడు, ఎవరో చేసిన నిందలను అనుకరించినప్పుడు కూడ నీ భక్తులు–ఆ నిందలనుసైతం అమృతబిందువులను ఆస్వాదించినంతగా విని ఆనందిస్తారు. కాని, లోలోపల సూదులతో గ్రుచ్చినంత బాధపడతారు. దీనికి సూచనగానే వారికి రోమాంచం అనే సూదులు శరీరం అంతా నిండి ఉంటాయి.

**శివనింద** సహింపరానిది, నిందాపూర్వకమైన అనుకరణంకూడ. కాని లోకంలో దైవదూషకులకు తక్కువేమీ లేదు. వారి ఆ దూష్యవాక్కులు వింటూన్న శివ భక్తుల అంతరంగాలలో ఒకవంక అపరాధభావంతో బాధ ఉన్నప్పటికి, శివనిందకులు సైతం నిందమిషతో, నింద్యానుకరణంతో, శివనామాన్ని స్మరిస్తూ శివగుణాలను శ్లాఘిస్తూన్నారు కదా అన్న సంతోషంతో పులకరించిపోతారు. శరీరంపైనున్న జుత్తు సూదులు గ్రుచ్చినట్లు నిక్కుతాయి. భక్తులు దూషకుల మాటలను, చేతలను నిందాస్తుతులు లేక వ్యాజస్తుతులుగా

స్వీకరిస్తారు. అంతేకాదు. భక్తులుసైతం తమదైవాన్ని నిందించిన సమయాలున్నాయి. అటువంటి సందర్భాలలో పుట్టినవే నిందాస్తుతులు. అట్టి తరుణాలలో కూడ తమ స్వామి స్మరణం వారికి అమృతతుల్యమే.

**శ్లో॥ దుఃఖాపి వేదనా భక్తిమతాం భోగాయ కల్పతే ।**
**యేషాం సుధార్ద్రా సర్వైవ సంవిత్త్వచ్చంద్రికామయీ ॥ 11**

**ప్రతిపదార్థము :** వేదనా = జ్ఞానము, దుఃఖా + అపి = దుఃఖము కలిగించునదియైనప్పటికి, భక్తిమతామ్ = భక్తులకు, భోగాయ = అనుభవముకొరకు, కల్పతే = ఉపయోగించును; యేషామ్ = ఎవరికి, సర్వాఏవ = సమస్తమును, సంవిత్ = జ్ఞానమను, సుధా = అమృతముచేత, ఆర్ద్రా = తడిసినది, రసవంతమయినదగు, త్వత్ = నీయొక్క చంద్రికామయీ = వెన్నెలతో నిండినదే.

**తాత్పర్యము :** సంవిత్ లేక జ్ఞానము అనునది దుఃఖకారకమే, కాని భక్తులకు మాత్రం అది అనుభవానందన్ని కలిగిస్తుంది. ఎవరికైతే జ్ఞానం అమృతప్రాయమవుతుందో వారికి సమస్తమూ రసానందమే, శివచంద్రికామయమే.

జ్ఞానం దుఃఖకారణం ఎట్లా కాగలదు? ప్రాణంలేని పదార్థాలకు సుఖదుఃఖా లుండవని మనం భావిస్తాం కదా, ఎందుకని? ప్రాణంలేని దానికి జ్ఞానం ఉండే అవకాశం లేదని. జ్ఞానమే సుఖదుఃఖహేతువు. రోడ్డుమీద నడుస్తూన్నాము అనుకోండి. ప్రక్కన మిత్రునితో జ్ఞానాజ్ఞానహేతువులను చర్చిస్తూన్నాము. కాళ్ళకు చెప్పులులేవు. కొంతసేపటికి కాలికిందయేదో పడినట్లు అనిపించింది. ఆగి, ఆదేమిటో అని చూడాలంటే చీకటిగా ఉన్నది. అందుకని ఎడమ చేతివ్రేలితో పాదం అడుగున తడవిచూస్తే, యేదో ఉన్నది కాని అదేదో తెలియలేదు. అసంకల్పిత చర్యగా వేలు ముక్కు దగ్గరకు పోయింది. అది పేడ అని తెలిసింది. 'ఛీ' అని రోడ్డు ప్రక్కన నల్లాలోని నీటితో కడిగేసుకున్నాం వేలూ, ముక్కూ, కాలున్నూ. ఏదో తొక్కినానని తెలియటంవల్లనే కదా వేలికీ ముక్కుకూ అయింది పేడ. ఆ జ్ఞానం లేకపోతే, పాదం వరకే పేడ పరిమితమయ్యేది. కరెంటు లేనినాడు ఆముదపు దీపాలతో అన్నీ జరిగిపోయినవి. ఈనాడు కరెంటు పోతే ఎంత బాధ? జ్ఞానం వలన దుఃఖానుభవం ముందు, సుఖానుభవం తరువాత. ఇది లౌకికజ్ఞానలక్షణం. **చంద్రికా** అన్నది పరాశక్తి రూపానికి సంకేతం. **సంవిత్** అన్నది చిత్‌శక్తి.

**శ్లో॥ యత్ర తత్రోపరుద్ధానాం భక్తానాం బహిరన్తరే ।**
**నిర్వ్యాజం త్వద్వపుఃస్పర్శరసాస్వాదసుఖం సమమ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** యత్ర తత్ర = ఎక్కడో అక్కడ, ఉపరుద్ధానామ్ = నిరోధించబడిన, భక్తానామ్ = భక్తులకు, త్వద్ = నీయొక్క, వపుః స్పర్శ = స్వరూపస్పర్శయొక్క, రస ఆస్వాద = ఆనందానుభూతియొక్క, సుఖమ్ = సుఖము, బహిః = వెలుపల, అన్తరే = లోపల, నిర్వ్యాజమ్ = శుద్ధము, సమమ్ = ఒకటిగానుండును.

**తాత్పర్యము :** ఆధ్యాత్మికయాత్రలో యేదో ఒక స్థాయిలో ఆటంకపరుపబడిన భక్తులకు నీ స్వరూపదర్శనస్పర్శ ఆనందాన్ని కలిగిస్తుంది. ఆ ఆనందం బాహ్య ప్రకాశమే కాని వారిలోపల శుద్ధమై అద్వయభావంతో ఉంటుంది.

భక్తియున్నంతలో ఎవరైన పారమ్యాన్ని చేరుకోగలరని భావించరాదు. ప్రకృతి ప్రభావం చాల బలీయం. కనుక యే కొద్దిమందియో తప్ప అధిక సంఖ్యాకులు లౌకిక సుఖదుఃఖాలను దాటిపోలేరు. ఐనప్పటికి, నీ స్వరూపస్పర్శ భక్తివలన ఉండేఉంటుంది కాబట్టి ఆ అనుభూతి ప్రభావంవలన వారి మనస్సులు శుద్ధంగానే, సుఖదుఃఖద్వంద్వాన్ని సమంగా స్వీకరించగలశక్తి వారికుంటుంది. ఆనందం బైటకుమాత్రం కనబడుతుంది. ఐతే, అంతటి వారికి మరి పారమ్యాన్ని చేరటంలో అవరోధం ఎందుకు, ఎట్లా యేర్పడు తుంది? అన్నప్రశ్నకు సమాధానం, వాసనల కారణంగా, అని. మన ఇంద్రియానుభవాలు తాత్కాలికమైనవే, అనుభవిస్తూన్నంతకాలం మాత్రమే వాటి ప్రభావం అనిపిస్తుంది. కాని, అనుభవం ముగిసిన తరువాతకూడ వాని వాసనలు లేక సంస్కారాలు జీవునిలో మిగిలే ఉండి మరల మరల ఆ అనుభవాలకోసం ప్రాకులాడేట్లు జీవిని అసహాయుని చేస్తూంటవి. ఈ వాసనలను భక్తి శుద్ధిచేస్తుంది.

**శ్లో॥ తవేశ! భక్తేరర్చాయాం దైన్యాంశం ద్వయసంశ్రయమ్ ।**
**విలుప్యాస్వాదయన్త్యేకే వపురచ్ఛం సుధామయమ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** ఈశ = ఓ ఈశ్వరా!, తవ = నీయొక్క, అర్చాయామ్ = పూజలో, భక్తేః = భక్తియొక్క, ద్వయసంశ్రయమ్ = రెండు అన్న మూలభావంలోని, దైన్యాంశమ్ = దీనత్వమును, విలుప్య = వదలివేసి, ఏకే = ఒక్కటయిన, అచ్ఛమ్ = మలినములేని, సుధామయమ్ = అమృతముతో నిండిన, వపుః = శరీరము, రూపమును, ఆస్వాదయన్తి = దర్శింతురు, అనుభవింతురు.

**తాత్పర్యము :** ఈశ్వరా! పూజా మార్గానికి మూలం భక్తుడు–భగవంతుడన్న ద్వంద్వభావం. ఇందులో భక్తుడు దీనుడు. ఈ భావాన్ని విడిచిన భక్తులు నిర్మలమైన అమృతమూర్తినొక్కని మాత్రమే భావించి, వానిలో ఐక్యమవుతారు.

పూజచేయటం అన్నది, పూజరికంటె, ప్రకృతిలోని సమస్త వస్తుజాలముకంటె భగవంతుడనువాడు వేరుగా ఈ ప్రకృతికావల ఒకడున్నాడన్నభావం ఆధారంగా సాగే క్రియ. ఇదే ద్వయసంశ్రయం. దీనికిమూలం పూజించేవాడు శక్తిహీనుడని, దయనీయు డనిన్నీ పూజింపబడే దైవం సర్వశక్తిమంతుడనిన్నీ కరుణామయుడనిన్నీ విశ్వాసం. ఇది పూజించేవానిదైన్యం. భక్తిమార్గగామికి ఈ దైన్యం తొలగిపోతుంది, సర్వశక్తిమంతుని అండలో తానూ శక్తిమంతుడనైనానన్న భావం బలపడి, ఆపై క్రమంగా తనకూ ఆ దైవానికీ రూపభేదం, శక్తిభేదం, ఆశ్రయ-ఆశ్రితభావం తొలగిపోతుంది. దీనుడైన తాను (అహం) తప్పుకుంటాడు. ఆశ్రితుడు ఆశ్రయంలో ఐక్యంకాగా, అద్వయానందైకమూర్తిగా శివుడు నిలుస్తాడు.

**శ్లో॥ భ్రాన్తాస్తీర్థదృశో భిన్నా భ్రాన్తేరేవ హి భిన్నతా ।**
**నిష్ప్రతిద్వంద్వి వస్త్వేకం భక్తానాం త్వం తు రాజసే ॥ 14**

**ప్రతిపదార్థము :** తీర్థదృశః = దర్శనశాస్త్రజ్ఞులు, భ్రాన్తాః = భ్రాన్తులు, భిన్నాః = భిన్నులు, హి = ఏలన, భిన్నతా = భిన్నత్వము, భ్రాన్తేః + ఏవ = భ్రాన్తిజన్యమే, భక్తానాం తు = భక్తులకు మాత్రము, త్వమ్ = నీవు, నిష్ప్రతిద్వంద్వి = పోటీలేని, ఏకమ్ = ఒకేఒక, వస్తు = తత్త్వముగా, రాజసే = ప్రకాశించుచున్నావు.

**తాత్పర్యము :** దర్శనశాస్త్రపండితులు భ్రాన్తిలోనుండి భిన్నులైయుంటారు. ఎందుకంటే, భిన్నత్వం భ్రాంతిలో పుట్టినదే. కాని భక్తుల విషయంలో, స్వామీ!, నీవు ఒకే తత్త్వంగా ప్రకాశిస్తావు. నీకు ఎదురు నిలిచే రెండవదేమీలేదు.

శాస్త్రాలు అనుభవాలను సూత్రీకరించి సిద్ధాంతం చేస్తాయి. దర్శనాలు కూడ ఆ కోవలోనివే. ఈ దర్శనాలకు ఋషులు ద్రష్టలు. వారు దర్శించిన పరతత్త్వాన్ని వివరిస్తూ వారు వ్రాసిన గ్రంథాలను పండితులు వ్యాఖ్యానిస్తారు. ఈ వ్యాఖ్యాతలందఱూ ద్రష్టలు కారు. కనుక వారిలో ఎవరి దోవ వారిదేగా భిన్నత్వం కానవస్తుంది. ఒకే తత్త్వం వేర్వేరు వైయక్తిక తత్త్వార్థాలను సంతరించికొంటుంది. దీనికి కారణం భ్రమ. భ్రమలో ప్రమ భిన్నమవుతుంది. అయితే భక్తితత్త్వంలో ఈ భ్రమప్రమాదం లేదు. భక్తి స్వభావతః విభక్తం కానిది. దాని తత్త్వం ఒకే ఒక్కటి: ధ్యానగమ్యుడైన దైవాన్ని అంతరంగంలో దర్శించి, పులకించి, ఆ పరమతత్త్వంలో తాను పారమ్యం పొందటమే.

**శ్లో॥ మానావమానరాగాదినిష్పాకవిమలం మనః ।**
**యస్యాసౌ భక్తిమాంల్లోకతుల్యశీలః కథం భవేత్ ॥ 15**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనియొక్క, మనః = మనస్సు, మాన = ఆదరము, అవమాన = అనాదరము, రాగ = అనురాగము, ఆది = మొదలైన, నిష్పాక = సమాప్తి వలన, విమలమ్ = మలినములేనిదైనదో, అసౌ = అతడు, భక్తిమాన్ = భక్తిగలవాడు, లోకతుల్య = సాధారణజనులతో సమానమైన, శీలః = నడవడికగలవాడు, కథమ్ = ఎట్లు, భవేత్ = అగును?

**తాత్పర్యము :** ఎవని మనస్సు మానావమానాలు, రాగద్వేషాలు, ఇత్యాదిద్వయప్రకృతికి లొంగక, నిర్వికారమై, నిర్మలమైనదిగా ఉంటుందో, ఆ భక్తుడు అందఱివంటి సామాన్యుడు కాడు; వాని చరిత్రకూడ అసాధారణమే.

**మన ఏవ మనుష్యాణాం కారణం సుఖదుఃఖయోః** అన్నది శాస్త్రవాక్యం. అంటే సుఖదుఃఖాలకు కారణమైన మానావమానాలు, రాగద్వేషాలు ఇత్యాది ద్వంద్వాలన్నీ మనస్సుపొందే వికారాలు మాత్రమే అని భావం. ఈ వికారాలన్నీ భక్తిలో కాగిపోగా, మనస్సు నిర్మలం కాగా, ఆ భక్తుడు అసామాన్యుడే. ప్రసిద్ధులైన శివభక్తులు, విష్ణుభక్తులు, వీరి చరిత్రలు పరిశీలిస్తే, ఒక్కరి జీవితమూ సరళంగా సాగినట్లుకనబడదు. బాధలన్నీ తపస్సుగా మారి, వారి భక్తి శక్తిగా మారి, వారి జీవితమొక సూక్తంగా మారినట్లు తెలుస్తుంది. వారిని సాధారణవ్యక్తులుగా పరిగణించటం అసాధ్యం.

**శ్లో॥ రాగద్వేషాంధకారోఽపి యేషాం భక్తిత్విషా జితః ।**
**తేషాం మహీయసామగ్రే కతమే జ్ఞానశాలినః ॥ 16**

**ప్రతిపదార్థము :** యేషామ్ = ఎవరియొక్క, భక్తిత్విషా = భక్తియొక్క తేజస్సువలన, రాగద్వేష + అన్ధకారః = రాగము–ద్వేషము అను ద్వంద్వమువలన కలిగిన చీకటి, అపి = కూడ, జితః = గెలువబడినదో, తేషామ్ మహీయసామ్ = ఆ మహాపురుషుల యొక్క, అగ్రే = ముందు, ఎదుట, జ్ఞానశాలినః = జ్ఞానులు, కతమే = ఎవరు?

**తాత్పర్యము :** భక్తితేజస్సుతో ద్వంద్వప్రకృతిని గెలిచి, రాగద్వేషాదుల మాయలో పడని వారితో జ్ఞానవంతులను పోల్చటం కుదరదు.

సాధారణజ్ఞానం ఇంద్రియాధారితం. ప్రతి జీవికి దాని జీవనావసరాలనుబట్టి ఈ జ్ఞానం ఉంటుంది. ఇందులోను ఎవరి అనుభవం వారిదే. కనుక అనుభవజ్ఞానం అందరికీ సమానం కాదు. కాగా, ప్రత్యేకం జ్ఞానులుగా ముద్రపడినవారు కొందరున్నారు. వీరు అనేక గ్రంథాలను చదివినవారు, అందలి విషయాలను ప్రవచింపగలిగినవారు, అందలి భాగాలను కంఠపాఠంగా ఎప్పుడైన ఎక్కడైన అప్పజెప్పగలవారు, పండితులు,

పవిత్రులు, యతులు, యోగులు ఇత్యాది బిరుదాంకితులు. కాని, వీరందరూ గ్రంథపరిజ్ఞానం ఉన్నంతగా తామెఱిగిన సత్యాన్ని ఆచరణలో గౌరవించగలవారుకారు. రాగద్వేషాలకు అతీతులుకారు. కనుక వీరి చదువు సమగ్రం కాదు. వీరికి రాగద్వేషాలను జయించిన భక్తులతో పోలికలేదు.

**శ్లో॥ యస్య భక్తిసుధాస్నానపానాదివిధిసాధనమ్ ।**
**తస్య ప్రారబ్ధమధ్యాన్తదశాసూచ్చైః సుఖాసికా ॥ 17**

**ప్రతిపదార్థము :** యస్య = ఎవనికి, భక్తిసుధా = భక్తిరూపమైన అమృతం, స్నాన = స్నానము, పాన = పానీయము, ఆది = మొదలైన, విధి = కార్యనిర్వహణకు, సాధనమ్ = సాధనమో, తస్య = వానికి, ప్రారబ్ధ = ముందుగాపొందినది, మధ్య = మధ్యలో పొందినది, అన్త = చివరగాపొందినదియైన, దశాసు = దశలందు, ఉచ్చైః = ఉత్తమమైన, సుఖాసికా = సుఖమైనదగును.

**తాత్పర్యము :** భక్తి ఎవరికి స్నానపానాదిదైనందిన కార్యకలాపాలకు ఆధారమవుతుందో, అట్టి వానికి అన్ని దశలలోనూ ఉత్తమమైన ఆనందానుభవమే కలుగుతుంది.

**కర్మ** కాయిక, వాచిక, మానసికములను మూడుదశలలోసాగేది. వీటినే త్రికరణములంటారు: శరీరము, వాక్కు, మనస్సు, ఈ మూడుదశలలోను కర్మ మరల విహితము, నిషిద్ధము, అకర్మ అని మూడు దశలున్నవి. అంటే, చేయదగినది, చేయదగనిది, చేయబడనిది. సాధరణకర్మ, వికర్మ, అకర్మయను దశలు మరి మూడున్నవి, సాధారణకర్మ, విశేషకర్మ, నిష్కామకర్మ అనునవి. ఇవికాక, ప్రారబ్ధకర్మ, సంచితకర్మ, ఆగామికర్మ, అంటే, అనుభవించి వదిలించుకొనగలిగినది, ఎప్పటినుండియో వెన్నంటి వచ్చేది, ఈ జన్మలో చేసికొన్నది. ఇవి ఫలానుభవాన్నిబట్టి నిర్ణయం. ఈ అన్నిదశలలోను కర్మానుభవం భక్తునకు సుఖప్రదమే అవుతుందని భావం.

**శ్లో॥ కీర్త్యశ్చింతాపదం మృగ్యః పూజ్యో యేన త్వమేవ తత్ ।**
**భవద్భక్తిమతాం శ్లాఘ్యా లోకయాత్రా భవన్మయీ ॥ 18**

**ప్రతిపదార్థము :** యేన = దేనిచేత, త్వం ఏవ = నీవే, భవత్ = నీయొక్క, భక్తిమతామ్ = భక్తులకు, కీర్త్యః = కీర్తించదగినది, మృగ్యః = వెదుకదగినది, పూజ్యః = పూజింపదగినది, చిన్తాపదమ్ = చింతించుటకు విషయమో, తద్ = అందువలన, లోకయాత్రా = జీవితయాత్ర, భవత్ + మయీ = నీతో నిండినదో, శ్లాఘ్యా = ప్రశంసనీయము.

**తాత్పర్యము :** ఏ కారణంగా నీ భక్తులకు కీర్తించదగినది, వెదుకదగినది, పూజింపదగినది,

చింతింపదగినది నీవే అగుదువో, ఆ కారణంగా వారి జీవితంలోని అన్ని ఘట్టములూ నీతో నిండిపోవునో, అట్టివారి జీవితచరిత్ర ప్రశంసనీయము.

ఒకే లక్ష్యంతో ఏకమనస్కతతో జీవితాన్ని ప్రమాణీకరించికొనేవారు లోకంలో ప్రశంసనీయులే. వారు భక్తులైనా లేక శాస్త్రపరిశోధకులైనా ఇది సత్యం. జీవనవిధానానికొక ప్రమాణాన్ని యేర్పఱచుకొని లక్ష్యశుద్ధిగలవారు లోకవంద్యులు.

**శ్లో॥ ముక్తిసంజ్ఞా విపక్వాయా భక్తేరేవ త్వయి ప్రభో! ।**
**తస్యామాద్యదశారూఢా ముక్తకల్పా వయం తతః ॥ 19**

**ప్రతిపదార్థము :** ప్రభో = ఓ స్వామీ!, విపక్వాయాః = పరిపక్వావస్థకుచేరిన, త్వయి భక్తేః = నీయందలి భక్తియొక్క, ముక్తిసంజ్ఞా ఏవ = సంజ్ఞమాత్రమే ముక్తి; వయమ్ = మేము, తస్యామ్= ఆ భక్తియందు, ఆద్యదశా = తొలిమెట్టు, ఆరూఢాః = ఎక్కినవారము, తతః = ఇందువలన, ముక్తకల్పాః = ముక్తులమైనట్లే, ముక్తులలెక్కలోనివారము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీయందలి భక్తి పక్వదశను చేరితే, అది ముక్తికి సూచన, గుర్తు. మేము నీ భక్తిలో తొలిమెట్టు ఎక్కినాము కనుక మేముగూడ ముక్తులలెక్కలో జేరితిమి.

రుచి మరిగితిమి కనుక నీ భక్తి మార్గాన్ని విడువము. కనుక ప్రగతి సాధించటం, లక్ష్యాన్ని చేరటం కాలగతిలో సమకూరేవే.

**శ్లో॥ దుఃఖాగమోఽపి భూయాన్మే త్వద్భక్తిభరితాత్మనః ।**
**త్వత్పరాచీ విభో! మా భూదపి సౌఖ్యపరంపరా ॥ 20**

**ప్రతిపదార్థము :** విభో = ఓ సర్వవ్యాపీ!, త్వద్ = నీయొక్క, భక్తిభరిత = భక్తితోనిండిన, ఆత్మనః = ఆత్మగలవాడనగు, మే = నాకు, దుఃఖ+ఆగమః అపి = దుఃఖమువచ్చుట యైనను, భూయత్ = కలుగుగాక!, త్వత్ = నీకు, పరాచీ = ఎడముఖమైన, సౌఖ్య = సుఖములయొక్క, పరంపరా = వరుస, అపి = కూడ, మా భూత్ = కలుగకుండుగాక!

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! నేను భక్తితో నిండిన ఆత్మగలవాడను. నాకు దుఃఖము కలిగిన కలుగుగాక! నీకు ఎడముఖమైన సుఖములు వరుసగా కలిగినను, నేనొల్లను. అట్టి స్థితి కలుగకుండుగాక!

లోకానుభవంలో సాధారణమైనది: యే వ్యక్తియైన ఒక విలువను, ఒక ప్రమాణాన్ని సర్వోన్నతంగా భావించి జీవిస్తూన్నప్పుడు, భరింపరాని దుఃఖాలు

కలుగుతాయి; అప్పుడే, తనదారి తప్పితే చాలు, ఎడలేని సుఖాలు పొందే అవకాశాలూ కన్పిస్తాయి. ఈ కష్టాలను ముందే ఊహించి, ఆరంభింపరునీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై, అంటాడు భర్తృహరి: ఆరంభించి పరిత్యజింతురురువిఘ్నాయత్తుల్ మధ్యముల్, ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థములుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్గావునన్. భర్తృహరి విశ్లేషణలోని ధీరులకోవకు చెందినవాడు ఈ భక్తుడు. కడుకొద్దిమంది ఈ కోవకు చెందుతారు.

**శ్లో॥ త్వం భక్త్యా ప్రీయసే భక్తిః ప్రీతే త్వయి చ నాథ! యత్ ।**
**తదన్యోన్యాశ్రయం యుక్తం యథా వేత్థ త్వమేవ తత్ ॥ 21**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, యత్ = ఏది, త్వమ్ = నీవు, భక్త్యా = భక్తిచేత, ప్రీయసే = ప్రసన్నుడవౌదువు, చ = మరియు, త్వయి = నీయందు, ప్రీతే = ప్రీతిజెందినది, భక్తిః = భక్తి, తత్ = అది, అన్యోన్య ఆశ్రయమ్ = ఒకదానిపైనొకటి ఆధారపడునది, యథా = యే విధముగా, యుక్తమ్ = జతగూర్పబడునో, తత్ = ఆ విషయము, త్వం ఏవ = నీవే, వేత్థ = ఎఱుగుదువు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీవు భక్తికి ప్రసన్నుడవు. నీయందు భక్తి ప్రీతిజెందును. ఇది అన్యోన్యాశ్రయమైన విషయము. ఈ రెంటిని సాధించుటెట్లు?! నీవే ఎఱుగుదువు!

శివుడు భక్తికి మాత్రమే ప్రసన్నుడవుతాడు. భక్తికి మరొక పేరు శుద్ధప్రేమ. అందుకే పార్వతిని గూర్చి నారదమహర్షి, ప్రేమ్ణాశరీరార్థహరాం హరస్య, అనినాడు కాళిదాసుని కుమారసంభవకావ్యంలో (సర్గ1,శ్లో. 50). ఆ నారదుడే భక్తిని సూత్రీకరిస్తూ, **సా త్వస్మిన్ పరమప్రేమరూపా**, అన్నాడు తన భక్తిసూత్రాలలో (సూ. 2). కనుక శివుడు ప్రేమభక్తికి వశుడనటం. అయితే భక్తి ప్రేమగా మారితేతప్ప శివుడు ప్రసన్నుడు కాడు కదా, మరి ప్రేమగా మారటం అన్న పరిణామం ఎట్లా? ముందు శివునియందు ప్రేమ కలిగి అది పరిపూర్ణమై భక్తియవుతుందా? ఈ రహస్యం శివుడే ఎఱుగును. ఎందుకంటే, శివరాత్రి పర్వదినాన శుచిగా శివలింగానికి అభిషేకం, బిల్వార్చన, ఉపవాసమూ జాగరణ చేస్తే, అది భక్తే కదా? చాలదా? విత్తుముందా? చెట్టుముందా? భక్తిముందా? ప్రేమ ముందా?

**శ్లో॥ సాకారో వా నిరాకారో వాన్తర్వా బహిరేవ వా ।**
**భక్తిమత్తాత్మనాం నాథ! సర్వథాసి సుధామయః ॥ 22**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, సాకారః = ఆకారముగలవాడవు, వా = లేక,

నిరాకారః = ఆకారములేనివాడవు, వా = లేక, అన్తర్ = లోపల, వా = లేక, బహిః ఏవ వా = వెలుపలనేగాని, భక్తి = భక్తియందు, మత్త+ఆత్మనాం = వివశమైన ఆత్మలు గలవారికి, సర్వథా = అన్నివిధముల, సుధామయః = అమృతమూర్తివి, అసి = అగుచున్నావు.

**తాత్పర్యము :** సాకారుడవుగాని, నీవు నిరాకారుడవుగాని, హృదయాలలోగాని, బాహ్య ప్రపంచమునగాని, ఓ స్వామీ! అన్ని రీతులలో భక్తియందు తాదాత్మ్యము చెందిన వారికి నీవు అమృతమూర్తివి.

భగవంతుడు సాకారుడా? నిరాకారుడా? సాకారుడైతే మనందరివలె సగుణుడే కదా, ఆతడు సర్వేశ్వరుడెట్లా కాగలడు? త్రిగుణాల సుడిలో మనవలె మనతో తిరిగేవాడు ఆ సుడిగుండం నుండి మనల్ని ముక్తుల్ని చెయ్యటమెట్లా సాధ్యం? పోనీ, నిరాకారుడైతే, నిర్గుణుడైతే, స్పందనే ఉండదని అర్థంకదా, మరి ఆరాధనలూ ప్రార్థనలూ అన్నీ వ్యర్థ ప్రయాసే కదా? అదీకాక, నీ లోపలే ఉంటే ఈ పూలూ బుక్కాయిలూ, మంత్రాలూ జపాలూ ఎందుకు? ఒకవేళ, నీకు వెలుపల ఉంటే ఎక్కడున్నాడో ముందు తేల్చాలికదా! చెట్టుకూ పుట్టకూ, ఊయికీ రప్పకూ ఈ పూజలెందుకు? యేమిలాభం!? ఇత్యాది ప్రశ్నలకు ఒకే సమాధానం : **సంశయాత్మా వినశ్యతి**. దృఢవిశ్వాసంతో ఒక మార్గాన్ని అనుసరించి త్రికరణశుద్ధిగా త్రికరణాలతో ధ్యానించి, అర్చించిన భక్తులకు ఆ అమృతమూర్తి ప్రసన్నుడే. ఇదీ కవిహృదయం.

**శ్లో॥ అస్మిన్నేవ జగత్యన్తర్భవద్భక్తిమతః ప్రతి ।**
**హర్షప్రకాశనఫలమన్యదేవ జగత్స్థితమ్ ॥ 23**

**ప్రతిపదార్థము :** అస్మిన్ ఏవ జగతి = ఈ జగతియొక్కయే, అంతర్ = లోపల, భవత్ = తమయొక్క, భక్తిమతః ప్రతి = భక్తులకొరకు, హర్షప్రకాశనఫలమ్ = ఆనందప్రకటన ఫలము, అన్యత్ + ఏవ = మరియునొకటియే, జగత్ స్థితమ్ = జగత్తయినది.

**తాత్పర్యము :** తమ భక్తులు ఈ జగత్తులోనే ఆనందఫలాన్ని పొందుతారు. నిజానికి ఈ ఆనందజగత్తు వేరుగానే ఉన్నది.

మానవుని పుట్టుక, మనుగడ ఈ లోకంలోనే. ఈ లోకమేమో మహాఘోరమైనది: అసంతృప్తి, దుఃఖం, అలసట, ఇవి దీని అనుభవరూపాలు. అయితే దీని లక్షణం మాత్రం అన్వేషణ, శాశ్వతానందంకోసం వెదకులాట, సాధారణమానవులకు జీవితమంతా వెదకులాటలోనే సరిపోతుంది. కాని భక్తుల విషయం వేరు. భక్తిధర్మాన వారు ఈ

లోకంలో దైహికంగా మనుగడ సాగిస్తూనే, ఆత్మతో శివలోకజీవనం గడుపుతారు, పరమానందాన్ని అనుభవిస్తూంటారు. అసలేమో, వారనుభవించే ఈ ఆనందం ఈ భౌతిక జగత్తుకు చెందినదికాదు, అదేమో వేరేలోక సంబంధమైనది, ఆ జగత్తు ఆత్మసంబంధమైనది. అయినా భక్తి మహత్తువలనవారు శరీరం ఇక్కడున్నాగాని ఆత్మతో ఆ ఆనందఘనమైన లోకంలో విహరిస్తారు.

**శ్లో॥ గుహ్యే భక్తిః పరే భక్తిర్భక్తిర్విశ్వమహేశ్వరే ।**
**త్వయి శంభౌ శివే దేవ! భక్తిర్నామ కిమప్యహో! ॥ 24**

**ప్రతిపదార్థము :** దేవ = ఓ జ్యోతిస్స్వరూపా!, అహో = ఔరా!, గుహ్యే = గుహ్యుడని పేరుగల, త్వయి = నీయందు, భక్తిః = భక్తి, పరే = పరునియందు, భక్తిః = భక్తి, విశ్వమహేశ్వరే = విశ్వమహేశ్వరునియందు, భక్తిః = భక్తి, శంభౌ = కల్యాణరూపియైన, శివే = శివునియందు, భక్తిః = భక్తి, నామ = నిస్సంశయముగా, కిమపి = యేదో అలౌకికమైనది.

**తాత్పర్యము :** ఓ దేవా! నీవు జ్యోతిస్స్వరూపుడవు, గుహ్యుడవు, పరుడవు, విశ్వ మహేశ్వరుడవు, శంభుడవు, శివుడవు, వీనిలో యే నామరూపాలతో నిన్నర్చించి నప్పటికి, నీ యందలి భక్తి మాత్రం, నిస్సందేహంగా, ఇదియని చెప్పనలవిగాని యొకానొక అలౌకికమైన అనుభవము. ఏమాశ్చర్యము!

శివునకుగాని వేరేదేవునకైనగాని, వానికిగల అనేక నామాలలో దేనినో ఒక దానినెంచికొని పూజించటం ఉపాసనపద్ధతి. నామంతో రూపం జతపడి ఉంటుంది. ఈ వివరాలు ఆగమశాస్త్రప్రోక్తాలు. ఏ ఒక్కటైన, దానియందు భక్తి సుదృఢమైతే ఆ వ్యక్తికి అలౌకికానందం అనుభవంలోకి వస్తుంది. ఒక్కొక్క రూపనామానికి తాను అందించగల ఫలం ప్రత్యేకం ఉంటుంది. కామ్యభక్తుడు తనకామ్యాన్నిబట్టి ఆ రూపాన్నీ నామాన్నీ ఉపాసించవలె. **దేవ** అన్నది కాంతివిశేషాన్ని తెలిపే పేరు. దేవతలందఱూ కాంతిశరీరులే. వారందఱకూ శ్రేష్ఠుడు కనుక ఈతడు దేవదేవుడు, జ్యోతిస్స్వరూపుడు. **గుహ్యః**, గుహ్యగురుః ఇది నిధులను కాపాడువారు, వారికిపెద్ద, అన్న అర్థంలో శివనామం. **పరః** – ఆత్మ, సర్వోన్నతసత్త, ముక్తిరూపమైనది. ఈ అన్వయంలో శివపరమైన శబ్దం. **విశ్వమహేశ్వరః** – ఐశ్వర్యము, అనగా, అణిమాది సిద్ధులు కలిగినవాడు ఈశ్వరుడు. వారిలో శ్రేష్ఠుడు మహేశ్వరుడు. విశ్వమున విరాజిల్లువాడు విశ్వమహేశ్వరుడు. **శంభుడు** – సుఖప్రదాత, ఆనందరూపి, ఆనందదాత. **శివః** – నిర్వికారుడు, బ్రహ్మానందరూపి, శుభప్రదాత, జ్ఞానరూపి, జ్ఞానదాత.

**శ్లో॥ భక్తిర్భక్తిః పరే భక్తిర్భక్తిర్నామ సముత్కటా ।**
**తారం విరౌమి యత్తీవ్రా భక్తిర్మేఽస్తు పరం త్వయి ॥ 25**

**ప్రతిపదార్థము :** తారమ్ = బిగ్గరగా, విరౌమి = అఱచి అఱచి చెప్పుచున్నాను, యత్ = యేది, మే = నాకు, త్వయి = నీయందు, పరే = పూర్ణునియందు, సముత్కటా = ప్రబలమైన, భక్తిః = భక్తి, అస్తు = అగుగాక!, పరమ్ = అత్యంతము, తీవ్రా = తీవ్రమైన, భక్తిః = భక్తి, భక్తిః = భక్తి, నామ = అనగా, నిజమైన, భక్తిః = భక్తి.

**తాత్పర్యము :** ఎలుగెత్తి ప్రకటిస్తూన్నాను; పూర్ణుడవైన నీయందు నాకుగల భక్తిప్రబలమగు గాక! అత్యంత తీవ్రమైన భక్తి, భక్తి అంటే, నిజమైన భక్తి, కలుగుగాక!

ఈ ప్రకటన ద్వారా సంపూర్ణతీవ్ర భక్తియొక్క ఆవశ్యకత, దాని సాధనలోని క్లిష్టత స్పష్టమవుతూన్నది. నిజమైన భక్తి సంపూర్ణశరణాగతి.

**శ్లో॥ యతోఽసి సర్వశోభానాం ప్రసవావనిరీశ! తత్ ।**
**త్వయి లగ్నమనర్ఘం స్యాద్రత్నం వా యది వా తృణమ్ ॥ 26**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ ఈశ్వరా!, యతః = ఎందువలన, సర్వశోభానామ్ = అన్ని శోభలకు, ప్రసవ+అవనిః = జన్మభూమి, అసి = అయియున్నావు, తద్ = ఆ కారణంగా, రత్నం వా = రత్నమైనను, యది వా = లేకున్న, తృణమ్ = గడ్డిపరక, త్వయి = నీయందు, లగ్నమ్ = లగ్నమైనంతనే, అనర్ఘమ్ = అమూల్యమైనది, స్యాత్ = అగును.

**తాత్పర్యము :** ఓ ఈశ్వరా! నీవు శోభలన్నిటికి పుట్టినిల్లు. ఆ కారణంగా రత్నమైనను లేక గడ్డిపోచయైనను నీయందు తాదాత్మ్యం చెందగనే అమూల్యమైనదిగా మారిపోతుంది.

తిన్నని వంటి శివభక్తుల చరితలే ఈ శ్లోకార్థానికి ప్రమాణం. శివభక్తు కుటుంబంలో జన్మించి, ఆ ఆచారసంప్రదాయాలను పుణికిపుచ్చుకున్న రత్నాలవంటి భక్తులకు యే సుగతిలభించినదో అదే సుగతి తిన్ననికిన్నీ లభించినది. అంటే అర్థం, శివభక్తి ఒక పరుసవేది. దాని స్పర్శ కలిగితే చాలు ఇనుమైనా బంగారంగా మారిపోతుంది. కారణం, శివుడే సర్వమంగళప్రదాత. శివస్పర్శ భక్తికి కలిగితే శివుడే కాగలగటం పరిణామపరాకాష్ఠ. ఇది భ్రమరకీటన్యాయం వలన సాధ్యం.

**శ్లో॥ ఆవేదకాదా చ వేద్యాద్యేషాం సంవేదనాధ్వని ।**
**భవతా న వియోగోఽస్తి తే జయన్తి భవజ్జుషః ॥ 27**

**ప్రతిపదార్థము :** సంవేదన = సంవిత్, అధ్వని = మార్గంలో, ఆవేదకాత్ = జ్ఞాతనుండి, ఆ చ వేద్యాత్ = జ్ఞేయమువరకు, యేషామ్ = ఎవరికి, భవతా = మీనుండి, వియోగః = వియోగము, న అస్తి = లేదో, తే = వారు, భవత్ = తమయొక్క, జుషః = జ్ఞానసేవకులు, లేక, జ్ఞానభక్తులు, జయన్తి = వారికి జయమగును.

**తాత్పర్యము :** జ్ఞానమార్గంలో, జ్ఞాతనుండి జ్ఞేయమువరకు యే భక్తునకు సమస్తము శివమయమగునో, ఆతడు జ్ఞాని. అట్టి జ్ఞానభక్తులకు జయము!

భక్తుని లక్ష్యం ఏకాత్మకం కావాలి. అనగా, అద్వయంలోకి పరిణతి చెందవలె. ఈ సాధనలో చరమస్థితి జ్ఞాతయైన భక్తుడు, జ్ఞేయమైన శివుడు, జ్ఞానమైన శివత్వంగా మమేకం కావలె. అప్పుడే అతడు పరిపూర్ణజ్ఞాని కాగలడు.

**శ్లో॥ సంసారసదసో బాహ్యే కైశ్చిత్త్వం పరిరభ్యసే ।**
**స్వామిన్! పరైస్తు తత్రైవ తామ్యద్భిస్త్యక్తయన్త్రణైః ॥ 28**

**ప్రతిపదార్థము :** స్వామిన్! = ఓ స్వామీ!, కైఃచిత్ = కొందరితో, సంసారసదసః = సంసారరూపమైన సభయొక్క, బాహ్యే = వెలుపల, త్వమ్ = నీవు, పరిరభ్యసే = కౌగలింతువు, తు = కాని, పరైః = ఇతరులతో, తామ్యద్భిః = వివశులైనవారితో, త్యక్తయంత్రణైః = కష్టమును విడచినవారితో, తత్ర ఏవ =అక్కడనే (సంసార సభామధ్యమున).

**తాత్పర్యము :** స్వామీ! సంసారసభవెలుపల నీవు కొందరిని కౌగలింతువు, కాని, కష్టములను విడచి, వివశులైన ఇతరులను మాత్రము ఆ సంసారసభామధ్యంలోనే కౌగలింతువు.

**శివుడు** చక్రవర్తి. ఈ సంసారమనబడే విశ్వమంతా వాని సభ. కొందరినాతడు ఆ సభలోనే చేరదీసి కౌగిలిలో చేర్చుకుంటాడు. ఇతరులను ఆ సభవెలుపల ఆదరిస్తాడు.

ఈ శ్లోకంలో, కవి నిమీలన సమాధి, ఉన్మీలనసమాధి అను వానిని ప్రస్తావిస్తున్నాడు : నిమీలనసమాధి అనగా, యోగి కన్నులు మూసికొని, ఇంద్రియము లన్నింటిని బాహ్య విశ్వముపైనుండి తనలోని ఆత్మవైపునకు మరల్చి లోదృష్టితో ఆత్మసుఖము నాస్వాదించటం. అంటే, తన సుఖానికి కారణం ప్రాపంచికమైన ఇంద్రియ విషయాలుకాక, సుఖస్వరూపమైన ఆత్మ అనబడే శివుని మాత్రమే ఆధారం చేసికొనటం. దీనినే కవి శివపరిష్వంగంగా భావించినాడు. ఇది ప్రాకృతికానుభవం కానిది, దానికి వెలుపలిది కనుక శివుడు కొందరిని సభవెలుపల కౌగిలిస్తాడని సంకేతించినాడుకవి.

ఇదేరీతిగా, ఉన్మీలనసమాధిలోని యోగులను శివుడు ఆదరిస్తాడు. ఉన్మీలనసమాధి అంటే యోగి తన కన్నులు తెఱచిఉంచి ప్రకృతిలో నుండియే ఆత్మదర్శన స్పర్శనసుఖాన్ని అనుభవిస్తాడు. ఇదే శివుని కౌగిలి. ఇది ఈ ప్రపంచసభలోనే లభిస్తుంది వారికి. అంటే, కొందఱు భక్తులు జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యావస్థలలోనే శివసాన్నిధ్యాన్ని అనుభవించగా, మరికొందఱు ఈ అవస్థలను దాటి తురీయావస్థలో శివానుభవాన్ని పొందుతారని భావం.

శ్లో॥ పానాశనప్రసాధనసంభుక్తసమస్తవిశ్వయా శివయా ।
ప్రలయోత్సవసరభసయా దృఢముపగూఢం శివం వందే ॥ 29

**ప్రతిపదార్థము :** పాన = త్రాగుట, అశన = తినుట, ప్రసాధన = బిడ్డలకనుట, సంభుక్త = భోగింపబడిన, సమస్తవిశ్వయా = సర్వజగత్తుగలవాడు, ప్రలయ + ఉత్సవ = ప్రలయమను ఉత్సవమువలన, సరభసయా = ఆనందముతోకూడిన, శివయా = పార్వతితోడి, దృఢమ్ = గాఢమైన, ఉపగూఢమ్ = కౌగిలిగల, శివమ్ = శివుని, వందే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఈ విశ్వం ఈశ్వర భోగవస్తువు. ఇది త్రాగటం, తినటం, బిడ్డల కనటం, అనే చర్యల ద్వారా ప్రాణిజగత్తులో ప్రకటమవుతూన్నది. ఈ మూడింటి తర్వాతి చర్య ప్రలయం, అంటే రూపనామజగత్తు నశించటం. ఇదికూడ, ఈశ్వరుడు ఉత్సాహంతో చేసే కార్యమే. ఈ కార్యకలాపమంతా శివుడు పార్వతితో కలిసి నిర్వహిస్తాడు. వీరిద్దరి ఆనందమయాలింగనమే ఈ సృష్టి, స్థితి, లయములనే క్రియలు. ఇట్టి పార్వతీసమేతుడగు శివుని నమస్కరిస్తూన్నాను.

**సృష్టిలో ప్రకటంగా ప్రకాశించే అంశాలు మూడు :** సత్, అంటే, ఉనికి; చిత్, అంటే, జ్ఞానం; ఆనంద, అంటే, అనుభవాన్ని, అది సత్ అయిననూ లేక చిత్ అయిననూ, సృజనాత్మకమైననూ, ప్రలయకారకమైననూ, నిర్ద్వంద్వంగా స్వంతం చేసికొని ఆస్వాదించటం. ఈ మూడున్నూ వస్తుక్రియా రూపాలలో రెండుగా ఉంటాయి. వస్తువు యొక్క క్రియాత్మకత ఉనికి. ఈ ఉనికిని గూర్చిన సమగ్రమైన తెలివిడి జ్ఞానం. తద్వారా పొందేది ఆనందం. శివుడు ఆనందఘనుడు, జ్ఞానమూర్తి. పార్వతి వాని క్రియాశక్తి. వీరిద్దరి కలయిక లేనిదే ఉనికిలేదు, జ్ఞానంలేదు, ఆనందంలేదు, విలయంలేదు. ఈ భౌతికవిశ్వం విలయమైనప్పుడున్నూ స్థాణువై శివుడు, వాని అంతర్భాగమై పార్వతి ఉంటారు. వారే కాళీకాలస్వరూపులు. త్రిమూర్త్యాత్మక విశ్వమునకాత్మయైన బ్రహ్మ స్వరూపులు. <u>**శైవాగమాలు**</u> శివుని చిద్భైరవుడంటాయి. పానము అంటే త్రాగటం అనేకాక,

రక్షించటం అని కూడా అర్థం. అట్లే అశనం అంటే సంహరించటం అనిన్నీ అర్థం. ప్రసాధనం అంటే సిద్ధిసంపాదనం. ఇక్కడ సంహరణం కూడా అభ్యుదయమే. ఎందుకంటే, సంహరణం నిజానికి రూపనామ ఉపసంహరణం మాత్రమే, నశింపు లేనేలేదు, కనుక ప్రలయోత్సవం సరభసం, ఆనందమయమే అవుతుంది. కాళికాదేవిగా, బాహ్యరూపనామ ప్రపంచంతో వ్యవహరించే తీరునే ఆమె రూపాన్ని ధరిస్తే, రక్తపానమూ, మాంసాశనము, అస్థ్యాది విభూషితమూ, అంటే భౌతికప్రపంచాన్ని ఆమె నిశ్శేషంగా ఉపభోగపాత్రంగా స్వీకరించి తనలోనే ఇముడ్చుకుంటుందని, షట్త్రింశత్తత్త్వమయం విశ్వం ఆ పరాశక్తియే యని సంకేతితమవుతుంది. ఆ పరాశక్తి సృష్టిస్థితిలయాలలో ఆనందక్రియారూపిణియై ఆత్మయందు వేంచేసియున్న పరమేశ్వరునితో ఏకరూపమై శివా యనబరగునని తత్త్వదర్శనం.

**శ్లో॥ పరమేశ్వరతా జయత్యపూర్వా - తవ విశ్వేశ! యదీశితవ్యశూన్యా ।**
**అపరాపి తథైవ తే యయేదం - జగదాభాతి యథా తథా న భాతి ॥ 30**

**ప్రతిపదార్థము :** విశ్వేశ = ఓ జగదీశ్వరా!, తవ = నీయొక్క, పరమేశ్వరతా = పరమశివరూపమైన ఈశ్వరత్వము, అపూర్వా = అపూర్వము, జయతి = జయము నొందుచున్నది, యత్ = ఎందువలన, ఈశితవ్యశూన్యా = ఎవరి అధీనముననూ ఉండనిదైన, తథా ఏవ = అట్టిదైనను, తే = నీకు, అపరా = ఇతరముకానిది, అపి = కూడ, యయా = యే దేవిచే, ఇదం జగత్ = ఈ జగత్తు, యథా = ఎట్లు, ఆభాతి = గోచరించుచున్నదో, తథా = అట్లు, న భాతి = ప్రకాశించదు, గోచరించుటలేదు.

**తాత్పర్యము :** జగదీశ్వరా! నీ ఈశ్వరత్వము పరమశివరూపమైనది, పరమమైనది, అపూర్వమైనది. అది ఎవరి అధీనములోనుండియో ప్రవర్తించునదికాదు, నీకంటె వేరైనదియుకాదు. అట్టి నీ ఈశ్వరత్వము కారణముగనే ఈ జగత్తు జగద్రూపమున గోచరించుచున్నది. ఐనను తన స్వస్వరూపమున ప్రకాశించుటలేదు. అట్టి నీకు జయము!

ఈ జగత్తు ఈశితవ్యంగా గోచరిస్తుంది, అంటే, ఇది ఒకరి అధీనంలోఉండి, వారి ఆజ్ఞకు లోబడి నడుస్తూన్నట్లు తోస్తుంది. అందుకే, జగత్తుకు ఉపదేశం అనిపేరు. అంటే, జగత్తును పరిశీలించినప్పుడు, ఒక సమన్వయ దృష్టితో అవగాహన కలిగినప్పుడు, అది స్వతంత్రం కాదనీ, ఏదో కనరాని యొక తెలివి, ఒక జ్ఞానం, దానిని తన ఇచ్ఛానువర్తిగా నడిపిస్తూన్నదనీ అనిపిస్తుంది, కనుక నడుస్తూన్న ఈ జగత్తు, పదార్థరూప జగత్తు, వేరుగనూ, ఈశితవ్యముగనూ, దీనిని నడిపించే ఈశ్వరత్వము, జ్ఞానము, తెలివిడి, వేరుగనూ, మొత్తం రెండున్నట్లు భావం కలుగుతుంది. ఇది ద్వయభావం.

భక్తుడు–భగవంతుడు అన్న భావం ఇందులోనిదే. ఇది శివుని వ్యక్తరూపం, లేక శివవపుః.

అయితే, ఈ జగత్తు అనబడే పదార్థం యే శక్తితో, యే ప్రేరణతో నడుస్తూన్నది? ఆ ప్రేరణ జగత్తులోనిదా? వెలుపలిదా? లోనిదని అర్థమవుతుంది. వెలుపల ఉన్నదేదో అది అవ్యక్తం. లోనిది వ్యక్తం. పదార్థరాశిలో, ఊయి, లోహం, ఇత్యాదులను పరిశీలిస్తే, దేనికి దానికే ప్రత్యేక లక్షణాలు (Properties) ఉన్నవి, ఈ లక్షణశక్తియే ఆయాపదార్థాల వ్యక్తరూపాలకు, ప్రవర్తనకు కారణమని తెలుస్తుంది. జీవజాలమూ అంతే కదా. దేనికదే, భిన్నజాతులన్నీ, ఆంతరంగికమైన (innate) లక్షణాల కారణంగానే బాహ్యజీవనం సాగిస్తూన్నవి. వీని ఉనికి, దైహికలక్షణాలు, మనోధర్మాలు, ప్రేరణలు, సమస్తమూ ఆ ఈశత్వశక్తి అధీనంలోనే ఉన్నాయి కదా. ఇట్లా లోతుగా తాత్త్విక దృష్టితోచూస్తే, జగత్తుబాహ్యమూ, జగత్తు ఆంతరంగికమూ కలగలిసియే, అద్వయముగనే, విడరాని, విడని బంధంతో పెనవేసికొని ఉన్నవి. ఇది శివశక్తుల ఆంతరింగిక తత్త్వప్రకాశం.

ఇట్లా మానవుడు శివుని ద్వయరూపాన్ని అనుభవిస్తూ తనలోని శివతత్త్వాన్ని భక్తితో సేవిస్తూ పరవశించగలడు. ఆ పారవశ్యం పారమ్యాన్ని చేరినప్పుడు సాక్షాత్ శివతత్త్వస్వరూపాన్ని, చిద్రూపాన్ని, సమాధిస్థితిలో దర్శించి శివోఽహం, శివోఽహం, అహమేవాహమవ్యయః, అంటూ సత్యజ్ఞాన ప్రకాశతాదాత్మ్యము నాస్వాదించి అద్వయమూర్తి కాగలడు. ఇది భక్తుని వ్యుత్థాన సమాధి ద్వయాద్వయానుభూతి, రెండైన ఒక్కటి, ఒక్కటేయైన రెండు.



శ్రీః

# 17. దివ్యక్రీడాబహుమానస్తోత్రమ్

**శ్లో॥ అహో! కోఽపి జయత్యేష స్వాదుః పూజామహోత్సవః ।**
**యతోఽమృతరసాస్వాదమస్రూణ్యపి దదత్యలమ్ ॥ 1**

**ప్రతిపదార్థము :** అహో = ఔరా!, ఏషః = ఈ, కః + అపి స్వాదుః = ఇదియది యని చెప్పలేని ఆనందముగల, పూజా = పూజరూపమైన, మహోత్సవః = గొప్ప సంబరము, జయతి = జయమగుచున్నది, యతః = దేనివలన, అస్రూణి + అపి = కన్నీరుకూడ, అమృతరస = అమృతపానీయపు, ఆస్వాదనమ్ = అనుభవమును, అలమ్ = పూర్ణముగా, దదతి = ప్రసాదించుచున్నది.

**తాత్పర్యము :** ఈ పూజా మహోత్సవము ఒక అలౌకికమైన ఆనందము. దీనివలన కన్నీరుకూడ అమృతమయమైన ఆనందానుభూతిని కలిగించుచున్నది. ఏమాశ్చర్యము!

**పూజ** యన్నది బాహ్యమున దైహిక క్రియాకలాపము. పూజాద్రవ్యాలను సమకూర్చుకొనటం మొదలు దేహాన్ని మనస్సును తదనుకూలంగా సంసిద్ధపరచుకొని, కరన్యాసాలతో పూవులు, అక్షతలు, పసుపుకుంకుమలు ఇత్యాదులతో అర్చించి, అర్ఘ్యపాద్యాదులు, నైవేద్యము అర్పించటం, ప్రదక్షిణ నమస్కారాలు అంతా శరీరస్థాయిలోని విధానం. శరీరవిన్యాసాల కర్థాలనాపాదిస్తూ మనస్సు స్పందించటం ముఖ్యం అంటారు. ఈ మనోవ్యాపారం పూజానుకూలంకావటం కష్టసాధ్యం. ఈ మాట నిజమని ప్రతి యింటా జరిగే దైనందిన పూజావిధానాన్ని చూచినవారు ఎవరైనా చెప్పగలరు. అందున మనస్సు దైవానికనుసంధానంకావటం మరింత కష్టం. అనుసంధానమైనప్పుడుకూడ తాదాత్మ్యస్థితిని పొంది ఆనందమయం కావటం మరింకా కష్టం. సాధిస్తే, ఆ ఆనందాస్రువులు సైతం అమృతప్రాయమవుతాయి. దుఃఖాస్రువులు ఉప్పగాను, ఆనందాస్రువులు తియ్యగాను ఉంటాయన్నది నానుడి.

**శ్లో॥ వ్యాపారాః సిద్ధిదాః సర్వే యే త్వత్పూజాపురఃసరాః ।**
**భక్తానాం త్వన్మయాః సర్వే స్వయం సిద్ధయ ఏవ తే ॥ 2**

**ప్రతిపదార్థము :** త్వత్ = నీయొక్క, పూజా = పూజకు, పురఃసరాః = సంబంధించినవి, యే వ్యాపారాః = యే కర్మలో, (అవి), సర్వే = అన్నియు, సిద్ధిదాః = సిద్ధినిచ్చునవి, భక్తానామ్ = భక్తులకు, తే = అవి, సర్వే = అన్నియు, త్వత్+మయాః = నీతో నిండినవి, నీకంటె వేరుకానివి, స్వయం ఏవ = స్వయముగ, నీవే, సిద్ధయః = సిద్ధులు.

**తాత్పర్యము :** నీ పూజకు సంబంధించిన కార్యకలాపం అంతా, సిద్ధినిచ్చేదే. భక్తుల దృష్టిలో నీకున్నూ నీపూజకై చేసే కార్యాలకున్నూ, పూజాసామగ్రికిన్నీ, యేమీ భేదంలేదు. ఎందుకంటే, వాటన్నీటిలో నీవే నిండియున్నావు. అంతేకాదు, ఆ పూజలవలన సిద్ధించే సత్ఫలాలన్నీకూడా సాక్షాత్తూ నీవే : నీకూ నీ పూజాఫలానికీ భేదం లేదు.

ఒక సంగీత కచేరీలో గాయకడు, సహకారవాద్యాలూ శ్రోతలూ ఉంటారు. వీరందరినీ కలిపే గానమూ ఉంటుంది. కచేరీ ఆరంభంలో ఈ బహుళత్వం విస్పష్టం. కచేరీ సాగినకొలది, తొలుత వేదిక మీది గాయకుడు, సహకారవాద్యాలూ, వారి వాద్యవిన్యాసాలూ విడివిడిగా కనబడటం మాని మొత్తం ఒకటే రసస్రవంతిగా మారిపోయి, కడపట శ్రోతసైతం ఒక అభేదరసానందంలో లీనమైపోతాడు. పూజ, పూజాద్రవ్యాలూ, మంత్రాలూ, పూజాక్రియ, భక్తుడు, భగవంతుడు, ఇదంతా పూజ సాగినకొలది

తాదాత్మ్యస్థితికి చేరగా ఆనందం ముద్దకట్టిన ఒకే ఒక అద్వయస్వరూపంగా పరిణతి చెందుతుంది : భేదబుద్ధి ఉన్నంతవరకే భేదం. ఆ ఆనందమే భక్తి, అదేసిద్ధి, అదేశివుడు, అదే భక్తుడున్నూ.

**శ్లో॥ సర్వదా సర్వభావేషు యుగపత్సర్వరూపిణమ్ ।**
**త్వామర్చయన్త్యవిశ్రాన్తం యే మమైతేఽధిదేవతాః ॥ 3**

**ప్రతిపదార్థము :** యే = ఎవరు, సర్వదా = ఎల్లవేళల, సర్వభావేషు = అన్ని భావముల లోను, స్థితులలోను, అవిశ్రాన్తమ్ = ఎడతెగనిరీతిగా, యుగపత్ = అందరూ కలిసి ఒకేసారి, సర్వరూపిణమ్ = అన్ని రూపములతోనున్నవానిని, త్వామ్ = నిన్ను, అర్చయన్తి = పూజించుచున్నారో, ఏతే = వారు, మమ = నాయొక్క, అధిదేవతాః = ఇష్టదేవతలు.

**తాత్పర్యము :** అన్నివేళల, అన్ని స్థితులలోను, తెరిపిలేకుండా, అందరూ కలిసి ఒక్కటై, అన్నిరూపాలతో గోచరించే నిన్ను ఎవరు పూజిస్తూంటారో, వారు నాకు ఇష్టదేవతలు.

యే నలుగురైనా ఒక ప్రత్యేక సందర్భంలో కొంతసమయం కలిసి పూజలో పాల్గొనటం సాధ్యం, సహజం. అన్నివేళల, తెరిపిలేకుండా, అందరూ ఒక్కటై పూజించటం కనీసం యే ఇద్దరికైన సాధ్యమా!? సాంసారిక జీవులకు వ్యాపకాలు బహుళం కదా. పైగా, ఒక వ్యక్తికైనా జీవవ్యాపారాలు తప్పక నిర్వర్తించవలసినవి కొన్ని ఉంటాయి కదా. అట్లే, భోజన, నిద్రాది సమయాలూ తప్పవు కదా. మరి అందరూ అన్నివేళల ఏకమైపూజించటం ఎట్లా సాధ్యం! పైగా సర్వభావేషు అన్నదాని అర్థాన్ని విచారిస్తే, పితృభావం, మాతృభావం, భ్రాతృభావం ఇత్యాది భావబంధాలు ఎన్నో ఉన్నవి కదా, ఈ భావాలన్నిటి నిర్వహణనూ పూజాభావంతో మమేకం చేయటం ఎంత పరిణతభక్తి! అవిశ్రాన్తం అన్నదీ ఇట్లే, పూజయన్నది భక్తుని శ్వాస కావలెనని చెప్పటమే కదా. అటువంటి భక్తులు ఎందరున్నా, ఎక్కడెక్కడున్నా, కలిసే ఉంటారు, పూజలేని సమయం వారికిలేదు కనుక వారికి ఎడలేదు. అట్టివారు తనకు ఇష్టదేవతలనటం, సాక్షాత్ శివుడే ఇష్టదైవం అనటం, ఒకటే.

**శ్లో॥ ధ్యానాయాసతిరస్కారసిద్ధస్త్వత్స్పర్శనోత్సవః ।**
**పూజావిధిరితి ఖ్యాతో భక్తానాం స సదాస్తు మే ॥ 4**

**ప్రతిపదార్థము :** ధ్యాన = ధ్యానము అను, ఆయాస = క్లేశము, కష్టముయొక్క, తిరస్కార = తిరస్కారముచేత, సిద్ధః = సిద్ధించునది, త్వత్ = నీయొక్క, స్పర్శన = స్పర్శయను, ఉత్సవః = ఉత్సవము, భక్తానామ్ = భక్తులకు, పూజావిధిః = పూజయనువిధానము,

ఇతి = అని, ఖ్యాతః = ప్రసిద్ధము, సః = అది, మే = నాకు, సదా = ఎల్లప్పుడు, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** ధ్యానము అనేది ప్రయాసతో కూడినది. దానిని దాటినప్పుడే శివస్పర్శ పూజావిధానంలో లభిస్తుంది. ఇది ప్రసిద్ధమైన విషయమే. ఈ స్పర్శన స్థితి నాకు ఎప్పుడూ కలుగుగాక!

**ధ్యానం** అంటే ఉచ్చారకరణాదులు గూడ ఉద్దేశింపబడినవి, అంటే, మంత్రోచ్చారణ (జపం), తదితర అనుబంధక్రియలు. ఇవన్నీ ముఖ్యంగా ధ్యానం నిలవడానికి. ధ్యానం నిర్విషయం మనః, అంటే, మనస్సును ఇంద్రియ విషయాలు లేకుండా ఉంచటం, అనిన్నీ, విజాతీయ ప్రత్యయాంతరాఽ వ్యవహితమేకచిన్తనం ధ్యానం, మనస్సున ధ్యేయమొక్కటితప్ప ఇతరమేదీ లేకుండ చేయటం, emptying the mind ఆనిన్నీ stilling the mind ఆనిన్నీ, ధ్యానాన్ని నిర్వచించినారు. ఇది ప్రయాసతో కూడిన సాధన. ధ్యానం సవికల్పం, నిర్వికల్పం అని రెండు విధాలు. వీనిలో ఈ కవి నిర్వికల్ప సమాధి కలగాలని ప్రార్థిస్తూన్నాడు. **నిర్వికల్పే మహావ్యోమ్ని సా పూజాహ్యాదరాల్లయః ।** అనటాన్నిబట్టి ఈ నిర్వికల్పసమాధిలో పూజయన్నది దహరాకాశంలో లీనమవుతుంది. అంటే, బాహ్యమైనపూజ, ధ్యానమూ ఉండవు. ఈ నిర్వికల్పసమాధి తనకు కలగాలని ఈ భక్తకవి ప్రార్థన.

**శ్లో॥ భక్తానాం సమతాసారవిషువత్సమయః సదా ।**
**త్వద్భావరసపీయూషరసేనైషాం సదార్చనమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, సదా = ఎల్లప్పుడు, సమయః = సమయము, విషువత్ = విషువద్వత్సరమువలె, సమతాసార = సమత్వము సారమో, ఏషామ్ = వారికి, త్వద్ = నీయొక్క, భావరస = భక్తిరసరూపమైన, పీయూషరసేన = అమృతరసముతో, సదా = సర్వకాలము, అర్చనమ్ = పూజ.

**తాత్పర్యము :** విషువత్ సంవత్సరంవలె యే భక్తులకు సమత్వమే సర్వకాలాలలో ఉంటుందో, వారికి నీ భక్తి అమృతసమమైన ఆనందంతో సర్వకాలం పూజ జరుగు తూంటుంది.

**కాలం** అనుభవరూపంలో రాత్రి–పగలు అనే ద్వంద్వంగా భాసిస్తుంది. రాత్రి చీకటిని దుఃఖంగానూ పగటి వెలుతురును సుఖంగానూ సంకేతించటం పరిపాటి. కాలగమనంలో విషువత్ లేక విషువం అనుపేరుగల సమయమొకటి వస్తుంది. విషు

అనే అవ్యయానికి సమము అని అర్థం. సంవత్సరకాలంలో ఈ రోజున రాత్రి–పగలు సమంగా వ్యవధిని కలిగిఉంటాయి. కనుక దీనికి విషువత్ అనిపేరు కలిగింది. దీనినే equinox అంటారు. కాలంతోపాటు అనుభవంలోకి వచ్చేది సుఖదుఃఖాలు. ఈ రెండిటిని సమంగా చూడగలగటం అన్నది భక్తుని వైఖరిలో విషువత్ అవుతుంది. ఈ వైఖరిని సాధించిన వానికి యేటికొక రోజుకాక ఎల్లకాలం విషువత్ అవుతుంది. అట్టి భక్తులకు కాలం కాలకూటంకాదు, కాలామృతం అవుతుంది. వారి శివార్చన ఆ అమృతాభిషేకంతో ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఈ **విషువత్** సంవత్సరానికి రెండుసార్లు సూర్యుడు భూమధ్యరేఖను దాటే సమయంలో యేర్పడుతుంది. మార్చి నెల 20వ తేది; సెప్టెంబరు 22, 23 తేదీలలో ఒకరోజు. వీనిని vernal equinox అనిన్నీ autumnal equinox అనిన్నీ అంటారు.

**శ్లో॥ యస్యానారంభపర్యన్తౌ న చ కాలక్రమః ప్రభో! ।**
**పూజాత్మాసౌ క్రియా తస్యాః కర్తారస్త్వజ్జుషః పరమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ ప్రభూ! యస్య = ఎవనికి, అనారంభపర్యన్తౌ = ఆద్యంతములు రెండూ ఉండవో, చ = మరియు, కాలక్రమః = క్రమబద్ధమైన కాలము, న = కాదో, అసౌ = ఆతడు, పూజాత్మా = పూజను ఆత్మగాగల, క్రియా = కార్యముచేయు, త్వద్ + జుషః = నీయొక్క దర్శన తత్త్వమునెఱిగినవాడు, తస్యాః = ఆ కార్యమునకు, పరమ్ = మిక్కిలి, సంపూర్ణముగ, కర్తారః = చేయువాడు, కర్త.

**తాత్పర్యము :** ప్రభూ! ఆద్యంతములు, క్రమబద్ధమైన కాలము ఉండనివాడెవడో ఆతడు పూజకాత్మయైన కార్యము జేయువాడు, నీ దర్శన తత్త్వమెఱిగినవాడు ఆతడే పూజను సంపూర్ణముగ చేయువాడు.

మొదలున్నదానికి తుద ఉండనే ఉంటుంది. లౌకికమైన ప్రతిదానికీ ఈ రెండూ ఉంటాయి. అనంతమైన కాలానికి మొదలూ ఉండదు. అయినా, లౌకికమైన కాలానికి క్రమం ఉంటుంది, మొదలూ చివరా ఉంటుంది. ఈ రెండూ లేనివాడు మధ్య అన్నది కూడ లేనివాడే. ఆదిమధ్యాంతరహితుడు పరమాత్మయే. కనుక వాని పూజకూ ఆద్యంతాలూ, కాలక్రమమూ ఉండే వీలులేదు. కాని పూజించే భక్తుడు విశ్వంలోనివాడు. వానికి ఆదిమధ్యాంతాలున్నాయి. మరి పూజతత్త్వాన్ని, శివతత్త్వాన్నీ తెలిసిన శివభక్తుడు శివపూజను కూడా కాలక్రమాన్ని పాటించక, ఆద్యంతరహితంగానే చేస్తాడు. ఇది మానసపూజ, బాహ్యపదార్థ పూజకాదు.

యస్య, అసౌ, ఏకవచనరూపాలు, కర్తారః = బహువచనరూపం. కనుక ఏకవచనంగానే అన్వయించబడింది.

**శ్లో॥ బ్రహ్మాదీనామపీశాస్తే తే చ సౌభాగ్యభాగినః ।**
**యేషాం స్వప్నేఽపి మోహేఽపి స్థితస్త్వత్పూజనోత్సవః ॥ 7**

**ప్రతిపదార్థము :** తే = వారు, బ్రహ్మ = బ్రహ్మ, ఆదీనాం+అపి = మొదలుగాగల వారికిగూడ, ఈశాః = ప్రభువులు, చ = మరియు, తే = వారు, సౌభాగ్యభాగినః = సౌభాగ్యశాలురు, యేషామ్ = ఎవరికి, స్వప్నే అపి = కలలోనైన, మోహే అపి = మోహమునందైనను, త్వత్ = నీయొక్క, పూజన = పూజయను, ఉత్సవః = ఉత్సవము, స్థితః = ఉన్నది.

**తాత్పర్యము :** వారు బ్రహ్మాది దేవతలకుగూడ ప్రభువులు, సౌభాగ్యశాలురు. వారికి కలలోనైన మోహభ్రాంతిలోనైన నీ పూజ యను ఆనందము ఉండే ఉన్నది.

శ్లో. 6లో చెప్పబడిన నిరంతరపూజామగ్నులైన భక్తులే ఈ శ్లోకంలోనివారు. వారు జాగ్రదవస్థలో ఉన్నను, మోహభ్రాంతిలో ఉన్నను నీ పూజ వారి మనస్సులలో సాగుతూనే ఉంటుంది. అంటే సర్వకాల సర్వావస్థలలో వారిలో శివసాన్నిధ్యం అనుభవమే, వారు శివయుతులు, శివసమానులు. వారు దేవతలకుగూడపూజ్యులు.

**శ్లో॥ జపతాం జుహ్వతాం స్నాతాం ధ్యాయతాం న చ కేవలమ్ ।**
**భక్తానాం భవదభ్యర్చా మహో యావద్యదా తదా ॥ 8**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, భవత్ = తమయొక్క, అభ్యర్చా = పూజ, మహః = ఉత్సవము, కేవలమ్ = కేవలము, జపతామ్ = జపించువేళ, జుహ్వతామ్ = హవనముచేయువేళ, స్నాతామ్ = స్నానముచేయువేళ, చ = మరియు, ధ్యాయతామ్ = ధ్యానించునప్పుడు, న = కాదు, యావత్ = ఎట్లు, యదా తదా = ఎప్పుడంటే అప్పుడు.

**తాత్పర్యము :** తమ పూజానందం భక్తులకు నామజపం చేసేటప్పుడో, హవనం చేసేటప్పుడో, స్నానం చేసేటప్పుడో, ధ్యానం చేసేటప్పుడో, ఆ కొద్దిసేపు మాత్రమే కాదు, ఎప్పుడంటే అప్పుడే కలుగుతుంది.

**శ్లో॥ భవత్పూజాసుధాస్వాదసంభోగసుఖినః సదా ।**
**ఇంద్రాదీనామథ బ్రహ్మముఖ్యానామస్తి కః సమః ॥ 9**

**ప్రతిపదార్థము :** సదా = ఎల్లప్పుడు, భవత్ = తమదైన, పూజాసుధా = పూజారూపమైన, అమృతముయొక్క, ఆస్వాద = ఆస్వాదనము అను, సంభోగ = ఆనందానుభవముతో, సుఖినః = సుఖులగువారు, సుఖముగలవానికి, సమః = సముడు, ఇంద్రాదీనామ్ = ఇంద్రుడు మొదలైన దేవతలకు, అథ = మరియు, బ్రహ్మముఖ్యానామ్ = బ్రహ్మాది ప్రముఖులకు, కః = ఎవడు?, అస్తి = ఉన్నాడు.

**తాత్పర్యము :** ఎల్లవేళల తమ పూజామృతాన్ని ఆస్వాదిస్తూ ఆనందానుభవంలో సుఖులైనవారికి సమానమైనవాడు ఇంద్రాది దేవతలలోగాని బ్రహ్మాది ప్రముఖులలోగాని ఎవ్వడూలేడు.

**శ్లో॥ జగత్క్షోభైకజనకే భవత్పూజామహోత్సవే ।**
**యత్ ప్రాప్యం ప్రాప్యతే కించిద్భక్తా ఏవ విదన్తి తత్ ॥ 10**

**ప్రతిపదార్థము :** జగత్ = విశ్వమునకు, క్షోభ ఏక జనకే = నశింపును కలిగించు ఒకే ఒక్కడవైన, భవత్ = నీయొక్క, పూజా = పూజయను, మహోత్సవే = గొప్ప సంబరమున, యత్ కించిత్ = యే కొంచెము, ప్రాప్యమ్ = పొందదగినదో, ప్రాప్యతే = పొందబడును, తత్ = దానిని, భక్తాః = భక్తులు, ఏవ = మాత్రము, విదన్తి = తెలియుదురు.

**తాత్పర్యము :** నీవు జగత్తునకు నాశము కలిగించు ఒకేఒక శక్తిశాలివి. నీ పూజామహోత్సవంలో ఎవరికేది ఎంతమాత్రం ప్రాప్తమో అది లభిస్తుంది. ఈ విషయం భక్తులకే ఎఱుక.

భక్తులు కానివారికి పూజాది కార్యకలాపాలన్నీ వృథాయాసంగా తోచవచ్చు. కాని వాటివల్ల కలిగే లాభం భక్తులెఱుగుదురు. భౌతికవిజ్ఞానశాస్త్ర పరిశోధకులనుచూచి కూడా పిచ్చివారిగా లోకం భావించింది. వారి ఆవిష్కరణలను చూచి 'ఔరా!' అనుకున్నది. మహాత్ముల సంగతీ అంతే, లౌకికుల ప్రమాణాలు వేరుకదా.

**శ్లో॥ త్వద్ధామ్ని చిన్మయే స్థిత్వా షట్త్రింశత్తత్త్వకర్మభిః ।**
**కాయవాక్చిత్తచేష్టాద్యైరర్చయే త్వాం సదా విభో! ॥ 11**

**ప్రతిపదార్థము :** విభో! = సర్వవ్యాపీ!, చిత్+మయే = చిత్ రూపి, జ్ఞానరూపియైన, త్వద్ = నీయొక్క, ధామ్ని = ధామమునందు, నెలవునందు, స్థిత్వా = ఉండి, కాయ = శరీరము, వాక్ = వాక్కు, మాట, చిత్త = మనసు, వీనియొక్క, చేష్టా = కర్మలు, ఆద్యైః = మొదలగు, షట్ త్రింశత్ = ముప్పదియారు, తత్త్వ = తత్త్వముల, కర్మభిః = కర్మలచేత, సదా = ఎల్లప్పుడు, త్వామ్ = నిన్ను, అర్చయే = అర్చింతును.

**తాత్పర్యము :** స్వామీ, సర్వవ్యాపీ!, చిద్రూపా!, నీ తావున నెలకొని మనోవాక్కాయములాది ముప్పదియారు తత్త్వముల కర్మలచే ఎల్లప్పుడు నిన్ను అర్చింతును.

**ధామము** అంటే ఇల్లు, స్థానము. ఇక్కడ శివధామప్రసక్తి కనుక శివుడు జ్ఞానప్రకాశుడు కనుక, వాని ధామము ఆ చిత్ లేక జ్ఞానప్రకాశమే, అని అన్వయం. **తత్త్వ** శబ్దానికి స్వభావమని, మూలకమనీ అర్థం. రసాయనశాస్త్రంలో మూలకాలు (elements) కొన్నటిని గూర్చి అధ్యయనం ఉన్నది. ఇది పదార్థవిజ్ఞాన సంబంధి. మూలకాల సంఖ్యను గురించి చర్చ ఉన్నది. ఇది తత్త్వశాస్త్రాలలోనూ ఉన్నది. ఆగమశాస్త్రాలు మూడు తత్త్వాలను లెక్కచెప్పగా, శ్రౌతశాస్త్రాలు ఇరువదనాలుగు తత్త్వాలనగా, ఇట్లా 96 వరకు వివిధంగా లెక్క చెప్పినారు పూర్వులు. ఈ కవి ముప్పది యారు తత్త్వాలని లెక్కజెప్పినాడు కనుక ఇది శాక్తేయశాస్త్రాల లెక్క, తత్త్వచూడామణిలో ఇట్లా వివరించబడినది:- మహాభూతాలు 5; తన్మాత్రలు 5; జానేంద్రియాలు 5; కర్మేంద్రియాలు 5; త్వగాది ధాతువులు 7; ప్రాణాలు 5; మాయ 1; శుద్ధవిద్య 1; మహేశ్వర 1; సదాశివ 1; మొత్తం 36 తత్త్వాలు. ఆ యా తత్త్వాలకు ఆ యా కర్మలు భిన్నంగా వివిధంగా ఉంటాయి. కాయ వాక్ చిత్తాలు త్రికరణాలు. వీనికి గూడ కర్మలు వేర్వేరు.

శివుని నివాసమైన, శివమయమైన జ్ఞానంలో నిలిచి, అంటే, నిర్వికారంగా శాంతుడై, త్రికరణశుద్ధిగా ఈ 36 తత్త్వాల కర్మలన్నింటినీ ఏకముఖం చేసి శివుని అర్చించవలెనన్నది ఈ భక్తుని కోరిక. తానున్నది శివమయమైన జ్ఞానప్రకాశంలో కనుక తత్త్వదర్శనం, దిశానిర్దేశం సాధ్యమే, అనిభావం.

**శ్లో॥ భవత్పూజామయాసంగసంభోగసుఖినో మమ ।**
**ప్రయాతు కాలః సకలోఽప్యనంతోఽపీయదర్థయే ॥ 12**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, పూజామయ = పూజతో నిండిన, ఆసంగ = సంపూర్ణమైన కలయికలోని, సంభోగ = ఆనందముతో, సుఖినః = సుఖించువాడనైన, మమ = నాయొక్క, సకలః అపి అనంతః అపి కాలః = సమస్తకాలము, అది అనంతమైనప్పటికి, ప్రయాతు = గడచుగాక!, ఇయత్ = ఇంతమాత్రము, అర్థయే = కోరుచున్నాను.

**తాత్పర్యము :** స్వామీ! నా కాలమంతా, అది అనంతకాలమైనప్పటికి, నీ పూజతో నిండిపోయి, నీతో సంపూర్ణసంగమం లభించి, ఆ ఆనందంతో జీవించవలెనన్నదే నా చిన్న కోరిక.

అనంతకాలం జన్మలెత్తుతూన్నప్పటికి, అన్నిజన్మలలోను నాకు నీ పూజ, నీతో తాదాత్మ్యంలోని పరమానందం ప్రాప్తించవలెనని భావం.

**శ్లో॥ భవత్పూజామృతరసాభోగలంపటతా విభో! ।**
**వివర్ధతామనుదినం సదా చ ఫలతాం మమ ॥ 13**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, మమ = నాయొక్క, భవత్పూజామృతరస + ఆభోగలంపటతా = మీ పూజామృతమును ఆస్వాదించుటయను భోగమునందలి తీవ్రమైన లాలస, అనుదినమ్ = ప్రతిదినము, వివర్ధతామ్ = విశేషముగ వృద్ధి జెందుగాక! చ = మరియు, సదా = ఎల్లప్పుడు, ఫలతామ్ = ఫలించుగాక!

**తాత్పర్యము :** స్వామీ! మీకు పూజచేస్తూ ఆ అమృతానందాన్ని ఆస్వాదించాలని నాకు తీవ్రమైన కోరిక ఉన్నది. అది దినదినాభవృద్ధిగా వర్థిల్లి సఫలమగుగాక!

**శ్లో॥ జగద్విలయసంజాతసుధైకరసనిర్భరే ।**
**త్వదబ్ధౌ త్వాం మహాత్మానమర్చన్నాసీయ సర్వదా ॥ 14**

**ప్రతిపదార్థము :** జగత్ = జగత్తుయొక్క, విలయ = నాశముచే, సంజాత = యేర్పడిన, సుధా = అమృతమయమైన, ఏకరస = అద్వయానందముతో, నిర్భరే = నిండియున్న, త్వద్ + అబ్ధౌ = 'నీవు' అను సాగరములో, సర్వదా = ఎల్లప్పుడు, త్వామ్ = నిన్ను, మహాత్మానమ్ = మహాత్ముని, అర్చన్ = అర్చించుచు, ఆసీయ = ఉందును.

**తాత్పర్యము :** ప్రళయంవలన జగత్తు నాశనంకాగా యేర్పడిన అద్వైతానందంతో నిండియున్న ఆనందసాగరుడవైన మహాత్ముని నిన్ను ఎప్పుడునూ అర్చించుచుందును.

జగత్తు ద్వైతం. జగద్విలయం అద్వైతం. అప్పుడు జగత్తులోని రసవికారాలన్నీ ఒకే ఆనందంగా మారిపోతాయి. అది యొక శివరూపమైన ఆనందాబ్ధి.

**శ్లో॥ అశేషవాసనాగ్రంథివిచ్ఛేదసరలం సదా ।**
**మనో నివేద్యతే భక్తైః స్వాదు పూజావిధౌ తవ ॥ 15**

**ప్రతిపదార్థము :** తవ = నీయొక్క, పూజా = పూజకుసంబంధించిన, విధౌ = విధానము నందు, భక్తైః = భక్తులచేత, అశేష = మిగులులేని, వాసనాగ్రంథి = వాసనలయొక్కముడి, విచ్ఛేద = విడిపోవటంవలన, సరలమ్ = సరళమైన, స్వాదు = అనుభవయోగ్యమైన, మనః = మనస్సు, సదా = ఎల్లప్పుడు, నివేద్యతే = అర్పించబడుచున్నది.

**తాత్పర్యము :** నీ పూజావిధానంలో వాసనలన్నీ మిగలకుండ నశించిపోగా, నిష్కపటమూ

నిర్మలమూ అయిన మనస్సు ఎల్లప్పుడు నీకు అనుభవయోగ్యమైనదిగా నీ భక్తులు నీకు సమర్పిస్తూన్నారు.

పూజకు ప్రయోజనం వాసనానాశంగా చెప్పబడింది. ఈ వాసనారాహిత్యం వలన మనస్సు శుద్ధికలదవుతుంది. చిత్తశుద్ధికోసం పూజావిధి అన్నది సారాంశం. చిత్తశుద్ధిలేనిదే ఆ మనస్సు శివుని యందు నిలువదు. కనుక శివార్పణం కావాలంటే శుద్ధికావాలి. ఆ శుద్ధి వాసనానాశంవలన కలుగుతుంది.

అయితే వాసనలేమిటి? అవి నశించటమేమిటి? అన్నప్రశ్న ఉన్నది. వాసనలకే సంస్కారాలు అని కూడా పేరు. ఇవి ఎప్పటినుండియో, అంటే, ఈ జన్మలోనూ పూర్వజన్మలలోనూ అంతఃకరణంలో పేరుకుపోయిన వైఖరులు లేక tendencies. ఇవి కలగలిసి యేర్పడినదే చిత్తము అనేది. చిత్తం అంటే మనస్సు (తమోగుణప్రధానమైనది), అహంకారము (రజోగుణప్రధానమైనది), బుద్ధి (సత్త్వగుణ ప్రధానమైనది), ఈ మూడూ కలసిన సమాహారస్వరూపం. దీని ప్రధానశక్తి ఇచ్ఛాశక్తి. సంకల్పవికల్పాలు, కోరికలు దీని ధర్మం. ఈ వైఖరులు చిత్తచాంచల్యానికి కారణం. వీనిని నిర్మూలిస్తే చిత్తం ఏకాగ్రమవుతుంది.

**శ్లో॥ అధిష్ఠాయైవ విషయానిమాః కరణవృత్తయః ।**
**భక్తానాం ప్రేషయన్తి త్వత్పూజార్థమమృతాసవమ్ ॥ 16**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులయొక్క, ఇమాః = ఈ, కరణవృత్తయః = ఇంద్రియ వృత్తులు, విషయాన్ = విషయములను, అధిష్ఠాయ = సేవించి, ఏవ = మాత్రము, త్వత్ = నీయొక్క, పూజార్థమ్ = పూజకొరకు, అమృత + ఆసవమ్ = అమృతమయమైన పానీయమును, ప్రేషయన్తి = పంపుచుందురు.

**తాత్పర్యము :** భక్తులయొక్క ఇంద్రియవృత్తులు విషయాలను సేవించియే నీ పూజకోసం అమృతాన్ని పంపుతూంటాయి.

కరణవృత్తులు అన్నవి ఇంద్రియాలకు సంబంధించిన వ్యాపారాలు. ఇంద్రియం అంటే గుర్తించగలిగి, పనిచేయగలిగి, ఆలోచించి నిర్ణయించగలిగిన సామర్థ్యాలు. పనిచేసేవి కర్మేంద్రియాలు, గుర్తించేవి జ్ఞానేంద్రియాలు, నిర్ణయించేవి అంతరింద్రియాలు. ఇదంత ఒక వ్యక్తి శరీరం సంగతి. ఈ వ్యష్టిశరీరాలన్నీ కలిసిన సమష్టి విషయంలో వీనినే అధిష్ఠానదేవతలంటారు. వీటి విషయాలు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునవి అయిదు. ఇంద్రియాలు, అధిష్ఠానదేవతలు:– 1. బుద్ధి – చతుర్ముఖుడు;

2. మనస్సు – చంద్రుడు; 3. చిత్తము – క్షేత్రజ్ఞుడు; 4. అహంకారము – రుద్రుడు; 5. త్వక్ (చర్మము) – వాయువు; 6. కన్ను – సూర్యుడు; 7. చెవి – దిక్కులు; 8. నాలుక – వరుణుడు; 9. ముక్కు – అశ్వినీదేవతలు; 10. వాక్కు – చతుర్ముఖుడు; 11. పాణి – ఇంద్రుడు; 12. పాదము – ఉపేంద్రుడు; 13. పాయువు – మృత్యువు; 14. ఉపస్థ – ప్రజాపతి. ఈ అధిష్ఠానదేవతలే ఆ యా ఇంద్రియ విషయాలను సేవించి తద్వారా కలిగిన ఆనందాన్ని అమృతరసంగా శివార్పణం చేస్తారు. ఈ అర్పణమే శివార్చన, శివపూజ. ఇదే ఈ శ్లోక భావం. ఇది భక్తుల విషయం. సామాన్యుల విషయంలో ఇంద్రియాలు బాధకాలవుతాయి.

**శ్లో॥ భక్తానాం భక్తిసంవేగమహోష్మవివశాత్మనామ్ ।**
**కోఽన్యో నిర్వాణహేతుః స్యాత్త్వత్పూజామృతమజ్జనాత్ ॥ 17**

**ప్రతిపదార్థము :** భక్తి = భక్తియొక్క, సంవేగ = మిక్కిలి తీవ్రమైన, మహా = గొప్ప, ఊష్మ = వేడివలన, వివశ = వశము తప్పిన, ఆత్మనామ్ = ఆత్మగల, భక్తానామ్ = భక్తులకు, నిర్వాణహేతుః = శాంతిచేకూర్చు కారణమైన, త్వత్ = నీయొక్క, పూజా = పూజయను, అమృత = అమృతములో, మజ్జనాత్ = స్నానము చేయుటకంటె, అన్యః = వేరైనది, కః స్యాత్ = ఏమున్నది?

**తాత్పర్యము :** భక్తిలోని తీవ్రత తాపాన్ని అధికంగా కలిగిస్తుంది. దానివలన భక్తులు వివశులవుతారు. అట్టి భక్తుల ఆత్మలకు శాంతిహేతువు పూజ అనబడే అమృతస్నానము. అంతకంటే గొప్ప శాంతిహేతువు మరియొకటేమున్నది?

భక్తిలో ఏకాగ్రత ముఖ్యమైన గుణం. ఏకాగ్రతవలన మెదడు వేడెక్కటం సామాన్యలౌకికానుభవమే. అది తీవ్రమైన కొలది తపస్సుగా మారి తాపాన్ని అధికం చేస్తుంది. ఆ తాపానికి ఉపశమనం పూజ. వేరొకటి లేదు.

**శ్లో॥ సతతం త్వత్పదాభ్యర్చాసుధాపానమహోత్సవః ।**
**త్వత్ప్రసాదైకసంప్రాప్తిహేతుర్మే నాథ! కల్పతామ్ ॥ 18**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, త్వత్ = నీయొక్క, ప్రసాద = ప్రసన్నతకు, ఏక = ఒక్కటయిన, సంప్రాప్తిహేతుః = సంపాదనకారణము, త్వత్ = నీయొక్క, పద = పాదములయొక్క, అభ్యర్చా = పూజయను, సుధాపాన = అమృతాస్వాదన, మహోత్సవః = మహోత్సవము, మే = నాకు, సతతమ్ = ఎల్లప్పుడు, కల్పతామ్ = లభించుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ పాదాలను పూజించటం ఒక్కటే నిన్ను ప్రసన్నం చేసికొనే

మార్గం. ఆ పూజ అమృతప్రాయమైనది, ఒక గొప్ప సంబరం. అది నాకు నిరంతరమూ లభించుగాక!

**పూజ** ఒక లాంఛనప్రాయమైన విషయం కాదనీ, అది ఆత్మానందాన్ని కలిగించేదనీ, ఆ ఆనందాన్ని అనుభవిస్తూ పూజ చేసినప్పుడే స్వామి ప్రసన్నుడవుతాడనినీ భావం.

**శ్లో॥ అనుభూయాసమీశాన! ప్రతికర్మ క్షణాత్ క్షణమ్ ।**
**భవత్పూజామృతాపానమదాస్వాదమహాముదమ్ ॥ 19**

**ప్రతిపదార్థము :** ఈశాన! = ఓ సర్వస్వతంత్రా!, భవత్ = నీయొక్క, పూజా = పూజయను, అమృత = అమృతమును, ఆపాన = తృప్తిగా త్రాగుటచే, మద = మత్తుపానీయమగు మదిరను, ఆస్వాద = చవిచూచిన, మహా = గొప్ప, ముదమ్ = సంతోషము, ప్రతికర్మ = అన్నిపనులలో, క్షణాత్ క్షణమ్ = అనుక్షణము, అనుభూయాసమ్ = అనుభవించు చుందునుగాక!

**తాత్పర్యము :** ఓ ఈశానా! నీ పూజామృతాన్ని తృప్తిగా త్రాగటంచేత మదిరాపానం చేసినంత మహాసంతోషం, పారవశ్యం నాకు అనుక్షణమూ నేను చేసే పనులన్నిటిలో లభించుగాక!

ఆపాన అనటంవలన పూజావిధానాన్ని మనసా ఆస్వాదించటమూ, పూజా విధానంలోని యే క్రియనూ యే కారణంచేతనూ వదలివేయకుండటమూ సూచింప బడుతూన్నాయి. కాగా, పని గట్టుకొని శివలింగం ముందు కూర్చొని చేసే విధ్యుక్తమైన పూజ మాత్రమే కాక, జీవితంలోని జీవకర్మలన్నిటా **యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్** అన్న వైఖరినీ అనుభవాన్నీ ప్రతికర్మక్షణాత్క్షణమ్ అన్నది ధ్వనిస్తూన్నది.

**శ్లో॥ దృష్టార్థ ఏవ భక్తానాం భవత్పూజామహోద్యమః ।**
**తదైవ యదసంభావ్యం సుఖమాస్వాదయన్తి తే ॥ 20**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, భవత్ = నీయొక్క, పూజా = పూజయను, మహా = గొప్ప, ఉద్యమః = ప్రయత్నము, దృష్ట = ప్రత్యక్షమైన, అర్థః ఏవ = ఫలప్రదకార్యమే, యత్ = యే, తే = వారు, తదా ఏవ = అప్పటికప్పుడే, అసంభావ్యమ్ = ఊహించరాని, సుఖమ్ = సుఖమును, ఆస్వాదయన్తి = అనుభవించుచున్నారు.

**తాత్పర్యము :** భక్తులకు నీ పూజ ఒక గొప్ప ప్రయత్నముతోకూడిన కార్యము. దానిఫలము

ప్రత్యక్షమే. ఆ ఊహించరాని మహానందాన్ని వారు అప్పటికప్పుడే అక్కడికక్కడే అనుభవిస్తూన్నారు.

కార్యక్రమం యేదైనా, దానికి కొంత ప్రయత్నం తప్పదు. శివపూజకైనా అది తప్పదు. కాని ప్రతి ఉద్యమానికి ఫలితం ఎప్పటికో తప్ప వెంటనేరాదు. శివపూజకుమాత్రం సత్ఫలితం వెనువెంటనే, పూజచేస్తూండగానే లభిస్తుంది. పూజవలన కలిగే శాశ్వత శివసాన్నిధ్యసుఖం అలా ఉంచి, పూజాక్రమంలోనే మహదానందం అనుభవంలోకి వస్తుంది. ఈ సద్యఃఫలప్రాప్తి పూజ అనే కర్మకు మాత్రమే సంభవం. అదే అసంభావ్యం అన్నది ధ్వనిస్తూన్నది.

**శ్లో॥ యావన్న లబ్ధస్త్వత్పూజాసుధాస్వాదమహోత్సవః ।**
**తావన్నాస్వాదితో మన్యే లవోఽపి సుఖసంపదః ॥ 21**

**ప్రతిపదార్థము :** యావత్ = ఎంతవరకు, త్వత్ = నీయొక్క, పూజా = పూజయను, సుధా = అమృతమును, ఆస్వాద = సేవించు, మహా = గొప్ప, ఉత్సవః = ఉత్సవము, న లబ్ధః = లభించదో, తావత్ = అంతవరకు, సుఖసంపదః = సుఖసంపద, లవః అపి = లేశమైనను, న ఆస్వాదితః = అనుభవింపబడలేదు, అని, మన్యే = తలంతును.

**తాత్పర్యము :** నీ పూజామృతసేవనం అనే ఆనందం లభించనంత కాలము నాకు సుఖానుభవము అణుమాత్రంకూడా లేదు, అని నా భావన. (లౌకిక సుఖాలు లెక్కలోనివికావు.)

**శ్లో॥ భక్తానాం విషయాన్వేషాభాసాయాసాద్వినైవ సా ।**
**అయత్నసిద్ధం త్వద్ధామస్థితిః పూజాసు జాయతే ॥ 22**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, పూజాసు = పూజలలో, అయత్న = ప్రయత్నము లేకుండ, సిద్ధమ్ = లభించిన, త్వద్ = నీయొక్క, ధామస్థితిః = అలౌకిక స్వాత్మ స్థితియనునదేదో, సా = అది, విషయ = సామగ్రిని, అన్వేష = వెదకుటయను, ఆభాస + ఆయాసాత్ = కష్టముననుభవించు విచారము, వినా ఏవ = లేకుండగనే, జాయతే = కలుగుచున్నది.

**తాత్పర్యము :** భక్తులకు పూజా సమయాలలో నీయందు స్వాత్మస్థితి అప్రయత్నంగా, సామగ్రిని వెదకే ఆయాసంలేకుండగనే కలుగుచున్నది.

**అయత్నసిద్ధం** అంటే ధ్యానాది ప్రయత్నంలేకుండా, అని. విషయ శబ్దానికి కుసుమధూపవిలేపనాది సాధనసామగ్రి అర్థం. ఇవన్నీ వెదకి తెచ్చుకోవలసినవి కనుక ప్రయాస కలిగించేవి.

**శ్లో॥ న ప్రాప్యమస్తి భక్తానాం నాప్యేషామస్తి దుర్లభమ్ ।**
**కేవలం విచరన్త్యేతే భవత్పూజామదోన్మదాః ॥ 23**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, ప్రాప్యమ్ = పొందదగినది, న అస్తి = లేదు; ఏషామ్ = వీరికి, దుర్లభమ్ = లభించనిది, అపి = కూడ, న అస్తి = లేదు; ఏతే = వీరు, భవత్ = నీయొక్క, పూజామద = పూజారూపమైన మదిరతో, ఉత్+మదాః = మత్తెక్కినవారు, కేవలమ్ = ఊరకే, విచరన్తి = విహరిస్తూంటారు.

**తాత్పర్యము :** భక్తులకు కోరదగిన లౌకిక వస్తువేదీలేదు. వీరు కావాలనుకుంటే వీరికి దొరకనిదీలేదు. వీరు నీ పూజచేసిన ఆనందంతో పరవశించి ఊరకే తిరుగుతూంటారు. అంతే.

ఇల్లు దాటి బైటప్రపంచంలోకి అడుగుపెడతే సాధారణంగా ఏదో పనిమీదనో, యేదో తెచ్చుకోవాలనో వెళ్ళటం జరుగుతుంది. భక్తులకు అటువంటిదేమీ ఉండదు. మనస్సు ఉల్లాసంగా తేలిపోతూంటే ఒకచోట కూర్చోలేక ఒక పనిగాని ఒక దిశగాని లేకుండా తిరుగుతుంటారు. మనస్సును ఉల్లాసపరచుకోటానికి లౌకికులు వాహ్యాళిగా విహరిస్తారు. భక్తులు శివార్చనానందంతో తేలిపోతూ విహరిస్తారు.

**శ్లో॥ అహో! భక్తిభరోదారచేతసాం వరద! త్వయి ।**
**శ్లాఘ్యః పూజావిధిః కోఽపి యో న యాచ్ఞా కలంకితః ॥ 24**

**ప్రతిపదార్థము :** వరద! = ఓ వరప్రదాతా!, శ్రేష్ఠమైనవానినిచ్చువాడా!, అహో = ఔరా!, భక్తిభర = భక్తితో నిండిన, ఉదారచేతసామ్ = ఉదార బుద్ధిగలవారికి, త్వయి = నీయందు, పూజావిధిః = పూజావిధానము, కః అపి = ఏదో అలౌకికమైన, శ్లాఘ్యః = ప్రశంసనీయమైనది, యః = ఏది, యాచ్ఞా = యాచనవలన, కలంకితః = దూషితము, న = కాదు.

**తాత్పర్యము :** ఓ వరప్రదాతా! ఉదారబుద్ధిగల నీ భక్తులు యాచకులు కారు. నీ యందలి భక్తికి వారు ప్రతిఫలమేమియు ఆశించరు.

వెనుకా ముందూ ఆలోచించకుండ వరాలిచ్చేదేవుడని శివుని కీర్తి. ఆయన అంత ఉదారుడు కనుకే ఆ స్వామి భక్తులు కూడా అంత ఉదారులే. తమభక్తికి ప్రతి ఫలాన్నికోరరు. అందుకే ఆతడు వారిపై విశేషాదరణతో వారు కోరకుండానే సర్వశ్రేష్ఠమైన తన సాన్నిధ్యాన్ని వారికి ప్రసాదిస్తాడు. వర శబ్దానికి కోరినది అనీన్నీ, శ్రేష్ఠమైనది అనీన్నీ కూడా అర్థాలుకదా.

శ్లో॥ కా న శోభా న కో హ్లాదః కా సమృద్ధిర్న వా పరా ।
కో వా న మోక్షః కోఽప్యేష మహాదేవో యదర్చ్యతే ॥ 25

**ప్రతిపదార్థము :** యద్ = ఏది, ఏషః = ఈ, మహాదేవః = మహాదేవుడు, కః అపి = ఎవరైన, అర్చ్యతే = పూజింపబడుచున్నాడో, అది, కా శోభా = యే శోభ, న = కాదు; కః హ్లాదః = యే సంతోషము, న = కాదు; వా = మరియు, కా పరా సమృద్ధిః = యే సర్వోత్తమసుఖసంపత్తి, న = కాదు; వా = మరియు, కః మోక్షః = యే మోక్షము, న = కాదు.

**తాత్పర్యము :** ఈ మహాదేవుని పూజించటం అన్నది, అన్ని శోభలు, అన్ని సంతోషాలు, అన్ని సుఖసంపదలు, అన్ని మోక్షములు కలిసిన సమాహారస్వరూపం. ఇది అలౌకికమే, కాని లౌకికాలన్నీ ఇందులో అంతర్భాగాలే.

**పూజ** అన్నది ఎక్కడో ఉన్న దేవునుద్దేశించి చేసేది కనుక అలౌకికం అనిపిస్తుంది. అయినా పూజించేవారు పూజాఫలంగా కోరేవన్నీ లౌకికాలే. తమ జీవితం ఒక్క అద్భుతశోభతో వెలిగిపోవాలని కొందరు; సంసారంలో అన్ని విధాల సుఖాలూ లభించవలెనని మరికొందరు; సుఖసంపదలు పొందాలని కొందరు కోరుకుంటారు. కొందరేమో ఆకలినుండి మోక్షం; దారిద్ర్యం నుండి మోక్షం; దుఃఖం నుండి మోక్షం; ఇత్యాది లౌకిక మోక్షాలు కోరుకుంటారు. ఎవడో ఒకడు జన్మరాహిత్యం కోరుకుంటాడు. ఇందరికీ ఇన్ని ఇచ్చేది శివపూజ. కనుకే ఇది సర్వఫలాత్మకం అంటూన్నాడు ఈ భక్తకవి.

శ్లో॥ అన్తరుల్లసదచ్ఛాచ్ఛభక్తిపీయూషపోషితమ్ ।
భవత్పూజోపయోగాయ శరీరమిదమస్తు మే ॥ 26

**ప్రతిపదార్థము :** అన్తర్ = లోపల, ఉల్లసత్ = ప్రకాశించు, అచ్ఛ+అచ్ఛ = అత్యంతము స్వచ్ఛము, నిర్మలమైన, భక్తిపీయూష = భక్తియను అమృతముచేత, పోషితమ్ = పోషింపబడిన, ఇదమ్ = ఈ, మే = నాయొక్క, శరీరమ్ = శరీరము, భవత్ = తమయొక్క, పూజా = పూజకై, ఉపయోగాయ = ఉపయోగించుటకొరకు, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** నా లోపల సంవిత్పదంలో ప్రకాశించే అతినిర్మలమైన భక్తియనే అమృతంతో నా ఈ శరీరం పోషింపబడింది. ఇది తమ పూజకు అక్కరకువచ్చుగాక!

**శరీరం** జడమని, క్షణికమని, శాశ్వతత్వానికి అయోగ్యమనీ కదా అంటారు. క్షణికమైన పుష్పాదిద్రవ్యాలు దేవదేవుని పూజకు పనికివస్తూన్నట్లు నా ఈ శరీరం కూడా పూజలో నియోగింపబడుగాక! అని కవి భావం.

**శ్లో॥ త్వత్పాదపూజాసంభోగపరతంత్రః సదా విభో! ।**
**భూయాసం జగతామీశ! ఏకః స్వచ్ఛందచేష్టితః ॥ 27**

**ప్రతిపదార్థము :** విభో! = సర్వవ్యాపీ!, జగతాం ఈశ! = లోకాల ఏలికా!, ఏకః = ఒక్కడవు, స్వచ్ఛంద = స్వతంత్రముగా, చేష్టితః = వ్యవహరించువాడవు, సదా = ఎల్లప్పుడు, త్వత్ = నీయొక్క, పాదపూజా = పాదములను పూజించు, సంభోగపరతంత్రః = ఆనందమునకు వశుడనై, భూయాసమ్ = ఉందును.

**తాత్పర్యము :** సర్వవ్యాపివైన జగదీశా! నీ వొక్కడవే స్వతంత్రుడవు. ఎల్లప్పుడు నీ పాదపూజలో ఆనందమున వివశుడనై నేనుందునుగాక!

లోకంలో ప్రతి ప్రాణీ తన ఇచ్ఛానుసారంగా బ్రతుకుతూన్నట్లు కనిపిస్తుంది. మానవులైతే స్వేచ్ఛాజీవులమని చెప్పుకుంటారు. ప్రతి విషయంలోనూ 'నా యిష్టం' అనటం అధికారముద్ర అయిపోయింది. కాని, నిజానికి సృష్టిలో యేదీ తన ఇష్టం వచ్చినట్లు జీవించటంలేదు. సజీవ నిర్జీవములన్నీ, మానవులతో సహా, సూత్రబద్ధమై నడుస్తూన్నవి. పశువును ఒక పొడవైన త్రాడుతో ఒక రాటకు కట్టివేయటంలాంటి స్థితి. త్రాడు పొడవే ఆ పశువు స్వాతంత్ర్యాన్ని నిర్ణయిస్తుంది. అంతే తప్ప, పశువుకు సంపూర్ణ స్వాతంత్ర్యంలేదు. ఏ పశువూ 'నా ఇష్టం' అనే వీలులేదు. సర్వస్వతంత్రుడు పశుపతి ఒక్కడే. వానికి వశవర్తియైన పశువునకు మాత్రమే పాశంనుండి విడుదల. ఈ రహస్యాని తెలిసినవాని భక్తి పూర్ణత్వాన్ని పొందుతుంది. ఇది తెలియకపోవటమే దుఃఖకారణం, తెలియటమే సుఖం. అందుకే ఈ భక్తకవి పూజానందాన్ని, కోరుతున్నాడు.

ఈ శ్లోకాన్ని ఇట్లా కూడ, **విభో! జగతామీశ!** (అహం) **త్వత్పాదపూజాసంభోగ పరతంత్రః ఏకః స్వచ్ఛందచేష్టితః భూయాసం,** అని అన్వయించవచ్చు. అంటే అర్థం : నీపాద పూజలో ఆనందపారవశ్యంతో అద్వయమూర్తినై స్వతంత్రుడనగుదునుగాక!, అని. భక్తి భక్తుని ఆనందకేవలుని చేస్తుంది. అదే కైవల్యప్రాప్తి. ఏకః అన్నది త్వత్పాద...

....పరతంత్రః అన్నదానికి లక్ష్యం, స్వచ్ఛందచేష్టితః అన్నది భక్తికే సాధ్యం!

**శ్లో॥ త్వద్ధ్యానదర్శనస్పర్శతృషి కేషామపి ప్రభో! ।**
**జాయతే శీతలస్వాదు భవత్పూజామహాసరః ॥ 28**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ స్వామీ!, త్వద్ = నీయొక్క, ధ్యాన = ధ్యానములో, దర్శన = దర్శనముచేత, స్పర్శ = స్పర్శయందుగలిగిన, తృషి = లాలస, తృష్ణ, కేషామ్ + అపి = కొందరికైతే, శీతల = చల్లని, స్వాదు = రుచికరమైనది, భవత్పూజా = నీ పూజ, మహా = గొప్ప, సరః = సరస్సు, జాయతే = అవుతుంది.

**తాత్పర్యము :** ఓ స్వామీ! కొందరికి ధ్యానంలో కలిగిన నీ దర్శనంవలన నీ స్పర్శకావాలన్న తీవ్రమైన కోరిక కలిగి, అది నీ పూజను చల్లని, తియ్యని సరస్సుగా మారుస్తుంది.

**అసలున్నాడా?** అన్న ప్రశ్న తీవ్రమైతే, ధ్యానం నిలుస్తుంది; ధ్యానం దర్శనంగా మారుతుంది; దర్శనం స్పర్శనాన్ని కోరుతుంది; స్పర్శనం తాదాత్మ్యాన్ని అభిలషిస్తుంది. ఈ స్థితి ఒకయువకుడు యువతి, వీరి శృంగారంలోని మెట్లలాంటివే ఇవి. శృంగారశతకంలో భర్తృహరి, ఏనుగు లక్ష్మణకవి అనువాదంలో, ఇలా అంటాడు:

ఉ. బాలిక నన్ను కన్గొననిపట్టున దర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచు కోరి మది, చక్కగ కన్నుల నన్ను జూచి ప్రో
యాలు కవుంగిలింపవలె నంచు తలంచె, తమిం గవుంగిటన్
మేలుగచేర్చుకొన్న ఇరుమేనులు నొక్కటి సేయ గోరితిన్.

ఈ భావావేశమే భక్తిలోని మాధుర్యం : శీతలస్వాదు భవత్పూజామహాసరః అంటూన్నాడీ భక్తకవి అందుకే.

**శ్లో॥ యథా త్వమేవ జగతః పూజాసంభోగభాజనమ్ ।**
**తథేశ! భక్తిమానేవ పూజాసంభోగభాజనమ్ ॥ 29**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఓ స్వామీ!, యథా = ఎట్లు, జగతః = జగత్తునకు, త్వం ఏవ = నీవే, పూజాసంభోగ = పూజయొక్క ఆనందమునకు, భాజనమ్ = పాత్రుడవో, తథా ఏవ = అట్లే, భక్తిమాన్ ఏవ = భక్తిగలవాడే, పూజాసంభోగ = పూజయొక్క ఆనందమునకు, భాజనమ్ = పాత్రుడు.

**తాత్పర్యము :** స్వామీ! భక్తుడు పూజించి ఆనందమును పొందటకు నీవే తగినవాడవు. అట్లే, నిన్ను పూజించి ఆనందమును పొందుటకు నీ భక్తుడే తగినవాడు.

భక్తి విషయంలో, భగవంతునకు భక్తునకు యోగ్యత పారస్పరికం. పూజించి ఆనందిస్తాడు భక్తుడు. పూజలందుకొని ఆనందిస్తాడు దేవుడు.

**శ్లో॥ కోఽప్యసౌ జయతి స్వామిన్! భవత్పూజామహోత్సవః ।**
**షట్త్రింశతోఽపి తత్త్వానాం క్షోభో యత్రోల్లసత్యలమ్ ॥ 30**

**ప్రతిపదార్థము :** స్వామిన్! = ఓ స్వామీ! అసౌ కః అపి = అదేదో అలౌకికమైన, భవత్పూజామహోత్సవః = మీ పూజయను గొప్ప ఉత్సవము, జయతి = జయమందు చున్నది, యత్ర = ఎక్కడ, షట్త్రింశతః = ముప్పదిఆరైన, తత్త్వానామ్ = తత్త్వములకు,

అపి = కూడ, క్షోభః = ఆవేగము, అలమ్ = చాలినంత, పూర్తిగా, ఉల్లసతి = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :** స్వామీ! మీ పూజ ఒక అలౌకికమైన మహోత్సవము. అందు ముప్పదియారు తత్త్వముల ఆవేగముకూడ పూర్తిగా ప్రకాశమానమగుచున్నది.

సాధారణమైన ఉత్సవంలో పాల్గొనేవారంతా సంతోషంతో కాంతివంతంగా ఉంటారు. శివపూజ మహోత్సవం. అందులో భక్తులు మాత్రమే కాదు, సృష్టి సమస్తమూ పాల్గొంటుంది; సృష్టిమూలకాలైన 36 తత్త్వాలు గూడా ఆవేగాన్ని చెందుతాయి, ఆనందంతో నిండి పొంగిపోతాయి.

శ్లో. 11లో తత్త్వాలగూర్చి, 36 తత్త్వాల పట్టిక వివరించబడింది.

**శ్లో॥ నమస్తేభ్యో విభో! యేషాం భక్తిపీయూషవారిణా ।**
**పూజ్యాన్యేవ భవన్తి త్వత్పూజోపకరణాన్యపి ॥ 31**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, యేషామ్ = ఎవరికి, త్వత్ = నీయొక్క, పూజా ఉపకరణాని = పూజాసామగ్రి, అపి = కూడా, భక్తిపీయూష = భక్తియను అమృతపు, వారిణా = జలముచే, పూజ్యాని ఏవ = పూజ్యములే, భవన్తి = అగుచున్నవో, తేభ్యః = వారికి, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ పూజాద్రవ్యాలు కూడా నీయందలి భక్తి కారణంగా ఎవరికి పూజ్యవస్తువులవుతూన్నవో, అట్టి నీ భక్తులకు నమస్కారము.

దేవునియందు భక్తిగలవానికి ఆ దేవునితో సంబంధంగలవన్నీ పూజనీయములే అనిపిస్తాయి. ఈ సూత్రం లౌకికజీవితం కూడా పాటిస్తుంది. చదువుకునే వయస్సులోని పిల్లలకుగాని చదువుకున్నవారికిగాని పుస్తకాలు, కలం ఇత్యాదులు సాక్షాత్ సరస్వతీమూర్తులుగానే తోచటం సంస్కార లక్షణం. సంగీతవాద్యకారులకు తమ మృదంగమూ, ఫిడేలు, వీణ, ఇలాంటి వాద్యాలు పూజ్యవస్తువులే. ఒక వడ్రంగి సంస్కారం, శ్రద్ధ కలిగినవాడైతే, తనకు నిత్యం తనపనిలో చేదోడుగా ఉండి తనకు బ్రతుకుదెరువైన తన పనిముట్లకు నమస్కరించి పనిమొదలుపెడతాడు. ఇది శ్రద్ధాళుల లక్షణం. భక్తుడు కూడా తనదైవాన్ని పూజించటంలో భాగస్వాములయ్యే పంచపాత్ర, ఉద్ధరణ, నీరు, పూలు, పండ్లు ఇత్యాదులయందు దేవునియందున్నంత శ్రద్ధాభక్తులను కలిగే ఉంటాడు. వానిలో కూడా దైవత్వాన్ని దర్శిస్తాడు. వాని స్పర్శ శివస్పర్శతో సమానంగా పులకింపజేస్తుంది. భగవద్గీత, శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, అంటుంది. జ్ఞానం లేనిదే ఆనందం శుద్ధం కాదు. అందుకే, అంతటి భక్తులకు నమస్కారం, అంటూన్నాడు కవి.

**శ్లో॥ పూజారంభే విభో! ధ్యాత్వా మంత్రాధేయాం త్వదాత్మతామ్ ।**
**స్వాత్మన్యేవ పరే భక్తా మాన్తి హర్షేణ న క్వచిత్ ॥ 32**

**ప్రతిపదార్థము :** విభో! = ఓ సర్వవ్యాపీ!, పూజారంభే = పూజమొదలుకాగా, మంత్ర = మంత్రముచేత, ఆధేయామ్ = సిద్ధమగునట్టి, త్వద్ = నీయొక్క, ఆత్మతామ్ = ఆత్మలక్షణమైన చిన్మయత్వమును, ధ్యాత్వా = ధ్యానించి, భక్తాః = భక్తులు, హర్షేణ = సంతోషముతో, పరే **(స్వామిని)** ఏవ = పూర్ణుడైన స్వామియందే, క్వచిత్ = ఎప్పుడైన, న మాన్తి = వర్తించరు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! పూజ మొదట మంత్రంతో నీ ఆత్మలక్షణాన్ని ధ్యానించి, భక్తులు సంతోషంతో పూర్ణుడవైన నీ రూపంలోనే నిల్చిపోరు.

పూజారంభంలో ఆరాధ్యదైవాన్ని ధ్యానించటం ఆచారం, దానివలన పూజించే భక్తునికి శివత్వప్రాప్తియనీ, అట్లా పూజకు పూజ్యత లభిస్తుందని భావం. అంతమాత్రంచేత భక్తుడు తన ఆత్మలో పరమశివుని పూర్ణరూపాన్ని నిల్పుకొని నిలువలేడు. **'ధ్యాత్వా'** అని చెప్పికొని ధ్యానించటం వలన శివత్వభావం భక్తుని పవిత్రునిచేసి శివుని చిన్మయరూపాన్ని దర్శించటానికి మార్గాన్ని సుగమం చేస్తుంది.

**శ్లో॥ రాజ్యలాభాదివోత్ఫుల్లైః కైశ్చిత్పూజామహోత్సవే ।**
**సుధాసవేన సకలా జగతీ సంవిభజ్యతే ॥ 33**

**ప్రతిపదార్థము :** పూజా = పూజయను, మహా = గొప్ప, ఉత్సవే = ఉత్సవమునందు, సకలా జగతీ = సమస్త జగత్తు, కైః చిత్ = ఒకానొక అలౌకికమైన, సుధా = అమృతమయ, ఆసవేన = మధురసముతో, సంవిభజ్యతే = నిండింపబడుచున్నది, రాజ్యలాభాత్ = రాజ్యమును పొందుటవలన, ఉత్ఫుల్లైః = ఆనందించినవారి చేత, ఇవ = వలె. మరియొక విధముగా – రాజ్యలాభాత్ = రాజ్యమునుపొందిన కారణంగా, ఉత్ఫుల్లైః = సంతోషముతో నున్న, కైః చిత్ = కొందరిచేతవలె.

**తాత్పర్యము :** రాజ్యాన్ని పొందినవారు ఆనందంతో తమరాజ్యాన్ని ఉత్సవాలతో నింపి వేసినట్లు, పూజయనుదానిని కొందరు ఒక అలౌకికమైన ఆనందంగా భావించి ఆ అమృతానందాన్ని మహోత్సవంగా లోకమంతా పంచిపెడతారు.

ఒక రాజుకు పట్టాభిషేకం జరిగితే, అది ఆ రాజ్యానికి మొత్తానికి సంబరమే అన్నట్లు రాజ్యమంతా ఆనందోత్సవాలు జరుపుకుంటారుకదా. అట్లాంటిదే భక్తిరాజ్యమున్నూ, అంటూన్నాడీ కవి. “ రామభక్తిసామ్రాజ్యం బే మానవుల కబ్బేనో ఆ

మానవుల కత్యంతానందమే మనసా! ” అన్నాడు త్యాగరాజస్వామికూడ. ఆ ఆనందాన్ని లోకానికంతకూ పంచిపెడతారు ఆ భక్తులు. ఈ అలౌకిక భక్తిసామ్రాజ్యం లోకాన్ని ఆక్రమించి ఎల్లలుదాటి ప్రవహించే ఆనందసామ్రాజ్యం, అని కవి హృదయం.

**శ్లో॥ పూజామృతాపానమయో యేషాం భోగః ప్రతిక్షణమ్ ।**
**కిం దేవా ఉత ముక్తాస్తే కిం వా కేఽప్యేవ తే జనాః ॥ 34**

**ప్రతిపదార్థము :** యేషామ్ = ఎవరికి, ప్రతిక్షణమ్ = అనుక్షణము, నిరంతరం, పూజా = పూజయను, అమృతపానమయః భోగః = అమృతసేవనముతో నిండిన ఆనందము కలుగునో, తే జనాః = అట్టివారు, దేవాః కిమ్ = దేవతలా యేమి?!, ఉత = లేక, కిం వా ముక్తాః = ముక్తులా యేమి?!, తే = వారు, కే అపి ఏవ = ఎవరో అలౌకికులే!

**తాత్పర్యము :** నిర్విరామముగ పూజచేస్తూ, తరుగని అమృతానందాన్ని పొందే భక్తులు దేవతలో లేక ముక్తులో తెలియదు, కాని వారు తప్పక ఎవరో అలౌకికులైన మహాత్ములే.

అమృతపానంతో నిరంతరం ఆనందంలో మునిగియుంటారు దేవతలని పురాణోక్తి. పూజతప్ప మరియే అమృతమూ సేవించకుండానే అంతటి మహదానందాన్ని పొందగల భక్తులు దేవతల కోవలో వారో, ఇంకా పైవారో మరి! ముక్తులు నిత్యానందంలో తేలియాడుతూంటారన్నది కూడా ఆర్యోక్తి. ఈ లోకంలో ఉంటూనే, పూజా మాత్రంచేత అంతటి ఆనందాన్ని నిత్యం అనుభవించే భక్తులు, ఆ ముక్తులకు పైవారే సుమా! వారెవరైనా, ఈ లోకానికి చెందినవారు కారు. పైలోకాలకు పైవారే, ఇది నిశ్చయం, అన్నది కవి భావం.

**శ్లో॥ పూజోపకరణీభూతవిశ్వావేశేన గౌరవమ్ ।**
**అహో! కిమపి భక్తానాం కిమప్యేవ చ లాఘవమ్ ॥ 35**

**ప్రతిపదార్థము :** అహో! = ఔరా!, భక్తానామ్ = భక్తులకు, పూజా = పూజకు ఉపకరణీ భూత = ఉపకరణములైన, విశ్వ = జగత్తుయొక్క, ఆవేశేన = సమీకరణముచేత, కిమపి = యే అసామాన్య, గౌరవమ్ = గురుత్వమో, చ = మరియు, కిమపి = ఎంతటి, లాఘవం ఏవ = లఘుత్వమో!

**తాత్పర్యము :** ఔరా! భక్తులకు పూజలో ఉపకరణమైన జగత్తునకు ఎంతటి అసామాన్య గౌరవం కలుగుతుందో! ఎంతటి నైపుణ్యం లభిస్తుందో!

భక్తులతో శివపూజావిధిలో జగత్తుకూడ పరికరంగా భాగస్వామి అవుతుంది. ఇందువలన గొప్ప అసాధారణగౌరవం కలుగుతుంది, కుశలత లభిస్తుంది. **గౌరవం**

అన్నది గురుభావం. గురుశబ్దానికి పెద్దరికం, బరువు అర్థాలు. పూజలో ఉపకరణం కావటం వలన విశ్వానికి బరువు బాధ్యతలు పెరుగుతూన్నాయని భావం. అట్లే ప్రాముఖ్యం కూడా పెరుగుతూన్నది. బాహ్యప్రకృతి, తదాంతరంగిక తత్త్వరూపం, రెండున్నూ శివుని చిద్భూమియందు ప్రవేశాన్ని పొందినవి కనుక ఈ ఘనత. గురుస్వరూపమై విశ్వం శివుని ఉపదేశిస్తూన్నది కనుక గౌరవం. **లాఘవం** అన్నది లఘుతభావం. లఘు శబ్దానికి తేలికైన అని అర్థం. కనుక తేలికపడుతూన్నదని అర్థం. అట్లే కౌశలం, నిపుణత అని కూడ లాఘవం. విశ్వం పదార్థరాశిభావంలోని భౌతికతాభారం నుండి తేలికపడుతూన్నది, కుశలమవుతూన్నది.

ఈ మొత్తం భావాన్ని భక్తానాం, భక్తులకూ అన్వయించవచ్చు. అంటే పూజచేసే భక్తుడున్నూ, ఉపకరించే వస్తువులున్నూ గౌరవాన్నీ లాఘవాన్నీ పొందుతూన్నవని భావం.

**శ్లో॥ పూజామయాక్షవిక్షేపక్షోభాదేవామృతోద్గమః ।**
**భక్తానాం క్షీరజలధిక్షోభాదివ దివౌకసామ్ ॥ 36**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, పూజామయ = పూజలో లగ్నమైన, అక్ష = ఇంద్రియములయొక్క, విక్షేప = చాంచల్య, క్షోభాత్ = క్షోభ లేక వ్యాకులతవలన, ఏవ = మాత్రమే, అమృత = అమృతముయొక్క, ఉద్గమః = ఉత్పత్తి, ఇవ = వలె, దివౌకసామ్ = దేవతలకు, క్షీరజలధిక్షోభాత్ ఏవ = పాలసముద్ర క్షోభవలననే, అమృత = అమృతముయొక్క, ఉద్గమః = ఉత్పత్తి.

**తాత్పర్యము :** (ఈ క్రమంలో) భక్తులకు పూజలో లగ్నమైన ఇంద్రియాల చలనంవలన మాత్రమే అమృతమును పోలిన ఆనందం లభించినట్లు దేవతలకు పాలసముద్రాన్ని తరచటంవలననే అమృతం లభించింది. (లేక, దేవతల ఉదంతం ముందుచెప్పి, భక్తుల సంగతి తరువాత చెప్పినట్లయితే) దేవతలకు పాలసముద్రాన్ని చిలకటం వలన అమృతం లభించినట్లు భక్తులకు పూజాసమయంలో ఇంద్రియాల కదలికవలననే ఆనందామృతం లభిస్తుంది.

ఇక్కడ రెండటికీ ఉపమాన ఉపమేయత్వాలు రెండూ సిద్ధించినవనవచ్చు. పాల కడలిని దేవతలు చిలికినప్పుడు దేవతల శరీరేంద్రియాలు కూడా చలిస్తూనే ఉన్నవి. అవి చలించకపోతే మథనం లేదు, అమృతోదయం కాదు. కనుక చాంచల్యం ఇక్కడ గుణమే కాని దోషం కాదు. అట్లాగే, పూజవేళ భక్తుల ఇంద్రియాలు కదులతూనే ఉంటాయి. కదలకపోతే, పూజలేదు, తత్ఫలమైన ఆనందామృతం లేదు. పూజలోని

ఇంద్రియచాంచల్యం ఈశ్వరకైంకర్యమే. కనుకే ఆనందోత్పత్తి నిరాతంకమవుతుంది. గుణదోషాలన్న విభాగం సందర్భాశ్రయం.

**శ్లో॥ పూజాం కేచన మన్యన్తే ధేనుం కామదుఘామివ ।**
**సుధాధారాధికసారం ధయన్త్యన్తర్ముఖాః పరే॥ 37**

**ప్రతిపదార్థము :** కేచన = కొందరు, పూజామ్ = పూజను, కామదుఘాం ఇవ = కామధేనువునువలె, మన్యన్తే = తలచుచున్నారు, పరే = ఇతరులు, అన్తర్ముఖాః = లోచూపుగలవారై, సుధాధారా = అమృతధారకంటె, అధికరసామ్ = ఎక్కువ ఆనందమును, ధయన్తి = పిండుకొనుచున్నారు.

**తాత్పర్యము :** కొందరు భక్తులు పూజను కామధేనువుగా భావిస్తూంటారు. మరికొందరు లోచూపుగలవారై అమృతాన్నిమించిన రసానుభూతిని పూజద్వారా పొందుతుంటారు.

ఇక్కడ చెప్పిన మొదటి తరగతి భక్తులు సకామభక్తులు. వీరు పూజించేది లౌకికమైన కోరికలు తీర్చుకోవటానికి. వీరికి భక్తియన్నది, పూజయన్నది కామధేనువు వలె యే పెద్దకోరికనైన తీర్చగల సాధనం. అంత మాత్రమే. ఇక రెండవ తరగతి భక్తులు నిష్కామభక్తులు. వీరు బాహ్యప్రపంచంలోని దేనివలనగాని తృప్తిని, ఆనందాన్ని కోరేవారు కారు. వీరి చూపు ఆత్మపైన ఉంటుంది. వీరి ఆనందం ఆత్మలో ఉంటుంది. అది అమృతత్వం. దాన్ని పొందుతారు వీరు. పూజ కోరికలు తీర్చేందుకుకాదు. పూజ పూజకోసమే. ఇద్దరూ ఆనందాన్వేషులే. మొదటివారికి ఆనందం బాహ్యంలో ఇంద్రియ విషయాలవలన కలుగుతుందని నమ్మేవారు, అదే కావాలనేవారు. రెండవవారు అది అశాశ్వతం కనుక, అతీంద్రియమైన ఆత్మానందం శాశ్వతం కనుక, అదే కావాలని, దానిని పూజలో పొందేవారు.

**శ్లో॥ భక్తానామక్షవిక్షేపోఽప్యేష సంసారసంమతః ।**
**ఉపనీయ కిమప్యన్తః పుష్ణాత్యర్చామహోత్సవమ్ ॥ 38**

**ప్రతిపదార్థము :** సంసార = సంసారమునుండి, సంమతః = చక్కగా తెలియబడినది, ఏషః = ఈ, అక్ష = ఇంద్రియములయొక్క, విక్షేపః = చాంచల్యము, అపి = కూడ, భక్తానామ్ = భక్తులకు, అన్తః = లోపల, కిమపి = ఏదేనొక అలౌకికమైన, అర్చా = పూజా సంబంధమైన, మహా + ఉత్సవమ్ = గొప్పఉత్సవమును, ఉపనీయ = పొంది, పుష్ణాతి = వృద్ధియగుచున్నది.

**తాత్పర్యము :** లోకాన్ని చూచి చక్కగా తెలిసికొన్నాను : ఈ ఇంద్రియచాంచల్యం కూడ

భక్తుల అంతరంగంలోని యేదో ఒక అలౌకికపూజా మహోత్సవాన్ని పొంది బలాన్ని సమకూర్చుకుంటూన్నదని.

ఇంద్రియచాపల్యం సంసారంలో విపరీతంగా భావించబడదు, ఇదియొక లోకాతీతమైన ఆనందానికి సంకేతమే అనిపిస్తుంది. ఈ బాహ్యాలోకానందోత్సవానికి విశ్రాంతిరూపమే పూజా విధిగా తోస్తుంది. వెలపలి ఈ ఉత్సవంలో ఆనందమెంతో అలసట మరియంత. కనుక విశ్రాంతి అపేక్షితం. గీతాంజలిలో విశ్వకవి రవీంద్రుడంటాడు:

అందుకొన్నాడ నేను నాహ్వానములను
ఈ ప్రపంచోత్సవమునకు, ఇట్లు ధన్య
మయ్యె నా జన్మ, కనుసెవులర్థమరసె.

దీనిని, కరణేశ్వరీ చక్రప్రసరసమావిష్టులైన భక్తుల అర్చామహోత్సవంగా అభివర్ణించినాడు ఈ స్తోత్రవ్యాఖ్యాత క్షేమరాజాఖ్యుడు. ఈ ఆనందం ఆత్మానందానికి ప్రేరకం.

**శ్లో॥ భక్తిక్షోభవశాదీశ! స్వాత్మభూతేఽర్చనం త్వయి ।**
**చిత్రం దైన్యాయ నో యావద్దీనతాయాః పరం ఫలమ్ ॥ 39**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, చిత్రమ్ = ఆశ్చర్యము, భక్తి = భక్తియొక్క, క్షోభ = వ్యాకులతచే, వశాత్ = వివశమగుటవలన, త్వయి = నీయందు, స్వాత్మభూతే = స్వాత్మయందు కలిగిన, అర్చనమ్ = పూజా, దైన్యాయ = దీనతకై, నో = కాదు; యావత్ = కాని, దీనతాయాః = దీనత, లేక, కోరికయొక్క, పరమ్ = పరమమైన, ఫలమ్ = ఫలము.

**తాత్పర్యము :** ఈశ్వరా! భక్తిప్రసారమువలన కలిగిన వ్యాకులత వివశుని చేయగా నా ఆత్మవైన నిన్ను పూజించటం నా దైన్యం వలనకాదు కాని అది ఆ దీనతకు పరమఫలము. ఆశ్చర్యము!

పూజచేయకుండ ఉండలేని అశాంతి, వ్యాకులత క్షోభ. అంతమాత్రాన అది దైన్యమనదగిన తీవ్రమైన కోరికయనరాదు. అది భక్తిలోని చైతన్యతత్త్వమే తప్ప దైన్యంకాదు. ఆ చైతన్యప్రసారం పూజరూపం సంతరించికొంటుంది. అయితే, పూజ బాహ్యక్రియగా కోరిక ఫలమే. నిజానికి పూజ ఎవరికి? శివునకు. ఆ శివుడు ఎక్కడివాడు? స్వాత్మభూతే, నా ఆత్మయై ఉన్నవాడు. నా ఆత్మను నేను పూజించటానికి దీనతజెందేంత కోరికతో పనిలేదు.

శ్లో॥ ఉపచారపదం పూజా కేషాంచిత్త్వత్పదాప్తయే ।
భక్తానాం భవదైకాత్మ్యనిర్వృత్తిప్రసరస్తు సః ॥ 40

**ప్రతిపదార్థము :** కేషాంచిత్ = కొందరికి, పూజా = పూజ, త్వత్ = నీయొక్క, పద = స్థానమును, ఆప్తయే = పొందుటకొరకు, ఉపచారపదమ్ = ఉపాయము, సాధనము, తు = కాని, భక్తానామ్ = భక్తులకు, భవత్ = తమతోడి, ఏకాత్మ్య = ఏకాత్మతారూపమైన, నిర్వృత్తి = ఆనందమునకు, సః ప్రసరః = ఆ వికాసము.

**తాత్పర్యము :** కొందరు నీ స్థానాన్ని పొందటానికి సాధనంగా నీ పూజను స్వీకరిస్తారు. కాని, భక్తులకు నీతోడి ఏకాత్మతారూపమైన ఆనందానికి వికాసరూపమే ఆ పూజ.

భక్తులలో రెండు రకాలవారిని ప్రస్తావిస్తూన్న దీ శ్లోకం : 1 ద్వయభక్తి, 2. అద్వయభక్తి. వీరిలో ఇక్కడ 'కొందరు' (కేషాంచిత్) అన్నవారు ద్వయభక్తులు. అంటే శివుని నెలవును, కైలాసాన్ని చేరుకోవాలని కోరుకుని, అందుకు పూజనొకసాధనంగా భావించేవారు. వీరిలో నీవు–నేను అన్న ద్వయబుద్ధి అట్లేఉంటుంది. తాము తాముగానే ఉంటూ తమ ఇష్టదైవం ఉండే లోకంలో, ఆ పరివారంలో స్థానాన్నిమాత్రం అపేక్షించేవారు. వీరిని భక్తులుగా ఈ కవి గుర్తించలేదు. భక్తులంటే అద్వయబుద్ధిగలవారు మాత్రమే. వీరి లక్ష్యం సాక్షాత్ శివత్వమే. ఆనందస్వరూపుడైన శివునితో (రసో వై సః) ఏకాత్మత సాధించినదానికి వ్యక్తరూపమే పూజ, అందుకు సాధనం కాదు. పూజ వీరికి ఆనందరూపం, ఆత్మరూపం, శివరూపం. ఆ భావానికి వికాసరూపం పూజ. విత్తనం వికసించి వృక్షమైనట్లు, అద్వయానందం వికసించి పూజగా వ్యక్తమవుతుంది.

శ్లో॥ అప్యసంబద్ధరూపాఽర్చా భక్త్యున్మాదనిరర్గలైః ।
వితన్యమానా లభతే ప్రతిష్ఠాం త్వయి కామపి ॥ 41

**ప్రతిపదార్థము :** భక్తి + ఉన్మాద = భక్తియనుమైకముతో, నిరర్గలైః = సంకెలలు, హద్దులులేని, నిరంకుశులైన భక్తులచే, వితన్యమానా = చేయబడుచున్న, అర్చా = పూజ, అసంబద్ధరూపా అపి = క్రమము తప్పినదేయైనను, త్వయి = నీయందు, కాం అపి = ఒక అసామాన్యమైన, ప్రతిష్ఠామ్ = స్థితిని, లభతే = పొందుచున్నది.

**తాత్పర్యము :** భక్తిభావం గాఢతరమైనకొలది బాహ్యస్పృహ తగ్గిపోయి పారవశ్యం కలుగగా, ఆ మైకంలో నిరంకుశులైన భక్తులు వారు చేస్తూన్న పూజ విధ్యుక్తక్రమంలో సాగుతున్నదా లేదా అన్న వివేచన కోల్పడి, అస్తవ్యస్తంగా పూజ చేసినప్పటికి అది ఆనందరూపమే అవుతుంది, శివస్వీకారాన్ని పొందుతుంది తప్ప దోషం కాదు, శివాపచారం కాదు.

మానవుడు చేసే పనికి విలువ రెండు అంశాలపై ప్రధానంగా ఆధారపడి ఉంటుంది, ఫలాన్నిస్తుంది: 1. శ్రద్ధ, 2. ఉద్దేశం. ఒకవేళ భావావేశం అధికమై చేసే పని అస్తవ్యస్తమైనా, అది అశ్రద్ధ కాదు. వాని ఉద్దేశంలో చ్యుతి లేదు. కనుక దోషం కాదు. Honesty and motive bring value to work. పూజలోనూ ఇదే సత్యం.

**శ్లో॥ స్వాదుభక్తిరసాస్వాదస్తబ్ధీభూతమనశ్చ్యుతామ్ ।**
**శంభో! త్వమేవ లలితః పూజానాం కిల భాజనమ్ ॥ 42**

**ప్రతిపదార్థము :** శంభో! = కళ్యాణస్వరూపా!, స్వాదు = మధురమైన, భక్తిరస = భక్తిరసమును, ఆస్వాద = సేవించుటచే, స్తబ్ధీభూత = నిశ్చలమైన, మనః = మనస్సునుండి, చ్యుతామ్ = వెలువడిన, ప్రకటమైన, పూజానామ్ = పూజలకు, భాజనమ్ = ఆశ్రయమైన, త్వమ్ = నీవు, లలితః ఏవ కిల = మనోహరుడవు, లలితుడవేకదా!

**తాత్పర్యము :** శంభో! భక్తిరసాన్ని సేవించి నిశ్చలమైన మనస్సుతో చేసిన పూజకు ఆశ్రయమైన నీవు నిజముగ మనోహరుడవే కదా!

భక్తియన్నది ప్రేమయే అంటాడు నారదుడు. దానితో నిర్మలమైన మనస్సు నిర్వికారమవుతుంది. అట్టి మనస్సుతో చేసిన పూజ నిజంగా హృదయంగమమే, హృద్యమే అవుతుంది. ఆ పూజకు ఆశ్రయమైన స్వామి మనస్సు చాంచల్యాన్ని హరించి తనయందు నిల్పగలవాడు కనుక మనోహరుడు.

**శ్లో॥ పరిపూర్ణాని శుద్ధాని భక్తిమన్తి స్థిరాణి చ ।**
**భవత్పూజావిధౌ నాథ! సాధనాని భవన్తు మే ॥ 43**

**ప్రతిపదార్థము :** నాథ = స్వామీ!, భవత్ = తమయొక్క, పూజావిధౌ = పూజాక్రమంలో, మే = నాయొక్క, సాధనాని = సాధనములు, పరిపూర్ణాని = లోటులేనివి, శుద్ధాని = మలినములేనివి, భక్తిమన్తి = భక్తిగలవి, చ = మరియు, స్థిరాణి = దృఢమైనవి, నిశ్చలమైనవి, భవన్తు = అగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! మీ పూజావిధినిర్వహణలో నాకు పరికరాలుగా ఉండే వస్తువులు, నా ఇంద్రియాలు, అన్నీ యే లోపమూ లేకుండా, మలినమైనవి కాకుండా, భక్తితో నిండినవై నిశ్చలమైనవి అగుగాక!

పూజావిధిలో పరికరాలు మూడు విధాలు: 1. పాత్రలు, పూలు, నీరు, అక్షతలు, పాలు, తేనె, నెయ్యి ఇత్యాదులు, 2. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, 3. మనస్సు. ఇవి లోపంలేనివి, మలినంలేనివి, భక్తిగలవి, నిశ్చలమైనవి. ఇందులో అన్నీ మనస్సుకు

వర్తించేవి కాగా నిర్దోషమూ నిర్మలమూ అన్నవి వస్తుపరంగానూ పూజాద్రవ్యాలపరంగానూ చెప్పదగినవి పూర్ణత్వం, నైర్మల్యం. ఇంద్రియాలపరంగా చెప్పదగినవి నిశ్చలత్వం, నైర్మల్యం, భక్తి. ఇట్లా పూజ సంపన్నం కావాలి.

**శ్లో॥ ఆశేషపూజాసత్కోశే త్వత్పూజాకర్మణి ప్రభో! ।**
**అహో! కరణవృందస్య కాపి లక్ష్మీర్విజృంభతే ॥ 44**

**ప్రతిపదార్థము :** ప్రభో = స్వామీ!, త్వత్ = నీయొక్క, పూజా = పూజయను, కర్మణి = కర్మయందు, అశేష = సమస్తమైన, పూజా = పూజయొక్క, సత్కోశే = మంచి, ఉదాత్తమైననిధిలో; కరణవృందస్య = ఉపకరణసమూహముయొక్క, కా అపి = యేదో అలౌకికమైన, లక్ష్మీః = లక్ష్మి, కాంతి, విజృంభతే = ఉద్దీప్తమగును.

**తాత్పర్యము :** స్వామీ! నీ పూజలో, ఆ కర్మలో అశేషమైన ఒక పూజానిధి యున్నది; ఉపకరణములయొక్క అనిర్వాచ్యమైన ఒక తేజస్సు ఉద్దీప్తమై కనబడుతుంది.

పూజ ఒక కర్మ, పని. సాధారణంగా యే కర్మయైన ఒకటిగనే తోస్తుంది. పూజ అనే కర్మమాత్రం ఎన్నో కర్మల సమాహార మనకతప్పదు. సాధారణ కర్మలలో కర్మేంద్రియాలు ప్రధానపాత్రవహించగా, జ్ఞానేంద్రియాలు ఉండి లేనట్లుంటాయి. కాని పూజాక్రియలో మాత్రం మనోవాక్కాయాలన్నీ పూర్తిగా పాల్గొంటాయి. లేకుంటే అది ఒక సాధారణ లౌకికకర్మగాని లేక లాంఛనకర్మగాని అవుతుంది. పూజ అనిపించుకోదు. ఇట్లా త్రికరణాలూ లగ్నమైనందువలన అది తేజోమయమవుతుంది. దీనినే లక్ష్మీకళ అంటాము. లక్ష్మీదేవి కాంత్యభిమాని దేవత. కాంతియున్నచోట లక్ష్మి ఉంటుంది. లక్ష్మి ఉన్నట్లు సూచన మనోవాక్కాయాలన్నిట ఒక ఉత్సాహం, ఓజస్సు, తేజస్సు ఉన్న అనుభూతి కలుగుతుంది.

**శ్లో॥ ఏషా పేశలిమా నాథ! తవైవ కిల దృశ్యతే ।**
**విశ్వేశ్వరోఽపి భృత్యైర్యదర్చ్యసే యశ్చ లభ్యసే ॥ 45**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, ఏషా పేశలిమా = ఈ కోమలత, తవ ఏవ = నీదేయైనదిగా, కిల = నిజముగా, దృశ్యతే = కనిపించును, యత్ = ఏకారణంగా, విశ్వ+ఈశ్వరః అపి = విశ్వమునకు స్వామియైనప్పటికి, భృత్యైః = దాసులచేత, అర్చ్యసే = పూజింపబడుచున్నావు, చ = మరియు, లభ్యసే = పొందబడుచున్నావు.

**తాత్పర్యము :** స్వామీ! నీవు విశ్వేశ్వరుడవైయుండికూడ నీ సేవకులచేత పూజింపబడుతూ, వారికి లభిస్తూన్నావు కదా. ఈ కోమలత నీ లక్షణం అనటానికిది తార్కాణగా ఉంది.

**పేశలిమా,** కోమలత, అన్నది మనోధర్మం. మెత్తని మనస్సు, కరుణ సేవకులు యజమానిని ఎంతైనా గౌరవిస్తారు. ఆది వారి ధర్మం, వారి అవసరం కూడా. కాని యజమాని ప్రసన్నుడై వారికి వశుడు కావటం లోకసహజం కాదు. కనుకే వాని విశ్వేశ్వరత్వం నియంతృత్వం కాక సంపూర్ణప్రేమతత్త్వం అనకతప్పదు. ఇదే కవి హృదయం.

**శ్లో॥ సదా మూర్తాదమూర్తాద్వా భావాద్యద్వాప్యభావతః ।**
**ఉత్థేయాన్మే ప్రశస్తస్య భవత్పూజామహోత్సవః ॥ 46**

**ప్రతిపదార్థము :** భవత్ = మీదైన, పూజా = పూజయొక్క, మహా + ఉత్సవః = గొప్ప సంబరము, ప్రశస్తస్య = ప్రశంసనీయమైన, మే = నాకు, మూర్తాత్ = సాకారము, వా = లేక, అమూర్తాత్ = నిరాకారము అయిన, భావాత్ = భావమునుండి, యత్‌వా = అట్లే, అభావతః = లేమి, శూన్యమునుండి, అపి = కూడ, సదా = ఎల్లప్పుడు, ఉత్థేయాత్ = ఉదయించునుగాక!

**తాత్పర్యము :** మీ పూజామహోత్సవం నాకు ప్రశంసనీయ కార్యం. కనుక అది సాకారమో, లేక శూన్యభావమో, దేనినుండియైన ఎల్లప్పుడు కలుగుగాక!

ఈశ్వరుని పూజకు మూర్తి ఆవశ్యకం అంటారు చాలమంది. పూజయన్నది భౌతికమైన కార్యం కనుక దానికి లక్ష్యంగా ఒక మూర్తి కావలెనన్నది ఉద్దేశం. ఈ మూర్తి మానవుడెఱిగిన ఒక రూపం. ఈ విధంగా యేర్పడింది విగ్రహారాధన. విగ్రహరూపంలో స్పష్టమైన ఆకారం లేకున్నా, లింగాకారాన్ని, సాలగ్రామాన్ని కూడా అర్చనకుపయోగిస్తున్నారు. కొందరు ఆకారం ప్రాకృతికం కనుక అది నశ్వరం కనుకను, అది ఈశ్వరసృష్టి కనుకను పూజార్హత దానికి లేదని నిరాకారునే ఆరాధించవలెనని భావిస్తారు. సాకారమూర్తిపూజకూడా నిజానికి నిరాకారదైవభావానికే తప్ప పదార్థానికి కాదు కదా అన్నది వీరి వాదం. ఆకారం, గుణం రెండూలేని శక్తిని ఆరాధించి యేమి ఫలమని విగ్రహారాధకుల వాదం. ఈ వాదాల జోలి నాకువద్దు కాని స్వామీ పూజా భావం నాకు ముఖ్యం. సగుణారాధన, నిర్గుణారాధన, నాకేదైన ఒకటే, నాలో ఆరాధనభావంమాత్రం సదా సచేతనంగా ఉంటే చాలు అంటూన్నాడీ భక్తుడు.

**శ్లో॥ కామక్రోధాభిమానైస్త్వాముపహారీకృతైః సదా ।**
**యేఽర్చయన్తి నమస్తేభ్యస్తేషాం తుష్టోఽసి తత్త్వతః ॥ 47**

**ప్రతిపదార్థము :** ఉపహారీకృతైః = అర్పణచేయబడిన, కామ = కామము, క్రోధ =

క్రోధము, అభిమానైః = అభిమానము అను వీనిచేత, యే = ఎవరు, త్వామ్ = నిన్ను, సదా = ఎల్లప్పుడు, అర్చయన్తి = పూజింతురో, తేభ్యః = వారికి, నమః = నమస్కారము, తత్త్వతః = తత్త్వదృష్టితో, తేషామ్ = వారికి, తుష్టః = ప్రసన్నుడవు, అసి = అగుచున్నావు.

**తాత్పర్యము :** నిన్ను ఎల్లవేళల తమలోని కామక్రోధ అహంకారములనర్పించి పూజించువారికి నమస్కారము, నీవు వారియందు తత్త్వదృష్టితో ప్రసన్నుడవే.

ఈశ్వరునకు పూజ ధూపదీపనైవేద్యాలతో ఉత్సవంగా చేయవచ్చు. కాని కామక్రోధాదుల నర్పించటం ఉదాత్తంగా భావించబడింది. భగవద్గీత కూడ అ. 12, శ్లో. 15లో హర్షామర్షభయక్రోధైర్ముక్తో యః స చ మే ప్రియః అని స్పష్టం చేసింది. దేవునకర్పించదగినవి షడ్వర్గంగా చెప్పబడిన కామక్రోధాదులు. ఇవి మానవుని ప్రగతికి శత్రువులు, దుఃఖానికి కారణాలు. కనుకే ఈ శత్రువర్గాన్ని శివార్పణం చేసిన భక్తులు శివప్రసన్నులు. వారికి నమస్సులు.

**శ్లో॥ జయత్యేష భవద్భక్తిభాజాం పూజావిధిః పరః ।**
**యస్తృణైః క్రియమాణోఽపి రత్నైరేవోపకల్పతే ॥ 48**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, భక్తిభాజామ్ = భక్తులయొక్క, ఏషః = ఈ, పరః = అత్యుత్తమమైన, పూజావిధిః = పూజావిధానము, జయతి = జయము చేయుచున్నది, యా = ఏది, తృణైః = గడ్డిపరకలచే, క్రియమాణః అపి = చేయబడుచున్నదియైనను, రత్నైః ఏవ = రత్నములచేతనే, ఉపకల్పతే = సంపూర్ణమగుచున్నది.

**తాత్పర్యము :** సామీ! మీ పూజావిధికి జయము! ఇది అత్యుత్తమమైనది: గడ్డితో నిర్వహించబడుచున్నను, రత్నములతో సంపన్నమగుచున్నది.

పూజావిధానానికి ఒక పద్ధతి, క్రమం ఉంటుంది. ఏ పూజయైన, అది ఒక ప్రార్థన, ఒక లక్ష్యంతో చేసేదిగా ఉంటుంది. పూజ అంటే ఒక శక్తివంతమైన దేవతకు చేసే ఒక గౌరవం, సత్కారం. దానితో ప్రసన్నమైన ఆ దేవత వాని కోరికల సాఫల్యాన్ని తన శక్తితో ప్రసాదిస్తుంది. భక్తులు కోరే సాఫల్యం లౌకికమైనా, అలౌకికమైనా, తప్పక మానవశక్తికి మించినదై ఉంటుంది. కాని పూజావిధిలో ఉపయోగించే సామగ్రి, ఆ దేవతకు అర్పించే పదార్థజాలం అంతా చాల సామాన్యమైనదే : పూలు, అక్షతలు, పసుపు, కుంకుమ, పండ్లు, ఇట్లాంటివే. వీనిని మనసా అర్పిస్తారు కనుక దేవత ప్రసన్నమవుతుంది. **పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,** అనిన్నీ, **యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్,** అనిన్నీ, గీతావాక్యానుసారం ఫలం గొప్పదిగా లభిస్తుంది.

శివపూజకు వాంఛితఫలం అన్నిటికంటె ఉదాత్తమైనది మోక్షం. ఈ మోక్షఫలాన్నాశించినవాడైనా, లేక, ఒక చిన్న లౌకికఫలాన్ని ఆశించినవాడైనా, పూజా విధి ఒక్కటే. పెద్దప్రయోజనానికి పెద్దపెట్టుబడి అక్కర్లేదు. చిన్న కోరికే కదా అని పూజలో నిర్లక్ష్యమూ, అలసత్వమూ, ఉదాసీనతా చెల్లవు. అందుకే పూజావిధి సర్వాదరణీయమైనది. అట్టి పూజకు జయము జయము!



# 18. ఆవిష్కారస్తోత్రమ్

**శ్లో॥ జగతోఽన్తరతో భవన్తమాప్త్వా – పునరేతద్భవతోఽన్తరాల్లభన్తే ।**
**జగదీశ! తవైవ భక్తిభాజో – న హి తేషామిహ దూరతోఽస్తి కించిత్ ॥ 1**

**ప్రతిపదార్థము :** జగదీశ! = లోకాల ఏలికా!, తవ = నీయొక్క, భక్తిభాజః ఏవ = భక్తజనులే, జగతః = జగత్తుయొక్క, అన్తరతః = మధ్యలోనుండి, భవన్తమ్ = తమరిని, ఆప్త్వా = పొంది, పునః = మరల, ఏతత్ = దానిని, భవతః = తమయొక్క, అన్తరాత్ = మధ్యలోనుండి, లభన్తే = పొందుచున్నారు, హి = ఏలన, తేషామ్ = వారికి, ఇహ = ఈ లోకంలో, కించిత్ = కొంచెమైన, దూరతః=దూరమునుండి, న అస్తి = లేదు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! నీ భక్తులు ఈ జగత్తులో నుండియే నిన్నుపొంది, మరల ఈ జగత్తును నీలోనుండి పొందుచున్నారు. వారికి దూరంగా యేదీలేదు కనుక ఇది సాధ్యమే.

భక్తియొక యోగం కనుక అది భక్తుని బాహ్యాజగత్తును ఆంతరజగత్తుతో కలిపి ఒక్కటి చేసే ప్రక్రియ. కనుక భక్తునికి అంతర్బహిర్జగత్తులలో ఒకే అనుభూతి కలుగుతుంది. బాహ్యజగత్తు బహునామరూపాలతో ప్రకటమవుతూన్నప్పటకి, ఈ బహుళత్వంలో ప్రకాశమానమయ్యే చిత్‌శక్తి ఒక్కటేయన్న దర్శనం వానికి అనుభవంలోనికి వస్తుంది. దీనినే ఈ భక్తకవి జగత్తుయొక్క ఆంతర్యం జగదీశరతత్త్వంగా దర్శించినాడు. ప్రకటించినాడు. జగత్తులో జగత్తత్త్వంగానే నామరూపాదులు పొంది ఉనికిని చాటుకుంటూన్న భక్తుడు జగత్తులో కాక జగదీశ్వరుని వేరెక్కడ పొందగలడు?! అసలీ జగత్తు ప్రకటమైనది ఆ జగదీశ్వరునిలోనుండియే కదా? జగత్తులో జగదీశుని దర్శించినంతనే, జగదుదయస్థితి జగదీశుని అంతరంగముననే అన్న సత్యం అవగత మవుతుంది. ఇంక లోపల – వెలుపల అన్న భేదమూలేదు, దూరమూలేదు. జగత్ స్థితి జగదీశుడే అన్న అద్వయచిత్ప్రకాశముద్దీప్తమవుతుంది. ఈ భావాన్నే ఈ భక్తకవి

ఆవిష్కరిస్తున్నాడు. భగవద్గీత కూడా **యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।** (6–31) అన్నది.

**శ్లో॥ క్వచిదేవ భవాన్ క్వచిద్భవానీ – సకలార్థక్రమగర్భిణీ ప్రధానా ।**
**పరమార్థపదే తు నైవ దేవ్యా – భవతో నాపి జగత్త్రయస్య భేదః ॥ 2**

**ప్రతిపదార్థము :** క్వచిత్ = ఒకప్పుడు, భవాన్ ఏవ = తమరే, క్వచిత్ = ఒకప్పుడు, సకల = అన్ని, అర్థ = పదార్థముల, క్రమ = క్రమముగ, గర్భిణీ = తనలో నిమిడించినదైన, భవానీ = శక్తి, భగవతి, ప్రధానా = ప్రధానమను పేరుగలది, తు = కాని, పరమార్థపదే = వాస్తవమున, పరమార్థ దృష్టినుండి, న ఏవ దేవ్యాః = దేవియొక్కయు కాదు, న అపి జగత్త్రయస్య = త్రిలోకములయొక్కయు కాదు, భవతః = తమయొక్క, భేదః = భేదము.

**తాత్పర్యము :** ఒకప్పుడు నీవే; ఒకప్పుడు సకల పదార్థగర్భిణియైన ప్రధానమనబడు శక్తి భగవతి. కాని వాస్తవంగా ఇది దేవి భవానీదిగాని లేక జగత్తులదిగాని కాదు. ఇది నీయందలి భేదమే.

ఎప్పుడు నీవుగా దర్శనమిస్తావు? ముక్తియందు మాత్రమే. దేనినుండి ముక్తి? ద్వయభావమునుండి, ప్రపంచభావమునుండి ముక్తి. ఈ ప్రపంచభావమున్నంతవరకు పదార్థభౌతికజ్ఞానముంటుంది, ఆ పదార్థ భోగక్రమముంటుంది. అది శక్తి భవానీ రూపదర్శనం, సకలం, అంటే కళలన్నీ ప్రకటమైనరూపం, ప్రవృత్తి, ప్రకృతి, ప్రధానం అనబడేది. కల అంటే 1/16 అని అర్థం, శక్తి అన్న అర్థం కూడా, కళ అని వ్రాయటం పరిపాటి. ప్రధానకళలైదు : శాంత్యతీతము (ఆకాశశక్తి), శాంతి (వాయుశక్తి), విద్యా (తేజశ్శక్తి), ప్రతిష్ఠా (ఆపశ్శక్తి), నివృతి (పృథ్వీశక్తి). ఇవి నాదోద్భవాలు. కళ అన్నది శక్తిసంకేతం వ్యష్టిలోగాని సమష్టిలోగాని. ఈ భేదం ఎక్కడిది? ప్రకృతిదా? ప్రధానమనబడే త్రిగుణసమతౌల్యస్థితిదా? కాదుకాదు. ఇది పరమాత్మ భేదమే. కనుక పరమాత్మకు అభిన్నమైనదే. శరీరంలోని వివిధాంగాలు వేరుగా కనబడుతూన్ననూ, నిజానికవి శరీరమే కదా, అట్లాగే.

**శ్లో॥ నో జానతే సుభగమప్యవలేపవన్తో**
**లోకాః ప్రయత్నసుభగా నిఖిలా హి భావాః ।**
**చేతః పునర్యదిదముద్యతమప్యవైతి**
**నైవాత్మరూపమిహ హా! తదహో! హతోఽస్మి ॥ 3**

**ప్రతిపదార్థము :** ఇహ = ఈ లోకంలో, లోకాః = ప్రజ, జనులు, అవలేపవన్తః = పై

పూతగలవారై, సుభగం అపి = ఆనందమయమైనప్పటికి, రూపమ్ = స్వస్వరూపమును, నో జానతే = ఎఱుగకున్నారు, హి = ఏలన, నిఖిలాః = అన్ని, భావాః = వస్తువులు, ప్రయత్నసుభగాః = ప్రయత్నముతో సర్వోత్కృష్టమైనవి, అహో = ఔరా! పునః = మరల, ఉద్యతం అపి = ప్రయత్నము చేయబడినదైనను, ఇదం చేతః = ఈ మనస్సు, హృదయము, న ఏవ అవైతి = తెలిసికొనలేదు అన్నది, యత్ = యేది కలదో, తత్ = అది, హా హతః అస్మి = అయ్యో! నిరాశయే!

**తాత్పర్యము :** లోకంలో జనులు విషయాసక్తియను పైపూతగలవారైన కారణంగా వారికి స్వస్వరూపజ్ఞానం కలగటంలేదు. ఇందువలన అన్ని వస్తువులను ఆనంద రూపాలుగా చూడలేకున్నారు. ప్రయత్నించి ధ్యానం ద్వారా ఈ సత్యాన్ని గ్రహించగలరు. కాని, మరల ఎంత ప్రయత్నించినను ఈ మనస్సు తెలిసికొనలేదు. ఇది నిరాశాజనకమైన విషయం.

శుద్ధజ్ఞాన ప్రకాశమే అన్ని పదార్థాలలో జీవులలో నిండియున్నది. ఈ సత్యాన్ని ధ్యానం ద్వారా తెలియవచ్చు. కాని ఏకాగ్రధ్యానానికి ఈ మనస్సొప్పదు. కారణం ఈ మనస్సు ఇంద్రియవిషయాలుగా మాత్రమే అన్నివస్తువులనూ చూడటానికి అలవాటు పడింది. అన్నిటా ఇంద్రియాలందించినంతమాత్రమే ఆనందాన్ని అందుకొని అదే జగద్వస్తువులలోని సత్యతత్త్వం, వాని స్వరూపం అన్న భ్రమలో ఉన్నది. ఈ భ్రమనుండి ప్రమవైపు దాన్ని మళ్లించటం ఎంత ప్రయత్నించిననూ సాధ్యమనిపించటంలేదు. ఈ విషయాన్ని తలుచుకుంటూంటే నిరాశముంచుకొస్తూన్నది, అంటూన్నాడీ కవి.

**శ్లో॥ భవన్మయస్వాత్మనివాసలబ్ధ – సంపద్భరాభ్యర్చితయుష్మదంఘ్రిః ।**
**న భోజనాచ్ఛాదనమప్యజస్ర – మపేక్షతే యస్తమహం నతోఽస్మి ॥ 4**

**ప్రతిపదార్థము :** భవత్+మయ = నీతో నిండిన, స్వ = తనయొక్క, ఆత్మ = ఆత్మలో, నివాస = వసించుటచే, లబ్ధ = పొందబడిన, సంపత్+భర = ఐశ్వర్యాధిక్యముచే, అభ్యర్చిత = పూజింపబడిన, యుష్మద్ = నీయొక్క, అంఘ్రిః = పాదములుగలవాడు, యః = ఎవడు, అజస్రమ్ = ఎల్లప్పుడు, భోజన = భోజనము, ఆచ్ఛాదనమ్ = వస్త్రము, అపి = కూడ, న అపేక్షతే = కోరడో, తమ్ = వానిని, అహమ్ = నేను, నతః అస్మి = వంగినమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** తన ఆత్మలో నిన్ను నింపికొన్న సంపదతో నీ పాదముల నెవడు ఎల్లప్పుడు పూజించునో, ఆతడు అన్నవస్త్రములను గూడ కోరడు. అట్టి వానిని నేను తలవంచి వినమ్రుడనై నమస్కరించుచున్నాను.

ఈశ్వరుడు ఆత్మలో ఉండటమే ఐశ్వర్యం. అంతకంటె సంపదయేముంటుంది. ఈశ్వరపూజకు ఆ సంపద చాలు. అట్టివానికి శరీరావసరాల స్పృహ ఉండదు. ఆతడు సదా ఈశ్వరయుక్తుడు, ఈశ్వరునంతటివాడు. వానికి నమస్కరించుట సాక్షాత్ శివునకు నమస్కరించుటే.

**శ్లో॥ సదా భవద్దేహనివాసస్వస్థో – ఉ ప్యన్తః పరం దహ్యత ఏష లోకః ।**
**తవేచ్ఛయా తత్కురు మే యథాత్ర – త్వదర్చనానందమయో భవేయమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** ఏషః లోకః = ఈ లోకము, జనులు, సదా = ఎల్లప్పుడు, భవత్ = తమయొక్క, దేహ = దేహమున, స్వరూపమున, నివాస = వసించుటచేత, స్వస్థః = తన స్థానమున ఉన్నది, సుఖమున్నది, అపి = అయినను, తవ = నీయొక్క, ఇచ్ఛయా = ఇచ్ఛాశక్తివలన, అన్తః = అంతరంగమున, పరమ్ = మిక్కిలి, దహ్యతే = దహింపబడుచున్నది, అత్ర = ఈ విషయమున, తత్ = ఆ విధముగ, కురు = చేయుము, యథా = ఎట్లు, త్వద్ = నీదైన, అర్చనా = పూజయొక్క, ఆనందమయః = ఆనందముతో నిండినవాడను, భవేయమ్ = అగుదునో.

**తాత్పర్యము :** ఈ లోకం ఎప్పుడూ నీలోనే ఉన్నది. కనుక స్వస్థమైయున్నది. ఐనను, నీ ఇచ్ఛవలన, మిక్కిలి దహించబడుచున్నది. ఈ విషయంలో, నేను నీ పూజానందంతో పరవశించి యుండునట్లు అనుగ్రహింపుము.

ఈశ్వరుడు ఆనందరూపి కనుక వానియందున్న లోకము ఆనందములోనే యుండును. కాని నిత్యానుభవములో దానికి దుఃఖమే తప్ప సుఖములేదు. కారణము? ఈశ్వరుని ఇచ్ఛాశక్తి లేక మాయాశక్తి. మాయ యన్నది ప్రకృతికి మరొక పేరు. అదే ఇచ్ఛాశక్తి. మాయ ఈశ్వరుని ఇచ్ఛావర్తి. శివునాజ్ఞ లేనిదే చీమైన కుట్టదను నానుడికి కారణమిదే. ప్రకృతిని శివుడు ఉపసంహరించినప్పుడే లోకమునకు తన స్వస్థత తెలియవచ్చును. అది కూడ వాని సంకల్పవర్తియే. కనుక ప్రకృతి అట్లేయున్నను, శివ పూజానందమున్నచో మాయ ప్రవర్తించలేదు. ఆ స్థితి తనకు సదా కలుగుగాక యని ఈ భక్తుని కోరిక.

**శ్లో॥ స్వరసోదితయుష్మదంఘ్రిపద్మ – ద్వయపూజామృతపానసక్తచిత్తః ।**
**సకలార్థచయేష్వహం భవేయం – సుఖసంస్పర్శనమాత్రలోకయాత్రః ॥6**

**ప్రతిపదార్థము :** స్వరస = స్వాభావికముగ, ఉదిత = ఉదయించిన, యుష్మద్ = నీయొక్క, అంఘ్రిపద్మ = పాదములను పద్మముల, ద్వయ = రెండిటియొక్క, పూజామృత

= పూజారూపియైన అమృతమును, పాన = త్రాగుటయందు, సక్త = లగ్నమైయున్న, చిత్తః = మనస్సుగల, అహమ్ = నేను, సకల = అన్ని, అర్థచయేషు = వ్యవహారము లందు, సుఖసంస్పర్శనమాత్ర = ఆనందస్పర్శమాత్రమే కలిగిన, లోకయాత్రః = జీవనయాత్రగలవాడను, భవేయమ్ = అగుదునుగాక!

**తాత్పర్యము :** నాయందు అప్రయత్నంగా, అతి సహజంగా యేర్పడిన నీ పాదదర్శనము వలన ఉదయించిన మానస పూజారూపమైన అమృతమును ఆస్వాదించటములో కలిగిన ఆసక్తి దృఢమై దానివలన లౌకిక వ్యవహారాలలో ఫలనిరాసక్తమైన ఆనందం మాత్రమే లభించుగాక!

పూజకు భౌతికరూపం ప్రయత్నం తప్పదు. పూజాద్రవ్యాలను సమకూర్చు కోవలెను కదా! కాని మానస పూజకివి అక్కరలేదు. మనస్సు లోకవ్యవహారాలలో తిరుగుతూండగానే తటాలున శివమయమైపోతుంది. అదే స్వరసోదిత అనబడేది. అప్పుడది లౌకిక దుఃఖాలను విడిచి శివానందలహరిలో తేలియాడుతుంది. ఆ ఆనంద స్పర్శ సదా నిలకడగా లభించుగాక! అన్నదీ కవి ఆకాంక్ష.

**శ్లో॥ సకలవ్యవహారగోచరే – స్ఫుటమన్తః స్ఫురతి త్వయి ప్రభో! ।**
**ఉపయాన్త్యపయాన్తి చానిశం – మమ వస్తూని విభాన్తు సర్వదా ॥ 7**

**ప్రతిపదార్థము :** ప్రభో! = స్వామీ!, సకలవ్యవహార = అన్నిలౌకికవిషయములలో, గోచరే = కన్పించువాని, అన్తః = లోపల, త్వయి = నీయందు, స్ఫుటమ్ = స్పష్టముగ, స్ఫురతి = ప్రకాశించు, వస్తూని = వస్తువులు, ఉపయాన్తి = ఉత్పన్నమగుచున్నవి, చ = మరియు, అపయాన్తి = నశించుచున్నవి, సర్వదా = ఎల్లప్పుడు, అనిశమ్ = నిరంతరముగా, మమ = నాకు, విభాన్తు = గోచరించుగాక!

**తాత్పర్యము :** ఓ స్వామీ! ప్రాపంచిక వ్యవహారవిషయములలో నాకు నీ చిద్రూపము నిరంతరాయముగ ప్రకాశించుచు, లౌకికవస్తుజాలముయొక్క ఉత్పత్తి నాశములు స్పష్టమగునుగాక!

లోకంలో ఎంతటి ప్రజ్ఞాశీలియైన ఎప్పటికప్పుడు ప్రస్తుతమయ్యే వ్యవహార మంతా తనదేనన్న భావం కలిగి దానితో తాదాత్మ్యం చెందుతూ విషయాలలో మునిగి సత్యదర్శనం మసకబారుతుంది. కనుక ఈ ప్రార్థన. సమస్త వస్తువులు, వ్యవహారాలు ఆ స్వామి చిద్రూపంలో ఉదయించి అస్తమిస్తూండటం నిరంతరప్రక్రియ. వానికి యెవ్వరి సంబంధమూ ఉండదు. ఈ సత్యం నా జ్ఞానదృష్టికి మరుగునపడకుండ సదా ప్రకాశించుగాక!

**శ్లో॥ సతతమేవ తవైవ పురేఽథవా - ప్యరహితో విచరేయమహం త్వయా।**
**క్షణలవోఽప్యథ మా స్మ భవేత్ స మే - న విజయే నను యత్ర భవన్మయః ॥8**

**ప్రతిపదార్థము :** అహమ్ = నేను, సతతం ఏవ = ఎల్లవేళలనూ, తవ = నీయొక్క, పురే = పురమునందు, ఏవ = మాత్రము, విచరేయమ్ = చరింతును, అథవా = లేకున్నా, త్వయా అరహితః = నీతోకూడినవాడనై, అపి = కూడ, అథ = కాని, యత్ర = ఎక్కడ, భవత్ + మయః = నీతో నిండివాడనై, అభిన్నుడనై, న విజయే = గౌరవమును పొందనో, సః = ఆ స్థితి, క్షణలవః అపి = క్షణమునందొక కొంచెమైనను, నను = నిశ్చయముగా, మే = నాకు, మా భవేత్ స్మ = కలుగకుండుగాక!

**తాత్పర్యము :** నేనెప్పుడునూ నీ పురమునందే చరింతును. లేకున్న, నీకంటె అభిన్నుడనైయుండి గౌరవమును పొందని స్థితి నాకు కలుగుగాక!

పురము అన్నది పూరకమైన శాక్తపదము. కనుక నీ పురమునందే చరింతును, అంటే, నీకు సంబంధించిన నీ శక్తి ప్రసరించు చోటనే చరింతును అని. విశ్వం శివశక్తియుగళం. కనుక ఈ ప్రపంచంలో, నీ శక్తిమయమైన ప్రకృతిలో, విహరిస్తాను. అది నాకు గౌరవమే. లేదా, నీవే నేనై, ప్రకృతి స్వభావమునుండి విముక్తుడనై, విజయము చేయటం నాకు గౌరవం. శక్తిస్థానమైన ప్రకృతిలో ఉండటం సహజసిద్ధ స్థితి. ప్రకృతిని అధిగమించి శివయుక్తుడు కావటం లోకాతీతస్థితి. రెండిటనూ ఆనందానుభవమే. ఉత్తరోత్తరం ఉత్తమోత్తమం.

**శ్లో॥ భవదంగపరిస్రవత్సుశీతామృతపూరైర్భరితే సమన్తతోఽపి ।**
**భవదర్చనసంపదేహ భక్తాస్తవ సంసారసరోఽన్తరే చరన్తి ॥ 9**

**ప్రతిపదార్థము :** భవత్ = తమయొక్క, అర్చనసంపదా = పూజయను సంపద, తవ = నీయొక్క, భక్తాః = భక్తులు, భవత్ = తమయొక్క, అంగపరిస్రవత్ = శరీరము నుండి ప్రవహించిన, సుశీత = అతి చల్లని, అమృతపూరైః = అమృతధారలతో, సమన్తతః అపి = అన్ని దిక్కులనుండియు, భరితే = నింపబడిన, ఇహ సంసార = ఈ లౌకికరూప మైన, సరః + అన్తరే = సరస్సు యొక్క మధ్యభాగమున, చరన్తి = విహరించుచున్నారు.

**తాత్పర్యము :** ఈ సంసారము భవదుఃఖసాగరము. దీనిలో తమ భక్తులు హాయిగ విహరించుటకు కారణము వారికి మీ పూజ యను అమృతము చల్లగ లభించుటే. ఈ చల్లని అమృత ధార అన్ని దిక్కుల నుండి తమ శరీరము నుండి ప్రవహించుచున్నది.

**సంసారం దుఃఖసాగరం** కనుక అది తాపముతో వేడెక్కినదే. అయితే ఈ

తాపసముద్రములోనికి శివుని శరీరమునుండి, అన్ని దిక్కులనుండి, అమృతధార ప్రవహించటం వలన ఇది చల్లనైనది. ఈ చల్లదనమును భక్తులాస్వాదిస్తూ శివపూజను విడువక సంసారసాగరంలో విహరిస్తారు. ఈ సంసారం శివుని పరశక్తిరూప శరీరము. దానినిట్లని దర్శించిన భక్తులకు శాంతి లభించి సంసారం ఆనందసాగరంగా ఆస్వాద్యమవుతుందని ఈ భక్త కవి భావన.

**శ్లో॥ మహామన్త్రతరుచ్ఛాయాశీతలే త్వన్మహావనే।**
**నిజాత్మని సదా నాథ! వసేయం తవ పూజకః॥ 10**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ! మహామంత్ర = మహామంత్రము అను, తరుచ్ఛాయా శీతలే = చల్లని చెట్టు నీడలో, నిజ = నాదైన, ఆత్మని = ఆత్మయందు, త్వత్ = నీయొక్క, మహావనే = విశాలమైన తోటలో, సదా = ఎల్లప్పుడు, తవ = నీయొక్క, పూజకః = పూజచేయువాడనై, వసేయమ్ = నివసింతును.

**తాత్పర్యము :** స్వామీ! నీ భక్తి యొక్క విశాలమైన వనం. అందు నిన్ను జపించు మహామంత్రము చల్లని నీడనిచ్చు వృక్షము. దాని నీడలో తాపములన్నీ మాసిపోగా నీ పూజలో లీనమై ఆత్మానందము ననుభవిస్తూంటాను.

మహామంత్రము అహంపరామర్శరూపమైనది. శుద్ధాహంకారమంటారు. పరా అను పేరుగల వాగ్రూపశక్తి. ఈ శివశక్తి శాఖోపశాఖలుగా విస్తరించినది కనుక వృక్షసామ్యము చెప్పబడినది. నీడగా చెప్పబడినది నిజానికి జ్ఞానకాంతి. అది చల్లని దనటంలో భావం, ఈ సంసారంలో ద్వయ లేక భేదదర్శనం వలన కలిగిన సంతాపముల నన్నిటిని ఉపశమింపజేయునది, అని. మహావనం అన్నది చిదాత్మయైన శివుడే. ఇక నిజాత్మని, నా యాత్మలో అంటే, జీవునిదైన శివమయ స్వభావమని భావం. అదే జీవుని అసలైన స్వభావం. ఈ స్వభావం శివపూజామయమైన మనస్సుకే దర్శనసాధ్యం కనుక తవ (నీ) పూజకః పూజచేయువాడనై ఉంటాను అనటం.

**శ్లో॥ ప్రతివస్తు సమస్త జీవతః – ప్రతిభాసి ప్రతిభామయో యథా ।**
**మమ నాథ! తథా పురః ప్రథాం – వ్రజ నేత్రత్రయశూలశోభితః ॥ 11**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, యథా = ఎట్లు, సమస్త = అన్ని, జీవతః = జీవులకు, ప్రతివస్తు = ప్రతివస్తువులో, ప్రతిభామయః = చిద్రూపముతో నిండి, ప్రతిభతో నిండి, ప్రతిభాసి = ప్రకాశింతువో, తథా = అట్లు, మమ = నాయొక్క, పురః = ఎదుట, నేత్రత్రయ = మూడు కన్నులు, శూల = శూలము, వీనితో, శోభితః = శోభించువాడవై, ప్రథాం వ్రజ = ప్రకటము గమ్ము.

**తాత్పర్యము :** ఓ స్వామీ! అన్ని జీవులలో ప్రతిభామూర్తివై నీవు ప్రకాశించు విధముగనే నా ఎదుట మూడు కన్నులతో త్రిశూలముతో శోభిల్లుచు ప్రత్యక్షము గమ్ము.

పరమాత్ముడు విశ్వమంతట విరాజమానుడైయున్నాడు. ఆతడు ప్రతిభా రూపములో నుండుట వలన సాకారంగా మన కంటికి కనబడక, కన్నులతో చూచిన రూపముతో కనబడును. కాని భక్తుడు ఆ దర్శనముతో తృప్తిజెందడు. అన్ని వస్తువులను తమ తమ ప్రత్యేకమైన రూపములతో చూడటానికి అలవాటుపడిన మానవమేధ, పరమాత్ముడు నామరూపరహితుడని ఎఱిగి యుండియు, వానిని తానెఱిగిన మానవరూపమున చూడవలెనని కోరుకొనును. అటువంటి ఆకాంక్షనే యీ భక్తకవి ప్రదర్శిస్తూన్నాడు. ఇంద్రియానుభవానికి వచ్చినదే సత్యమన్నది ప్రాకృతికమైన బుద్ధి. దానిని సైతము తృప్తిపరచవలెనని, అంతట జ్ఞానము సమగ్రమను మానుషభావన భక్తుని విడిచిపెట్టదు!

**శ్లో॥ అభిమానచరూపహారతో – మమతాభక్తిభరేణ కల్పితాత్ ।**
**పరితోషగతః కదా భవాన్ – మమ సర్వత్ర భవేద్ దృశః పదమ్ ॥ 12**

**ప్రతిపదార్థము :** మమతా = మమకారంతో, భక్తిభరేణ = పూర్ణభక్తితో, కల్పితాత్ = చేయబడిన, అభిమాన = అహంకారరూపమైన, చరు = హవ్యాన్నముయొక్క, ఉపహారతః = బహుమానముతో, పరితోషగతః = ప్రసన్నుడై, భవాన్ = తమరు, కదా = ఎప్పుడు, సర్వత్ర = అంతట, అన్ని అవస్థలలో, మమ = నాయొక్క, దృశః = చూపుయొక్క, పదమ్ = విశ్రాంతి స్థానము, భవేత్ = అగును.

**తాత్పర్యము :** మమకారంతో, పూర్ణభక్తితో నేను బహుమానముగా తమకు సమర్పించిన నా అహంకారమను హవ్యాన్నమును స్వీకరించి, ప్రసన్నుడవై, నీవు నా దృష్టికి విషయమై కంటి ముందు ఎప్పుడుందువు, స్వామీ!

క్రిందటి శ్లోకంలోని మూలభావమే. ఈ భక్తుడు తన లౌకికసంపదగా భావించే జీవాహంకారాన్ని తన సంపూర్ణ ప్రేమభక్తియను అగ్నిలో శివునకు హవ్యంగా సమర్పిస్తాననీ, అప్పుడైనా తనకు శివుడు తన విశ్వాత్మ సాక్షాత్కారాన్ని అనుగ్రహించ వలెనని ఈ ప్రార్థన.

**శ్లో॥ నివసన్ పరమామృతాబ్ధిమధ్యే – భవదర్చావిధిమాత్రమగ్నచిత్తః ।**
**సకలం జనవృత్తమాచరేయం – రసయన్ సర్వత ఏవ కించనాపి ॥ 13**

**ప్రతిపదార్థము :** భవత్ = నీయొక్క, అర్చావిధిమాత్ర = పూజామాత్రంలో, మగ్న =

లగ్నమైన, చిత్తః = మనస్సుగలవాడనై, పరమామృత = చిదానందరూపమైన, అబ్ధిమధ్యే = సముద్రమధ్యంలో, నివసన్ = నివసించుచు, సర్వతః ఏవ = అంతటను కూడ, కించన + అపి = ఏదో అలౌకికమైన, రసయన్ = అనుభవమును పొందుచు, సకలమ్ = సమస్తమును, జనవృత్తమ్ = లౌకికవ్యవహారమును, ఆచరేయమ్ = నడుపుదును.

**తాత్పర్యము :** నీ పూజామాత్రంచేత మనస్సు చిదానందసముద్రమధ్యంలో లగ్నమై, అంతటా యేదో అలౌకికమైన రసానుభవాన్ని పొందుతూ, నేను ఈ లోక వ్యవహారాలన్నిటిని ఆచరిస్తాను.

ఇది మహాభక్తులు సాధించగలిగిన ఒక మహోన్నతస్థితి. ఇది మహాయోగులకు న్నూ లభించేది, (Open trance) అనబడే స్థితి. పరమాత్మానుభవాన్ని పొందుతూన్న సమయంలోనే, అందుకేమీ ఆటంకం లేకుండా, ఏకకాలంలో, లౌకిక విషయాలను సామాన్యులతో మాట్లాడుతూ దైనందిన జీవన కార్యక్రమాలనూ, తనను నమ్మివచ్చిన ఆర్తుల బాధలనూ తీర్చుతూండగలరు. ఇందువలన యే ఒక్కదానిమీదగాని వారి మనస్సు ఏకాగ్రం కాకపోవటం ఉండదు. అంతటి మహోదాత్తస్థితి తనకు కలుగవలెనని ఈ భక్తుని కోరిక.

**శ్లో॥ భవదీయమిహాస్తు వస్తు తత్త్వం – వివరీతుం క ఇవాత్ర పాత్రమర్థే ।**
**ఇదమేవ హి నామరూపచేష్టా – ద్యసమం తే హరతే హరోఽసి యస్మాత్ ॥ 14**

**ప్రతిపదార్థము :** ఇహ = ఇక్కడ, లోకంలో, వస్తు = వస్తువు, భవదీయమ్ = తమది, అస్తు = అగుగాక!, అత్ర అర్థే = ఈ విషయంలో, తత్త్వమ్ = వాస్తవిక స్థితి, వివరీతుమ్ = నిశ్చయించుటకు, కః ఇవ = ఎవరని, పాత్రమ్ = యోగ్యుడు?, హి = ఎందుకనగా, ఇదం ఏవ = ఇదియే, తే = నీయొక్క, అసమమ్ = అసాధారణమైన, నామ = పేరు, రూప = ఆకారాము, చేష్టా = కార్యము, ఆది = మొదలుగా, హరతే = హరించును, యస్మాత్ = ఎందువలన, హరః = హరించువాడు, అసి = నీవగుచున్నావు.

**తాత్పర్యము :** ఈ లోకంలో వస్తువు తమది. కానిండు. ఈ విషయంలో వాస్తవాన్ని నిర్ణయించటానికి యోగ్యుడెవరు? భక్తుడు కాడు కదా! ఎందుకంటే, దాన్ని విచారించే ప్రయత్నం కూడ తమదే కదా, ఆ అసాధారణ ప్రజ్ఞ తమదే మరి. మీ పేరు, రూపము, కార్యము హరించేవే అని చెప్పేదేకదా 'హరుడు' అను మీ పేరు!

విశ్వంలో ప్రతిదీ ఈశ్వరునిదే. అవును – కాదు అని భక్తుడు నిర్ణయించలేడు. ఆ ప్రయత్నంలో కావలసిన జ్ఞానమూ ఆ స్వామిదే, ఆయన చిద్రూపి కనుక. అట్లే

భక్తుడు గాని వేరొకడుగాని నిర్ణయించటానికి అసలు స్వతంత్రుడే కాదు. కారణం ఆ స్వామి 'మహేశ్వరుడు' కదా. ఇక ఆ స్వామి కార్యమా సర్వసంహరణం. అందుకే కదా ఆయనకు హరుడని పేరు. కనుక సర్వజ్ఞుడూ తానే, స్వతంత్రుడూ తానే. ఇక ఈ అస్వతంత్ర మానవుడు యే నిర్ణయమైనా ఎట్లా చేయగలడు?

**శ్లో॥ శాన్తయే న సుఖలిప్సుతా మనా - గ్భక్తిసంభృతమదేషు తైః ప్రభోః ।**
**మోక్షమార్గణఫలాపి నార్థనా - స్మర్యతే హృదయహారిణః పురః ॥ 15**

**ప్రతిపదార్థము :** భక్తిసంభృత = భక్తితో నిండిన,మదేషు = మత్తులైనవారిలో, శాన్తయే = శాంతి కొరకు, మనాక్ = ఒక కొంచెము, సుఖ = సుఖమునందు, లిప్సుతా = కోరిక, న = లేదు; తైః = వారిచే, హృదయహారిణః = మనస్సును హరించునట్టి, ప్రభోః = స్వామియొక్క, పురః = ఎదుట, మోక్షమార్గణ = మోక్షము నన్వేషించు, ఫలా = ఫలముగల, అర్థనా అపి = ప్రార్థన కూడా, న స్మర్యతే = స్మరింపబడదు.

**తాత్పర్యము :** భక్తితో మత్తులైనవారికి కొంచెమైన కోరిక యేదీ సుఖం కోసం ఉండదు. వారు పూర్ణశాంతులై ఉంటారు. మనస్సును హరించే ఆ స్వామి సన్నిధిలో మోక్ష ఫలాపేక్ష కూడా కోరుకో వలెనని తోచదు.

భక్తి లౌకికప్రయోజనం కోసం అత్యధికంగా లోకంలో ప్రవర్తిల్లుతుంది. మహాభక్తుల చరిత్రలను చూచినా ఇది స్పష్టమే. సర్వమూ త్యజించి తీవ్రంగా తపస్సు చేసిన వారందరూ భోగభాగ్యాలు, యుద్ధంలో జయం మరణం లేని జీవనం, ఇత్యాదులే కోరినారు. వారి లక్ష్యమది. శివుని దర్శనం లభించిన తరువాత కూడ వారికి ఈ లౌకికభ్రాంతి వదల లేదు. కాని కొందరు భక్తి నుండి భక్తి పారవశ్యానందాన్ని మాత్రమే కోరుకుంటారు. వారికి మనస్సులు నిర్వికారములై ఉండటం వలన శాంతి తనంత తానే నెలకొని ఉంటుంది. ఆ ఆనందానుభవం సంపూర్ణంగా ఉండటం వలన మోక్షఫలాన్ని కోరుకోవాలన్న ఆలోచనేరాదు. ఆ స్వామి దర్శనంతో పరవశించి మత్తిల్లి ఉంటారు.

**శ్లో॥ జాగరేతరదశాథవా పరా - యాపి కాచన మనాగవస్థితేః ।**
**భక్తిభాజనజనస్య సాఖిలా - త్వత్సనాథమనసో మహోత్సవః ॥ 16**

**ప్రతిపదార్థము :** అవస్థితేః = జగత్తుయొక్క వ్యవస్థా సంబంధమైనది, యా కాచన = యే = ఒకానొక, జాగర = జాగృతి, ఇతర = వేరొక, దశ = దశ, అథవా = లేక, పరా = సుషుప్తి, మనాక్ అపి = కొంచెమైనను, సా = అది, అఖిలా = సమస్తము, త్వద్ =

నీతో, సనాథ = ఏకాత్మత పొందిన, మనసః = మనస్సుగల, భక్తిభాజనజనస్య = భక్తిగలవారియొక్క, మహోత్సవః = గొప్ప ఉత్సవము.

**తాత్పర్యము :** జాగృతి, స్వప్న, సుషుప్తి అవస్థలు లేక దశలు ఈ జగత్తు అనబడు వ్యవస్థలో భాగాలు. అవి సుదీర్ఘ కాలం ఉండేవి కావు. కాని అది అంతా నీయందు భక్తి గలవారికి, మనస్సులు నీతో ఏకాత్మత పొందినవి కనుక, మహోత్సవమే.

సాధారణ మానవులకు నిద్ర, మొలకువ అన్నవి లోక వ్యవహారంలో సహజభాగాలు. మెలకువ అన్నది క్రియాత్మక జీవనం, నిద్ర అన్నది విశ్రాంతి. అంటే, శ్రమ – విశ్రాంతి. ఇంత మాత్రమే. కాని శివభక్తులకు జీవనమంతా శివసాన్నిధ్యమే. వారి మనస్సులలో మరొకటి ఉండదు. మెలకువతో ఉన్నప్పుడు శారీరకమైన శివపూజా విధి తోడవుతుంది. స్వప్నావస్థలో కలలు శివునితోనే పెనసి ఉంటాయి. ఇక సుషుప్తిలో వారు సాక్షాత్ శివుని మానసదర్శనానందంలో ఉంటారు. ఈ దశలు దేనికది క్షణికమే. కాని భక్తులకు ఈ దశలన్నిటా శివదర్శనం ఉండే ఉన్నది. కనుక వారి కాలం క్షణాలలో కొలిచేది కాదు. అది యొక మహోత్సవం.

**శ్లో॥ ఆమనోఽక్షవలయస్య వృత్తయః – సర్వతః శిథిలవృత్తయోఽపి తాః ।**
**త్వామవాప్య దృఢదీర్ఘసంవిదో – నాథ! భక్తిధనసోష్మణాం కథమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, ఆమనః = మనఃపర్యంతమైన, అక్షవలయస్య = ఇంద్రియములన్నిటియొక్క, వృత్తయః = కార్యములు, సర్వతః = పూర్తిగా, శిథిలవృత్తయః = సమగ్రములు కావు, చంచలములు, తాః = అవి, అపి = కూడ, త్వామ్ = నిన్ను, అవాప్య = పొంది, భక్తిధన = భక్తియను ధనముతో, సోష్మణామ్ = ప్రజ్వలితములుగ, కథమ్ = ఎట్లు, దృఢ = నిశ్చలమైన, దీర్ఘ = స్థాయిగల, సంవిదః = జ్ఞానరూపములు.

**తాత్పర్యము :** ఓ స్వామీ! ఇంద్రియాలు, మనస్సు, వీటన్నిటి కార్యాలు పూర్తిగా చంచలములు, అసమగ్రములు. అవి కూడ నిన్ను పొందగనే భక్తిధనంతో ఉద్దీప్తములై నిశ్చలములు, జ్ఞానరూపములు అవుతూన్నవి. ఇదెట్లా సంభవం!?

శరీరములో కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలూ మొత్తం పది. ఇదీ ఇంద్రియ వలయం. ఈ ఇంద్రియాలు మనస్సుతో చేరి తమ తమ కార్యాలు నిర్వహిస్తాయి. అయితే మనస్సు సహజంగా చంచలం, యే పనినీ సమగ్రంగా చెయ్యదు. కాని వాని ఈ నైజం లౌకికవ్యవహారాలకే పరిమితం. అవి భక్తిభరితములైనప్పుడు ప్రత్యేకం ఉద్దీపనం చెందుతాయి. వాని స్వభావం పరివర్తనం చెందుతుంది. ఒక అలౌకికమైన

నిశ్చలత్వం వాని నావహిస్తుంది. అవి దేనికదే ఒక జ్ఞానరూపంగా భాసిస్తుంది. ఇది మహాద్భుతం! **కర్మ** బ్రహ్మోద్భవం విద్ధి అంటుంది భగవద్గీత (అ.3, శ్లో.15) అంటే కర్మ పరబ్రహ్మమునుండియే ప్రవర్తించినది, అని అర్థం. ఆ పరబ్రహ్మము దిశగా భక్తివలన మరల్చబడినప్పుడు తన స్వస్వరూపాన్ని గ్రహిస్తుంది కర్మ. అందుకే భగవద్గీత (అ.3, శ్లో.7) ఇట్లా అంటుంది :

> యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున ।
> కర్మేంద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే ॥

అంటే, మనస్సుతో ఇంద్రియాలను అదుపుజేసి, లౌకికవిషయాసక్తి లేకుండ, కర్మేంద్రియాలతో ఎవడు కర్మను చేస్తాడో అతడు శ్రేష్ఠుడు. భక్తుడు ఈ విధమైన కర్మలోనే ప్రవర్తిస్తూన్నాడు కనుక వాని కర్మకూడ జ్ఞానమే అవుతుంది.

**శ్లో॥ న చ విభిన్నమసృజ్యత కించిద - స్త్వథ సుఖేతరదత్ర న నిర్మితమ్ ।**
**అథ చ దుఃఖి చ భేది చ సర్వథా - ప్యసమవిస్మయధామ నమోఽస్తు తే ॥ 18**

**ప్రతిపదార్థము :** విభిన్నమ్ విశేషముగ వేరైనది, కించిత్ = కొంచెమైన, న = లేదు, చ = మరియు, అసృజ్యత = సృజింపబడిన, **వస్తుతః** = వస్తువులనుబట్టి, **త్వత్తః** = నీకంటె, భిన్నమ్ = వేరైనది, కించిత్ అపి = కొంచెమైనను, న అస్తి = లేదు, అథ = అందువలన, అత్ర = విశ్వంలో, సుఖ = సుఖమునకు, ఇతరత్ = వేరైనది, న నిర్మితమ్ = చేయబడలేదు, అథ చ = ఐనప్పటికిని, దుఃఖి చ = దుఃఖమయమున్ను, భేది చ = భేదమయమున్ను, అసమ = అసాధారణ, విస్మయ = ఆశ్చర్యమునకు, ధామ = నెలవు, తే = నీకు, నమః అస్తు = నమస్కారమగుగాక!

**తాత్పర్యము :** విశేషంగా వేరైనదేదీ లేదు : సృష్టి చేయబడిన వస్తువులేవీ నీకంటె వేరు కావు; సుఖానికి వేరైనది సృష్టిలో లేదు. ఐనప్పటికి ఈ జగత్తు దుఃఖమయం, భేదమయంగా ఉన్నది. ఇది అసాధారణం, ఆశ్చర్యకరం. దీని నిట్లా నిర్వహిస్తూన్నందుకు నీకు నమస్కారం.

భేదబుద్ధిని తొలగించి చూస్తే నిజానికి భేదం లేదు. ఈ శివాద్వయస్వరూపం తెలిస్తే, ఇక దుఃఖమూలేదు. కాని ద్వయానుభవం తీరదు, దుఃఖం మాయదు. ఉన్నదాన్ని గుర్తించలేక లేదన్న దుఃఖం. అంతే. ఎంత ఆశ్చర్యం!

**శ్లో॥ ఖరనిషేధఖదామృతపూరణో - చ్ఛలితధౌతవికల్పమలస్య మే ।**
**దలితదుర్జయసంశయవైరిణ - స్త్వదవలోకనమస్తు నిరన్తరమ్ ॥ 19**

**ప్రతిపదార్థము :** ఖరనిషేధఖదామృతపూరణ = నీ స్వరూపమును దాచియుంచే భయానకమైన గ్రసనమును పరమానందరూపమైన అమృతముతో నిండుగా నింపుటచే, ఉచ్ఛలితధౌత = నష్టముచేయబడిన, వికల్పమలస్య = వికల్పరూపమైన మలము గలవానియొక్క, దలిత = నష్టముచేయబడిన, దుర్జయ = అజేయమైన, సంశయ వైరిణః = సంశయమునకు శత్రువు, మే = నాకు, త్వద్ = తమయొక్క, అవలోకనమ్ = దర్శనము, నిరన్తరమ్ = ఎల్లప్పుడు, అస్తు = అగుగాక.

**తాత్పర్యము :** నీ స్వస్వరూపాన్ని ఈ లౌకికలక్షణమైన నశించటం అన్నది దాచి ఉంచుతుంది. కాని నేను సంశయమనే శత్రువును అణచివేసి, మీ భక్తివలన పొందిన ఆనందంతో పొంగిపోతూ, నాలో సహజంగా ఉన్న వికల్పం అనబడే మలినాల్ని కడిగివేసికొన్నవాడను. కనుక నాకు నీ దర్శనమును అంతరాయం లేకుండా అనుగ్రహించు స్వామీ!

**సంశయాత్మా వినశ్యతి** అంటుంది భగవద్గీత. సంశయం జయింపరానిది. దాన్ని అణచివేసినప్పుడు బలవత్తరమయ్యేది విశ్వాసం. అంతటి విశ్వాసంతో భక్తిమార్గాన్ని అనుసరిస్తే, ఆ భక్తి అమృతమవుతుంది. ఈ సంసారం అన్నదొక మాయగా శివస్వరూపాన్ని కప్పివేసి, ఇదంతా కేవలం క్షణికమని కంటికి చూపుతుంది. కాని ఆ నశ్వరం కూడా ఆనందదాయకం కనుక ఇంద్రియాలు దానినే విషయంగా గ్రహిస్తాయి. ఐతే, భక్తిమాత్రం ఆ ఆనందమే అసలు శివరూపమని గుర్తిస్తుంది. కనుక అది అమృతమవుతుంది, మృత్యుంజయమవుతుంది. ఆ స్థితికి చేరిన భక్తుడు శివదర్శనానికి యోగ్యుడు, సమర్థుడు. ఆ దర్శనం కేవలం సమాధిలో మాత్రమే కాక సర్వదా, వ్యుత్థానంలోనూ అనుగ్రహించుమని ఈ భక్తుని ప్రార్థన.

**శ్లో॥ స్ఫుటమావిశ మామథావిశేయం – సతతం నాథ! భవన్తమస్మి యస్మాత్ ।**
**రభసేన వపుస్తవైవ సాక్షాత్ – పరమాసత్తిగతః సమర్చయేయమ్ ॥ 20**

**ప్రతిపదార్థము :** నాథ! = ఓ స్వామీ!, స్ఫుటమ్ = స్పష్టంగా, వ్యక్తరూపంలో, మామ్ = నన్ను, ఆవిశ = ఆవేశించుము, అథ = అటుపై, భవన్తమ్ = తమరిని, సతతమ్ = ఎల్లప్పుడు, ఆవిశేయమ్ = ఆవేశించుచుందును, యస్మాత్ = యే కారణమున, పరమ్ = మిక్కిలి, ఆసత్తి = చేరువను, గతః = పొందినవాడనై, రభసేన = ఉత్సాహముతో, త్వరగా, తవ ఏవ = మీదేయైన, సాక్షాత్ = ప్రత్యక్షముగా, వపుః = స్వరూపమును, సమర్చయేయమ్ = చక్కగా అర్చింతును.

**తాత్పర్యము :** ఓ స్వామీ! మీరు నాకు వ్యక్తరూపంలో సాక్షాత్కరించండి. ఆ సాక్షాత్కారంతో మీరు నాలో ప్రవేశించినవారవుతారు. ఆ తరువాత నేను ఎల్లవేళల తమరిని సాక్షాత్కరింపజేసికొందును. అనగా, నేను తమలో ఎల్లప్పుడు ప్రవేశించగలుగుదును. ఈ రీతిగా నేను మీకు బాగుగా చేరువయై త్వరలోనే మీదైన తాత్త్వికసత్యస్వరూపమును అర్చింపగలుగుదును.

భక్తుడు తన స్వామిని ఎంత గాఢంగా విశ్వసిస్తూన్నానని భావించినప్పటికి, ప్రాకృతికమైన ఒక సంశయం యే మూలనో తచ్చాడుతూంటుంది. ఆ సంశయలేశం నశించవలెనంటే తన స్వామి ప్రకటరూపంతో తన కనులముందు కనబడవలె, ఆ స్వామి పలుకరింపును తాను చెవులార విని పులకరించవలె. ఇంద్రియానుభవ సాక్ష్యంతో తన విశ్వాసం నిస్సంశయం కావలె. (క్రిందటి శ్లోకంలో 'దుర్జయసంశయ' అన్నదానిని స్మరించవలె). అప్పుడు, తన స్వామి తనలోనికి నిరాటంకంగా ప్రవేశిస్తాడు. అంటే, తనలోని తన స్వామిని తాను దర్శించగలుగుతాడు. అంతట తానుగూడ తన స్వామియొక్క తాత్త్వికస్వరూపజ్ఞానాన్ని పొందగలుగుతాడు. ఆ జ్ఞానస్వరూపాన్ని పూజింపగలుగుతాడు. సగుణ సాకార శివదర్శనం నుండి శివతత్త్వదర్శనంతో ద్వయబుద్ధి అద్వయంగా పరిణమిస్తుంది. ఇప్పుడంతా శివోఽహమ్.

**శ్లో॥ త్వయి న స్తుతిశక్తిరస్తి కస్యా - ప్యథవాస్త్యేవ యతోఽతిసుందరోఽసి ।**
**సతతం పునరర్థితం మమైత - ద్యదవిశ్రాన్తి విలోకయేయమీశమ్ ॥ 21**

**ప్రతిపదార్థము :** కస్య అపి = ఎవరికైనను, త్వయి = నీయందు, స్తుతిశక్తిః = స్తుతి చేయు సామర్థ్యము, న అస్తి = లేదు, అథవా = లేక, ఒకవేళ, అస్తి ఏవ = ఉన్నప్పటికిని, యతః = యే కారణమున, అతిసుందరః = అత్యంతసుందరుడవు, అసి = అయియున్నావు, మమ = నాయొక్క, పునః అర్థితమ్ = కోరికయైతే, సతతమ్ = ఎల్లప్పుడు, ఏతత్ = ఇది, యత్ = యేది, అవిశ్రాన్త = విరామం లేకుండా, ఈశమ్ = ఈశ్వరుని, విలోకయేయమ్ = చూచుచుందును.

**తాత్పర్యము** : నిన్ను స్తోత్రము చేయగల శక్తి ఎవ్వరికీ లేదు. ఒకవేళ ఉన్నట్లయితే, అందుకు కారణము నీ అమితమైన సౌందర్యమే. నా కోరిక యేమంటే, విరామం లేకుండా, రాత్రీ పగలూ కూడా, ఈశ్వరుడవైన నిన్ను దర్శిస్తూనే ఉండాలి, అన్నది.

ఈశ్వరుని సౌందర్యం వర్ణనాతీతం. చూచినవారు వర్ణించకుండ ఉండనూలేరు, తృప్తిగా, సమగ్రంగా వర్ణించనూలేరు. ఆ సౌందర్యం యత్ర వాచో నివర్తన్తే, వాక్కులకు

అందనిది. వాక్కు మాత్రం ఇంద్రియజ్ఞానానికి అందినంత అందినట్లు వర్ణిస్తుంది. ఐనా అసంపూర్ణమే. అందుకే ఈ అలౌకిక ఆత్మీయ సౌందర్యాన్ని చూస్తూ పరవశించటం నా కోరిక, అంటూన్నాడు ఈ భక్తకవి.



శ్రీః

# 19. ఉద్యోతనాభిధానస్తోత్రమ్

**శ్లో॥ ప్రార్థనాభూమికాతీతవిచిత్రఫలదాయకః ।**
**జయత్యపూర్వవృత్తాన్తః శివః సత్కల్పపాదపః ॥ 1**

**ప్రతిపదార్థము :** ప్రార్థనాభూమికా = ప్రార్థనయొక్క అవస్థకు, అతీత = మించిన, విచిత్రఫలదాయకః = అమూల్యఫలమునిచ్చువాడైన, అపూర్వవృత్తాన్తః = అలౌకికమైన నడవడి గలవాడు, శివః = శివుడు, సత్ = ఉత్తమ, కల్పపాదపః = కల్పవృక్షము, జయతి = జయమగుగాక!

**తాత్పర్యము :** ప్రార్థితఫలముకంటె అధిక ఫలమునిచ్చు ఉత్తమ కల్పవృక్షము, అలౌకిక చరిత్రగల శివుడు. వానికి జయము!

లోకంలో ఎవరైన అడిగినదివ్వటం ఔదార్యం. దేవతావృక్షం ఇంద్రుని కల్పవృక్షం కూడా అడిగినదే అనుగ్రహిస్తుంది. కాని శివుడు అలౌకికమైన ప్రవర్తన గలవాడు, దేవతలలో గూడ ప్రత్యేకంగా భాసించేవాడు, అమూల్యవరముల నిచ్చేవాడు. కనుక భక్తుడు ప్రార్థించటమే తనకు మహాభాగ్యమన్నట్లు మురిసిపోయి అడిగిన వరంతోబాటు అడగని వరాలుకూడా ఇచ్చేస్తాడు. కనుక కల్పవృక్షం కంటె ఉదారుడు. కనుక వానికి జేజేలు.

**శ్లో॥ సర్వవస్తునిచయైకనిధానాత్ - స్వాత్మనస్త్వదఖిలం కిల లభ్యమ్ ।**
**అస్య మే పునరసౌ నిజ ఆత్మా - న త్వమేవ ఘటసే పరమాస్తామ్ ॥ 2**

**ప్రతిపదార్థము :** సర్వవస్తునిచయ = అన్ని వస్తువులకు, ఏక = ఒక, నిధానాత్ = ఆశ్రయమైన, స్వాత్మనః = తన ఆత్మయైన, త్వత్ = మీదైన, అఖిలమ్ = అంతయు, లభ్యం కిల = లభించునదే కదా!, పునః = కాని, అస్య మే = ఈ నాకు, త్వం ఏవ నిజః ఆత్మా = నీవే నాదైన ఆత్మ, న ఘటసే = కనిపించవు, పరమ్ = మిగతవి, ఆస్తామ్ = అటుండుగాక!

**తాత్పర్యము :** అన్ని వస్తువులకు నీవే ఆశ్రయము, వేరొకటి లేదు. అనగా, మీరే ఆత్మయైన వారికి అన్నీ లభించునవియే కదా. మరి, నీవే ఆత్మవైన నాకు కన్పించుటలేదు. ఇక, మిగతవాని సంగతి చెప్పునదేమి?

శివారాధనవలన శివదర్శనమూ సిద్ధులూ లభిస్తాయంటారు. శివుడే అన్ని వస్తువులకు, జడచేతనములకు ఆశ్రయమనీ చెబుతారు. ఇది నిజమైతే శివుడే ఆత్మయైన భక్తునకు అన్నీ లభించవలెనుకదా. మరి నా ఆత్మయైన శివుడే నాకు ప్రత్యక్షముగ కన్పించడేమి?! నా ఆత్మయే నాకు కనరానిదైతే, ఇంక సిద్ధులు లభిస్తాయని నేనెట్లా నమ్మేది? సమాధిస్థితిలో నీ దర్శనం కలుగుతూన్నది. అందుకే నీవు నా ఆత్మ అని తెలిసింది. ఆ నీవే సమస్త వస్తువులకూ ఆత్మవుకదా, మరి వ్యుత్థానంలో సమస్తంలో నీ దర్శనం నాకెందుకు కలగటం లేదు? ఇది అసాధ్యమయితే, సిద్ధులెట్లా సాధ్యమవుతాయి? సిద్ధుల సంగతి అలా ఉండనివ్వు. నాకు వ్యుత్థానంలో గూడ దర్శనమివ్వు. ఇది ఈ భక్తుని తర్కం.

**శ్లో॥ జ్ఞానకర్మమయచిద్వపురాత్మా - సర్వథైష పరమేశ్వర ఏవ ।**
**స్యాద్వపుస్తు నిఖిలేషు పదార్థే - ష్వేషు నామ న భవేత్కిముతాన్యత్ ॥ 3**

**ప్రతిపదార్థము :** నిఖిలేషు పదార్థేషు = అన్ని పదార్థములలో, ఏషః = ఈ, జ్ఞానకర్మమయ = జ్ఞానకర్మలతో నిండిన, చిద్వపుః = చిత్‌స్వరూపముగల, పరమేశ్వరః ఏవ = పరమేశ్వరుడే, ఆత్మా = ఆత్మ, సర్వథా = అన్నివిధముల, వపుః = శరీరము, స్వరూపము, స్యాత్ = అగును, తు = అయినచో, ఏషు = వీనిలో, నామ = పేరు, న భవేత్ = కలుగదు, అన్యత్ = మిగత విషయములు, ఉత కిమ్ = ఇక నేమి?

**తాత్పర్యము :** అన్ని వస్తువులలో ఈ జ్ఞానకర్మలను రెండున్నూ పరమేశ్వరుని చిద్రూపమే, పరమేశ్వరుడే ఆత్మ, స్వరూపము రెండున్నూ అగును. ఈ విధముగ కాకున్న అసలు వీని పేరే ఉండదు. కనుక వీనిని గురించి ఇతర విషయము లేముండును?

సృష్టిలో ఉన్నవి రెండే : శరీరము, ఆత్మ, లేక కర్మ, జ్ఞానము. కర్మ శరీర సంబంధి. శరీరం అంటే మనస్సుతో కలిపి, కర్మ జ్ఞానేంద్రియాలు. వీనికి కేంద్రమైనది ఆత్మ. జ్ఞానం ఆత్మసంబంధి. ఐతే, ఇంద్రియజ్ఞానం ఉన్నది కదా, అంటే, అది పరిమితజ్ఞానం, ఆత్మజ్ఞానంతో కలిసినప్పుడే అది సత్యజ్ఞానమూ సమగ్రమూ అవుతుంది. కనుక జ్ఞానం అనదగినది ఇంద్రియసంబంధి కాదు, ఆత్మసంబంధి. ఈ రెండున్నూ సృష్టిలో ఉన్నవి. ఇవే ఈశ్వరుని శరీరసంబంధి పదార్థము (matter), జ్ఞానము (knowl-

edge) ఆత్మసంబంధి. పదార్థసంబంధియే క్రియాశక్తి. కనుక ప్రతి వస్తువునకు ఒక గుర్తింపు పేరు. పరమేశ్వరుడు కానిదేదీ లేనిదే. ఉనికే లేనిదానిని గురించి తెలియదగినదేముంటుంది?!

**శ్లో॥ విషమార్తిముషానేన ఫలేన త్వద్దృగాత్మనా ।**
**అఖిలీయ పథా నాథ! మమాస్తు త్వన్మయీ గతిః ॥ 4**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, విషమ = భయంకరమైన, ఆర్తి = దుఃఖమును, ముషా = దూరముచేయునట్టి, త్వద్ = నీయొక్క, దృక్ + ఆత్మనా = దర్శనరూపమైన, అనేన = ఈ, పథా = మార్గముతో, అఖిలీయ = లీనమై, ఫలేన = ఫలముచేత, మమ = నాకు, త్వద్ + మయీ = నీతో నిండిన, గతిః = అవస్థ, స్థితి, అస్తు = కలుగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నీ దర్శనము భయంకరమైన దుఃఖాన్ని దూరం చేస్తుంది. నేను ఆ దర్శనమార్గంలో లీనమై, దాని ఫలితంగా నాకు నీతో తాదాత్మ్యం కలుగుగాక!, అని ప్రార్థిస్తున్నాను.

**దుఃఖానికి కారణం భయం**. దానికి కారణం ద్వయదర్శనం. నివారణ అద్వయదర్శనం, శివదర్శనం. ఆ దర్శనం సాధనలతో సమాధిస్థితిని పొందినవారికి ఆ స్థితిలో లభిస్తుంది. సమాధి నుండి వ్యుత్థానంలో మరల ద్వయదర్శనం మాయచేస్తుంది. అది లేని తాదాత్మ్యం ప్రార్థితఫలం.

**శ్లో॥ భవదమలచరణచిన్తారత్నలతా - లంకృతా కదా సిద్ధిః ।**
**సిద్ధజనమానసానాం విస్మయజననీ - ఘటేత మమ భవతః ॥ 5**

**ప్రతిపదార్థము :** భవత్ = నీయొక్క, అమల = మలినములేని, చరణ = పాదములగూర్చిన, చిన్తా = స్మరణధ్యానములనబడు, రత్నలతా = రత్నముల తీగ, అలంకృతా = అలంకరిపంబడినదై, సిద్ధజన = సిద్ధి పొందినవారియొక్క, మానసానామ్ = మనస్సులకు, విస్మయజననీ = ఆశ్చర్యమును కలిగించు, సిద్ధిః = సిద్ధి, మమ = నాకు, కదా = ఎప్పుడు, భవతః = తమనుండి, ఘటేత = లభించునో.

**తాత్పర్యము :** నిర్మలమైన తమ పాదముల స్మరణధ్యానములనబడు రత్నముల తీగతో అలంకరింపబడినదై సిద్ధజనుల మనస్సులకు ఆశ్చర్యమును కలిగించు సిద్ధి తమరు నాకెప్పుడు ప్రసాదింతురో!

కోరినది సిద్ధించుటకు మూలకారణము దానినివ్వగలవారిని స్మరించుట, ధ్యానించుట అనునవి. ఆ రెండిటిని నిర్వర్తించిన నాకు సిద్ధులే ఆశ్చర్యపడునట్లు మహాసిద్ధి

కలుగుటెప్పుడని ఈ భక్తుని ఆరాటము. మహాసిద్ధి అనగా మోక్షము. ఎందుకనగా, అది లభించిన వెనుక మరేదియో కావలెనన్న కోరిక కలుగదు.

**శ్లో॥ కర్హి నాథ! విమలం ముఖబింబం – తావకం సమవలోకయితాస్మి ।**
**యత్ స్రవత్యమృతపూరమపూర్వం – యో నిమజ్జయతి విశ్వమశేషమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, తావకమ్ = తమదైన, విమలమ్ = శాంతమైన, ప్రసన్నమైన, ముఖబింబమ్ = ముఖకాంతిని, కర్హి = ఎప్పుడు, సమవలోకయితా అస్మి = సాక్షాత్ చూచినవాడనగుదును, యత్ = యేది, అపూర్వమ్ = అలౌకికమైన, అమృతపూరమ్ = అమృతధారను, స్రవతి = ప్రవహించుచున్నదో, యః = యే ధార, అశేషమ్ = మిగులులేని, విశ్వమ్ = జగత్తును, నిమజ్జయతి = ముంచివేయుచున్నదో.

**తాత్పర్యము :** స్వామీ! మీ ముఖకాంతి అమృతధారను ప్రవహించునది. ఆ ధారయే జగత్తును ముంచివేయునది. అట్టి మీ ముఖదర్శనము నాకెప్పుడు కలుగును?

శివదర్శనము వలన జగత్తత్త్వము బోధపడును. అందుచేత జగత్తుయొక్క బాహ్యద్వయరూపము అదృశ్యమై భక్తునకు శివాద్వయరూపము తెలియవచ్చును. అప్పుడు కలుగు ఆ ఆనందము అపూర్వము, అనగా పూర్వము తానెఱిగిన ఇంద్రియ విషయానందమును ముంచివేయును. దానిని కోరి ఈ భక్తుని తపన.

**శ్లో॥ ధ్యాతమాత్రముదితం తవ రూపం – కర్హి నాథ పరమామృతపూరైః ।**
**పూరయేత్త్వదవిభేదవిమోక్షా – ఖ్యాతిదూరవివరాణి సదా మే ॥ 7**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, మే = నాయొక్క, ధ్యాతమాత్రమ్ = ధ్యానము చేసినంత మాత్రమున, ఉదితమ్ = ఉదయించిన, తవ = నీయొక్క, రూపమ్ = స్వరూపము, పరమ = మిక్కిలి, అమృతపూరైః = అమృతధారలచే, త్వద్ = నీయొక్క, అవిభేద = భేదములేని, విమోక్ష = మోక్షమను, అఖ్యాతి = అపకీర్తి, దూరవివరాణి = దాటరాని అఖాతములను, కర్హి = ఎప్పుడు, సదా = ఎల్లప్పుడు, పూరయేత్ = నిండింతువు?

**తాత్పర్యము :** స్వామీ! ధ్యానంచేసినంతమాత్రాన నాకు నీ రూపదర్శనం కలుగుతూన్నది. ఆ దర్శనం అమృతధారల నాస్వాదించిన నాకు నీకంటే వేరు కాని మోక్షం కావాలన్న కోరిక కలిగింది. కాని ఆ మోక్షం దూరాన ఉన్నది. మధ్యలో అఖాతములున్నవి. వీనిని నింపి నన్నెప్పుడు దాటింతువు?

**విమోక్షము** అంటే శివాభేదస్థితియే, అంత వరకు బంధించిన భేదదృష్టిబంధం

తెగిపోవటమే. దూరవివరాలన్నవి కోరికలతో నిండినవి. ఆ కోరికలు నశించితే తప్ప మోక్షం లేదు. ఆ స్థితి నా కెప్పుడు కలుగుతుందో కదా, అని ఈ భక్త కవి చింతిస్తూన్నాడు.

**శ్లో॥ త్వదీయానుత్తరరసాసంగసంత్యక్తచాపలమ్ ।**
**నాద్యాపి మే మనో నాథ! కర్హి స్యాదస్తు శీఘ్రతః ॥ 8**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, మే = నాయొక్క, మనః = మనస్సు, అద్య అపి = నేడు కూడా, త్వదీయ = నీదగు, అనుత్తర = అలౌకికి, రస = రసముయొక్క, ఆసంగ = సంపర్కముతోగూడ, సంత్యక్త = విడువబడిన, చాపలమ్ = చంచలత్వము కలిగినది, న = కాదు, కర్హి = ఎప్పుడు, స్యాత్ = అగును?, శీఘ్రతః = త్వరగా, వేంటనే, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నా మనస్సు నేటికీ, నీ అలౌకికానందస్పర్శ కలిగినదైనప్పటికి, తన చంచలత్వాన్ని విడిచిపెట్టి నిశ్చలమగుటలేదు. అదెప్పుడు సంభవించునో! అచిరకాలములోనే అగుగాక!

మనస్సు ఎంత చంచలమో ఈ శ్లోకం చెబుతూన్నది. సాధారణ సంసారికి చాంచల్యము సహజమే కావచ్చును. కాని ఇంద్రియవిషయానందాన్ని తెలిసి, మరెంతగానో సమాధిస్థితిలో శివదర్శనానందాన్ని అనుభవించి, రెండిటి భిన్నస్వభావములెఱిగిన ఒక భక్తుడు తనమనస్సు చంచలంగా ఉన్నదని వాపోతే, ఇక సామాన్యుడి గతి యేమిటి? ఉత్తమోత్తమానందము నాస్వాదించిన వెనుకగూడ మనస్సు ఇంద్రియానుభవాన్ని కోరుతూన్నదంటే, ఇక ఇంతకంటె ఇంద్రజాలమేముంటుంది? ఆ మాయ ఊబి వంటిది: బైటపడవలెనని పెనగులాడిన కొలది భక్తుడైనా సరే, అందులో మరింత దిగబడి పోతాడు. అట్లని నిష్క్రియుడు కాలేడు. కనుక ఆశగా ఆ స్వామివంక చూస్తూ ఆర్తిగా వాని అనుగ్రహం ఎప్పుడెప్పుడు కలుగుతుందా అని ఎదురు చూస్తూన్నాడీ భక్తుడు.

**శ్లో॥ మా శుష్కకటుకాన్యేవ పరం సర్వాణి సర్వదా ।**
**తవోపహృత్య లబ్ధాని ద్వంద్వాన్యప్యాపతన్తు మే ॥ 9**

**ప్రతిపదార్థము :** సర్వాణి ద్వంద్వాని = ద్వందములన్నియు, త్వద్ = నీయొక్క, అద్వయ = ద్వంద్వములేని, శుష్క = రసములేని, ఎండిపోయిన, కటుకాని = కటువైన, ఏవ = మాత్రమే, మే = నాకు, మా ఆపతన్తు = వచ్చిపడకుండుగాక!, పరమ్ = కాని, తవ = నీయొక్క, ఉపహృత్య = పొందగలిగి, లబ్ధాని = లభించినవి, అపి = మాత్రము, సర్వదా = ఎల్లప్పుడు.

**తాత్పర్యము :** ద్వంద్వాలన్నీ నీ అద్వైతస్పర్శలేనందువలన ఎండి కటకటలాడునవైపోవును. అటువంటివి నా పాలబడకుండుగాక! నాకు నీ స్పర్శతో అమృతాయమానమైనవే ఎల్లప్పుడు లభించుగాక!

లోకమంతా ద్వంద్వాలతో నిండిపోయింది : రాత్రి – పగలు, ఎండ – వాన, వేడిమి – చల్లదనం, తడి – పొడి, ఆడ – మగ, ప్రేమ – ద్వేషం, వినయం – అహంకారం, వగైరా వగైరా. ఈ ద్వంద్వమే జీవి సుఖదుఃఖాలకు మూలం, మూల్యాంకన ప్రమాణం కూడా. ఇందులో శివత్వం లేదు, అంటూన్నాడు కవి, అంటే విరోధస్పర్శలేని అనుభవం, అది ఆనందం. కనుక వానివలన కలిగే అనుభవం నాకు వద్దు, అని కవి నిర్ణయం. అయితే శివస్పర్శ కలిగినవి మాత్రం కావాలట. అంటే, పూజలో భాగంగా తాను శివునకు సమర్పించే ఫలపుష్పాది ప్రాకృతిక పదార్థాలు శివస్పర్శసోకి అమృతత్వాన్ని పొందుతూన్నవి కనుక అవి గ్రాహ్యములే, శివప్రసాదం కదా! ఇట్లే శివస్పర్శగల భావాలు స్వీకారయోగ్యములే, అని కవి హృదయం.

**శ్లో॥ నాథ! సామ్ముఖ్యమాయాన్తు విశుద్ధాస్తవ రశ్మయః ।**
**యావత్కాయమనస్తాపతమోభిః పరిలుప్యతామ్ ॥ 10**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, తవ = నీయొక్క, విశుద్ధాః = నిర్మలములైన, రశ్మయః = శక్తులు (కిరణములు), సామ్ముఖ్యమ్ = సమ్ముఖ్యమును, ఆయాన్తు = వచ్చుగాక!, యావత్ = ఎంతలో, కాయ = శరీరసంబంధి, మనః = మనస్సంబంధి, తాపతమోభిః = దుఃఖరూపమైన చీకట్లచే, పరిలుప్యతామ్ = పూర్తిగా నష్టమగుగాక!

**తాత్పర్యము :** స్వామీ! నీ స్వచ్ఛమైన శక్తులు నా ముందుకు వచ్చుగాక! అంతలో నా శారీరక, మానసిక దుఃఖాలు, కాంతికిరణాలు సోకగా చీకట్లు పోయినట్లు, నశించుగాక!

**విశుద్ధాః రశ్మయః** అంటే స్వచ్ఛకాంతులు అని శబ్దార్థం. కాని శాక్తేయ సాంప్రదాయికార్థంలో, రశ్మి, మరీచి, కిరణ శబ్దాలకు శక్తియని అన్వయం. ఇక్కడ విశుద్ధరశ్ములు అనగా అనుగ్రహరూపమైన అఘోరరూపశక్తులని విశిష్టార్థం. **శారీరక దుఃఖాలు –** ఆకలిదప్పులు, వ్యాధిబాధలు, ఇత్యాది. **మానసికదుఃఖాలు –** కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలు. వీనివలన కలిగే అనేకానేక వికారాలు, ఆధి అనబడేవి.

**శ్లో॥ దేవ! ప్రసీద యావన్మే త్వన్మార్గపరిపంథికాః ।**
**పరమార్థముషో వశ్యా భూయాసుర్గుణతస్కరాః ॥ 11**

**ప్రతిపదార్థము :** దేవ! = స్వామీ!, త్వద్ = నీయొక్క, మార్గ = మార్గమును, పరిపంథికాః

= అడ్డగించువారు, పరమార్థ = పరమార్థమును, ముషః = దొంగిలించువారు, గుణ = గుణ లేక ఇంద్రియరూపమైన, తస్కరాః = దొంగలు, యావత్ = ఎంతలో, మే=నాకు, వశ్యాః = వశులు, భూయాసుః = అగుదురో, (అంతలో), ప్రసీద = ప్రసన్నులుగండు!

**తాత్పర్యము :** దేవా! నీ మార్గంలో ఆటంకాలను కలిగించేవారు, పరమార్థాన్ని దొంగిలించే గుణసంబంధమైన దొంగలు నాకు వశులగునట్లు నాయందు ప్రసన్నులు కండు.

దైవమార్గంలో సాగేవారికి అడ్డుపడేవారే పరమార్థాన్ని దొంగిలించేవారు. వారిని గురించిన హెచ్చరింపే ఇది –

కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః ।
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగృథ జాగృథ ॥

వీరంతా గుణసంబంధి తస్కరులు. సత్త్వరజస్తమోగుణాలు మూడున్నూ పరమాత్మ మార్గంలో అవరోధాలే. విశ్వామిత్రుడు బ్రహ్మర్షిగా పరిణతిని సాధించే మార్గంలో అడుగడుగున అడ్డుపడినవి ఈ అహంకారపు కామరూపాలే. వీనికి ఇంద్రియాలు ఆధారం. విషయలాలసను పెంచి ముందుకు సాగనివ్వవు ఇంద్రియాలు. వీనిని వశం చేసికొనే ప్రయత్నం భక్తుడెంతగా చేసినప్పటికి దైవానుగ్రహం లేనిదే అది సాధ్యం కాదు. కనుకే 'ప్రసీద' అని పరమేశ్వరుని వేడుకొనటం.

**శ్లో॥ త్వద్భక్తిసుధాసారైర్మానసమాపూర్యతాం మమాశు విభో! ।**
**యావదిమా ఉహ్యన్తాం నిఃశేషాసారవాసనాః ప్లుత్వా ॥ 12**

**ప్రతిపదార్థము :** విభో! = సర్వవ్యాపీ!, మమ = నాయొక్క, మానసమ్ = మనస్సు, త్వద్ = నీయొక్క, భక్తిసుధా = భక్తియను అమృతపు, ఆసారైః = ధారలచే, ఆశు = వెంటనే, ఆపూర్యతామ్ = నిండింపబడుగాక!, యావత్ = ఎంతలో, ఇమాః = ఈ, నిఃశేష = మిగులులేని, అసార = సారములేని, వాసనాః = వాసనలు, ప్లుత్వా = లేచి, ఉహ్యన్తామ్ = ఎగిరిపోవుగాక!

**తాత్పర్యము :** ఓ సర్వవ్యాపీ! నా మనస్సు నీ భక్తియను అమృతపుధారలతో వెంటనే నిండిపోవుగాక! దానిచే నిస్సారములైన వాసనలు లేచి పూర్తిగా ఎగిరిపోవుగాక!

మానవుడు జన్మించునాటికే వానితోగూడ వాని మనసులో దాగి వాసన లుంటాయి. ఇవి వానిని ప్రతి విషయంలో ప్రభావితం జేసి వాడు కోరినట్లు సాగకుండా చేస్తాయి. వీనికే సంస్కారాలని మరియొక పేరు. ఇవి జన్మజన్మల నుండి వెంట తగిలి జీవునితో సాగివస్తాయి. ఇవి నశించటం చాల కష్టం. శిక్షణ, సాధన వానిని కొంత

అదుపులో ఉంచినప్పటికి, అవి అదనుకోసం వేచి ఉండి మరల మరల తలెత్తుతాయి. ఇవి నిశ్శేషం కాకుండా మనస్సు పరిశుద్ధం కాదు. చిత్తశుద్ధి కానిదే ప్రయత్నాలు ఫలాగ్రాలు కావు. కనుక భక్తిమార్గాన్ననుసరించి వాసనలను తొలగించు కోవాలనీ, అందుకు ఈశ్వరానుగ్రహం కావాలని ఈ కవి ప్రార్థన.

**శ్లో॥ మోక్షదశాయాం భక్తి - స్త్వయి కుత ఇవ మర్త్యధర్మిణోఽపి న సా ।**
**రాజతి తతోఽనురూపా - మారోపయ సిద్ధిభూమికామజ! మామ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** అజ! = ఓ స్వయంభూ!, మర్త్యధర్మిణః = మరణించుట ధర్మముగా గలవానికి, మోక్షదశాయామ్ = మోక్షదశయందు, త్వయి = నీయందు, భక్తిః = భక్తి, కుతః ఇవ = యే కారణమున?, సా = ఆ భక్తి, న రాజతి = ప్రకాశింపదు, అపి = కూడ, తతః = ఆ కారణమున, అనురూపామ్ = యోగ్యమైన, సిద్ధిభూమికామ్ = సిద్ధి కలుగు భూమికపై, మామ్ = నన్ను, ఆరోపయ = చేర్చుము.

**తాత్పర్యము :** ఓ స్వయంభూ! మరణం ధర్మమైనవానికి జీవము విడివడు సమయంలో నీయందు భక్తి కలగటానికి తగినంత కారణం ఉండదు. ఒకవేళ ఆ భక్తిభావం మిణుకు మిణుకుమనినప్పటికి అది నిలిచి ప్రకాశించదు కూడ. అందువలన నన్ను ఇప్పుడే ఆ భక్తియను సిద్ధి కలుగుటకు వీలైన స్థితికి చేర్చుము.

అజ, పుట్టకలేనివాడా!, అన్న సంబోధనలోనే మరణం లేనివాడా! అన్న సంబోధన ఇమిడియున్నది. ఇది మర్త్యధర్మిణః అన్నదానితో సాపేక్షభావస్ఫూర్తిని కలిగిస్తుంది, ఓ స్వామీ! నీకు పుట్టటం లేదు కనుక గిట్టటం లేదు, మరి మేము మర్త్యులము, పుట్టుగిట్టులు రెండూ కలవారం. మాకు హఠాత్ మరణవేళ భక్తి ఎట్లా కలుగుతుంది? కలుగదనే కదా బాల్యం నుండి అభ్యాసం చేయమన్నారు పెద్దలు. ఆ యేర్పాటు నీవే చేయవలె, అన్నది ఈ ప్రార్థన తాత్పర్యం.

**శ్లో॥ సిద్ధిలవలాభలుబ్ధం - మామవలేపేన మా విభో! సంస్థాః ।**
**క్షామస్త్వద్భక్తిముఖే - ప్రోల్లసదణిమాదిపక్షతో మోక్షః ॥ 14**

**ప్రతిపదార్థము :** విభో! = సర్వవ్యాపీ!, మామ్ = నన్ను, అవలేపేన = అభిమానముతో, సిద్ధిలవలాభలుబ్ధమ్ = సిద్ధులనబడు అల్పలాభమునకై లాలసుడనుగా, మా సంస్థాః = చేయవద్దు, ప్రోల్లసత్ = ఎంతో మెఱుగులీనుచున్న, అణిమా ఆది = అణిమా మొదలగువాని, పక్షతః = ప్రాప్తివలన, మోక్షః = మోక్షము, త్వద్ = నీయొక్క, భక్తిముఖే = భక్తిసమక్షములో, క్షామః = క్షీణించినది.

**తాత్పర్యము :** ఓ దేవా! నన్ను అణిమాది సిద్ధులయందు లోభిగా చేయవద్దు. ఈ అణిమాది సిద్ధులు చాల ఆకర్షణీయములైనవి. ఇవి పరమలాభమైన మోక్షం నుండి నీ భక్తిని పరాఙ్ముఖం చేస్తాయి, క్షీణింపచేస్తాయి. దీనికి కారణం భేదబుద్ధి అను దేహాభిమానం, అహంకారం. ఇది పైపూతవలె యేర్పడి దృష్టిభేదాన్ని కలిగించి ఆసక్తిని రేపుతుంది.

గొప్ప లాభాన్ని లక్షించి కృషి చేసేవారికి తమ సాధనలో అల్పలాభాలు తటస్థించి వానిని ఆకర్షిస్తాయి. ఈ అనుభవం ఆధ్యాత్మిక రంగంలో మరింత అధికమని సాధకుల చరిత్రలు సాక్ష్యమిస్తాయి. కనుక తన బుద్ధిని సంకుచితపరచి, వాని ఆకర్షణలో పడకుండ చేయుమని, ఈ భక్తుని ప్రార్థన. **సిద్ధులు –** అణిమా, మహిమా, లఘిమా, గరిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనబడు ఎనిమిది. ఇవే అష్టైశ్వర్యాలంటారు.

ఈ శ్లోకాన్ని ఇట్లా కూడా అన్వయించవచ్చు : మహాసిద్ధి అనబడు ఈశ్వరైక్యాన్ని లక్షించిన సాధకుని మార్గంలో, సీతాన్వేషణలో హనుమంతునకువలె, అణిమాది అల్పసిద్ధులు లభిస్తాయి. అప్పుడు, భుక్త్వా భోగాన్ శివం వ్రజేత్, భోగములనుభవించి శివుని పొందవలెనన్న ఆమ్నాయార్థాన్ని అనుసరించి, ఈ సిద్ధుల ననుభవించిన తర్వాత కాలాన్తరంలో మహాసిద్ధిని పొందవలెనని భావం.

**శ్లో॥ దాసస్య మే ప్రసీదతు – భగవానేతావదేవ నను యాచే ।**
**దాతా త్రిభువననాథో – యస్య న తన్మాదృశాం దృశో విషయః ॥ 15**

**ప్రతిపదార్థము :** నను = నిజముగా, ఏతావత్ ఏవ = ఇంతమాత్రమే, యాచే = ప్రార్థించుచున్నాను, భగవన్ = ప్రభూ!, మే = నాకు, దాసస్య = దాసునకు, ప్రసీదతు = ప్రసన్నుడవగుదువుగాక, యస్య = నీయొక్క, దాతా = దాత, త్రిభువననాథః = మూడు లోకముల ఏలికయో, తత్ = అది, మాదృశామ్ = మాబోంట్లయొక్క, దృశః విషయః = దర్శనవిషయము, న = కాదు.

**తాత్పర్యము :** నిజముగా నా ప్రార్థన ఇంతమాత్రమే : ఓ ప్రభూ! నేను నీ దాసుడను, నాయందు ప్రసన్నుడవు గమ్ము; నీవు మూడు లోకముల ఏలికవు, నీవే దాతవు, అట్టితరి మా బోంట్ల ప్రార్థనల ఫలమిది యది అనునది బుద్ధికందని విషయము.

మానవుని బుద్ధి పూర్ణశక్తివంతము కాదు. దాని పరిధి ఈ భూలోకానుభవము నకు పరిమితము. పంచేంద్రియప్రాప్యమైనదే దాని జ్ఞానము. దానికందిన జ్ఞానమును విశ్లేషించి వివేకించుటకంటె అధిక సామర్థ్యము మానుషబుద్ధికిలేదు. భక్తులు కూడ ఈ పరిమితికి లోబడవలసినవారే. కనుకే వారి భక్తికి ఫలము 'ఇది' యని వారెఱుగరు.

ఫలదాతకే అది తెలియును. కనుక నా ప్రార్థన ఇంతమాత్రమే : నాకు ప్రసన్నుడవు గమ్ము. ఆ ప్రార్థనలో భక్తుని శరణాగతి యున్నది.

**శ్లో॥ త్వద్వపుః స్మృతిసుధారసపూర్ణే – మానసే తవ పదాంబుజయుగ్మమ్ ।**
**మామకే వికసదస్తు సదైవ – ప్రస్రవన్మధు కిమప్యతిలోకమ్ ॥ 16**

**ప్రతిపదార్థము :** త్వద్ వపుః = నీ శరీరము, రూపము, స్మృతి = చిన్తనరూపమైన, సుధారస = అమృతరసముచే, పూర్ణ = నిండిన, మామకే = నాదైన, మానసే = మనస్సులో, తవ = నీయొక్క, పద అంబుజ = పాదపద్మముయొక్క, యుగ్మమ్ = జంట, కిం అపి = ఏదేని, అతిలోకమ్ = అలౌకికమైన, మధు = అమృతమును, ప్రస్రవత్ = ప్రవహించుచు, సదా ఏవ = ఎల్లవేళలను, వికసత్ అస్తు = వికసించునుగాక!

**తాత్పర్యము :** నా మనస్సు చిన్తనామృతముతో నిండినదై నీ పాదములను తనలో నిలుపును. నీ పాదపద్మములు ఒక అలౌకిక మధుధారలను ప్రవహించును. ఇది సమాధిదశలో నీ రూపచిన్తనతో కలుగుచుండు అనుభవము. కాని వ్యుత్థానదశలో ఇది ఇట్లే వికసించియుండునట్లు అనుగ్రహించుము.

భక్తిపారవశ్యంలో శివరూపదర్శనం, శివానందానుభవం కలుగుట సరే. ఆ పారవశ్యం నుండి బాహ్యప్రపంచదర్శనంలోకి మరల జాగృతి కలిగినప్పుడు, ఆ ఆనందమూ అదృశ్యమవుతూన్నది. భేదబుద్ధి, సంకోచము యథాపూర్వం కలుగుచున్నది. దీనిని తప్పించి అద్వయబుద్ధినీ దర్శనాన్నీ ప్రసాదించుమని భావం.

**శ్లో॥ అస్తి మే ప్రభురసౌ జనకోఽథ – త్ర్యంబకోఽథ జననీ చ భవానీ ।**
**న ద్వితీయ ఇహ కోఽపి మమాస్తీ – త్యేవ నిర్వృతతమో విచరేయమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** అథ = తరువాత, అసౌ త్ర్యంబకః = ఈ మూడుకన్నులవాడు, ప్రభుః = ప్రభువు, మే = నాయొక్క, జనకః = కన్నతండ్రి, అస్తి = అయియున్నాడు, అథ చ = మరియును, భవానీ = పరాశక్తియైన భవానీదేవి, జననీ = కన్నతల్లి, ఇహ = ఈ లోకంలో, ద్వితీయః = రెండవవారు, కః అపి = ఎవరుగాని, మమ = నావారు, న అస్తి = అయియుండలేదు, ఇతి ఏవ = అనియే, నిర్వృతతమః = అత్యధిక ఆనందము గలవాడనై, విచరేయమ్ = సంచరించుచున్నాను.

**తాత్పర్యము :** మూడు కన్నులవాడైన శివుడు నా కన్నతండ్రి; పరాశక్తి భవానీ పార్వతి నా కన్నతల్లి, ఈ లోకంలోవారెవరూ నావారు కారు. ఈ భావనలోనే నాకు అత్యంతమైన ఆనందం కలుగుతూండగా, నిర్విచారంగా తిరుగుతూన్నాను.

ఈ లోకంలో కన్న తల్లిదండ్రులున్నప్పటికిని, వారినీ వారినీ వారి వారి వారినీ అందరినీ కన్న తల్లి ఆ అమ్మలగన్నయమ్మ జగత్తుకే తల్లి కనుక, ఆమె తరువాత స్థానంలోనే తల్లిగా చెప్పదగినది ఈ లోకంలో జన్మకారణమైన తల్లిగాని, గురుపత్నిగాని, వదినెగాని, ఇత్యాదులెవరైనగాని. తండ్రియైనప్పటికి, జగత్పితను చెప్పిన తరువాతనే మరెవరినైన చెప్పవలసి ఉంటుంది. కాగా, ఐహిక బంధాలుగా, ఆముష్మికానికి ముంగాళ్ళబంధాలుగా చెప్పదగిన బందుగులే ఈ లోకపు చుట్టాలు. ఈ బంధమోక్షమును కలిగించే జగత్పితరుల తోడి భక్తిబంధం నిజానికి మోక్షమే. అదే పరమానందకారకం.



శ్రీః

## ౨౦. చర్వణాభిధానం స్తోత్రమ్

**శ్లో॥ నాథం త్రిభువననాథం భూతిసితం త్రిణయనం త్రిశూలధరమ్ ।**
**ఉపవీతీకృతభోగినమిందుకలాశేఖరం వందే ॥ 1**

**ప్రతిపదార్థము :** త్రిభువననాథమ్ = ముడు లోకములకు స్వామియైనవానిని, భూతి = భస్మముతో, సితమ్ = తెల్లనైనవానిని, త్రిణయనమ్ = మూడు కన్నులు గలవానిని, త్రిశూలధరమ్ = త్రిశూలమును ధరించినవానిని, ఉపవీతీకృత = యజ్ఞోపవీతముగ చేయబడిన, భోగినమ్ = సర్పముగలవానిని, ఇందుకలాశేఖరమ్ = సిగపై చంద్రకళను ధరించినవానిని, నాథమ్ = స్వామియైనవానిని, **వందే** = నమస్కరింతును.

**తాత్పర్యము :** మూడు లోకాలకు స్వామి, భస్మలేపనంవలన తెల్లనివాడు, మూడు కన్నులు గలవాడు, త్రిశూలధరుడు, నాగయజ్ఞోపవీతుడు, సిగపై చంద్రకళను ధరించినవాడును అగు నా స్వామిని నమస్కరించుచున్నాను.

**భూతి** అనునది విశ్వమయ విభూతి. మూడు కన్నులు అనునవి ఇచ్ఛా జ్ఞాన క్రియా అనునవి. ఇందుకళ యన్నది విశ్వజీవనియైన చిత్‌శక్తి. – ఇది ఇక్కడి శివరూపం. ఇది సాంప్రదాయికమైన అన్వయం.

**శ్లో॥ నౌమి నిజతనువినిస్సరదంశుకపరివేషధవలపరిధానమ్ ।**
**విలసత్కపాలమాలాకల్పితనృత్తోత్సవాకల్పమ్ ॥ 2**

**ప్రతిపదార్థము :** నిజ తను = తన స్వరూపమునుండి, వినిఃసరత్ = ప్రసరించు,

అంశుకపరివేష = కిరణమండలరూపమైన, ధవల = తెల్లని, పరిధానమ్ = వస్త్రధారణ గలవానిని, విలసత్ = ప్రకాశించుచున్న, కపాలమాలా = తలపుఱ్ఱెల దండవలన, కల్పిత = కల్పింపబడిన, నృత్త ఉత్సవ + ఆకల్పమ్ = నృత్తోత్సవశోభగలవానిని, **నౌమి** = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** తన శరీరమునుండి ప్రసరించే కాంతి కిరణాలు తెల్లని పరివేషంగా యేర్పడి శుభ్రవస్త్రధారణ శోభనీయగా, ఆ కాంతి పరివేషంలో మెఱిసిపోతూన్న పుఱ్ఱెలదండ తన ఆనంద నృత్తమునకు శోభగూర్పగా, నటించు నటరాజునకు నమస్కారము.

శివుడు నటరాజస్వామియై ఆనందతాండం చేసేవేళ ఆ జ్ఞానశరీరం నుండి వెలువడిన కాంతి పరివేషమే తెల్లని వస్త్రధారణ. పరిధానం అంటే ప్రావరణం అన్నది సాంప్రదాయికార్థం. ఉత్సరత్ప్రకృతిః శివః అనుటను బట్టి ఈ ప్రావరణం శివుని శక్తిచక్రమే. కనుక, తన కాంతిచక్రముచే చుట్టుకొనబడినవాడు, అని అర్థం. అది వస్త్రం అనటం ఉత్ప్రేక్ష. ఆ స్వామి ధరించిన కపాలమాల సదాశివాది సర్వప్రమాతృ ముండమాలా, అనగా ఈ నృత్తోత్సవం స్వాతంత్ర్యవిజృంభాభ్యుదయం అని భావం.

ఈ మూర్తుల రూపాలకు సాంకేతికార్థాలు ఆయా ఆగమశాస్త్రోక్తాలుగా ప్రసిద్ధాలు.

**శ్లో॥ వందే తాన్ దైవతం యేషాం హరశ్చేష్టా హరోచితాః ।**
**హరైకప్రవణాః ప్రాణాః సదా సౌభాగ్యసద్మనామ్ ॥ 3**

**ప్రతిపదార్థము :** యేషాం సౌభాగ్యసద్మనామ్ = యే సౌభాగ్యశీలురకు, హరః = హరుడు, శివుడు, దైవతమ్ = ఇష్టదైవమో, చేష్టాః = చేతలు, హర + ఉచితాః = శివునకు తగినవో, అనుకూలమైనవో, ప్రాణాః = జీవితమంతయు, హర ఏక ప్రవణాః = శివుడొక్కడే ధ్యాన గమ్యుడో, తాన్ = అట్టివారిని, సదా = ఎప్పుడూ, **వందే** = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఎవరు సౌభాగ్యవంతులై శివుని ఇష్టదైవముగా భావించి, వారి కార్యములను ఆ దైవాని కిష్టమైనట్లు తీర్చిదిద్దుకొని, జీవితం శివధ్యానానికే అని నమ్మి ప్రవర్తిస్తారో, వారికి నమస్కారము.

శివభక్తులు తమ కార్యాలను హరోచితముగ నిర్వహించటం అనగా సృష్టి సంహారానుగ్రహాదిరూపాః హరోచితాః అని లఘువ్యాఖ్యను రచించిన శ్రీక్షేమరాజాచార్యులు వివరించినారు. అంటే, వారి ఉద్దేశం బహుశః సంసారంలోనే ప్రవర్తిస్తూ, అని కావచ్చు.

అన్యథా భక్తుడు సృష్టిసంహారానుగ్రహాదిరూపకార్యాలనేమి నిర్వర్తిస్తాడు? తాను నిర్వహించకున్నాగాని, హరుని సంకల్పాన్నెఱిగి ప్రవర్తించటం అన్నది ఉద్దిష్టార్థం అనుకోవచ్చు. లేదా, హర శబ్దానికి దుఃఖహరుడన్న అర్థం ప్రసిద్ధమే కనుక, హరోచితకార్యం అంటే ఇతరుల దుఃఖాన్ని అపనయించే కార్యాలు చేస్తూండటం అర్థంగా చెప్పవచ్చు. హరశ్చేష్టాః, హరుడే తమ చేష్టలు, అంటే, తమ చేష్టలకు కర్త తాముకాదు, హరుడే అన్న భావంతోడి నిరహంకారితను అర్థంగా చెప్పవచ్చు. ఈ విధంగా సంకల్ప కర్తృత్వాలను హరునియందే ఉంచి జీవించటం చెప్పబడింది.

**శ్లో॥ క్రీడితం తవ మహేశ్వరతాయాః పృష్ఠతోఽన్యదిదమేవ యథైతత్।**
**ఇష్టమాత్రఘటితేష్వవదానేష్వాత్మనా పరముపాయముపైమి ॥ 4**

**ప్రతిపదార్థము :** తవ = నీయొక్క, మహేశ్వరతాయాః = విశ్వప్రభుతయొక్క, పృష్ఠతః ఏవ = వెనుకనే, తోడనే, ఇదమ్ = ఈ, అన్యత్ = మరియొక, క్రీడితమ్ = లీల, యథా = ఏ ప్రకారముగా, ఏతత్ = ఇది, ఇష్టమాత్ర = ఇచ్ఛామాత్రమున, ఘటితేషు = సంభవించినట్టి, అవదానేషు = అద్భుతకర్మలను చేయుటలో, ఆత్మనా = ఆత్మచేత, పరమ్ = పూర్ణమైన, ఉపాయమ్ = ఉపాయమును, ఉపైమి = పొందుచున్నాను.

**తాత్పర్యము :** నీవు జగత్తునకు ప్రభువు. దానితోనే ఈ లీలాప్రదర్శన : నీ ఇచ్ఛామాత్రం చేత ప్రవర్తిల్లే అద్భుతకర్మలు. నీ సమావేశమువలన నాదైన చిద్బలమును నీ వాక్రమించి, నీ కృత్యములను నా చేత చేయించుటయే ఆ లీల.

ఈశ్వరునకు జగత్ప్రభుతయున్నదే. దానిలోని భాగమే ఈ జగచ్చరిత, ఊహించని సంఘటనలు. అన్నీ ఈశ్వరేచ్ఛననుసరించి జరుగునవే. కాని, దేనికది ప్రతి ఘటనకు కర్త ఈ జీవుడేయనిపించటం. పరమకర్త ఈశ్వరుడైనాగాని, నిమిత్తకర్తగా జీవునిచేసి, ఆ నిమిత్తకర్తయే కర్త అను భావమును కలిగించటం ఈశ్వరలీల. ఈ రహస్యాన్ని తెలిసి, అహంకారకేంద్రాన్ని ఈశ్వరీయ కేంద్రంలో లయం చేసినట్లయితే, అది భోక్తృత్వం నుండి, ఈ కర్తృత్వలీలనుండి తప్పించికొనే ఉపాయం లభించినట్లు అవుతుంది.

**శ్లో॥ త్వద్ధామ్ని విశ్వవంద్యేఽస్మిన్నియతి క్రీడనే సతి ।**
**తవ నాథ! కియాన్ భూయాన్నానందరససంభవః ॥ 5**

**ప్రతిపదార్థము :** నాథ = ఓ స్వామీ!, విశ్వవంద్యే = జగత్తు అంతటికినీ పూజ్యుడవైన, త్వద్ = నీయొక్క, ధామ్ని = ప్రకాశరూపమైన నివాసమున, ఇయతి = ఇంతటి,

బ్రహ్మాండ రచనారూపిణియైన, అస్మిన్ = ఈ, క్రీడనే = లీల, సతి = యుండగా, తవ = నీయొక్క, ఆనందరససంభవః = ఆనందాస్వాదనకు మూలము, కియాన్ = ఎంతటి, భూయాన్ = గొప్పది!

**తాత్పర్యము :** స్వామీ! ఈ జగత్తు నీ ప్రకాశరూపము. ఇది నీ క్రీడ. దీని వ్యాప్తి బ్రహ్మాండము. ఇంతటి ఆట (క్రీడ, లీల) సాగుచుండగా దానినుండి నీవు పొందు ఆనందమెంత గొప్పది!

సృష్టి స్థితి లయములను ఈ ఆట నీ ఆనందరూపము. అనగా, నీ ఆనందమే ఈ క్రీడ. క్రీడ శబ్దములోనే ఆనందము అంతర్లీనము. నీ ఆనందరూపమైన ఈ జగత్తు నీ భక్తులకు గూడ ఆనందదాయకమే, అనునది కవి హృదయము.

**శ్లో॥ కథం స సుభగో మా భూద్యో గౌర్యా వల్లభో హరః ।**
**హరోఽపి మా భూదథ కిం గౌర్యాః పరమవల్లభః ॥ 6**

**ప్రతిపదార్థము :** యః హరః = యే శివుడు, గౌర్యాః = గౌరికి, వల్లభః = ప్రియుడో, సః = ఆతడు, కథమ్ = ఎట్లు, సుభగః = సౌభాగ్యశాలి, మా భూత్ = కాకుండును?, అథ = ఆపై, హరః అపి = హరుడు కూడ, గౌర్యాః = గౌరికి, పరమవల్లభః = అత్యంత ప్రియుడు, మా భూత్ కిమ్ = కాకుండునా యేమి?

**తాత్పర్యము :** పార్వతికి ప్రియుడు కనుక శివుడు సౌభాగ్యశాలి. సౌభాగ్యశాలి కనుకే శివుడు పార్వతికి అత్యంత ప్రియుడు.

శివుడు – పరాశక్తి ద్వయభావంగా కన్పించినప్పటికి వారు అద్వయమూర్తులే! ఆ అద్వయభావం పేరే ప్రియత్వం, ప్రేమ, సౌభాగ్యము.

**శ్లో॥ ధ్యానామృతమయం యస్య స్వాత్మమూలమనశ్వరమ్ ।**
**సంవిల్లతాస్తథారూపాస్తస్య కస్యాపి సత్తరోః ॥ 7**

**ప్రతిపదార్థము :** యస్య సత్ తరోః = భక్తరూపమైన యే ఉత్తమవృక్షమునకు, స్వాత్మ = తన ఆత్మయొక్క, మూలమ్ = కారణము, ధ్యాన + అమృతమయమ్ = ధ్యానరూపమైన అమృతముతో నిండినది, అనశ్వరమ్ = నాశములేనిది అగునో, తస్య కస్యాపి = ఆ అలౌకికమైన, సంవిత్‌లతాః = విషయజ్ఞానరూపమైన కొమ్మలు, తథా రూపాః = ఆ రూపము కలిగినవే.

**తాత్పర్యము :** భక్తుడొక ఉత్తమ వృక్షమై, వాని ఆత్మకు తల్లివేరు ధ్యానం అనబడే

అమృతంతో నిండినదైతే, అది నాశనములేనిదే అవుతుంది, దాని కొమ్మలు, విషయజ్ఞాన రూపాలయినప్పటికి, అవికూడా ఆ అమృతంతో నిండినవే అవుతాయి.

చెట్టు వ్రేళ్ళు యే సారాన్ని గ్రహిస్తాయో అదే సారం ఆ చెట్టు కొమ్మలన్నిటా వ్యాపించి ఉండటం సహజం. అయితే ఆ సారనిర్ధారణ జరిగేది మాత్రం ఆ వ్రేళ్ళు యే భూమిలో ఉన్నాయన్నదాని ననుసరించిమాత్రమే. ఎందుకంటే ఆ భూమియొక్క సారాన్నే వ్రేళ్ళు గ్రహిస్తాయి కనుక. భక్తుడనువాని మూలం ధ్యానమన్న భూమిలో లోతుగా ఉన్నప్పుడు, ఆ అమృత సారాన్నే ఆ భక్తుడు గ్రహిస్తాడు. దానివలన ఆతని లౌకిక విషయజ్ఞానం కూడా సంవిత్ అనబడే అమృతపూర్ణమే అవుతుంది.

**శ్లో॥ భక్తికండూసముల్లాసావసరే పరమేశ్వర ।**
**మహానికషపాషాణస్థూణా పూజైవ జాయతే ॥ 8**

**ప్రతిపదార్థము :** పరమేశ్వర = ఈశ్వరా!, భక్తికండూ = భక్తియను దురదయొక్క, సముల్లాస = చక్కని సంతోషము గలుగు, అవసరే = సమయమున, పూజా ఏవ = పూజయే, మహానికషపాషాణస్థూణా = నిగ్గుదేల్చు, గీటురాయియైన ఊతిస్తంభముగా, జాయతే = అగును.

**తాత్పర్యము :** భక్తికండూతియను సంతోషమునకు పూజ ఒక్కటే గీటుఊయి. అది భక్తిని ఊతిస్తంభమువలె నిల్పును.

భక్తిని కండూతి లేక దురదతో పోల్చటం ఆశ్చర్యంగా ఉన్నప్పటికి, కవి ఉద్దేశం, బహుశః, కండూతి సహజంగా వంటబుట్టినట్లే, భక్తికూడ సహజంగా యేర్పడిన మనోల్లాస లక్షణమే అని కావచ్చుననిపిస్తుంది. కనుకే సముల్లాసావసరే అనటం. కండూతియొక్క ఆనందం గోకటంలో కనబడుతుందికదా, అట్లాగే, భక్తియొక్క ఆనందం పూజలో కనబడుతుంది : ఎంత తన్మయత్వంతో గోకితే, అంత గొప్ప కండూసముల్లాసం, ఎంత తన్మయత్వం పూజలో పొందితే అంత గొప్ప భక్తిపారవశ్యం. కనుకే దురదకు గీటుఊయి గోకటం, భక్తికి గీటుఊయి పూజ. ఈ పూజ భక్తిని ఊతి స్తంభంవలె నిలబెడుతుందంటాడు కవి. దురద తీవ్రమైతే స్తంభానికి రుద్దుకోవటమూ కద్దు.

భక్తిరసంతో హాస్యరసాన్ని కలబోయటం మనకేమీ క్రొత్తకాదులెండి.

**శ్లో॥ సదా సృష్టివినోదాయ సదా స్థితిసుఖాసినే ।**
**సదా త్రిభువనాహారతృప్తాయ స్వామినే నమః ॥ 9**

**ప్రతిపదార్థము :** సదా = ఎల్లప్పుడు, సృష్టి = సృష్టిచేయుటలో, వినోదాయ = వినోదించు

వానికి, సదా = ఎల్లప్పుడు, స్థితి = రక్షణ చేయుటలో, సుఖ + ఆసినే = సుఖమైన ఆసనముగలవానికి, సదా = ఎల్లప్పుడు, త్రిభువన = మూడులోకములను, ఆహార = ఆహారమును తినుటలో, తృప్తాయ = తృప్తిచెందువానికి, స్వామినే = యజమాని యగువానికి, నమః = నమస్కారము.

**తాత్పర్యము :** సృష్టి, స్థితి, లయము అను ఈ మూడిటిలో వినోదమును, సుఖమును, తృప్తిని ఎల్లప్పుడు అనుభవించు స్వామికి నమస్కారము.

బాలబాలికలు ఇసుకలో గూళ్ళు కట్టటం వంటి వినోదం స్వామికి సృష్టి. వారు ఆ ఇసుకగూళ్ళను నానావిధాలుగా అలంకరించటం వంటి సుఖం స్వామికి స్థితి. వారు ఆ గూళ్ళను కసబిస కాళ్ళతో త్రొక్కి ఇసుకలో కలిపివేయటం వంటి తృప్తి ఆ స్వామికి లయం. ఈ మూడిట ఉన్నది ఆనందమొక్కటే. క్రొత్తగా వచ్చింది, పోయింది కూడా నామరూపాలే. అసలు వస్తువు ఉన్నదే. ఆ ఉనికిలోని ఆనందం క్రియారూపం దాల్చినప్పుడు త్రివిధంగా వినోదం, సుఖం, తృప్తి అన్న నామరూపాలు సంతరించికొన్నది. ఈ ప్రక్రియమొత్తంలో ఆనందానికి ప్రభుత, అధికారం స్వయంసిద్ధమన్నది స్వామిన్ శబ్దం తెలియజేస్తుంది.

**శ్లో॥ న క్వాపి గత్వా హిత్వాపి న కించిదిదమేవ యే ।**
**భవ్యం త్వద్ధామ పశ్యన్తి భవ్యాస్తేభ్యో నమో నమః ॥ 10**

**ప్రతిపదార్థము :** యే భవ్యాః = యే భాగ్యశాలురు, క్వాపి = యే స్థానమునకును, న గత్వా = చేరక, కించిత్ అపి = యేమియు, న హిత్వా = త్యజించక, ఇదం ఏవ భవ్యమ్ = ఈ సంసారమునే, త్వద్ = నీయొక్క, ధామ = నివాసముగ, మోక్షప్రదముగ, పశ్యన్తి = చూచుచున్నారో, తేభ్యః = వారికి, నమః నమః = మరి మరి నమస్కారము.

**తాత్పర్యము :** యే స్థానానికీ చేరక, దేనినీ త్యజించక, ఈ సంసారాన్నే శివనివాసంగా, మోక్షప్రదంగా భావించేవారు భాగ్యశీలురు. వారికి మరి మరి నమస్కారము.

**న క్వాపి గత్వా** అంటే, ఎక్కడికీ వెళ్ళక, అని. భావం, సాధకుడై యే ఉన్నత స్థానాన్నీ పొందక, అని. అత్యున్నతస్థానంగా యోగసాధకులు భావించేది ద్వాదశాంత స్థానం అనబడేది. దీనినే నిర్గుణపరబ్రహ్మస్థానం అంటారు. శిరోదేశాత్ ద్వ్యంగుళోర్ధ్వం, శిరస్సునకు పైన రెండు అంగుళముల ఎత్తున ఉండే పరంవ్యోమ, పరమాకాశ మనబడే స్థానం. దీనిని చేరకపోయినను, సంసారంలో దేనినీ వదలకపోయినను, సంసారాన్ని శివమయంగా చూచే వైఖరి కలిగినవారు వందనీయులంటాడు కవి.

**శ్లో॥ భక్తిలక్ష్మీసమృద్ధానాం కిమన్యదుపయాచితమ్ ।
ఏతయా వా దరిద్రాణాం కిమన్యదుపయాచితమ్ ॥ 11**

**ప్రతిపదార్థము :** భక్తిలక్ష్మీసమృద్ధానామ్ = భక్తిరూపముగల సంపద చాలినంతగా కలిగినవారికి, అన్యత్ = వేరొకటి, కిమ్ = యేమి, ఉపయాచితమ్ = కోరదగినది?, వా = మరియు, ఏతయా దరిద్రాణామ్ = ఈ భక్తిలక్ష్మి లేనివారికి, అన్యత్ = వేరొకటి, కిం ఉపయాచితమ్ = కోరదగినది యేమి?

**తాత్పర్యము :** భక్తిగలవారికి, అదే సమస్తసంపదలు. వారికింక కోరదగినది వేరొకటి లేదు. ఈ భక్తి లేనివారికి, మిగత లౌకికసంపదలేమి ఉన్నప్పటికి, దారిద్ర్యం ఉన్నట్లే. కనుక వారికి గూడ కోరదగినది భక్తిమాత్రమే, వేరొకటి లేదు.

**శ్లో॥ దుఃఖాన్యపి సుఖాయన్తే విషమప్యమృతాయతే ।
మోక్షాయతే చ సంసారో యత్ర మార్గః స శంకరః ॥12**

**ప్రతిపదార్థము :** యత్ర = ఎక్కడ, యే మార్గంలో, దుఃఖాని అపి = దుఃఖాలు కూడ, సుఖాయన్తే = సుఖములగునో, విషం అపి = విషముకూడ, అమృతాయతే = అమృతమగునో, చ = మరియు, సంసారః = సంసారము, మోక్షాయతే = మోక్షమగునో, సః మార్గః = ఆ మార్గము, శంకరః = శంకరమార్గము.

**తాత్పర్యము :** శంకరమార్గము ననుసరించువారికి, శివభక్తులకు, దుఃఖాలుగూడ సుఖాలే అవుతాయి. విషంకూడ అమృతమే అవుతుంది, ఈ సంసారమే మోక్షమార్గమవుతుంది.

శంకరమార్గం అంటే శాక్తమార్గము. ఆ మార్గంలో నడిచేవారికి సుఖదుఃఖాది ద్వయానుభవం ఉండదు. సమస్తం అద్వయానందమే, అని కవి భావం.

**శ్లో॥ మూలే మధ్యేఽవసానే చ నాస్తి దుఃఖం భవజ్జుషామ్ ।
తథాపి వయమీశాన! సీదామః కథముచ్యతామ్ ॥ 13**

**ప్రతిపదార్థము :** ఈశాన! = ఈశ్వర!, భవత్ జుషామ్ = నీ భక్తులకు, మూలే = మొదట, మధ్యే = నడుమ, అవసానే చ = చివర కూడా, దుఃఖమ్ = దుఃఖము, న అస్తి = లేదు, తథా అపి = అట్లయినను, వయమ్ = మేము, సీదామః = కష్టము లనుభవింతుము, ఉచ్యతాం కథమ్ = ఇదెట్లో వివరింపదగును.

**తాత్పర్యము :** ఈశ్వరా! నీ భక్తులకు దుఃఖమన్నది మొదటా లేదు, నడుమా లేదు, చివరా లేదు. అయినా గాని, నీ భక్తులమైన మేము కష్టపడుతూనే ఉన్నాము. ఇదెట్లా జరుగుతూన్నదో తమరే చెప్పగలరు.

**మూలము,** మొదట, అంటే సంవిదుదయంలో అని భావం. సంవిద్ అంటే జ్ఞానం. కనుక జ్ఞానోదయమైనప్పుడు, అని అర్థం. ఈ జ్ఞానం లోకాతీతమైన అద్వయ జ్ఞానం. కనుక ఈ జ్ఞానోదయంలో, మూలంలో, మొదట దుఃఖం లేదు. శివుడు సుఖస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, అనగా, జ్ఞానం సుఖమయం అని అర్థం. దీనికి భిన్నంగా దుఃఖానుభవం ఎట్లా సాధ్యం? అన్నది ప్రశ్న. **మధ్యను,** నడుమ, అంటే సంవిత్ ప్రసరణసమయంలో అని. అనగా, ఉదయించిన జ్ఞానం వ్యాపించి సత్యస్వరూపాన్ని దర్శింపజేసే సమయం. అప్పుడు కూడా దుఃఖానికి అవకాశం లేదు. ఐనా, మాకీ దుఃఖం ఎట్లా కలుగుతూన్నది? **అవసానం,** చివర, అంటే, సంవిత్ విశ్రాంతిదశ, జ్ఞానం పరిపూర్ణమైన దశ. ఇప్పుడూ దుఃఖానికి తావులేదు. ఐనా దుఃఖం మాకెట్లా కలుగుతున్నది? **వ్యుత్థానదశలో,** సమాధిలో కలిగిన జ్ఞానం, యేమైపోతూన్నది? ఎందుకు నిలుకడ లేకపోతూన్నది?!

**శ్లో॥ జ్ఞానయోగాదినాన్యేషామప్యపేక్షితుమర్హతి ।**
**ప్రకాశః స్వైరిణామేవ భవాన్ భక్తిమతాం ప్రభో! ॥ 14**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ఓ ప్రభూ!, అన్యేషామ్ = ఇతరులకు, భవాన్ = మీరు, జ్ఞాన = జ్ఞానము, యోగ = యోగము, ఆదినా అపి = మొదలగువానిచే గూడ, అపేక్షితుమ్ = అపేక్షించుటకు, అర్హతి = తగియున్నారు, స్వైరిణాం భక్తిమతామ్ = స్వేచ్ఛాచారులగు భక్తులకు, ప్రకాశః ఏవ = ప్రకటమగుటయే, (భవతి = జరుగును).

**తాత్పర్యము :** ప్రభూ! ఇతరులు మిమ్ము సాక్షాత్కరించుకొనుటకు వారికి జ్ఞానము, యోగము మొదలైన ఉపాయముల సహాయమవసరము. నీ భక్తులైన వారు, స్వతంత్రులుగా వ్యవహరిస్తారు. వారికి ఈ ఉపాయాలేమీ అక్కఱలేదు. అయినప్పటికి, వారికి నీ స్వరూప సాక్షాత్కారం, ఆనందం శ్రమలేకుండానే లభిస్తుంది. ఇది నీ భక్తి మహిమ.

దైవసాక్షాత్కారానికి చాలా సాధన అవసరమవుతుంది. అనేకరీతుల క్రమశిక్షణ పాటించవలసి ఉంటుంది. ఇదంతా సాధారణ భక్తుల విషయం. కాని సమావేశశీలం గల భక్తుల విషయం వేరు. కారణం వారు కోరినప్పుడు అనాయాసంగానే దైవతత్పరత కలుగుతుంది. సమాధిస్థితి కలుగుతుంది. సాక్షాత్కారం లభిస్తుంది. వీరు అసాధారణ భక్తులు.

**శ్లో॥ భక్తానాం నార్తయో నాప్యస్త్యాధ్యానం స్వాత్మనస్తవ ।**
**తథాప్యస్తి శివేత్యేతత్కిమప్యేషాం బహిర్ముఖే ॥ 15**

**ప్రతిపదార్థము :** భక్తానామ్ = భక్తులకు, న ఆర్తయః = దుఃఖములు లేవు, అపి = మరియు, తవ స్వాత్మనః = నీ నిజస్వరూపముయొక్క, ఆధ్యానమ్ = చిన్త, న అస్తి = లేదు, తథా అపి = అట్లయినను, కిమపి = యేదో అలౌకికమైన, శివ ఇతి ఏతత్ = శివ అను శబ్దము, బహిః = బైటనుండి, ఏషామ్ = ఈ భక్తులయొక్క, ముఖే = ముఖమునందు, నోటిలో, అస్తి = ఉన్నది.

**తాత్పర్యము :** భక్తులకు దుఃఖాలు లేవు, నీ నిజస్వరూపాన్ని గూర్చిన చింతకూడా లేదు. అయినప్పటికి, వారి నోటినుండి శివ అను శబ్దం వెలువడుతూ యేదో అలౌకికమైన ఆనందాన్ని స్ఫురింపజేస్తుంది.

దుఃఖాలు కలిగినపుడు ఇష్టదైవాన్ని స్మరించటం లోకసహజం. ఈ శివభక్తులు దుఃఖాలే లేనివారు; కనీసం శివుని నిజస్వరూపదర్శనం కోసం కూడా వీరికి చింత లేదు. ఐనాగాని అప్రయత్నంగా, యేదో అలౌకిక ప్రేరణవలన శివశబ్దం వీరి ముఖతః వెలువడుతూనే ఉంటుంది. అది వారి ఆనందానికి గుర్తు.

**శ్లో॥ సర్వాభాసావభాసో యో విమర్శవలితోఽఖిలమ్ ।**
**అహమేతదితి స్తౌమి తాం క్రియాశక్తిమీశ తే ॥ 16**

**ప్రతిపదార్థము :** ఈశ! = ఈశ్వరా!, అహమ్ = నేను, ఏతత్ అఖిలమ్ = ఇది సమస్తము, ఇతి = అని, యః = యే, సర్వ + ఆభాస = అన్ని ప్రకాశములయొక్క, అవభాసః = ప్రకాశము, విమర్శవలితః = స్వాత్మపరామర్శచే పూర్ణముగ చేయబడిన, తే = నీయొక్క, తాం క్రియాశక్తిమ్ = ఆ క్రియాశక్తిని, **స్తౌమి** = స్తుతించుచున్నాను.

**తాత్పర్యము :** ఈశ్వరా! ఈ సమస్తము నేను అను భావన సర్వప్రకాశములకు ప్రకాశము. అది పరమానంద ప్రకాశముతో పరిపూర్ణమవుతుంది. ఆ ఆనందమే దాని పరివేషము. అదియే నీ క్రియాశక్తి. ఆ శక్తిని స్తుతిస్తూన్నాను.

జీవికి తాను మాత్రమే 'నేను' అనబడే వ్యక్తియనిన్నీ మిగత జగత్తు 'నీవు' అనబడేదనిన్నీ భావం సహజంగా ఉంటుంది. కాని పరమశివభక్తులకు సమస్త జగత్తు ఈ 'నేను' గనే ప్రకాశిస్తుంది. జగత్తు నిజానికి 'నేను' అని వ్యక్తమయ్యే ప్రకాశరూపానికి ప్రకాశమే, అని తెలుస్తుంది. 'నేను', 'అహం' శివుడైతే, ఈ జగత్తు నా క్రియాశక్తి రూపమే, అనగా, శివశక్తియే, అని అవగతమవుతుంది. అప్పుడు జగత్తంతా పూజనీయమే. ఆ జగత్తును నీ క్రియాశక్తిరూపంగా స్తుతిస్తాను.

**శ్లో॥ వర్తన్తే జన్తవోఽశేషా అపి బ్రహ్మేంద్రవిష్ణవః ।**
**గ్రసమానాస్తతో వందే దేవ! విశ్వం భవన్మయమ్ ॥ 17**

**ప్రతిపదార్థము :** దేవ! = ప్రభూ!, అశేషాః జన్తవః = జన్తువులన్నియు, బ్రహ్మా = బ్రహ్మ, ఇంద్ర = ఇంద్రుడు, విష్ణవః = విష్ణువు అనువీరు, అపి = కూడ, గ్రసమానాః = ఎల్లవేళల విషయములను ఆహరించుచున్నవారలై, వర్తన్తే = ప్రవర్తించుచున్నారు, తతః = అందువలన, భవన్మయం విశ్వమ్ = మీరేయైన విశ్వమును, వందే = నమస్కరించు చున్నాను.

**తాత్పర్యము :** దేవా! రుద్రుడవై నీవు విశ్వమును ఆహారముగా హరింతువని నిన్ను హరుడనుచున్నాము. వివేకించినచో, సమస్త ప్రాణులు, సృష్టికర్తయైన బ్రహ్మ, దేవతల నాయకుడైన ఇంద్రుడు, స్థితికారకుడైన విష్ణువుకూడా, అందరూ తమ తమ విషయములను హరించుచునే ఉన్నారు. కనుక ఆ విశ్వమంతా హరుడవైన నీ రూపమే. అట్టి విశ్వమునే నమస్కరించుచున్నాను.

జగత్తుయొక్క లక్షణం యేమని విచారిస్తే హరించటమే అని విశదమవుతుంది. ఇది హర లక్షణం కనుక జగత్తు హరుడే.

**శ్లో॥ సతో వినాశసంబంధాన్మత్పరం నిఖిలం మృషా ।**
**ఏవమేవోద్యతే నాథ! త్వయా సంహారలీలయా ॥ 18**

**ప్రతిపదార్థము :** నాథ! = స్వామీ!, సంహారలీలయా = సంహారక్రీడాశీలివైన, త్వయా = నీచేత = ఏవమేవ = ఇట్లే, ఉద్యతే = సూచించబడుచున్నది, సతః = జగత్తులోని వారందరకు, వినాశసంబంధాత్ = నశింపుతో సంబంధమున్నందువలన, మత్పరమ్ = నాకంటె వేరైనది, నిఖిలమ్ = అంతయు, మృషా = అసత్యము.

**తాత్పర్యము :** స్వామీ! ఈ ఉన్నవారందరకు నాశముతో సంబంధమున్నది. కనుక సంహార క్రీడాశాలివైన నీవు, నీకంటె భిన్నమైనది యేదీలేదని, అసత్యమని, ప్రకటిస్తూన్నట్లున్నది.

**వ్యక్తప్రపంచలక్షణం** తినటం, తినబడటం, అంటే నాశనం చెయ్యటం, నశించటం. ఈ రెండు విధాలూ నాశనంతో ముడి. తన ఆనందానికి విషయంగా స్వీకరించి ప్రతిదీ రెండవదానిని నశింపజేస్తుంది, తానూ నశిస్తుంది. ఇదంతా హరుని సంహారక్రీడ లేక లీల, అంటే ఆనందం. దీనినిబట్టి అర్థమయ్యేది యేమంటే, నామరూప విభిన్న లక్షణం గల జగత్తు అసత్యమనిన్నీ, ఆనందరూపియైన శివుడే సత్యమనిన్నీ. ఇదే నిర్ణయానికి కవి చేరుకున్నాడు.

**శ్లో॥ ధ్యాతమాత్రముపతిష్ఠత ఏవ – త్వద్వపుర్వరద! భక్తిధనానామ్ ।**
**అప్యచిన్త్యమఖిలాద్భుతచిన్తా – కర్తృతాం ప్రతి చ తే విజయన్తే ॥ 19**

**ప్రతిపదార్థము** : వరద! = వరములిచ్చే స్వామీ!, అచిన్త్యం అపి = ధ్యానమునందైన స్ఫురించనిదైనను, త్వద్ వపుః = నీ చిద్రూపము, భక్తిధనానామ్ = భక్తియను ధనముగలవారికి, ధ్యాతమాత్రం ఏవ = ధ్యాతయైనంతనే, ధ్యానము నిల్చినంతనే, ఉపతిష్ఠతే = లభింతువు, అద్భుత = ఆశ్చర్యకరమైన, కర్తృతామ్ = కర్తృత్వమును, ప్రతి = గురించి, చిన్తా = చిన్తగలవారై, విజయన్తే = ప్రకాశించుచున్నారు.

(లేక) అద్భుతచిన్తాకర్తృతాం ప్రతి విజయన్తే = ఆశ్చర్యకరమైన చిన్తన చేయుటను గురించి ప్రకాశించుచున్నారు.

**తాత్పర్యము :** స్వామీ! సామాన్యభక్తులకు నీ చిద్రూపము మనసున స్ఫురించదు. కాని నీ విశేషభక్తులకు ధ్యానము నిల్చినంతనే ఆ దర్శనము లభించును. అట్టివారు ఆశ్చర్యకరమైన ఆలోచనలతో ప్రకాశిస్తారు.

భక్తిపారవశ్యంలో మైమరిచిన మహనీయుల ప్రవర్తన అద్భుతంగా ఉంటుంది. సదాశివబ్రహ్మేంద్రచరిత్రం చూచినా, రామదాసు, త్యాగరాజు మొదలైన మహాత్ముల చరిత్రలు చూచినా ఇది స్పష్టమవుతుంది.

**శ్లో॥ తావకభక్తిరసాసవ – సేకాదివ సుఖితమర్మమండలస్ఫురితైః ।**
**నృత్యతి వీరజనో నిశి – వేతాలకులైః కృతోత్సాహః ॥ 20**

**ప్రతిపదార్థము :** తావక = నీయొక్క, భక్తిరస ఆసవసేకాత్ ఇవ = భక్తి సంబంధి రసమను మధువును చిలకరించినందువలన అనునట్లు, సుఖిత = సుఖించిన, మర్మమండల = పాశసమూహములవలన, స్ఫురితైః = ప్రకాశించిన, వేతాలకులైః = వేతాల సమూహములచేత, కృత = చేయబడిన, ఉత్సాహః = ఉత్సాహముగలవాడై, వీరజనః = శూర – వీరజనులు, నిశి = రాత్రియందు, నృత్యతి = నృత్యముజేతురు.

**తాత్పర్యము :** నీ భక్తి ఆసవం వంటిది. దానిని స్వీకరించినందువలననేమో అన్నటు పాశసమూహాలు సుఖించినవి. అందువలన ఉత్సహించి, వేతాల సమూహం నృత్యం చేసినట్లు, వీరులు రాత్రివేళ నృత్యం చేస్తారు.

మధువును సేవించినవారు తమలోని పాశవమైన భావాలు తృప్తిచెందగా రాత్రివేళ నృత్యం చెయ్యటం లోకరీతి.

సాంకేతికార్థంలో – నిశి, రాత్రి, మాయకు గుర్తు. ఈ మాయలో, వీరజనుడు, అంటే సంసారపశువును సంహరించిన భక్తుడు, నృత్యం చేస్తాడు. ఎట్లాగంటే, భక్తిమధువుతో మత్తెక్కిన వానివలె, అంటే, స్వామి దర్శనానందంతో పరవశించినవానివలె,

అని. పాశసంచయసంబంధులు మర్మమండలం. పశుహృదయాఘట్టకశక్తులు వేతాలకులం. ఈ సాంకేతికార్థాలను మహాభక్తుని సంసారవిజయానికీ సాధనాసాఫల్యానికీ తత్ఫలానందాస్వాదానికీ అన్వయించుకుంటే శాక్తేయ సాంప్రదాయికార్థం లభిస్తుంది.

**శ్లో॥ ఆరబ్ధా భవదభినుతి – రమునా యేనాంగకేన మమ శంభో! ।**
**తేనాపర్యన్తమిమం కాలం – దృఢమఖిలమేవ భవిషీష్ట ॥ 21**

**ప్రతిపదార్థము :** శంభో! = శంకరా!, అమునా యేన అంగకేన = యే ఈ అంగకముతో (సమావేశశ్రేష్ఠతను రూపించు ప్రకారముగా), భవత్ అభినుతిః = మీ సంస్తుతి, ఆరబ్ధా = ప్రారంభింపబడినదో, తేన ఏవ = దానిచేతనే, ఇమం అఖిలమ్ = ఇదంతయు, అపర్యన్తం కాలమ్ = అనంతకాలమువరకు, దృఢమ్ = అచంచలమై, భవిషీష్ట = అగుచుండుగాక!

**తాత్పర్యము :** శంభో! నీ సమావేశశ్రేష్ఠతను ప్రకటించే ఈ మీ స్తోత్రము యే భావంతో ప్రారంభింపబడినదో, ఆ భావం చేతనే ఇదంతా అనంతకాలం దృఢమై సాగుగాక!

కవి ఉద్దేశం ఈ స్తోత్రావళిలో శివానందాద్వయానుభవం భక్తులకు యెట్లా లభిస్తుందో, ఆ ప్రకారాన్ని వివరించి చెప్పటం. ఈ విషయౌచిత్యమే ఈ స్తోత్రావళిని స్థిరంగా ఉంచుతుంది, కవికి ప్రేరణగా కొనసాగుతుంది కూడా.

--

**శ్రీమదుత్పలదేవాచార్యవిరచిత శ్రీశివస్తోత్రావళి కి**

**చింతగుంట సుబ్బారావు**

**అందించిన తెలుగుటీకాతాత్పర్యవివరణ సంపన్నము.**



**శ్రీః**

# శివస్తోత్రావళీ శ్లోకానుక్రమణికా

(శ్లోకానికెదురుగా ఇవ్వబడిన అంకెలలో మొదటిది స్తోత్ర క్రమసంఖ్య, రెండవది శ్లోక సంఖ్య)

## య



## ర



## ల



## వ



## శ

శ్రీః